ఈ వ్యాస సంపుటీకరణానికి తెలుగు విశ్వవిద్యాలయం
ఆర్థిక సహాయం చేసింది.

సాహితీ వ్యాసంగం (వ్యాస సంకలనం) -
-డా॥ అక్కిరాజు రమాపతిరావు



వెల నూరు రూపాయలు (రూ. 100), USA 10 dollars

ప్రథమ ముద్రణ : 1994 మార్చి

ప్రతులు : 500

సోల్ డిస్ట్రిబ్యూటర్లు :
నవోదయ బుక్ హౌస్
3.3.865, ఆర్యసమాజ మందిర్ ఎదురు వీధి
కాచిగూడ, హైదరాబాదు–500 027

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1.1.517/B/1, న్యూ బాకారం
గాంధీనగర్, హైదరాబాదు - 500 380
ఫోన్లు : 611413, 600457

# విన్నపం

గత ముప్పై సంవత్సరాలుగా నేను చేసిన సాహితీ వ్యాసంగం కొంత ఇప్పుడీవిధంగా సంపుటీకరించి ఈతరం తెలుగు సాహిత్యాభిమానులకు సమర్పించుకోవాలనే కుతూహలమే నన్నీపనికి ప్రేరేపించింది మొదట నేను సర్జన రచయితను కథలు, నవలలు రాయడంతో నా సాహిత్యాభిరుచి ముకుళన దశ నుంచి వికసించింది. ఇరవై సంవత్సరాల వయసున నేను నవలా రచన ఆరంభించాను ఆ తర్వాత పది సంవత్సరాలలో చిన్నవీ పెద్దవీ కలిపి పది నవలలు రాశాను అవి అన్నీ అచ్చైనాయి

పంధొమ్మిది వందల అరవైలో నేను ఎమ్.ఏ ప్యాసై, హైదరాబాదులోని న్యూసైన్స్ కళాశాలలో తెలుగు అధ్యాపక ఉద్యోగంలో చేరటంతో నా దృష్టి వృత్తిపరమైన పురోభివృద్ధిని కాంక్షించడం సహజమే. అందువల్ల పిహెచ్.డి. చేయాలనే ఆకాంక్ష నాలో కలిగింది. ఆ తర్వాత రెండేళ్ళకు పరిశోధక విద్యార్థిగా నా పేరు నమోదు చేయించుకోవడంతో వీరేశలింగంపంతులు సాహిత్య, సామాజిక కృషినిగూర్చి పరిశోధనాధ్యయనానికి ఆచార్య బిరుదురాజు రామరాజుగారి మార్గదర్శనంలో ముందుకుసాగే అవకాశం నాకు లభించింది అప్పటివరకు కేవలం కథలు, నవలలు రాసిన నాకు సాహిత్యాధ్యయనంలోని ప్రమాణాలేమిటో, రచనలో తీసుకోవలసిన జాగ్రత్తలేమిటో శ్రీరామరాజుగారి పర్యవేక్షణవల్లనే తెలిశాయి

మొదటినుంచీ సంప్రదాయ సాహిత్యం, సంస్కృత భాషాపరిజ్ఞానం నాకు దూరంగానే ఉన్నాయి వ్యాకరణం చదువుకోగల అవకాశం నాకు లేకపోయింది. అయినా సృజనాత్మక ప్రవృత్తివల్ల కావలసినంతవరకు ఆయా విషయాలు ఆకళించుకోగలిగాను వీరేశలింగంపంతులుగారి సాహిత్య, సామాజిక కృషి పరిశోధనాంశంగా ఎన్నుకొన్నందువల్ల ఆధునికయుగీన సాహిత్యం పూర్వాపరాలు, కాలిక పరిణామాలు, సహజ జీవన పరివర్తనలు ఆసక్తితో తెలుసుకోవాల్సిన అవసరమూ, అధ్యయసం చేయాల్సిన అగత్యమూ, విశ్లేషించి ప్రతిపాదించాల్సిన

అభిరుచీ నాకు తప్పనిసరి అయినాయి. తెలుగులో వచ్చిన స్వీయ చరిత్రలు నేను సేకరించినన్ని మరొకరు చూసి ఉండరేమోనని వినయంగా భావిస్తున్నాను. వీరేశలింగం సమకాలీన సాహిత్య సాంఘిక స్థితిగతులను, వాటి క్రమపరిణామాన్ని ఆసక్తితో తెలుసుకున్నాను. చెప్పగలిగినంత చెప్పాను.

ఈవిధంగా సృజనాత్మక రచనలనుంచి కొంత ఆటవిడుపు నాకు లభించినట్లైంది. నేను తెలుసుకొన్న అనేక విషయాలను గురించి చిన్నాపెద్దా వ్యాసాలు రాయడం ఆరంభించాను. కొన్ని వందల వ్యాసాలు వివిధ పత్రికలలో, ప్రత్యేక సంచికలతో కలిపి నేను ప్రకటించాను

ఇప్పుడీ సంపుటంలో చేర్చిన రచనలన్నీ పందొమ్మిది, ఇరవై శతాబ్దాల సాహిత్య సామాజిక పరిణామాలకు, విశ్లేషణలకు సంబంధించినవేను. వైవిధ్యం బాగానే ఉంది. కథ, నవల, నాటకం, స్వీయచరిత్ర, భాషాచరిత్ర, కవుల చరిత్ర మొదలైన ఆదునిక ప్రక్రియలకు సంబంధించిన విశేషాలు ఈ వ్యాసంగంలో పరిశీలించాను.

తెలుగులో బాల సాహిత్య నిర్మాతల తొలితరం వారిని గూర్చి కొన్ని విషయాలు చేర్చగలిగాను. తెలుగు సామెతలను గూర్చి కూడా ఆసక్తికరమైన ఒక అధ్యయనాన్ని ఈ సంపుటంలో చూడవచ్చు.

ఈ వ్యాస సంపుటిని స్వీకరించడానికి ఆమోదం తెలిపిన ఆచార్య బిరుదు రాజుగారికి నా కృతజ్ఞతాభివందనాలు నామీద వారికిగల ఆదరాభిమానాలకు ఇది ఒక గుర్తుగా నేను భావించుకుంటున్నాను.

హైదరాబాదు
10.3.1994
మహాశివరాత్రి.

అక్కిరాజు రమాపతిరావు

# విషయసూచిక

# డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) ఇతర రచనలు

## సృజనాత్మక సాహిత్యం

### I నవలలు - నవలికలు

1 జారుడుమెట్లు 2 జీవితవలయాలు 3 ఋణానుబంధం 4. కొత్త బాట 5 పరాజితులు 6. మనుషులు - మమతలు 7 స్వర్గారోహణ 8 ప్రపంచమార్గం 9 నూరు శరత్తులు 10. దూరతీరాలు

### కథాసంపుటాలు

1. మైథిలి 2 మంచుకురిసిన రాత్రి 3 జీవిత దృశ్యాలు 4. మంజుశ్రీ కథలు 5. పంచాక్షరి 6 సుందరీవా దరీవా

### II సాహిత్యం - జీవిత చరిత్ర - పరిశోధన

1. వీరేశలింగం - సమగ్ర పరిశీలన (పిహెచ్ డి థీసిస్)
2. వ్యవహారిక భాషా వికాసం-చరిత్ర(ఆంధ్రప్రదేశ్ అకాడమి బహూకృతం)
3. వీరేశలింగం (జీవితచరిత్ర) - ఆం ప్ర ప్రభుత్వ సమాచార పౌర సంబంధ శాఖ ప్రచురణం
4. కొమర్రాజు లక్ష్మణరావు - విశాలాంధ్ర ప్రచురణ
5. గిడుగు రామమూర్తి జీవితం - ఉద్యమం - తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ
6. వీరేశలింగం తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ
7. తెలుగు నవల - ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ.
8. వీరసావర్కర్ - నవభారతి ప్రచురణ.
9. ఆంధ్రకేసరి ప్రకాశం - ఆం.ప్ర ప్రభుత్వ విద్యాశాఖ ప్రచురణ (9 వ తరగతి ఉపవాచకం)

10 కోలవెన్ను వారి జీవితానుభవాలు
11. తెలుగులో స్వీయచరిత్ర - యువభారతి ప్రచురణ
12 తెలుగు వెలుగు వీరేశలింగం - వికాస ప్రచురణలు

III అనువాదాలు

1 నానాలాల్ - కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురణ
2. విప్లవ భావుకుడు - మానవతావాది శరచ్చంద్రుడు - నేషనల్ బుక్ట్రస్ట్
3 శ్రీనారాయణగురు - నేషనల్ బుక్ట్రస్ట్
4 వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్రా చరిత్ర - శ్రీభారతి ప్రచురణ
5. భారతీయ సంస్కృతి - వారసత్వం - తెలుగు అకాదమి ప్రచురణ
6 కంచిమీదుగా అరుణాచలయాత్ర - పాల్‌బ్రంటన్ రచనకు అనువాదం.
7. బహాఉల్లా - ఆం ప్ర. బహాయిసంఘ ప్రచురణం

IV సంపాదకత్వం - సంకలనం - సంవాదం

1 మాండలిక పదకోశం - తెలుగు అకాడమీ ప్రచురణ.
2 గ్రాంథిక వ్యావహారిక శైలీవాద సూచిక - తెలుగు అకాడమీ ప్రచురణ.
3. యుగకర్త వీరేశలింగంపై నీలాపనిందలు - జయంతి పబ్లికేషన్స్.
4 వీరేశలింగంపై అభియోగాలు, అపవాదాలు - శ్రీ చైతన్య మండలి.
5. కొమర్రాజు వారి వ్యాసావళి - వి యస్ ఆర్. ట్రస్టు ప్రచురణ.
6. పలనాటి వీర చరిత్ర - (కోడిపోరు, బాలచంద్ర యుద్ధం)
7. వీరేశలింగ గ్రంథావళి - స్వీయ చరిత్ర (ప్రథమ భాగం) - విశాలాంధ్ర ప్రచురణ
8. వీరేశలింగ గ్రంథావళి - స్వీయ చరిత్ర (ద్వితీయ భాగం) - విశాలాంధ్ర ప్రచురణ
9 వీరేశలింగం నవలలు - విశాలాంధ్ర ప్రచురణ
10 వీరేశలింగం ఉపన్యాసాలు - జీవిత చరిత్రలు - విశాలాంధ్ర ప్రచురణ
11 వీరేశలింగం డైరీలు - లేఖలు - జీవిత చరిత్ర - విశాలాంధ్ర ప్రచురణ
12 వీరేశలింగం ప్రహసనాలు - విశాలాంధ్ర ప్రచురణ
13. వీరేశలింగం కవుల చరిత్ర (3 సంపుటాలు) - విశాలాంధ్ర ప్రచురణ

14 శ్రీ స్వామి జ్ఞానానంద చరితామృతం - శ్రీరామ జ్ఞాన మందిర పబ్లికేషన్స్ లీగ్ - గొరగనమూడి.

15 శ్రీమన్నారాయణ కవచం (పోతన మహాభాగవతం) - శ్రీరామ జ్ఞాన మందిర పబ్లికేషన్స్ లీగ్ - గొరగనమూడి.

16. తెలుగు సామెతలు - సాంఘిక జీవితం - విశాలాంధ్ర ప్రచురణ

17. రాజశేఖర చరిత్ర (వీరేశలింగం పంతులు) - ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

V కూర్పు - వ్యాఖ్య - వివృతి

1 అద్భుత వాస్తవాలు - (ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక - మొత్తం 150 వారాలు ప్రచురితం)

2 శృంగార వీథి (సంప్రదాయ సాహిత్యంలో మూడో పురుషార్థం - ఉదయం వార పత్రికలో ధారావాహికం)

3. సాధువుల కథలు (ఆంధ్రభూమి వార పత్రికలో 50 వారాలు ధారావాహికం)

4 లీలాశుకుడి కృష్ణాకర్ణామృతం (వచనంలో)

5 పునర్దర్శనం (జాతీయ సాహిత్య పరిషత్తువారి సాధన మాస పత్రికలో సాహిత్య సంస్కృతి సంబంధి వ్యాసాలు)

6. మీ సాహితీ సంపద (ఆంధ్రప్రభ వార పత్రికలో 108 వారాలు వచ్చిన శీర్షిక)

ఇవికాక, రామాయణం, బాలకాండ, అయోధ్యకాండ, ఇతర వ్యాసాలు, సమీక్షలు అచ్చు కావలసి ఉన్నాయి.

గత 40 సంవత్సరాలుగా వివిధ పత్రికలలో సుమారు వెయ్యి రచనలు వచ్చాయి రేడియోలో సుమారు 200 ప్రసంగాలు వినవచ్చాయి.

జానపద సాహిత్యకోవిదులు
జాతీయాభినివేశ సౌహృదులు
నిరంతర పరిశోధక పరిశ్రమశీలి
సౌమ్యులు, నిరాడంబరులు

ఆచార్య బిరుదురాజు
రామరాజు
గారికి

# తొలి తెలుగు నవల

తొలి తెలుగు నవల ఏది? అన్న విషయంలో ఇంతవరకూ ఏకవాక్యం లేదు శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు రచించిన 'మహాశ్వేత' తొలి తెలుగు నవలని శ్రీ నిడదవోలు వేంకటరావుగారు ప్రతిపాదించారు.[1]

శ్రీ నరహరి గోపాలకృష్ణమశెట్టిగారు రచించిన శ్రీ రంగరాజ చరిత్రం తొలి తెలుగు నవలని శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగా రభిప్రాయపడ్డారు.[2]

ఇక వీరేశలింగం పంతులుగారు స్వీయచరిత్రలో తెలుగులో మొట్టమొదటి వచన ప్రబంధాన్ని- అంటే నవల అనే వారి అర్థం- తామే వ్రాశామని చెప్పుకున్నారు పంతులుగారు తెలుగు సాహిత్యంలో అనేకాలైన నూత్న ప్రక్రియలు వెలయించి, వాటికి స్థితినీ, ప్రాచుర్యాన్నీ కల్పించి, యుగపురుషులుగా కీర్తింపబడ్డారు కనుక, తెలుగు నవలకు శ్రీకారం చుట్టింది వారేనని చాలామంది సాహితీపరులు భావించారు ఇట్లా భావించటానికి పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాసుకున్న వాక్యాలే ప్రమాణం కావచ్చును కాని ఇటీవల, వీరేశలింగం పంతులుగారు రచనావ్యాసంగానికి పూనుకొనక పూర్వమే శ్రీ కొక్కొండవారూ, శ్రీ గోపాలకృష్ణమశెట్టిగారూ నవలలు రచించారని పైన చెప్పిన పెద్దలు అభిప్రాయపడ్డారు. తొలి తెలుగు నవల కర్తృత్వాన్ని గూర్చిన పై మూడు అభిప్రాయభేదాలు పరామర్శింపబడుతున్నవి.

## వచన ప్రబంధము-నవల

నేడు 'నవల' అన్న పేరు రూఢమైపోయిన సాహిత్య ప్రక్రియకు, తొలి దశలో వచన ప్రబంధమన్న పేరు వాడుకలో ఉండేది.

---

1 శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు - శ్రీ నిడదవోలు వేంకటరావుగారు భారతి - 1951 మార్చి, ఏప్రియల్, జూలై, నవంబరు సంచికలు

2 శ్రీ రంగరాజు చరిత్ర - శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు, [illegible] 1934 జనవరి సంచిక.

'ఈ వరకు మన యాంధ్రభాషలో జనుల యాచార వ్యవహారములను దెలుపుచు నీతిబోధకములుగా నుండు వచన ప్రబంధములేమియు లేకపోవుట యెల్లవారికిని విశదమయియే యున్నదిగదా?' అని వీరేశలింగం పంతులుగారు తమ రాజశేఖర చరిత్రానికి వ్రాసిన పీఠికలో దాన్ని వచన ప్రబంధంగానే పేర్కొన్నారు. ఇంతేకాక స్వీయచరిత్రలో కూడా అనేక సందర్భాలలో 'నవల' అన్న ఆంగ్లపదానికి సమానార్థకంగా వచన ప్రబంధమనే పంతులుగారు అనువదించారు. తెలుగున మొట్టమొదటి వచన ప్రబంధాన్ని నేనే రచించానని వారు చెప్పుకొన్న సందర్భంలో కూడా ఇది గమనార్హం.

రాజశేఖర చరిత్రం మొట్టమొదట 1878వ సంవత్సరంలో వెలువడింది. అంతకు ఆరు సంవత్సరాలముందే వెలువడ్డ శ్రీ రంగరాజ చరిత్రం ముఖపత్రం పైన కూడా ఆ పుస్తకాన్ని గూర్చి 'హిందువుల యాచారములు తెలుపునట్టి నవీన ప్రబంధమ'నే ఉన్నది ఆ కాలంలో యీ నవీన ప్రబంధాన్ని సమీక్షించిన పురుషార్థ ప్రదాయిని అనే మాసపత్రిక 'Rangarajucharita by Gopalakrishnama chetty garu, is a novel in a sweet, easy, grammatical and idiomatic Telugu prose' అని ప్రశంసించింది [3]

ఆ కాలంలో ప్రతి పత్రికలోనూ తెలుగు తెలియని అధికారుల ఉపయోగార్థమున్నూ తెలుగూ, ఇంగ్లీషూ రెండూ తెలిసినవారు తమ విజ్ఞానాన్ని ఇతోధికంగా పెంపొందించుకునేందుకున్నూ, ప్రాయికంగా సాంఘిక సమస్యలూ, రాజకీయాలూ, సారస్వత విషయాలూ తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ కూడా రెండు ప్రత్యేక విభాగాలుగా ప్రచురిస్తూ ఉండేవారు వీరేశలింగం పంతులుగారు నిర్వహించిన వివేకవర్ధనిలో కూడా ఇలాంటిదే ఇంగ్లీషు అనుబంధం ఉండేది

పురుషార్థప్రదాయిని ఆ కాలంలో చాలా పేరు ప్రఖ్యాతులు పొందిన సారస్వత మాసపత్రిక. ఇది మచిలీబందర్ నుంచి వెలువడుతుండేది. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు తమ ఆంధ్రభాషా సంజీవని సహాయంతో యీ పురుషార్థప్రదాయినితో వివాదపడుతూ ఉండేవారు వీరేశలింగం పంతులుగారు పురుషార్థప్రదాయినిలో ఆ కాలంలో రచనలు చేస్తూ ఉండేవారు. ఈ పత్రికలలో కూడా ఇంగ్లీషు విభాగం ఉండేది.

---

3. పురుషార్థ ప్రదాయిని - 1872 జూలై నెల సంచిక

ఈ ఇంగ్లీషు విభాగంలోనే నరహరి గోపాలకృష్ణమచెట్టిగారి శ్రీ రంగ రాజ చరిత్రం నవలగా ప్రసక్తమైంది తెలుగు సమీక్షలో వచన ప్రబంధంగానే పేర్కొనబడింది. ఈ వచన ప్రబంధమన్న పదాన్ని నవలకు సమానార్థకంగా శ్రీ గోపాలకృష్ణమచెట్టిగారే సృష్టించారని చెప్పవచ్చు. అంతకు పూర్వం తెలుగులో వచన ప్రబంధం వ్రాయటానికి, అంటే ఇంగ్లీషులో నవల వంటి సాహిత్య ప్రక్రియను తెలుగులోనికి తీసుకొనివచ్చే దృష్టితో ఎవరూ పూనుకో లేదు. ఈ ప్రయత్నం చేసిన వారిలో గోపాలకృష్ణమచెట్టిగారే ఆద్యులు. నవలకు వచన ప్రబంధమన్న పేరును సృష్టించి ప్రచారంలోకి తెచ్చింది కూడా వీరేనని శ్రీ రంగరాజచరిత్రం నుండి తెలుస్తున్నది. వారి తరువాత సుమారు పాతిక సంవత్సరాలవరకూ తెలుగులో వెలువడిన నవలలన్నీ వచన ప్రబంధాలుగానే పరిగణింపబడ్డాయి అయినా తెలుగు నవల యొక్క ఉద్భవ వికాస పరిణామాలు చిత్రించేటప్పుడు గోపాలకృష్ణమచెట్టిగారిని గూర్చి ఎక్కువగా తెలియబడక పోవడం, వారి శ్రీ రంగరాజ చరిత్రం బహుళ ప్రచారాన్ని పొందిఉండక పోవటమే కావచ్చును దీన్నిగూర్చి 1872 వ సంవత్సరంలో అచ్చయిన పుస్త కాల వివరాలను తెలిపే ఫోర్టు సెయింట్ జార్జి గెజట్‌లో ఈ విధంగా వివరింప బడింది [4]

'This is apparently the first attempt ever made in this part of India at novel writing in Telugu prose.'

కాబట్టి పురుషార్థ ప్రదాయిని, ప్రభుత్వ గెజటు, వీరేశలింగం పంతులు గారి రాజశేఖర చరిత్రం ఆధారంగా 'నవల' అన్న ఆంగ్ల ప్రక్రియ తెలుగులో వచన ప్రబంధమని పిలువబడుతుండేదని తెలుస్తున్నది

శ్రీ రంగరాజ చరిత్రంకన్నా పూర్వమే రచింపబడినదని చెప్పబడుతున్న 'మహాశ్వేత' అది రచింపబడినదని చెప్పబడుతున్న కాలానికి ముప్ఫయి సంవత్స లరా తరువాతగానీ ప్రచురింపబడక పోవటంవల్లనూ నాడుగానీ, తరువాతగానీ

4. Fort St Gaorge Gazette - 1872, July, August, September. (Supplement-Third quarter.)

పుస్తక రూపం పొందకపోవటంచేతనూ, మొట్టమొదటిసారిగా వైజయంతి అన్న పత్రికలో ఇది ప్రచురింపబడిన కాలానికి వచన ప్రబంధానికి నవల అన్న పదం పర్యాయపదంగా రూఢమైనందువల్లనూ మహాశ్వేతను వచన ప్రబంధమని పిలిచారో లేదో తెలుసుకునేందుకు అవకాశం లేదు

మహాశ్వేత 1867వ సంవత్సరంలోనే రచింపబడిందని చెప్పబడుతున్నది.

శ్రీ రంగరాజ చరిత్రం 1872 లో పుస్తకరూపాన వెలువడింది

వీరేశలింగం పంతులుగారి రాజశేఖరచరిత్రం వివేకవర్ధనిలో, 1878 వ సంవత్సరంలో భాగభాగములుగా వెలువడి, 1880వ సంవత్సరంలో మొదటిసారి పుస్తకరూపం పొందింది రాజశేఖర చరిత్రం తరువాత పంతులుగారు సత్యరాజాపూర్వ దేశయాత్రలు, సత్యవతీ చరిత్రం మొదలైన ఇతర వచన ప్రబంధాలు రచించారు

1893 వ సంవత్సరంలో రాజమహేంద్రవరం నుండి, ప్రచురింపబడ్డ 'చింతామణి' అన్న సారస్వత మాసపత్రిక, తెలుగు సాహిత్య చరిత్రలో తొట్ట తొలుతగా నవలలపోటీ నిర్వహించింది. ఈ పోటీలో పాల్గొని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవి సుప్రసిద్ధములైన నవలలనెన్నో రచించారు. 'చింతామణి' పోటీ బహుమానాల ప్రేరణతో తెలుగు సాహిత్యంలో నవలా ప్రక్రియ, బహుళ ప్రచారాన్నీ, పుష్టినీ పొందింది చిలకమర్తివారు ఈ పోటీల్లో పాల్గొనే నిమిత్తమే రామచంద్ర విజయం, అహల్యాబాయి వంటి నవలలు రచించారు.

ఈ చింతామణి 1891 వ సంవత్సరంలోనే ప్రారంభింపబడింది. పోటీలు మాత్రం 1893 లో మొదలై, ఐదారు పర్యాయాలు నిర్వహింపబడ్డాయి. ఈ పత్రికకు న్యాపతి సుబ్బారావు పంతులుగారు యాజమాన్యం వహించారు. వీరేశలింగం పంతులుగారి కీపత్రికతో సన్నిహిత సంబంధముండేది. 1893 వ సంవత్సరంలో నవలా రచనను ప్రోత్సహించే ఉద్దేశ్యంతో పోటీని ఏర్పరచిన కాలానికి కూడా యీ ప్రక్రియకు వచన ప్రబంధమన్న పేరే వ్యవహారంలో ఉన్నది. అప్పటికి 'నవల' అన్న పేరు పర్యాయపదంగా వాడుకలోకి రాలేదు.

ఈ పత్రిక నిర్వహించిన పోటీలలో పాల్గొనేవారికి మార్గదర్శకంగా ఉండేందుకు కొన్ని నిబంధనలు ప్రకటించారు. ఈ పోటీ నిబంధనలలో వచన ప్రబంధానికి కుండలీకరణాలలో Novel, Novellette అన్న ఇంగ్లీషు పదాలు వాడబడటం గమనించాలి. ఈ నిబంధనలు ఇంకా యీ విధంగా వివరణాత్మకంగా ఉన్నాయి [5]

'ప్రబంధమనగా కల్పితమైన కధ ఆ కథను పురాణేతిహాసాదుల నుండి గాని, చరిత్రముల నుండిగాని గ్రైకొని, కథాసారస్యమున కనుకూలముగా నుండు లాగున దానికి నూతనాంశములను జేర్చి పెంచి వ్రాయవచ్చును. లేదా కవి మొదటినుండి కడవరకును స్వబుద్ధిచేతనే నూతన కథను కల్పించియైనను వ్రాయవచ్చును

'శృంగారమో, వీరమో యేదో యొక రసమును ప్రధానముగా జేసికొని వివిధ రస సంయుతముగ నుండునట్లుగాని, యాయా రసమును పోషించుటకయి వివిధ కష్ట సుఖములను, ప్రయత్నములను, కార్య విఘాతములను, కార్యా సాఫల్యములను మధ్య మధ్య సందర్భోచితముగ దీసికొని వచ్చుకథయంతయు, నొక్కని చరిత్రమువలె నుండునట్లు వ్రాయవలెను '

'మహాశ్వేత' తొట్టతొలుతటి వచన ప్రబంధం కాగలదా అన్న మీమాంసను పరిష్కరించటానికి పైవివరణలు తోడ్పడతవని వివరంగా ఉద్ధరింపబడ్డాయి. అదీగాక నాటి సాహితీ పరులలో నవలయొక్క లక్షణాలను గూర్చిన అభిప్రాయాలు కూడా పై వివరణల వల్ల స్పష్టపడుతున్నవి.[6]

ఈ వివరణలను బట్టి వచన ప్రబంధమందలి ఇతివృత్తం అనువాదం కారాదనీ, రసము శృంగారమో, వీరమో అయి ఉండాలనీ, ఏకనాయకాశ్ర

5 చింతామణి 1893 మార్చి, ఏప్రియల్ సంచికలు.

6 'నవల యనగా కృత్రిమమైన (అంటే స్వకపోల కల్పితమన్న భావం కావచ్చు) స్వాభావికమగు నితివృత్తము గలిగి తరచు ఉత్తమ నాయకోపేతమయి, శృంగార వీర రసములలో నేదేని యొక్కటి ప్రధానముగా గల వచన ప్రబంధ విశేషము' - వివేక చంద్రికా విమర్శనం (1897) పీఠికలో శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

యత్వము ఉండాలనీ నాటి సాహితీపరులు భావించారని తెలుస్తున్నది. తెలుగు సాహిత్యంలోని ప్రబంధ ప్రక్రియ యొక్క లక్షణాలనన్నిటినీ స్వీకరించి వచనంగా రూపొందిస్తే, ఆ ప్రయత్నం నవలగా రూపొందుతుందని వాళ్ళు తలంచినట్లుగా కనపడుతున్నది ఈ దృష్టిని పురస్కరించుకొనే, సంస్కృత సాహిత్యంలోని కాదంబరి, వాసవదత్తలను ప్రబంధాలుగా సాహిత్యవేత్తలు పరిగణించారు. కళాపూర్ణోదయాన్ని పద్య నవల అని భావించారు ఇంగ్లీషులోని నవలా ప్రక్రియయొక్క లక్షణాలు సంస్కృత సాహిత్యంలోని కాదంబరి, వాసవదత్త వంటి ప్రబంధాలలో ఉన్నాయనీ, తెలుగులోనూ ప్రబంధాలుగా వెలసిన వాటిలోనూ, అవి పద్యకృతులు కావటమనే ప్రధానభేదాన్ని మినహాయిస్తే, ఆ లక్షణాలు ఉన్నాయనీ, సాహిత్యవేత్తలు తలంచినట్లూ పై నిబంధనల వలన స్పష్టం

కాని ఆంగ్ల సాహిత్య ప్రభావం కొత్తగా తెలుగులో కాలూనిన యీ ప్రక్రియపై, అపరిమేయమన్న విషయం వాళ్ళు గ్రహించకపోలేదు. ఈ ప్రక్రియ ప్రాచుర్యం పొందటానికి ఆంగ్ల సాహిత్య ప్రభావం ఎంత పనిచేసిందో శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు, శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ప్రకటించిన అభిప్రాయాల నుంచి తెలుసుకోవచ్చు. వేంకటరాయశాస్త్రిగారు తెలుగులో నవలా రచనావిర్భావం గురించి యీ విధంగా భావించారు:7

"మనవారు మేకదాటుగా చిరకాలము పురాణముల నాంధ్రీకరించి, తరువాతం ప్రబంధంబుల విసిగి,యిపుడు అన్యములందొడంగినారు మరియు గీర్వాణ నాటకముల నెఱింగియు, హూణనాటకములం జదువు వరకు నాటకములు వ్రాయరైరి గీర్వాణకథలనెరింగియు హూణనవలలగాంచినదనుక నవలలపయిం బడరైరి'

ఇదే అభిప్రాయాన్ని బ్రహ్మయ్య శాస్త్రిలవారు కూడా వెల్లడించారు.8

7. వేదం వేంకటరాయ శాస్త్రిగారి జీవిత చరిత్రము - V. V. Sastry పుట. 55 -

8. వివేకచంద్రికా విమర్శనం (పీఠిక) - శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

'ఈ విధమగు గ్రంథము లింగ్లీషు భాషయందు విశేషముగా గలవు కాని, మన భాషయందంతగా గానరావు. అందులో తెనుగునందు బొత్తుగా లేవు. సంస్కృతమునందన్నను వాసవదత్త, కాదంబరిలోనగువాని నీ తరగతిలోనివానిగా జెప్పవచ్చును. ఆంధ్రమందుగల కళాపూర్ణోదయము గద్య పద్యాత్మముగాగాక, కేవల వచన భూయిష్టమైనచో నీ విధమగు దానినిగానే జెప్పవచ్చును

'మన దేశమం దింగ్లీషుభాష వ్యాపించిన తరువాత నీ లోపమును పూర్తి చేయు తలంపుతో నొకరిద్దరు వొకటి రెండు నవలలను వ్రాసినను నేటివరకు నీ లోపము లోపముగానే యున్నది

ఇక సాహిత్యపు ప్రక్రియకు నవల అన్న పేరు తెలుగున ఎప్పటినుండి వ్యవహారంలోకి వచ్చిందో కూడా బ్రహ్మయ్యశాస్త్రిగారి వివేకచంద్రికా విమర్శనం నుంచి తెలుసుకోవచ్చును. ఈ వివేకచంద్రికా విమర్శనం మొదట శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు నడుపుతూ ఉండిన 'రాజయోగి' పత్రికలో ప్రచురింపబడి, తరువాత 1897 వ సంవత్సరంలో పుస్తక రూపాన వెలువడింది. వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రానికి వివేకచంద్రిక నామాంతరం. రాజశేఖర చరిత్రంపై నాటికి, నేటికీ కూడా వివేకచంద్రికావిమర్శనం వంటి సమగ్రమైన విమర్శన గ్రంథం ఇంకొకటి వెలువడనేలేదు

ఈ వివేకచంద్రికా విమర్శనం పీఠికలోని—

'ఆంగ్లేయభాషలో - నావల్ (Novel) అను పదము 'క్రొత్త' యను నర్థముగల 'నవ్' అను పదము నుండి పుట్టినది. ఈ 'నవ్' అనుదానికి 'నవ యను మన సంస్కృత పదమునకుగల సంబంధము తేటతెల్లమే కదా? కావున నవల యనగా నవాన్ విశేషాన్, లాతిగృహ్ణాతీతి నవలా, అనగా క్రొత్త విశేషంబు గలదని యర్థము వచ్చుచున్నది హూణభాషయందు నీ మాటకిదే యర్థమగుటచేత 'నావల'ను పదమునకు సరియైన వేరొక సంస్కృత పదమునకయి ప్రయత్నము చేయక 'నవల' యని యీ పదమునే నే నిట వాడుచున్నాను' అనే వాక్యాలను పురస్కరించుకొని 'నవల' అన్న పదం 1897 నుంచి సాహిత్య పరిభాషలోకి ప్రవేశించిందని తెలుసుకోవచ్చును. చింతామణి కూడా 1893 లో పోటీలు నిర్వహించినప్పుడు 'నవల' అన్న పదం ఉపయోగించలేదు 1894 వ

సంవత్సరంలో నిర్వహింపబడిన పోటీలో చిలకమర్తివారి రామచంద్ర విజయం ప్రథమ బహుమానం పొందింది చిలకమర్తివారి స్వీయచరిత్రలో కూడా యీ నవలల పుట్టుపూర్వోత్తరాలను గూర్చి, చింతామణి బహుమానాలను గూర్చి వివరించబడింది 'పాశ్చాత్యదేశ పద్ధతిని మన భాషలో గూడ నాఖ్యాయికలను (నవలలు) వ్రాయింపదలచి పోటీ పరీక్షలు బెట్టి వారి స్వధనములో నుండి (న్యాపతి సుబ్బారావు పంతులుగారు) బహుమానముల నీయ నారంభించిరి. ఈ యుత్కృష్ట కార్యమువలననే మన దేశములో క్రొత్త నవలలెన్నో తలయెత్తినవి' అని చిలకమర్తివారు స్వీయచరిత్రలో వ్రాశారు.

కాబట్టి నవల అన్న పదం 1897 లో పుట్టి 'తదాదిగా ప్రచారాన్ని పొందిందనీ, అంతకుపూర్వం యీ ప్రక్రియ వచన ప్రబంధంగా వ్యవహరింపబడేదనిన్నీ, 1872 లో వెలువడిన శ్రీ రంగరాజ చరిత్రం కానీ, 1878 లో వెలువడిన రాజశేఖర చరిత్రం కానీ ఆనాడు నవలగా పిలువబడలేదనిన్నీ, సంస్కృతంలోని వాసవదత్త, కాదంబర్యాదులు ఇంగ్లీషులో నవల అనబడే ప్రక్రియ యొక్క లక్షణాలు కలిగినవైనా, తెలుగులో నవలావిర్భావం సంస్కృతభాషా సంబంధి కాదనిన్నీ, ఆంగ్ల వాఙ్మయ ప్రభావం వల్లనే యీ ప్రక్రియ తెలుగులో ఆవిర్భవించి, పరిణతి చెందినదనిన్నీ తేటతెల్లమవుతున్నది

ఈ దృష్టితో పరిశీలించిచూస్తే శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు రచించిన 'మహాశ్వేత' తొలి తెలుగు నవల అవుతుందా అన్నది విచారణీయం అవుతున్నది

## మహాశ్వేత

మహాశ్వేత 1867 వ సంవత్సరంలోనే రచింపబడినదని ప్రతిపాదిస్తున్నారు. కాని 1895 వ సంవత్సరంలోకాని వెలుగు చూడలేదు పనప్పాకం అనంతాచార్యులవారు 'వైజయంతి' అన్న పత్రికను ఆ కాలంలో నిర్వహిస్తూ వుండేవారు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు తమ 'మృగావతి' కావ్యాన్ని ఇంకా యితర రచనలను యీ పత్రికలోనే వెలయింపచేశారు. ఈ పత్రికలో 'మహాశ్వేత' కొంత భాగం వెలువడింది సంస్కృత కాదంబరిలోని కొంత భాగ

మైన 'మహాశ్వేత' వృత్తాంతాన్ని యథామాతృకంగా అనువదించి 'మహాశ్వేత' అని పేరు పెట్టటంకన్నా శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు చేసిన మార్పు ఏమీ లేదు. 'తెనుగున నవలా రచనకు పంతులుగారు ప్రథములు' అని శ్రీ నిడదవోలు వారు వ్రాశారు

దీని కుపబలకంగా శ్రీ శివశంకర పాండ్యాగారనేవారు కొక్కొండవారి విగ్రహతంత్రానికి వ్రాసిన పీఠికలోని వాక్యాలను వారు ఉదాహరిస్తున్నారు. కొక్కొండవారి విగ్రహతంత్రానికి పీఠికగా వారి జీవిత విశేషాలు గురించీ, వారి ప్రతిభాసంపత్తిని గూర్చీ శివశంకర పాండ్యాగారు ఆంగ్లంలో ఉపోద్ఘాతం వ్రాశారు వీరు గుజరాతీలైనా, ఆనాటి చెన్నపట్నంలో స్థిరపడినవారు కాబట్టిన్నీ సంస్కృత భాషాకోవిదులు కాబట్టిన్నీ వేంకటరత్నం పంతులుగారితో సన్నిహిత పరిచయాన్ని కలిగియుండవచ్చును వీరా విగ్రహతంత్రం పీఠికలో 'In 1867, he (Venkataratnam Pantulu) Composed the first Telugu Novel by name 'Mahasweta' founded on the pleasant story of Kadambari the masterpiece of Bana Bhatta in sanskrit .' అని వ్రాశారు.

ఈ వాక్యాలను ఆధారం చేసుకొని శ్రీ వేంకటరావుగారీవిధంగా ప్రతిపాదిస్తున్నారు. 'వేంకటరత్నము పంతులుగారు దీనిని రచించడములో విశేషమున్నది మరాఠీ, గుజరాతీ, కన్నడ భాషలలో కాదంబరి అంటే నవల అనే వాడుకగా నిలిచినది. కాదంబరి కథ నవలవలె నడచునది కనుక అది నవలకు పర్యాయపదమైనది. ఇంగ్లీషులోని నావల్ (Novel) అను పదము నవల యైనదని చెప్పుదురు. నవల సాంస్కృతికముగా సాధింపవచ్చును' అని 'ఆంధ్ర వచన రచనా పరిణామము' అన్న గ్రంథంలో శ్రీ వేంకటరావుగారు వ్రాశారు కనుక సంస్కృతంలోని కాదంబరిని నవలగా గ్రహిస్తే, కాదంబరిలోని ఏకదేశమైన మహాశ్వేత వృత్తాంతాన్ని వేంకటరత్నం పంతులుగారనూదితం చేశారు కాబట్టి, అది తెలుగులో తొలి నవల అని శ్రీ వేంకటరావుగారి నిష్కర్ష కాని నవలాప్రక్రియ ఆంగ్ల వాఙ్మయ ప్రభావంవల్ల తెలుగులో ఆవిర్భవించిందనుకొన్నప్పుడు యీ అభిప్రాయం యుక్తిసహం కానేరదు. శ్రీ వేంకటరత్నం పంతులుగారు తెలుగున వచన కావ్యాలు లేని లోటును

గుర్తించి ఆ లోటును తీర్చవలెనని సంకల్పించి, కాదంబరిని అనువదించి ఉండ వచ్చును సంస్కృత నాటకాలను కొన్ని అనువదించినట్లుగా, ప్రౌఢకావ్యమైన కాదంబరిని కూడా వారనువదించా రనుకొనవచ్చును.

కాని కాదంబరి కావ్యంలోని ఏకదేశమైన మహాశ్వేత వృత్తాంతాన్ని మాత్రమే గ్రహించటం నూత్న ప్రయత్నమే అని చెప్పవచ్చును.

కాని యీ అంశాలను పరిశీలించాలి.

మహాశ్వేత 1867 లోనే రచితమైనా 1895 వరకూ ప్రచురితం కాలేదు. నవలగా ప్రశస్తికి రాలేదు.

అర్వాచీనులకు వచన ప్రబంధ రచనమునందు మార్గదర్శకం కాదు

ఈ రచనపై ఆంగ్ల వాఙ్మయ ప్రభావం ఏమాత్రమూ లేదు.

ఈ గ్రంథం సమగ్రం కూడా కాదేమోనన్న అనుమానానికి ఇది ప్రచు రింపబడిన వైజయంతి పత్రికలో ఇది పూర్తిగా ప్రచురింపబడకపోవటం బలం చేకూరుస్తున్నది

ఇందులోని వాక్యనిర్మాణం కూడా సంస్కృత మర్యాదానుసారిగానే వున్నది ఈ విషయం యీ క్రింది ఉదాహరణలవల్ల తెలుసుకోవచ్చు:

'నాస్తి ఖల్వసాధ్యం నామ భగవత్ మనోభువః క్వాయం హరిణఇవ వనవాస నిరతః స్వభావ ముగ్ధో జనః? క్వచ వివిధవిలాసరాశిర్గంధర్వ రాజపుత్రీ మహాశ్వేతా?' (కాదంబరి)

'అయ్యో! భగవంతుండగు మనోభువున కసాధ్యంబు లేదు హరిణంబు వలె వనవాస నిరతుండై స్వభావ ముగ్ధుండైన యీ జనుం డెక్కడ? వివిధ విలాసరాశి గంధర్వరాజపుత్రి మహాశ్వేత యెక్కడ?' (మహాశ్వేత).

' ఇత్యభిధాయ ప్రతివచనకాల మప్రతీక్ష్యైవ పురోయాయినా, అంబా యాః ప్రవిశతా, కనకవేత్రలతాకరేణ, ప్రతీహారీజనేన, కంచుకిలోకేన, గృహీత తాంబూల కుసుమ పటవాసాంగరాగేణ, చామర వ్యగ్రపాణినా, కుబ్జ కిరాత బధిర వామన వర్ష ధవ వికలమూకానుగతేన, పరిజనేన సర్వతస్సంరుద్ధా ద్వార దేశా కథ మప్యవాప్తనిర్గమః ప్రయయౌ . .' (కాదంబరి).

'ప్రతివచనము న్నిరీక్షింపకయే, మున్మున్ను బంగరుబెత్తముల బట్టుకొని ప్రవేశించుచున్నట్టి పనిక త్తెలచేతను, కోజలచేతను, తమ్ములమ్మను, బువ్వులను, గంధమును, గంధపుబొడిని, గొడుగు సీపురుల, నాలవట్టములను గొని వెంట నంటు కుబ్జ, కిరాత, బధిర, వామన, బర్బర, వికల, మూకానుగత పరిజనుల చేతను అంతట నడ్డగింపబడిన తలవాకిటనుండి యెట్లో వెలువడిపోయెను.' (మహాశ్వేత)

ఇంతేకాకుండా, శివశంకర పాండ్యగారు విగ్రహతంత్రానికి వ్రాసిన ఉపో ద్ఘాతాన్ని వీరేశలింగం పంతులుగారు విమర్శించారు. పాండ్యాగారు వ్రాసినట్లు వేంకటరత్నం పంతులుగారు తొలి తెలుగు నవల రచించారన్న వాక్యాలు చూసి కూడా వీరేశలింగం పంతులుగారు తెలుగులో మొదటి వచన ప్రబంధాన్ని తామే వ్రాశామని చెప్పటానికి కారణం, వారు 'మహాశ్వేత'ను నవలగా పరిగ ణించక పోవటమే అని చెప్పాలి. 1913 లో వీరేశలింగం పంతులుగారు తాము మొదటి వచన ప్రబంధం వ్రాశామని చెప్పుకున్నారు.

1895 లోనే మహాశ్వేత వైజయంతిలో ప్రచురింపబడింది. కాబట్టి వీరేశ లింగం పంతులుగారు మహాశ్వేతను వచన ప్రబంధ మనుకొనలేదు. వీరేశలింగం పంతులుగారు వైజయంతిసి, దానిలో ప్రచురితమైన మహాశ్వేతనూ చూడలేదేమో అనుకోవటానికి వీలులేదు పంతులుగారి చాలా గ్రంథాలపైనా, ముఖ్యంగా కవుల చరిత్రపైనా 'వైజయంతి'లో విమర్శలు వచ్చాయి పంతులుగారి కవుల చరిత్రను సమీక్షించింది మానవల్లి రామకృష్ణ కవిగారే ననుకొనటానికి, ఆ విమ ర్శనం క్రింద ఎమ్ ఆర్. అన్న పొడి అక్షరాలు దోహదం చేస్తున్నాయి.

అర్వాచీనులైన వారందరూ నవలా రచనకు మార్గదర్శకంగా రాజశేఖర చరిత్రాన్నే గ్రహించారు కాని, మహాశ్వేతను కాదు. చింతామణి పోటీ నిబంధన లలో కూడా మార్గదర్శకంగా రాజశేఖర చరిత్రమూ, సత్యవతీ చరిత్రమూ పేర్కొనబడినవి కాని, మహాశ్వేత స్మరింపబడలేదు

తేలిన సారాంశం ఏమిటంటే, నేడు నవలగా ప్రాచుర్యాన్ని పొందిన సాహిత్య ప్రక్రియ మనకు సంపూర్ణంగా విజాతీయం కాదనీ, సంస్కృతంలో ప్రసిద్ధిని పొందిన వాసవదత్తా కాదంబర్యాదు లీ ప్రక్రియాసంబంధులేనని తలంచి

నప్పుడు, మహాశ్వేత తెలుగులో నవలారచనకు తొలి ప్రయత్నం అవుతుంది. అట్లా భావించనప్పుడు కాదు పోనీ కాదంబరిని అనుసరించి, స్వకపోలకల్పన లతో యీ గ్రంథాన్ని వెలయించినా, ఇది మొదటి వచన ప్రబంధం అయివుండే దేమో! ఆ విధంగా కాకుండా యథామాతృకానువాదం కావటంతో, ఆ ప్రతి పత్తిని కూడా కోల్పోయిందని చెప్పాలి ఇక మరాఠీ, గుజరాతీ, కన్నడ భాష లలో నవలకు 'కాదంబరి' అన్న పేరుండటం, అంటే- ఆ భాషల్లో నవలను కాదంబరి అని పిలవటం 'మహాశ్వేత' తొలి తెలుగు నవల కాదు అని చెప్పటా నికి కొంత బాధకంగానే ఉంటుంది. అయినా అనువాదానికి ప్రాథమ్యం ఇవ్వ జాలము అదీకాక ఇంగ్లీషు ప్రభావం మహాశ్వేతపై బొత్తిగా లేదు.

## శ్రీ రంగరాజ చరిత్రము

శ్రీ రంగరాజ చరిత్రమునకు సోనాబాయి పరిణయమని నామాంతరం వున్నది 1872వ సంవత్సరంలో వెలువడిం దీవచన ప్రబంధం బంగాళా ప్రజల ఆచారాలు తెలిపే నవల వ్రాసిన వారికి బహుమానం ఇవ్వబడుతుందని నాటి గవర్నర్ జనరల్ అయిన మేయోగారు, బెంగాల్ గెజట్‌లో ప్రచురించగా, కర్నూలులో డిప్యూటీ కలెక్టరుగా ప్రభుత్వోద్యోగాన్ని నెరపుతుండిన నరహరి గోపాలకృష్ణమ్మచెట్టిగారు ఆ ప్రకటనను చూసి ప్రేరితులై, తెలుగులో హిందు వుల యాచారములు తెలిపే నవీన ప్రబంధాన్ని రచించారు ఇది స్వకపోల కల్పితం చారిత్రకేతివృత్తం కాకపోయినా పాత్రలు చారిత్రకంగా కనిపిస్తవి. నాయకుడు మహాకులీనుడై ఉండాలన్న ఆలంకారిక సిద్ధాంతాన్ని ప్రమాణంగా ఉంచుకొని విద్యానగరాన్ని పాలించిన శ్రీ రంగరాజును నాయకుణ్ణిగా గ్రహిం చానని రచయిత చెప్పుకున్నారు అంటే, పాత్రల పేర్లు మాత్రం చరిత్రనుండి గ్రహించారని తెల్లమవుతున్నది.

ఈ వచన ప్రబంధాన్ని గూర్చి వివరిస్తూ, తెలుగులో ఇది మొదటి నవల అని మద్రాసు గెజట్ పేర్కొన్నది నాడు యీ గ్రంథాన్ని సమీక్షించిన పురు షార్థప్రదాయిని దీనిని నవలగానే ఆంగ్ల సమీక్షలో పేర్కొన్నది బెంగాల్ గెజట్‌లో వెలువడిన ప్రకటన యీ వచనప్రబంధం ఆవిర్భవించటానికి కారణ మైంది కాబట్టి, యీ గ్రంథంపైన ఆంగ్ల సాహిత్య ప్రభావం కూడా ఉన్నది

వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్ర రచనలో శ్రీ రంగరాజు చరిత్ర ప్రభావం కూడా కొంత కనపడుతున్నది రాజశేఖర చరిత్రంలోని కొన్ని సన్నివేశాలు ఆయా వర్ణనలతోసహా శ్రీ రంగరాజ చరిత్రంలో కనపడుతున్నవి. శ్రీ రంగరాజ చరిత్రానికి సోనాబాయి పరిణయమని నామాంతరమున్నట్లే రాజశేఖర చరిత్రానికి కూడా వివేకచంద్రిక అని నామాంతరం వున్నది. అయితే శ్రీ రంగరాజ చరిత్రాన్ని రాజశేఖర చరిత్రంతో పోల్చిచూస్తే, శ్రీ రంగరాజ చరిత్రంలో శైలీ, ఇతివృత్తమూ మొదలైనవి పేలవంగానూ, అప్రౌఢంగానూ కనిపిస్తవి. శ్రీ రంగరాజ చరిత్రమునకు రాజశేఖర చరిత్రమునకుగల సామ్య వైషమ్యాలు శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు ప్రబుద్ధాంధ్ర మాసపత్రికలో (1934 జనవరి) చర్చించారు ఈ ప్రబుద్ధాంధ్ర శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి సంపాదకత్వాన రాజమహేంద్రవరంనుంచి వెలువడుతూ వుండేది. శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు కూడా తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావమన్న తమ పరిశోధక గ్రంథంలో శ్రీ రంగరాజ చరిత్రమును గూర్చి విపులంగా చర్చించారు

శ్రీ రంగరాజ చరిత్రకు ఆంగ్లంలోనూ తెలుగులోనూ కర్త పీఠిక వ్రాశారు ఈ గ్రంథం లార్డు మేయోగారికే అంకితం చేయబడింది. ఈ నవీన ప్రబంధంలో కులాచారములు, వర్ణభేదములు, శకునములు, గ్రహశాంతులు, వేశ్యాలంపటత్వము, మూఢాచారములు మొదలైన విషయాలు విమర్శింపడ్డాయి. నవలను వచనప్రబంధమని తొట్టతొలుత సంభావించినది కూడా గోపాలకృష్ణమ్మ చెట్టిగారే వీరేశలింగం పంతులుగారికన్నా ఆరు సంవత్సరాలముందే గోపాల కృష్ణమ్మ శెట్టిగారీ వచన ప్రబంధాన్ని రచించారు. ఈ వచన ప్రబంధాన్ని తాము చూసి చదివి అనుసరించి కూడా వీరేశలింగం పంతులుగా రీగ్రంథాన్ని స్మరించకపోవటం అనూహ్యం. 1893 వ సంవత్సరంలో చింతామణి నవలారచనను ప్రోత్సహించే ఉద్దేశంతో ఏర్పరిచిన పోటీలలో కొత్తగా వ్రాసేవారికి మార్గదర్శకములుగా పేర్కొన్న వచనప్రబంధాలలోకూడా శ్రీ రంగరాజ చరిత్రం లేదు కనుక 1893 వ సంవత్సరానికే శ్రీ రంగరాజ చరిత్రం సాహితీపరులచే విస్మరింపబడిందని తెల్లమవుతూవుంది ఈ వచనప్రబంధం మలిముద్రణంకూడా పొందలేదు. రాజశేఖర చరిత్రంపై వున్నంత ఆంగ్ల వాఙ్మయ ప్రభావం శ్రీ రంగరాజ చరిత్రంపైన లేదు. కాని తెలుగు నవలా రచనా పరిణామంలో

శ్రీ రంగరాజ చరిత్రానికి సముచితమైన స్థానం వుంది. మొట్టమొదటి నవలను రచించే ప్రయత్నం శ్రీ గోపాలకృష్ణమ్మశెట్టిగారే చేశారని చెప్పవచ్చు

మహాశ్వేతపై ఆంగ్ల వాఙ్మయ ప్రభావం లేదు.

శ్రీ రంగరాజ చరిత్రంపై కొద్దిగా వుంది.

ఇక రాజశేఖర చరిత్రం ఆంగ్ల వాఙ్మయ ప్రభావం వలనే తెలుగులో వెలసింది.

## రా జ శే ఖ ర చ రి త్ర ము

వీరేశలింగం పంతులుగారు రచించిన మొట్టమొదటి వచనప్రబంధం ఇది. జనులలోని మూఢాచారాలను, అంధవిశ్వాసాలను పోకార్చవలెనని పంతులుగారీవచనప్రబంధాన్ని రచించారు ఈ నవల వివేకవర్ధనిలో భాగాలుగా వెలువడి, 1880 వ సంవత్సరంలో పుస్తకరూపాన్ని పొందింది

ఇది ఆలివర్ గోల్డ్‌స్మిత్ రచితమైన 'ది వికరాఫ్ వేక్‌ఫీల్డ్' అనే నవలకు అనుసరణమని వీరేశలింగం పంతులుగారు తమ పీఠికలో వ్రాశారు. కాని విశేషించి ఆంగ్ల మూలానికీ తెలుగు నవలకూ పోలికలు కూడా యెక్కువగా లేవని పంతులుగారే చెప్పుకున్నారు అయినా యీ రాజశేఖర చరిత్రంలో పంతులుగారి స్వోపజ్ఞత ఏమీ లేదనీ, యథామాతృకంగా అనువదించి, మూల గ్రంథంయొక్క సౌందర్యాన్ని కూడా పాడుచేశారనీ శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు తమ వివేకచంద్రికా విమర్శనంలో వీరేశలింగం పంతులు గారిని తీవ్రంగా అధిక్షేపించారు. సాంఘిక సారస్వతాది రంగాలలో, మత విషయకమైన విశ్వాసాలలో వీరేశలింగం పంతులుగారిపట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారికున్న స్పర్థ యీ వివేకచంద్రికా విమర్శనంలో తలస్పర్శిగా కనపడుతుంది. దేశీయములైన ఆచార వ్యవహారాలు, పాత్రల పేర్లు, రాజశేఖర చరిత్రంలో ఆంగ్లమూలం కన్నా విభిన్నంగా కనిపించినా, ఆయా మార్పులు సౌందర్యాపాదకములుకాక, మూలగ్రంథంలో గోల్డ్‌స్మిత్ కవీశ్వరుడు పాలలో చక్కెర కలిపినట్లు కరుణ శాంతరసములను సమ్మేళనం చేయగా, రాజశేఖర చరిత్రంలో వీరేశలింగం పంతులుగారు పాలలో ఉప్పు వైచినట్లుగా కరుణరసాన్ని హాస్యంతో జోడించి రసాభాసం గావించారని బ్రహ్మయ్యశాస్త్రిగా రాక్షేపించారు సంఘ సంస్కరణమే

ముఖ్యోద్దేశంగా యీ గ్రంథం రచింపబడింది కాబట్టి, వ్యంగ్యధోరణిలో పంతులుగారు సంఘంలో నాడు ప్రచురంగా ఉండిన లోపాలను అపహాస్యంపాలు గావించారు అంతమాత్రం చేత పంతులుగారు మూలగ్రంథంయొక్క సౌంద ర్యాన్ని పాడుచేశారనటం తగదు అసలు మూలగ్రంథం వొక ఉద్దేశంతో రచింపబడిందికాగా, రాజశేఖర చరిత్రం రచింపబడిన ఉద్దేశం అదికాదు. మూలగ్రంథమైన 'ది వికరాఫ్ వేక్‌ఫీల్డ్'లో సాహిత్యశిల్ప సౌందర్యం ప్రధాన స్థానాన్నాక్రమించగా, రాజశేఖర చరిత్రంలో దురాచార నిరసనం ప్రధాన స్థానాన్ని ఆక్రమించింది. ఇంగ్లీషు కథకూ దీనికీ విశేష సంబంధం లేదు. అది యొక యుద్దేశముతో చేయబడినది. ఇది వేరొక యుద్దేశముతో చేయ బడినది మనలోగల మూఢ విశ్వాసములను పోగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో పంతులుగారు దీనిని రచించినట్లు చెప్పుకోగా వారిని వేరొక దృష్టితో విమ ర్శించటం భావ్యంకాదు మూలగ్రంథానికి రాజశేఖర చరిత్రానికి భేదములకన్నా సాదృశ్యములే యెక్కువని శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు తమ పరిశోధక గ్రంథంలో వ్రాశారు ఆ మూలగ్రంథాన్ని అనుసరించి తామీ గ్రంథం వ్రాశామని పంతులుగారే చెప్పుకున్నప్పుడు; యీ రెండు గ్రంథాలలో దేహబంధంలోగాని పాత్ర నిర్మాణంలోగాని సాదృశ్యం ఎక్కువగా ఉండటంలో వింతలేదు డా॥ ప్రిమ్‌రోజ్, బర్చెల్, ఒలీవియా, సోఫియా మొదలైన పాత్రలను పంతులు గారు రాజశేఖరుడు, రామరాజు, రుక్మిణి, సీత మొదలైన పాత్రలనుగా పరి వర్తింపచేశారు. మూలగ్రంథంలో కథానాయకుడైన డా॥ ప్రిమ్‌రోజ్ తన కథ నంతా ఉత్తమ పురుషలో వినిపిస్తాడు రాజశేఖర చరిత్రంలో అట్లా కాదు. మూలగ్రంథంతో పోల్చిచూస్తే రాజశేఖర చరిత్ర కథాకల్పనమునందు బిగి తక్కువ. ఇది పంతులుగారి ప్రతిభకు అపకర్షకాదు. సంఘ దురాచారాలను రూపుమాపటానికి సాహిత్యాన్ని పంతులుగారు సాధనంగా స్వీకరించారు కాబట్టి కావ్యసౌందర్యంపట్ల వారు తమ రచనలలో శ్రద్ధ వహించలేదు. శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు రాజశేఖర చరిత్రానికి, మూలగ్రంథానికి సామ్యములు చూపుతూ, ఈ క్రింది విషయాలు రెండు గ్రంథాలలోనూ వర్ణింపబడినవి కనుక, పంతులుగారు మూలగ్రంథానికీ తమ గ్రంథానికీ పోలిక లెక్కుడుగా లేవని వ్రాయటం ఆక్షేపణీయమని విమర్శించారు. వారు చూపిన సామాన్యాంశాలివి:

1. గుళ్లు, 2. శుభనక్షత్రాదికము జూచుట, 3. కలల నమ్ముట, 4. శకున మడుగుట, 5. స్త్రీ విద్య, 6. పునర్వివాహము, 7. పండుగలు, 8. స్త్రీల ప్రసంగములు, 9. ఎఱుకయడుగుట, 10. భాగ్యము, 11 బీదతనము, 12 దొంగతనము, 13. నాగరికము, 14 పాండిత్యము, 15. సాముద్రికము, 16. జారత్వము, 17 దేశయాత్రలు, 18. నాటకములు, 19 పెండ్లిండ్లు, 20. సంతలు, 21 ముఖస్తుతులు, 22 బళ్లు, 23. రాజకీవి, 24 వర్తకము, 25. వేదాంతము. 26 మతము, 27 మత గురువులు, 28. రోగములు, 29. వైద్యము, 30 కారాగృహము, 31. రిఫారము (Reform), 32. దంపతుల కలహము, 33. స్త్రీలదొ యలంకారముల యందలి యాశ, 34 ఇండ్లు కాలుట, 35. రాజభటుల దుర్నీతి, 36 మూఢభక్తి, 37. కవుల స్థితి, 38. ఆతిథ్యము.

ఈ పై అంశాలు రెండు గ్రంధాలలోనూ సామాన్యం కాబట్టి పంతులు గారు మూలగ్రంథాన్ని అనువదించి తమ స్వప్రజ్ఞగా సాధిస్తున్నారని బ్రహ్మయ్యశాస్త్రిగారి ఆక్షేపణ పైన వారు చూపిన సామ్యాంశాలనుబట్టి, వారి దృష్టి ఎంత స్పర్ధైకమూలమో స్పష్టపడుతున్నది. ఇటువంటి అంశాలలో పెక్కు అంశాలు, ఏమాత్రమూ సంబంధంలేని ఏ రెండు గ్రంథాలలోనైనా వర్ణింప బడవచ్చును. అందువల్ల ఆ రెండు గ్రంథాల పౌర్వాపర్యము కాని, అందులో ఒక గ్రంథకర్త గ్రంథచౌర్యం కాని ప్రతిపాదింపబడజాలవు.

ఈ విధంగా వాదనకు దిగితే మూలగ్రంథాని కేమాత్రమూ సంబంధం లేకుండా రాజశేఖర చరిత్రమునందు మాత్రమే ప్రసక్తాలైన అనేక విషయాలను పరిశీలించవచ్చును. వాటిలో కొన్ని-

1 స్వర్ణయోగము, 2. గ్రహబాధ (దేవతావేశము), 3 లంకెలబిందెలు, 4. బాల్యవివాహములు, 5 వితంతువుల కేశఖండనము, 6 దేవుని మాన్యములు, 7. అమ్మవారి (గ్రామదేవత) జాతరలు, 8. జ్యోతిషశాస్త్ర చర్చలు, 9 స్వయం పాకము, 10, వంట బ్రాహ్మణులు, 11 గ్రహణములు, 12. పర్వదినము లందు నదీస్నానములు, 13. సూతకము - మైలబొట్టు, 14 ఆతుర సన్యాసము, 15. అంజనమువేసి దొంగను పట్టుకొనుట, 16. పంచాంగ శ్రవణము, 17. శవ వహనము, 18. కులాచారములు, 19 నీళ్ల రేవులం దమ్మలక్కల ముచ్చట్లు,

20 వివాహ వ్యయములు, 21 సంగీత విద్వాంసులు, 22. బంధువులు, 23 పురిటిలో సందుగొట్టుట, 24 బాలరోగము, 25. బోగము మేళము, 26 బ్రాహ్మణ సంభావనలు, 27 పెండ్లి వేడుకల యందలి మోటు సరసములు, 28 గౌళిపాటు, 29 శివపూజ (పార్థివము), 30. ప్రయోగములు, 31 పురాణ పఠనము, 32 భూతవైద్యము, 33 ప్రశ్న చెప్పుట (పోయిన వస్తువుల ఉనికి చెప్పుట), 34 వర్ణభేదములు 35 శ్రీముఖములు (ఆంక్ష పత్రికలు), 36. పండుగలు (దేశీయాచారములు), 37 మూఢవిశ్వాసములు, 38 రక్ష రేకులు, 39 సప్త సంతానములు. 40 శాస్త్ర చర్చలు, 41. శాఖాభేదములు, 42. రథోత్సవము, 43. సాలగ్రామార్చన మొ॥ నవి

ఈ పై చెప్పిన విషయాల వర్ణన 'ది వికరాఫ్ వేక్‌ఫీల్డు' నందు లేదు కాబట్టి, రాజశేఖర చరిత్రం ఆంగ్ల గ్రంథానికి అనుసరణం కాదని చెప్పలేము. అట్లానే కొన్ని విషయాలు సమానంగా వున్నంత మాత్రాన ఆంగ్ల గ్రంథానికి రాజశేఖర చరిత్రం అనువాదమనీ అనలేము కాబట్టి దేహబంధం (Structure) విషయంలో ఆంధ్రాంగ్ల నవలలకు విశేషించి సామ్యము లున్నప్పటికీ, ఇతి వృత్తంలో (Plot) చాలా భేదం వున్నదనటం స్పష్టం రాజశేఖర చరిత్రం కేవల మనువాద గ్రంథమే అయివుంటే మళ్ళీ ఆంగ్లంలోకి అనువాదం పొందివుండేది కాదు. రాజశేఖర చరిత్రానికి ఇంగ్లీషులో రెండనువాదాలు వచ్చాయి. ఇందులో (Fortune's wheel - అదృష్ట చక్రం) అన్న పేరుతో వెలువడిన అనువాదం నాటి లండన్ టైమ్స్ పత్రికలో మిక్కిలి ప్రశంసింపబడింది అంతేకాకుండా, రాజశేఖరచరిత్రం తమిళ, కన్నడ భాషలలోకి కూడా అనూదితమైంది. చిలకమర్తివారు తాము రామచంద్ర విజయం రచించటానికి రాజశేఖర చరిత్రమే మార్గదర్శకమైనదని వ్రాశారు. ఈ విధంగా రాజశేఖర చరిత్రం అర్వాచీను లందరికీ నవలారచనలో మార్గదర్శకమైనది. ఈ నవల తొమ్మిదిసార్లు ప్రచురింప బడటం కూడా దీని విశేషప్రశస్తిని ఋజువుపరుస్తున్నది. ఆంగ్ల గ్రంథానికి అనుసరణమే అయినా, స్వతంత్రేతివృత్తంగా పంతులుగారు రాజశేఖర చరిత్రాన్ని రచించారు కాబట్టి సర్వలక్షణ సముపేతమైన, సర్వాంగసుందర మైన తొలి తెలుగు నవల రాజశేఖర చరిత్రమే అని నిర్ణయించవచ్చు.

అయితే శ్రీ రంగరాజ చరిత్రం నవలా రచనకు తెలుగులో తొలి ప్రయత్నమని భావించవచ్చును పంతులుగారు శ్రీ రంగరాజ చరిత్రాన్ని గూర్చి ఎక్కడా ప్రస్తావించక పోవటానికి కారణం వా రా గ్రంథాన్ని నవలగా, అంటే వచన ప్రబంధంగా భావించక, ఒక కథగా, అంటే అప్రౌఢమైన వచన రచనగా భావించటమే అయి ఉంటుంది

అందువల్లనే తెనుగున 'మొట్టమొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని' అని వారు వ్రాసుకోవటం సంభవించింది కాబట్టి నాటినుంచి సాహిత్య పరులందరూ తొలి తెలుగు నవల రాజశేఖర చరిత్రమేనని అభిప్రాయపడటం జరిగింది కొంతలో కొంత ఇది సత్యమే అయినా, తెలుగులో నవలారచనకు ప్రయత్నం, వీరేశలింగం పంతులుగారికి పూర్వమే, నరహరి గోపాలకృష్ణమ్మ చెట్టిగారివంటివారు చేశారనటం సత్యదూరం కాదు మహాశ్వేత తెనుగున వచన ప్రబంధం కాజాలదు కాబట్టి తెనుగులో అది తొలి నవల కాదు రాజశేఖర చరిత్రంపైన ఆంగ్ల వాఙ్మయ ప్రభావం వుండటమూ, అది అనువాదం కాక అనుసరణగా వెలయటం, బహుళ ప్రచారాన్ని పొందటం, తిరిగి ఇతర భాషల లోకి అనువదించబడటం మొదలైన కారణాలు పురస్కరించుకొని, తొలి తెలుగు నవలగా రాజశేఖర చరిత్రం ప్రశస్తిని పొందింది.

(భారతి 1967, డిసెంబర్)

# ఎమెస్కో వారి ఏభై పుస్తకాలు

ఈమధ్య వార్తాపత్రికల్లో చాలా ఆసక్తినీ, ఆశ్చర్యాన్నీ కలిగించిన వార్త ఒకటి వెలువడింది. ఏమంటే, ప్రపంచంలో సినిమాచిత్రాల నిర్మాణంలో ఇండియా రెండవ స్థానం వహిస్తున్నదని, అయితే పుస్తక ప్రచురణలోనూ, పుస్తక పఠనంలోనూ చాలా చాలా వెనుకబడి ఉన్నదనీ! సినిమాలు ఎక్కువ సంఖ్యలో మన దేశం ఉత్పత్తి చేస్తున్నదంటే, చూసి ఆనందించి, ఆదరించేవారి సంఖ్య కూడా ఎక్కువేనన్న మాటేగా! ప్రజలు సినిమాలు ఎందుకు చూస్తున్నారు? ఆనందిస్తున్నారు? ఆదరిస్తున్నారు? అన్న ప్రశ్నలకు సమాధానంగా - కొత్త విలువలను, కొత్త రూపురేఖలను సంతరించుకుంటున్న నేటి సంఘంలో, ఇంతకు పూర్వం వ్యక్తి జీవితంలో అనుభూతమైన ఒక వేగం ప్రధాన స్థానాన్ని ఆక్రమించుకున్నదనీ, ఈ యంత్రయుగపు నాగరికతలో ఈ వేగంలో సామాన్యుడికి కొంత ఉల్లాసాన్నీ, వినోదాన్నీ చేకూర్చగలిగిన సాధనంగా సినిమాకళ రూపొందినదనీ తెలుసుకోవటం చాలా అవసరం. అందువల్లనే సినిమాలు బాగా చూస్తున్నారు ప్రజలు అందువల్లనే సినిమాలు ఎక్కువ సంఖ్యలో నిర్మింపబడుతూ ఉన్నాయి.

అయితే పుస్తక పఠనం, ఎందుకు బాగా అభివృద్ధి పొందలేదు? మన దేశంలో అక్షరాస్యత రోజురోజుకీ గణనీయంగా పెరిగిపోతూనే ఉన్నది కొత్త స్కూళ్ళు, కాలేజీలు వెలుస్తూనే ఉన్నాయి అయినా పుస్తకాల ప్రచురణలోనూ, పుస్తకాలు చదవాలన్న ఆసక్తి ప్రజల్లో వ్యాప్తి పొందటంలోనూ గణనీయమైన అభివృద్ధి కనిపించటం లేదు దీనికి కారణాలు జనసామాన్యానికి అందుబాటులో ఉండేటట్లుగా పుస్తకాలు ప్రచురించటం కానీ, వాటిని ప్రచారం చేసి అమ్మకపు పనిని శాస్త్రీయంగా నిర్వహించటం కానీ, జనసామాన్యం యొక్క అభిరుచులకు అనుగుణమైన పుస్తకాలు ప్రకటించటం కానీ తమ ధ్యేయంగా, బాధ్యతగా, ప్రయోజనంగా ప్రచురణకర్తలు గ్రహించలేకపోవటమే! తరువాత పుస్తక ప్రచురణకు సంబంధించి, కొన్ని నైతిక విలువలూ, సాంఘిక బాధ్యతలూ

ఉంటాయన్న విషయాన్ని పుస్తక ప్రచురణ సంస్థలు పూర్తిగా విస్మరించాయి. కేవలం వైయక్తికమైన వ్యాపార ప్రయోజనాన్నే దృష్టిలో ఉంచుకొని, పుస్తక ప్రచురణని కూడా న్యూనపరచిన ప్రచురణకర్తలే అధిక సంఖ్యలో ఉన్నారు పుస్తకాలకు విపరీతమైన ధర లుంచటం, కొంత ఉన్నత ప్రమాణానికి చేరువగా రాగల అభిరుచులను ప్రోత్సహించకపోవటం, వైవిధ్యాన్నాదరించకపోవటం, పరిమితమైన శక్తియుక్తులు చూపి, అపరిమితంగా ఆర్జించాలన్న దురాశా పుస్తక పఠనానికి చేయవలసినంత దోహదం చేయలేకపోయినయ్ ఆదీకాక, సాంఘిక స్థితిగతులను, తరుణీతరుణుల మానసిక వికాసాన్నీ బాగా అవగతం చేసుకొని, వారి అభిరుచులకు అనుగుణమైన, ఆకర్షణీయమైన సాహిత్యాన్ని అందించలేకపోవటం కూడా పుస్తక పఠనం బాగా అభివృద్ధి చెందలేకపోవటానికి ఒక కారణంగా చెప్పవచ్చు మధ్యతరగతి జీవన వ్యయ సూచిని దాటిపోకూడదు పుస్తకం ఖరీదు అట్లానే మధ్యతరగతి విద్యావంతుల అవగాహనకు, అభిరుచులకూ అతీతమైనదిగా కూడా ఉండరాదు తాపీగా, నిదానంగా పెద్ద పెద్ద పుస్తకాలను సాహిత్యదృష్టితో, విలువలతో చదివి ఆనందించే వ్యవధీ, వోపికా, యీ సాంఘిక స్థితిని పురస్కరించుకుని జనసామాన్యానికి లేవు అందువల్ల, పుస్తకాలు చదివే అలవాటూ, ఆసక్తి కలవారల అభిరుచులను క్రోడీకరించి, తదనుగుణంగా తెలుగుదేశంలో పుస్తకపఠనాన్ని బాగా పెంపొందించాలనే సత్సంకల్పంతో, పుస్తక ప్రచురణలో విశేషానుభవం గడించి వున్న ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్‌వారు ప్రతి నెలా నాలుగు పుస్తకాలు, రెండురూపాయల నిర్ణీత ధరకు ప్రకటించే పథకాన్ని రూపొందించి, ఆ ప్రణాళికను అమలుజరపగలిగారు కిందటి సంవత్సరం అక్టోబరు నెలలో మొదటి విడత నాలుగు పుస్తకాలూ వెలువడ్డాయి ఈ సెప్టెంబరు నెలలో వెలువడిన ఐదు పుస్తకాలను అనుకొన్నట్లుగా వెలువరించి, 'నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు' అన్న లోకోక్తిని నిరూపించారు. అయితే యీ యాభై పుస్తకాలు కూడా ఉత్తమమైన సాహిత్యంగానూ, ఉత్తమాభిరుచుల కాటపట్టులగానూ వున్నాయా అంటే, అట్లా అని చెప్పటానికి వీల్లేదు అన్ని వర్గాలవారిని, అన్ని స్థాయిలలోని పాఠకులను అలరించి, ఆకర్షించేంత వైవిధ్యం మాత్రం యీ పుస్తకాలలో వున్నది ఒకే ఖరీదుకు ఇవ్వటమన్న అంతసూత్రం కూడా ఒకటి వున్నది.

జన సామాన్యంలో అందునా ముఖ్యంగా పుస్తకాలు చదివే ఆర్తీ, ఆసక్తి, జిజ్ఞాసా ఉన్నవారిలో వీటిని మరింత పెంపొందింపజేయటం, ఇతరులలో ఆ అభిరుచిని రేకెత్తించటం ప్రధాన లక్ష్యంగా యీ ప్రణాళికను రూపొందించారు కాబట్టి, ఆ ఆశయాన్ని ప్రచురణ కర్తలు నేర్పుగా సాధించారని యీ యాభై పుస్తకాలలో ఏ అయిదారు చదివినా తెలిసిపోతుంది అందరికీ అందుబాటులో వుండటం, అపూర్వమైన వైవిధ్యం, అందచందాలతో గూడిన రూపురేఖలు, ఉభయతారకమైన వ్యాపార ప్రయోజనం (అంటే పాఠకులూ, ప్రచురణకర్తలూ) యీ పుస్తకాలలోని ప్రత్యేక యోగ్యత లని చెప్పాలి తనకు మాలిన ధర్మమూ, మొదలు చెడిన బేరమూ వుండవు, వుండకూడదూ కనుక యీ పుస్తకాలు పది మందినీ ఆకర్షించే వైవిధ్యం కలిగివున్నాయి కలిగివుండాలనే వారి సంకల్పమైనట్లు కూడా గ్రహించటం మంచిది రెండు రూపాయలకు ఆ రూపు రేఖలతో పుస్తకాన్ని అందించినందుకే చదివేవారంతా వారి యెడల మిక్కిలి కృతజ్ఞులైవుండాలనీ, మనస్ఫూర్తిగా మిక్కుటమైన సంతోషంతో ఎమెస్కో ప్రచురణ కర్తల నభినందించాలనీ, వారి ప్రయత్నాలను ప్రోత్సహించాలనీ, ఆ పుస్తకాలకు స్వాగతం పలకాలనీ, ఇదంతా తెలుగుదేశం మేలుకేననీ విజ్ఞులూహిస్తారు- అసలు ఇలాంటి ప్రయత్నం జరగటమే అపూర్వం నిర్విఘ్నంగా కొనసాగటం తెలుగుదేశపు అదృష్టం దినదినాభివృద్ధిని పొందటం ప్రచురణ కర్తల చిత్తశుద్ధికీ, వ్యాపారదక్షతకూ, శక్తియుక్తులకూ నిదర్శనం, పాఠకులు కనపరుస్తున్న ఆసక్తి ప్రచురణకర్తల ఆశయ సఫలతకు తార్కాణం

ఈ యాభై పుస్తకాలను పరిశీలిస్తే అత్యంతాద్భుతం అయిన అనుభూతి కలుగుతుంది ఈ శతాబ్దిలో నాలుగైదు దశాబ్దాలుగా సాహిత్య సృష్టి చేసి పేరు ప్రఖ్యాతులు పొంది, తెలుగువారి అభిమానాన్నీ ఆరాధననూ సంపాదించుకొన్న ప్రతిభావంతుల రచనల నుండి ఇప్పుడిప్పుడే సాహిత్యరీతులను బాగా అవగాహన చేసుకుంటున్న రచయితల రచనలదాకా వున్నయ్ వీనిలో లబ్ధ ప్రతిష్ఠులనుంచి వర్ధిష్ణు రచయితలదాకా యీ యాభై పుస్తకాలను ఎన్నిక చేయటం స్తుతిపాత్రం అనక తప్పదు వయస్సూ, జ్ఞానమూ, పాండిత్యమూ, ప్రాగల్భ్యమూ, ప్రౌఢత మొదలుకొని తారుణ్యము, ఉద్రేకము, ఉత్సాహము, ఉపజ్ఞ, ఉన్నతాశయాలూ, ప్రాతినిధ్యం వహించగల రచయితలెందరో యీ పథకానికి పుష్టినీ, తుష్టినీ చేకూర్చారు వివిధ సాహిత్య సిద్ధాంతాలూ, విభిన్న

ధోరణులూ, వివాదాస్పదమైన నమ్మకాలూ కల రచయితల పుస్తకాలు యీ యాభైలో వున్నాయి చలానికీ, విశ్వనాథకూ ఉత్తర దక్షిణ ధ్రువాల మధ్య వున్నంత ఎడం ఉన్నది ఇలాంటి వైవిధ్యాన్నీ, పోలికలను ఇంకా ఇంకా నిరూపించటం కష్టమే అయినా, పెద్దలనుంచి కానీ, యువ రచయితల నుంచి కానీ విభిన్న ధోరణులను, వివిధ మార్గాలను, విశ్లేషించి చూపవచ్చు మధురాంతకం రాజారాం విశిష్టత వేరు అవసరాల రామకృష్ణారావు మార్గం వేరు రంధి సోమరాజు పంథా వేరు బలివాడ కాంతారావు పద్ధతి వేరు వీళ్ళవీళ్ళ రచనల్లోనూ, వస్తువుల్లోనూ కన్పించే వైచిత్రి అంతా ఇంతా కాదు

రచన అంటే శిల్పమని భావన ఇక్కడ వస్తువంటే వాళ్ళ పరిశీలనా దృష్టి కంటె మన చుట్టూ ఉన్న ప్రపంచం, హాస్యం, చమత్కారం, వ్యంగ్యం, హేళన, కరుణ దుఃఖం, ముగ్ధత్వం, వాస్తవికత చూపవలసివచ్చినప్పుడు, ఆయా రచయితల వాక్య నిర్మాణం, ప్రతిభ, వస్తు విమర్శనాదృష్టి యెంతో వైవిధ్యం కలిగి, పాఠకులను సంతృప్తిపరుస్తున్నాయి శివశంకరస్వామి కథల నుంచి శ్రీపతి కథలదాకా తెలుగు కథానిక క్రమవికాస పరిణామపు తీరుతెన్నులు వ్యక్తంకావా? అతినవ్యమైన పరిశీలనాదృష్టి నేటి యువ రచయితది ప్రాకృతమైన దృష్టి శివశంకరస్వామిది భాష భావం, ప్రకటన, ప్రతిస్పందన అతి నవీనంగా, విప్లవాత్మకంగా ఉండాలని వాంఛిస్తాడు నేటి రచయిత సాహిత్యపు విలువలూ సామాజిక పరివర్తనమూ అన్న వాటిలో సామాజికదృష్టి పరమ ప్రయోజనంగానూ, కోరుకోదగినదీ, చేరుకోదగినదీగానూ ఇవాళ్టి రచయిత భావిస్తున్నాడు ఏం చెప్పటంకంటే, ఎట్లా చెప్పటమన్నది ప్రధానమని యువ రచయితలు అనుకుంటున్నారు. సౌందర్య దృష్టి కాక సామాజిక దృష్టి ప్రాచుర్యం పొందాలని నవ్యుల కోరిక అన్ని ప్రక్రియలకూ కాక, నవల, కథానికా యీ పుస్తకాలలో ఎక్కువ ప్రాతినిధ్యాన్ని పొందాయి నేడు బాగా ప్రసిద్ధిపొంది, మంచి కథలూ, మంచి నవలలూ వ్రాసిన చాలా మంది యీ యాభై పుస్తకాలలో వున్నారు బాగా ప్రచారంలోవున్న వార పత్రికలలోనూ, మాస పత్రికలలోనూ తరచు రచనలు చేసే సుప్రసిద్ధ రచయిత్రు లెందరో, యీ యాభై పుస్తకాలలో చేర్చబడ్డారు ఏ ఒకరిద్దరో తప్ప, మంచి రచనలు చెసిన యువ రచయితలు కాని, రచయిత్రులుకాని యీ రచనలలోకి రాకుండా వుండలేరు. ఈ పుస్తకాలల్లో ఎక్కువ భాగం నవలలు.

తెలుగులో వెలువడిన మొట్ట మొదటి నవల సాంఘిక నవల కావటం గమనార్హం వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రం నేడు నవలలని పిలువబడుతున్న ప్రక్రియా స్వరూపంలో వెలువడిన మొదటి నవల రాజశేఖర చరిత్రలో నాటి సాంఘిక సమస్యలు, వాటి విమర్శ ప్రధాన స్థానాన్ని వహించాయి అంటే, ఇంచుమించుగా తెలుగు నవలకు తొంభై ఏళ్ళ చరిత్ర వున్నది వీరేశలింగం పంతులుగారి తరువాత నవలను బాగా ప్రచారంలోకి తెచ్చినవారు చిలకమర్తి చిలకమర్తి రామచంద్ర విజయం, ఏ కొలబద్దతో చూచినా మంచి సాంఘిక నవలే అని చెప్పాలి అప్పుడే 'చింతామణి' అన్న పేరుగల సాహిత్య మాసపత్రిక నవలలపోటీ నిర్వహించి, ఉత్తమమైన నవలలెన్నో వెలువడటానికి దోహదం చేసింది డెబ్భైఎనభై ఏళ్ళ క్రితం ప్రథమ బహుమతి పొందిన నవలకు ఐదువందల పారితోషిక మిచ్చారంటే పుట్టినప్పటినుంచీ కూడా నవలకు గల ఆకర్షణ ఎటువంటిదో మనకు తెలుస్తూవున్నది ఆ రోజుల్లో ఐదువందలిచ్చి ప్రోత్సహించటం చాలా గొప్ప విషయం ఇప్పుడు ఎన్నో పత్రికలు ఇటువంటి పోటీలు నిర్వహిస్తున్నాయి, ఎందరో నవ రచయితలు రంగ ప్రవేశం చేస్తున్నారు. బహుమందిచేత కొనియాడబడుతున్నారు ఏ విధంగా చూసినా ఇవాళ నవలలు చదివేవారి సంఖ్యే ఎక్కువని చెప్పాలి ఇటీవల కథలకు కూడా ఆదృతి తగ్గింది. దీనికి కారణం చాలా వారపత్రికలు, మాసపత్రికలు విధిగా కథలను అందిస్తూనే వున్నందున, సంపుటీకరించిన కథలకు అట్టే గిరాకీ వుండటంలేదు ఇక కవిత్వం, సాహిత్య విమర్శలకు ఏ రకమైన ఆకర్షణ, ఆదరణ వుంటుందో తెలుసుకుందుకు యీ మొదటి యాభై పుస్తకాలద్వారా ఆస్కారం లేదు

బహుముఖ ప్రతిభావంతుడు, అద్వితీయమైన ప్రజ్ఞాశాలి, పండితుడు, వ్యుత్పన్నుడు, రాసికిగాని వాసికిగాని సమకాలీన సాహిత్యచరిత్రలో నిరుపమానమైన స్థానాన్ని అలంకరించినవాడు, సాహిత్య తపస్వి అని పేర్కొన్నదగినవాడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఈయన చేపట్టని ప్రక్రియ లేదు అయితే వీరి సిద్ధాంతాలూ, నమ్మకాలు నేటి కాలానకు చాలా మందికి చేరువగా వుండవు ఆయన విలువలు వేరు ఆయన పద్ధతి వేరు సంప్రదాయంపట్ల గొప్ప అభినివేశమూ, సనాతనమైన దేనిపట్లనైనా గాఢాభిమానమూ విశ్వనాథ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నవీనమైన ధోరణులపట్ల ఆయనకు వైమనస్యమేమీ లేదని ఆయనగారి అభిమానులంటారు కాని వారి వ్యతిరేకులా అభిప్రాయాన్ని అంగీకరించరు ,

మన చరిత్రనంతా పాశ్చాత్యులు, వాళ్ళ అభిమానులూ, అనుయాయులూ మార్చి వేశారనీ, మసిపూసి మారేడుకాయ చేశారనీ విశ్వనాధ వారి అభియోగం. ఈ అభిప్రాయాన్ని అణుమాత్రమైనా వారు సడలించుకోరు దీనిలో సత్యాసత్యాలెట్లావున్నా వేదాలు, ఉపనిషత్తులు, సనాతన సంప్రదాయాలూ- వీటన్నిటి పైన విశ్వనాథకున్న గౌరవం, అభినివేశం వేరు ఈ దృష్టితో నేపాళ రాజవంశ చరిత్రనంతా తిరిగి వ్రాయవలెనన్న సంకల్పంతో నేపాళ దేశ చరిత్రను వారు నవలలుగా రూపొందించారు ఈ మొదటి యాభై పుస్తకాలలో నేపాళ దేశ చరిత్రాత్మకములైన 'దిండుక్రింది పోక చెక్క', 'చిట్లీ చిట్లని గాజుల'న్న నవలలు వెలువడ్డాయి విశ్వనాథవారు 'ప్రాతపై' ఎంత మమత కలిగివున్నా, నవలల పేర్లు మాత్రం ఎంతో ఆధునికంగా వుంచారు. అత్యంతాకర్షణీయంగా వున్నాయి యీ నవలల పేర్లు. వీరి ఇతర నవలలను గూర్చి కూడా యీ మాటే చెప్ప వచ్చు. ఈ నవలల్లో విశ్వనాథవారి కల్పనాశక్తి, చిత్ర విచిత్రంగా విజృంభించిందని చెప్పవచ్చు. జపహోమ అధ్వరాదులు, మంత్ర తంత్రాలు, ఇంద్ర జాల మహేంద్రజాలాలు యీ నవలల్లో చోటు చేసుకున్నాయి వయసుమీరుతున్న కొద్దీ విశ్వనాథవారిలో (అంటే ముఖ్యంగా నవలా రచనకు సంబంధించి) సాహిత్యం తగ్గి చాదస్తం పెరుగుతున్నదని వారి విమర్శకులు, వ్యతిరేకులూ, అంటారు గాక! ఆయనే చెప్పుకున్నట్లు తన గ్రంథాల ప్రాశస్త్యానికీ, ప్రచారానికీ అవన్నీ నిదర్శనాలేనేమో మరి! తమ గ్రంథాలకు ప్రత్యేకించి వ్యాపార ప్రకటన అవసరం లేదనీ, విమర్శకులే ఆ పనిని చక్కగా సాధించగలరనీ విశ్వనాథవారి అభిభాషణ ఈ నవలల్లో కథాగమనానికి ప్రయోజనకారులుకాని బహువిషయాలను సంక్షేపిస్తే ఇంకా ఆకర్షణీయంగా ఇవి ఉండేవనిపిస్తుంది. అయితే వారి వ్యుత్పన్నతకు, పాండిత్యానికి ఆ విధమైన సంక్షేపణ అనూహ్యమనిపిస్తుంది కాని జటిలమైన శైలీ, అభౌమములూ, అతిమానుషములూ,పాఠకులందరికీ సంతృప్తి చేకూర్చలేవనిపిస్తుంది హేతువాద దృష్టి ప్రబలిపోయిన యీ కాలానకు కాశీమజిలీ కథలు కాలక్షేపాలు కావు. ఒకవేళ వారాశించిన పరమ ప్రయోజనం వేరే ఏదైనావుంటే, అందుకు తగినట్లుగా వీటిని వారు మలచలేదనిపిస్తుంది.

విశ్వనాథ తరువాత పేర్కొనవలసింది చలాన్ని ఈ ఏభై పుస్తకాలలో చలానివి రెండు పుస్తకాలున్నాయి చలం అతివాదులలో అగ్రగామి. తిరుగు

బాటుదారులలో తెలుగుసాహిత్యంలోనే ఇతణ్ణిమించినవారు లేరేమో ననవచ్చు. అయితే చలం సాధించిన సాంఘిక ప్రయోజనం ఏమైనావున్నదా? అన్న విషయంలో ఏకవాక్యత లేదు చలం ఏమీ సాధించలేదంటే, గాంధీగారు పుట్టకపోయినా స్వాతంత్ర్యం వచ్చేదే అన్నట్లు ఉంటుంది చలంలో ఉద్రేకమూ, సాహసమూ, విప్లవ ధోరణీ, ఉపజ్ఞను మించిపోయాయి ఇలాటి రచనలు చేయకపోతే ఆయన గొప్పకవి అయివుండేవా డనిపిస్తుంది అతని శక్తి యుక్తులు తీవ్రంగా విజృంభిస్తోన్న కాలంలో స్త్రీ సాంఘిక స్థితి మనకు తెలియదు. స్త్రీ అట్టడుగున, అధోగతిలో, దయనీయమైన పరిస్థితుల్లో, విలాస వస్తువుగా, అమానుషంగా, చూడబడివుంటే చలం సంఘం పట్ల కనపరచిన కసీ, నిరసనా నిరర్థకాలు కావు.

ఏమైనా చలంలో ఆవేశం వున్నంతగా సంయమం లేదు. అతడు ప్రతిపాదించిన, ప్రచారం చేసిన, వాంఛించిన స్వేచ్ఛాప్రణయ సిద్ధాంతం అర్థం లేనిది. సాంఘిక వ్యవస్థలో చలం చూసిన దోషాలన్నీవున్నా, ఆయన ప్రతిపాదించిన ధోరణిమాత్రం సవ్యమైనది, అపేక్షితమైనదీకాదు చలాన్నిగూర్చి అందరూ మంచి తెలుగు వ్రాస్తాడనీ, ఆయన శైలి అనితరసాధ్యమనీ అంటారు కాని ఇది మాత్రమే చలంస్థానాన్ని సాహిత్యంలో నిరూపించజాలదు. చలం గొప్ప అన్వేషి. జీవితంలో ఎన్నోపరుగులు పెట్టాడు అతని మనః ప్రవృత్తి అటువంటిది ఈ రెండు పుస్తకాలలో విచిత్రనశీయం అన్న కథాసంకలనంలో మంచి కథలున్నాయి చురుకైన హాస్యం వున్నది ఆయన సిద్ధాంతాలు చెదురుమదురుగా వున్నాయి. ఆమె త్యాగం, రక్తదోషం లాంటి కథలు ఆ రోజుల్లోనే రచించాడంటే - చలం గొప్ప ప్రతిభావంతుడని స్పష్టపడుతున్నది రెండవ పుస్తకమైన 'దైవమిచ్చిన భార్య'లో ఆయన ఫిలాసఫీ తలస్పర్శిగా కనబడుతున్నది చలం బలంగా తన ఆశయాలకు, ఆలోచనలకు రూపరేఖలిచ్చి, 'దైవమిచ్చిన భార్య'లో ప్రాణ ప్రతిష్ఠచేశాడు. అంతరమైన మనఃప్రవృత్తిని, సౌకుమార్యాన్నీ ఈ నవల స్త్రీపురుషుల మధ్య సహజంగా కలిగే అనురాగాన్ని సాంఘికమైన కట్టుబాట్లు ఏవిధంగా సంకుచిత పరచి, సుఖాన్నీ, సంతోషాన్నీ, తృప్తినీ, స్త్రీపురుషు లిరువురూకూడా పొందలేక పోతున్నారో వివరిస్తున్నది చలం గొప్ప సౌందర్యారాధకుడు, సౌందర్యపిపాసి, తీక్ష్ణమైన మనస్సౌకుమార్యం కలవాడు కనుకనే క్రౌర్యం, కాఠిన్యం, మోసం, కల్పిత బంధాలు సహించలేకపోయాడు.

లబ్ధప్రతిష్ఠులైన పెద్దవారి రచనలలో శివశంకర స్వామివారి బుద్ధుని జాతక కథలు, ఒక చిన్న సంపుటంగా వెలువడినాయి ఇందులో భాషను ఇంకా కొంచెం సరళం చేసివున్నట్లయితే బావుండేది బహుభాషాకోవిదులు, యీ శతాబ్దంలో ఆంధ్రదేశంలో వచ్చిన అనేకానేకమైన సాహిత్యోద్యమాలకు సూత్రధారిత్వం చేసినవారు శివశంకరస్వామివారు పాళీభాష నుంచి, ప్రాకృతంనుంచి హిందూస్థానీ వరకూ వారికి నల్లేరుపై బండినడకయే బౌద్ధ జాతక కథలను పెద్ద పెద్ద సంపుటాలుగా వెలువరించా రిదివరలో అందులోంచి కొన్ని కథల ఎన్నిక యీ సంపుటం

పిలకా గణపతి శాస్త్రిగారి కాశ్మీరపట్టమహిషి, చైత్రపూర్ణిమ కనులకింపుగానూ, మనసుకింపుగానూ వున్నాయి కాశ్మీర మహాకవి కల్హణుని రాజతరంగిణి ఆధారంగా యీ రచనలు వెలువడ్డాయి లలితమైన, హృద్యమైన సంగీతం వింటున్నట్లుగా వుంటాయి వీరి రచనలు. భాషపైని పలుకుబడి, అపురూపమైన భావనాశక్తి యీ రచనల్లోని విశిష్టగుణాలు అలనాటి రాజప్రసాదాలు, కటకాంగద కేయూరహారభూషితులైన రాజులు, మృదువులైన చీని చీనాంబరాలు, రమ్యహర్మ్యాలు, నసబోడులు యీ కథల్లోనూ, నవలల్లోనూ సాక్షాత్కరిస్తారు అలనాటి సాంఘిక వ్యవస్థ, కాశ్మీర వైభవం, చందనచర్చలు, నవరత్నాల బేహారం, కుంకుమతోటలు - ఇవన్నీ ఊహాయవనికపై వర్తింప చేస్తారు యీ పుస్తకాలలో

మహీధర రామమోహనరావుగారు చరిత్రను, సాంఘిక వ్యవస్థను సామాజిక పరిణామ దృష్టితో అధ్యయనం చేసిన వ్యక్తి కుల మత వర్గవిచక్షణా రహితమైన సామాజిక వ్యవస్థ వీరిధ్యేయం సాంఘిక దృక్పథం వీరి సాహిత్యంలోని జీవనాడి బాగా వ్యుత్పన్నతను సాధించినవారు వీరి 'స్వయంవరణం' అన్న నవల మేధావివర్గాలను బాగా అలరించింది స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అన్ని విషయాలలో వలెనే యువతీ యువకుల వివాహ విషయకంగా కూడా అత్యంతం అభిలషింపదగినవని వీరి సిద్ధాంతం యూనివర్శిటీ విద్యను పూర్తిచేసుకుని జీవితంలో స్థిరపడబోతున్న యువతీ యువకుల సన్నికర్షను యీ నవలలో వీరు ప్రతిభావంతంగా నిరూపించారు సిద్ధాంతాలు ప్రధానమైన దృష్టితో వ్రాయబడినా సాహిత్య గౌరవాని కేమాత్రమూ లోపం రాకుండా

జాగ్రత్తపడ్డారీ నవలలో రామమోహనరావుగారు తెలుగు నవలల క్రమపరిణామ వికాసంలో రామమోహనరావుగారి కొక ప్రత్యేకమైనదీ విశిష్టమైనదీ ఐన స్థానమున్నది.

పెద్దతరం వారితో పేర్కొనదగిన వారు పాకాల రాజమన్నారుగారు. మేధావులుగానూ, సుప్రసిద్ధ న్యాయశాస్త్ర వేత్తలుగానూ వినుతికెక్కినవారు 'ఎప్పుడూ ఇంతే,' 'ఏమి మగవాళ్ళు' మొదలైన నాటికలద్వారా లబ్ధప్రతిష్ఠులు పీరి శ్రుతి తప్పిన రాగం అన్న నవల యీ పాకెట్ పుస్తకాలలో వెలువడింది విధి వంచనతో చిన్నతనంలోనే వంచింపబడిన స్త్రీ జీవితం శ్రుతితప్పిన రాగమని పీరి తీర్పు దుష్టులూ, నయవంచకులూ, సమాజాన్ని, వ్యక్తుల జీవితాలను ఏవిధంగా కలుషితం చేస్తారో ఇందులోని ఇతివృత్తం నిరూపిస్తున్నది

ఈ పాకెట్ పుస్తకాలలో ముళ్ళపూడి వెంకటరమణగారి 'సాక్షి' సినిమా స్క్రిప్టు వొకటి వెలువడింది సుప్రసిద్ధ హాస్యరచయిత అని పుస్తక పరిచయంలో రమణగారి గూర్చి పరిచయం చేశారుగాని, యీ సినిమా స్క్రిప్టులో హాస్యంలేదు. హాస్య ప్రధానమైన రచనలు ప్రత్యేకించి ఏవీ యీ యాకెట్ పుస్తకాలలో లేవనే చెప్పాలి. అయితే ఈ లోటును శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి 'బతికిన కాలేజి' కొంతవరకు తీర్చిందని చెప్పాలి మొట్టమొదటి విడత పుస్తకాలలోనే పద్మరాజుగారి యీ పుస్తకం వెలువడింది. చురుకైన, మౌలికమైన, ఉపజ్ఞా సహితమైన హాస్యం చక్కగా సృష్టించారు పద్మరాజుగారిందులో. ఇంగ్లీషులోని ఓడ్‌హౌస్ లాగా వ్రాయాలని తమ సంకల్పమైనట్లు పద్మరాజుగారు ప్రస్తావించారు. వారాశించిన ప్రయోజనం నెరవేరిందనే చెప్పాలి. ఇంకొక హాస్య రచనగా వెలువడింది శ్రీ వడ్లమన్నాటి కుటుంబరావుగారి 'గిరీశం ది గ్రేట్ - సెకండ్ స్టెప్' అనేది. అయితే ఇందులో హాస్యంకన్నా అపహాస్యంపాలే ఎక్కువని పాఠకులూ, సమీక్షకులూ కూడా అభిప్రాయపడ్డారు తెలుగు సాహిత్యంలో నుడికారమై నిలిచిపోయిన గురజాడవారి గిరీశాన్ని మళ్ళీ యీడ్చుకొని వచ్చి కొంత కథ నడిపించారు వడ్లమన్నాటివారు ఇది గిరీశం జీవితంలోని అట్టు తరువాత కథన్నమాట

తెలుగుదేశంలో వొకనాడు అత్యంత ప్రాచుర్యాన్ని పొందినవి కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారి రచనలు అక్షరాస్యులైనవారిలో ఏ కొంతైనా పుస్తక పరనంపైని అభిరుచివున్న వారికైనా ఆ రోజుల్లో కొవ్వలి పరిచితులే. ఎన్నో నవలలు రచించారు వారు వారిదే 'సిపాయి కూతురు' యీ పుస్తకాలలో వెలువడింది. సాహసోపేతమైన చారిత్రక ప్రణయ వృత్తాంతం ఇతివృత్తంగాగల నవల ఇది ఆంధ్రపత్రిక దినపత్రిక ఆదివారం సంచిక సారస్వతానుబంధంలో, వారం వారం వెలువడి, విశేషమైన ఆదరణను పొందిన ఈ నవల ఈ పాకెట్ పుస్తకాలలో వెలువడటం విశేషమే పుస్తకం రూపురేఖలు కూడా బహు ముచ్చటగా వున్నాయి చదివి ఆనందించదగిన నవల

వి యస్ అవధానిగారి ప్రాణాంతక ప్రణయం విలక్షణమైన నవల సవతితల్లి, సవతికొడుకు, అక్రమమైన ఆకర్షణలు, తత్పర్యవసానం వర్ణింపబడిన నవల లైంగిక ప్రవృత్తులకు సంబంధించిన శాస్త్రీయమైన విషయాలను అర్థం చేసుకుంటేగాని ఈ నవలను హర్షించటం కష్టం

పి వి కృష్ణమూర్తిగారి 'బంధమూ - అనుబంధమూ' సినిమాతార జీవితానికి సంబంధించిన కథ సినిమాతారల జీవితాలన్నీ కోరుకున్న భోగాలతో తులతూగుతూ ఉంటాయనీ, వారికి సమస్యలుంటాయాయని తెలీనివాళ్ళు అనుకోవచ్చు కాని వాళ్ళకు కూడా మానవీయమైన అనేక సమస్య లుంటాయని, కష్టసుఖాలూ, మానావమానాలు న్యూనతాధిక్యతలు వాళ్ళూ అనుభవిస్తారనీ చాటి చెపుతుందీ నవల పెళ్ళికాక పూర్వమే గర్భం దాల్చిన వనితను పెళ్ళి చేసుకుని, తరువాత బాధపడే భర్త మానసిక ప్రవృత్తి కొంత పాఠకులకు కష్టం కలిగించవచ్చు ఆ 'యాంటి సెంటుమెంటు' చుట్టూ బలంగా అల్లుకొనబడిన నవల-ఇది. చక్కని భావుకత, లలితమైన, హృద్యమైన తెలుగూ ఈ నవలను పట్టుకోగానే చదివిస్తవి శ్రీలేఖ పాత్రను చాలా చైతన్యవంతంగానూ, సౌందర్యపూరితంగానూ చిత్రించారు ఈ నవలలో తెరవెనుక జరిగే తతంగాలన్నీ, తెలుస్తాయి ఈ నవల చదివితే. తెరమీద కనపడే వ్యక్తుల తెరవెనుక జీవితాలెట్లావుంటాయన్నదానికి భావుకత్వంతో కూడిన రూపకల్పన ఈ నవల.

ఇక యువరచయితలను గూర్చి. ఆంధ్రదేశంలో నేడు బహుళ ప్రచారంపొందిన దిన, వార, మాసపత్రికల ద్వారా ఈ రచయిత

లందరూ సుప్రసిద్ధులే! వీరి రచనలు పుస్తక రూపంలో కూడా ఇదివరలో వెలువడ్డాయి లబ్ధప్రతిష్ఠులైన వీరందరి రచనలను తమకంతో చదివి ఆనందించే ప్రత్యేకమైన పాఠక మహాశయుల వర్గాలు కూడా వీరందరికీ వున్నారు.

కొమ్మూరి వేణుగోపాలరావు, గొల్లపూడి మారుతీరావు, హితశ్రీ, బలివాడ కాంతారావు, వాకాటి పాండురంగారావు, అవసరాల రామకృష్ణారావు, మధురాంతకం రాజారాం, వీరాజీ, వాసమూర్తి మొదలైనవారంతా విరివిరిగా రచనలు చేసినవాళ్ళే, చేస్తున్నవాళ్ళే ఆయా పత్రికలలో వీళ్ళు రచించిన మంచి కథలూ సీరియల్ నవలలూ ఎన్నో వెలువడ్డాయి పాఠకుల కందరకూ వీళ్ళు సుపరిచితులు.

కొమ్మూరి వేణుగోపాలరావు రచించిన చాలా మంచినవల వొకటి వెలువడింది ఈ పాకెట్ బుక్స్‌లో దాని పేరు 'హౌస్‌సర్జన్.' వైద్యవృత్తి భూమికగా వెలువడిన తొట్టతొలుతటి తెలుగునవల ఇదేనని చెప్పాలి.

ఈ నవలలో వైద్యవృత్తిలో ఉండే సాధకబాధకాలూ, సమస్యలూ, పరిష్కారాలూ ఎంతో సుకుమారంగా, సున్నితంగా చెప్పారు ఆయన నిత్యజీవితంలో మనకు తారసపడే పాత్రలనే, సంఘటనలనే రసవంతంచేసి, మరిచిపోలేని విధంగా చెప్పారీ నవలలో వేణుగోపాలరావుగారిదే రెండవ నవల 'హారతి' కూడా ఈ యాభై పరంపరలోనే వెలువడింది. ఇది కొంత సినిమా కథలాగే వున్నది. అయినా వేణుగోపాలరావుగారు సుకుమారమైన భావుకత్వం తమ రచనలన్నిటా చూపినట్లుగానే ఈ నవలలోనూ చూపారు

గొల్లపూడి మారుతీరావుగారు మంచి నాటకాలూ, నాటికలేగాక మంచి నవలలు కూడా వ్రాయగలరని ఈ ఏభై పుస్తకాలలో వెలువడిన తమ రెండు పుస్తకాల ద్వారా నిరూపించుకున్నారు పుస్తకాలకు పేర్లు పెట్టటంలో మారుతీరావుగారిది ఒక ప్రత్యేకత కానవస్తుంది పిడికెడు ఆకాశం, వెన్నెల కాచేసింది అన్న వీరి నవలలు పాఠకులను బాగా ఆకర్షించాయి సమకాలీన సాంఘిక స్థితి ఎంతో తెలివిగా ప్రదర్శింపగల నేర్పు మారుతీరావుగారికున్నది. చురుకైన వ్యంగ్యం, హాస్యం వీరి శైలిలో ప్రత్యేక లక్షణాలు

హితశ్రీగారి సామాన్యుని కామన- వర్తమాన సాంఘిక జీవితంలోని ఎత్తు పల్లాలను, వర్గ కలహాలను నిరూపించే నవల హితశ్రీగారి రచనలు సర్వసాధారణంగా సందేశాత్మకంగా వుంటాయి మంచి కొంచెం పెంచుకున్న మార్గం వీరిది శిల్ప సౌందర్యంతోపాటు సాహిత్యప్రయోజనం కూడా వీరి ధ్యేయమైనట్లు కన్పిస్తుంది, వీరి బహుళ ప్రచారం పొందిన రచలననుబట్టి

బలివాడ కాంతారావుగారి 'ఇదే దారి' మంచి నవల.అయితే కొంత 'మిస్టిసిజం ఈ నవలలో చోటు చేసుకున్నది చెరుకుపాలవంటి చక్కని తెలుగు, కండచక్కెరవంటి నుడికారం, ఇదే దారి అన్న పేరులో ఏదో గొప్ప తాత్త్విక దృక్పథం ఉన్నదనుకుంటాము ఆ ప్రయత్నం కొంత జరిగిందికాని, సువిస్పష్టమైన ఆకృతి ధరించలేదాప్రయత్నం

వాకాటి పాండురంగారావుగారి కధల సంపుటి 'అపరాజిత' లో మంచి కధలున్నాయి ఈ కథలు అకృతి ధరించటానికి పూర్వరంగాన్ని కూడా రచయిత పాఠకుల కెరుకపరచడమనేది కొత్త ప్రయత్నం ఇందులో 'అపరాజిత' అత్యుత్తమైన కథగా, ఒక ఎంపికలో బహుమతిని కూడా పొందింది. పాండురంగారావుగారి కథల్లో హృద్యమైన వ్యంగ్యం, చురుకైన హాస్యం ప్రధాన స్థానాన్నాక్రమిస్తవి. వ్యక్తుల కదలికలను సున్నితంగా పరిశీలనచేసి వ్యంగ్యమూ, హేళనా, అధిక్షేపణమూ తగినపాళ్ళతో ప్రవేశ పెడతారు ఈయన హాస్యంలో కరుణ అంతర్భూతంగా వుంటుంది కనుక, అవి మంచి కధలుగా రూపొందాయి. వ్యక్తుల ప్రవర్తనను తీవ్రంగా దూషించి అసహ్యించుకోకుండా హాస్య ధోరణిలో విమర్శిస్తారు ఆలుమగల మధ్య నడిచే సంసారిక శృంగారాన్ని నేర్పుగా, లలితంగా చిత్రించటంలో పాండురంగారావు కొంత ప్రసిద్ధుడు ఆ 'గాజుబొమ్మ' 'సృష్టిలో తీయనిది' మొదలైన చాలా చక్కని కథలు వ్రాశాడీయన ఇదివరలో.

అవసరాల రామకృష్ణారావుగారిని కథకుల కథకు డనవచ్చును. మానవత్వం ప్రబుద్ధం చేయాలన్నది వీరి రచనల్లోని ధ్యేయం ఒక విలక్షణమైన భావ ప్రకటనా పద్ధతి వున్నది రామకృష్ణారావుగారికి సుకుమారమైన, ఆహ్లాదకరమైన హాస్యం, హృద్యమైన శైలి, నిండైన పాత్రలు రామకృష్ణారావుగారి కథల్లోనూ, నవలల్లోనూ సాక్షాత్కరిస్తాయి అభ్యుదయ భావాలనీ, ఆ యీ

ఇజాలనీ, ప్రయోగాలనీ నేలవిడిచి సాము చెయ్యడం, పిచ్చికేకలు, వెఱ్ఱిధోర ణులు, గంతులు, వెక్కిరింతలు, వేళాకోళాల వొంత ఇసుమంత కూడా పోడు రామకృష్ణారావు అది ఈయనలోని విశిష్టత హృదయంలోని ఇరుకుతనాన్ని, పిరికితనాన్ని, మురికితనాన్ని ప్రభావితం చేసి, మనిషిలోని మంచిని పెంచే ఆసక్తి యీయన రచన లన్నిటికీ ప్రేరణ అనిపిస్తుంది 'అది ప్రశ్న - ఇది జవాబు' అన్న రామకృష్ణారావుగారి నవల 'యువ' మాసపత్రికలో ఇతఃపూర్వము వెలువడి పాఠకుల విశేషాదరాన్ని పొందింది అతి సున్నితమైన సమస్యను అతి గంభీరంగా, నేర్పుగా పరిష్కరించే విధంగా యీ నవలలో కథాగమనాన్ని నిర్వహించారు

మధురాంతకం రాజారాం గారికి ఈ సంవత్సరం ఉత్తమ కధకుడిగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి బహుమతి రావడం సర్వులకూ తెలి సిందే 'తాను వెలిగించిన దీపాల' పేరుతో ప్రచురింపబడిన వారి కధల సంపుటం ఈ మన్ననను పొందింది. శ్రీ రాజారాం గారి ఇతివృత్తాలన్నీ విలక్షణమైనవి. వీణా నాదానికి, తక్కిన వాయిద్యాల మాధుర్యాలకూ వున్న అంతరం వారి కథలకూ, వర్తమానులైన ఇతర రచయితల కథలకూ వుంటుంది ఒక ప్రయో జనం, ఒక గాంభీర్యం, ప్రౌఢిమ, సర్వరచనల్లోనూ వారు ఆశిస్తారని అనిపిస్తుంది రాజారాంగారి రచనలను చక్కగా పరిశీలించి చూస్తే అన్నీనూ దేశవాళీ ఇతి వృత్తాలు వీటిలో కనపడే మనుషులందరూ మన మెరిగినవాళ్ళే. చాలా ప్రతిభా వంతుడీయన పూర్వకవుల తెలుగు పలుకుబడిపై వీరికి మక్కువ ఎక్కువనీ, వాక్య నిర్మాణంలోనూ, నుడికారంలోనూ 'పాత' ధోరణి వీరిది అనీ వీరిపట్ల కొంత విమర్శ వినపడకపోదు. ఏది గుణమో దాన్నే దోషంగానూ, దానికి విపరీ తంగానూ, ఎవరెవరిఅభిరుచినిబట్టి,ప్రవృత్తినిబట్టి వారు నిర్ణయాలు చేస్తుంటారు. దాని కెవరినీ ఏమీ అనుకొని ప్రయోజనం లేదుగదా! కవిత్వానికి సంబంధించినట్లు గానే, ఈ కథలు నవలలూ ఆనందించే వారికి కూడా వారి వారి సంస్కారం, హృదయానుభూతి ప్రధానంగా వుంటాయి. ఇది మంచి నవల, ఇది మంచి కధ అని చెప్పేందుకు శాస్త్రీయమైన కొలబద్దలేమీ లేవు సాహిత్యపు విలువలను గూర్చి కూడా భిన్న మతాలున్నాయి కనుక ఇవి చాలామంచి కథలన్నప్పుడు, అవుననీ కాదనీ చర్చ పెంచనూవచ్చు, వివాదపడనూవచ్చు రాజారాంగారికి ఇతివృత్తంపైనే దృష్టి మెండు అంతేగాని ప్రయోగాలు, నవ్యత, శిల్పం వీటిపై

ఆదరం లేదనలేముగాని అవి గౌణాలే వీరి దృష్టిలో 'వక్రగతులు' అన్న యీ కథల సంపుటిలో రాజారాంగారి మంచి కధలు ఏడున్నాయి కధల సంపుటాలకు ఆదరం తక్కువగానున్న యీ రోజుల్లో పాకెట్ బుక్స్‌లో వచ్చిన కొద్ది కథా సంపుటాలలో ఇది మంచి కథాసంకలనం అని చెప్పవచ్చు.

వీరాజీ ప్రఖ్యాత యువరచయిత. చాలా నవలలు వ్రాసినవాడు మంచి భావుకుడు సరళమైన ఊహ, భాష ఈతని ప్రత్యేకతలు, ఈ పాకెట్ బుక్సులో ఇతని నవలలు 'సుఖంకోసం', 'ఇద్దరం ఒకటే' అనేవి వెలువడ్డాయి 'సుఖం కోసం' అన్న నవల చురుకుగా వ్రాశాడు ఇందులో డబ్బుకూ మానవ జీవితానికీ గల లంకెను తాత్త్విక దృక్పథంతో పరిశీలన జరిపి, డబ్బు ఆశించినంతగా సంపాదించినప్పటికీ తృప్తి, సుఖమూ మానవుడు సాధించలేకపోవచ్చునని సాహిత్య విలువల సిద్ధాంతం ప్రతిపాదించాడు 'ఇద్దరం ఒకటే' అన్న నవలలో ఇవ్వాళ్టి ఆధునాతన సాంఘిక వ్యవస్థ, ఈ వ్యవస్థ తాలూకు అవాంతర ఫలితాలు, యువతీయువకుల మధ్య పరస్పర సాన్నిహిత్యం, ప్రేమలూ, వాటి సాఫల్య వైఫల్యాలు, కులశీల అభిజాత్యాల కొలబద్దలు పోయి వాటి స్థానంలో వచ్చిన ఉద్యోగం, డబ్బు, పలుకుబడీ, హోదా సాంఘిక వ్యవస్థను ఎలా ఏలుతున్నాయి మొదలైన విషయాలతో ప్రేమకధ కాబట్టి, అత్యంతాకర్షణీయంగా వ్రాశాడు వీరాజీ ఈ రెండు నవలలూ పాఠకులను బాగా అలరించగలవు- అన్ని వర్గాల వారిని, అన్ని స్థాయిలవారిని కూడా

వాసమూర్తి గారు ఆంధ్రాంగ్ల భాషలలో విశేషమైన పరిజ్ఞానం సంపా దించి, ఇరు భాషలలోనూ చేయి తిరిగిన రచయిత అనిపించుకున్నవారు. వీరి నవల 'కోనేరు - సెలయేరు' అన్నది పేరుకు సంబంధించినంతమటుకు సాంకే తికమైన ధ్వని కలిగినట్టిది ఇందులో విద్యాధికుడు, భావుకుడు అయిన యువ కుడు నాయకుడు నాయిక జీవితంలోని లాలిత్యాన్నీ, సౌకుమార్యాలను మన్నింపగల భావుకత లేనిది ఆమె దృష్టి సుఖంగా, విలాసంగా, దర్పంగా, దర్జాగా బ్రతకటం మీదనే వుండేది అతడు కవిత్వం, సాహిత్యం, కరుణ మొదలైన విషయాలపైన అత్యంతాసక్తి కలిగివుండేవాడు అందువలన పొర పొచ్చాలు కలిగాయి. అయితే శ్రావణ మేఘాల్లా చెదరిపోయాయి కథ సుఖాంతం. పట్టి చదివిస్తుంది కాని యాదృచ్ఛికమైన సంఘటనలూ, ఇదివరలో అక్కడక్కడా చదివిన సన్నివేశాలూ కొంత అనాసక్తిని రేకెత్తించకపోవు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిలాగా, మల్లాది రామకృష్ణశాస్త్రిగారిలాగా లేదా వారి ఇతివృత్తం, వీరి రచనాశిల్పం, పొందికగా పోషించే ప్రయత్నం ఉషశ్రీ కథల్లో కనబడుతుంది. సాంసారికేతి వృత్తాలను నేర్పుగా, ఆ మౌగ్ధ్యం, ఆ తారుణ్యం, ఆ శృంగారం ప్రౌఢంగానూ, హృద్యంగానూ ప్రదర్శిస్తారు ఉషశ్రీ. ఉషశ్రీ ప్రేయసీ - ప్రియంవద అన్న రెండు చిన్న నవలికలను కలిపి సంపుటీకరించారు- యీ ప్రణాళికలోనే జ్వలితజ్వాల, మల్లెపందిరి, అమృత కలశం వంటి కథా సంపుటాల ద్వారా ఉషశ్రీ రచనలు పాఠకులందరికీ చిరపరిచితాలే ఇదివరలోనే.

ఇంకా ముద్దంశెట్టి హనుమంతరావుగారి 'అహం-అనర్థం', హరికిషన్‌గారి అదృష్టచక్రం, నండూరి విఠల్‌గారి లేడీ డాక్టర్, రంధి సోమరాజు గారి 'దుఃఖితులు' అన్న నాలుగు నవలలు కూడా యీ పాకెట్ పుస్తకాలలో వచ్చాయి

ముద్దం శెట్టి హనుమంతరావుగారి నవల 'అహం - అనర్థం' పాతకాలపు కుటుంబ వ్యవస్థకు సంబంధించింది ఇంటి వ్యవహారమంతా తమ చెప్పుచేతల్లో పెట్టుకోవాలనుకునే అత్తగార్లు ఇప్పుడెవరూ లేరు ఉన్నా చాలా అరుదుగా కనపడతారు అత్తాకోడళ్ళ అభిప్రాయభేదాలు, సాధింపులూ, సంఘర్షణలూ, పాత కాలపు సమస్యలేకాని నేటి సమస్యలు కావు. ముద్దంశెట్టి హనుహంతరావు గారు చాలా నవలలూ, కథలూ వ్రాశారు పాఠకులూ చాలామంది చదివారు వాటిని. ఈ నవలలో అత్తగారు ఇంటిపై పెత్తనమంతా చెలాయించబోయి భంగపడి తన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడేకథ ఇతివృత్తం.

హరికిషన్ గారుఇదివరలో పన్నీటిజల్లు, సుమంగళి మొదలైన అనేక నవలలు రచించారు మధ్యతరగతి కుటుంబ గాథలు వారికి చాలా ఇష్టం మలచటానికి మీ బాధలు, మీ గాథలు నేనెరుగుదు అని కవి అన్నట్లు, నిత్య జీవితంలో వారనుభవించే సాధక బాధకాలు, ప్రతి సూక్ష్మమైన విషయాన్ని కూడా పరికించకుండా, పరిశీలించకుండా విడిచిపెట్టదు వీరి లేఖిని. 'గగన కుసుమా' లన్న వీరి నవల పాఠకుల్లో చాలా ప్రాచుర్యం పొందింది.

నండూరి విఠల్‌గారు, రేడియో శ్రోతల కందరికీ బహుధా విశ్రుతులు. వీరు అనేకములైన నాటకాలు, నాటికలు రచించడం, అనేక శ్రవ్యరూపకాలకు ప్రయోక్తగా వుండటం అందరూ ఎరిగినదే! ఇటీవలనే వీరి కాలకన్య' అన్న రేడియో నాటకం బహుళ ప్రచారం పొందింది వేణుగోపాలరావుగారి నవల చాలా మెప్పు పొందటంతో విఠల్‌గారుకూడా వైద్యవృత్తిని భూమికగా తీసుకుని నవల వ్రాశారేమో మరి! కాని 'లేడీ డాక్టర్' అన్న పేరుకూ, నవలలోని ఇతివృత్తానికి అంత విడతీయరాని బంధం వున్నట్లు తోచదు. 'నర్తకి' అన్న పేరు పెడతామనుకోండి యీ నవలకు - వచ్చేప్రమాదం ఏమీ లేదు ఇందులోని కథానాయిక అరుణ లేడీ డాక్టరు కావటం యాదృచ్ఛికం ఈ నవలలోని వాతావరణానికీ, వైద్యవృత్తికీ ఎక్కువగా సంబంధం లేదు. హరాత్సంఘటనాలూ, యథాలాప సంఘటనలు చాలా వున్నాయి అయితే వొక ఆవేశం, చురుకైన భావాలు, వాక్యాలూ ఆహ్లాదాన్ని కలిగించకపోవు! వీరికి నాటకాల్లో మంచి అభిరుచీ, అభినివేశమూ, ప్రవేశమూ వున్నవి కాబట్టి ఈ నవలలోని సన్నివేశాల రూపకల్పనలో ఆ నాటకీయ ధోరణి కన్పించకపోదు! అధునాతన సభ్యతపై అవహేళనతో కూడిన ఏవగింపు ప్రదర్శించటమే వీరి ధ్యేయమైతే, యీ ప్రయత్నమూ, యీ 'కేన్వాసూ' చాలవు సంపన్నులై జూదగాండ్రూ,కల్లరులూ, కపటులూ,క్లబ్బులలోని విలాసకరమైన జీవితాలు, కాగితపుపూలవంటి బ్రతుకుల చుట్టూ యీ నవల అల్లబడింది కోర్టులో మరణదండన విధించబోయే ముందు నాయిక తన కథనంతా ఉత్తమ పురుషలో వినిపించినట్టుగా చెబుతూ మధ్య మధ్య ఆ పాత్రలను ఆ సన్నివేశాలను ఆమె చెప్పటాన్ని బాక్‌గ్రౌండ్‌లోకి తోసేసి మన కళ్ళముందు జరుగుతున్నట్లు 'సినిమాటిక్'గా వర్ణించారు. ఇలా వర్ణించడం కష్టం సాఫీగా వుండదు విస్తృతమైన పరిధిని ఎన్నుకొని వుంటే యీ నవల ఇంతకన్నా ఎక్కువ రాణించి వుండునేమో ననిపిస్తున్నది యువ రచయితల నుంచి ప్రాతినిధ్యం దృష్ట్యా ఇదివరలో పత్రికలలో సీరియల్ నవలగా ప్రచురించకుండానే పుస్తకరూపంలో వీరి ఈ నవల వెలువడింది.

ఈ ఏభై పుస్తకాలలో సుప్రసిద్ధులై, పత్రికలలో విరివిగా రచనలు చేసిన పద్నాలుగుమంది రచయిత్రుల ప్రాతినిధ్యం కూడా వున్నది వీరిలో కొందరు, అంటే ఏవొకరిద్దరో, కొత్తవారు కూడా వున్నారనిపిస్తున్నది. కొత్తవారంటే పత్రికాముఖాన బహుళ సంఖ్యలో రచనలు వెలువరించనివారని మాత్రమే. ఈ సుప్రసిద్ధ రచయిత్రుల రచనలను గూర్చి సమీక్ష చేయబోయే

ముందు, ఈ వ్యాసరచయిత పుస్తకాలు రెండు యీ యాభై పుస్తకాలలోనూ వున్నాయని చెప్పటం అవసరం అనుకుంటాను ఎందుకంటే, ఏభై పుస్తకాలను గూర్చిన సమీక్ష యీ వ్యాసం ఉద్దేశిస్తున్న ప్రయోజనం కనుక! అవి 'నూరు శరత్తు'లన్న నవల, 'జీవిత దృశ్యాల'నే కథా సంపుటమున్నూ. నూరు శరత్తులన్న నవలలో పల్లెటూళ్ళలో నేటి సాంఘిక వ్యవస్థలో ప్రచలితమవుతున్న రాజ కీయాలు, కులకక్షలు, స్వార్థం, రాజకీయ ప్రభావాలూ మొదలైనవి వర్ణింప బడినవి భాష కొంత బరువుగానూ, ప్రయత్నించి వ్రాసినట్లుగానూ వున్నదని కొందరు మిత్రులన్నారు నిజమేనని నా వొప్పుకోలు జీవితదృశ్యాలన్న కథా సంపుటంలో పధ్నాలుగు కధలున్నాయి ఇవన్నీ ఇదివరలో వివిధ పత్రికలలో వెలువడినవే ఇందులో కొన్ని మంచి కధలున్నాయని మిత్రులన్నారు. కుక్క, క్రాస్‌వర్డ్ పజిల్, నాతో కలిసి నలుగురు, 'కలలూ - కలవరింతలూ' మంచి కథలే ననుకుంటాను ఇంకా రెండు పుస్తకాలు గూర్చి చెప్పాలి.

ఈ ఏభై పుస్తకాలలోనే 'శ్రీపతి' గారి 'మంచు పల్లకితో మరితొమ్మిది' అన్న పది కథలుగల కథాసంకలనం పేర్కొనతగినది. ఈ రచయితకు నవ్య రీతులన్నిటి పట్లా చాలా ఆసక్తి, అపేక్షా వున్నది వచన కవిత్వం నవ్యనవ్యంగా వస్తూవున్న మార్పులవద్ద నుంచి ఏబ్‌స్ట్రాక్ట్ ఆర్టులోని సంపన్నత వరకూ అవ గాహన చేసుకోగల నేర్పూ, ద్రఢిమా యీయన కున్నాయి యువతరం రచయితలలో నవ్యులలో నవ్యుడీయన. ప్రతిదీ 'కొత్తకన్ను'లోంచి చూడటం ఈయన కిష్టం భావుకుడు భాషలో కొంత సారళ్యం సాధించటం అవసరమని పిస్తుంది తాను కట్టే బొమ్మలు, తన ఉపమానాలూ, తన భాష, ఇంకా స్పష్టత సాధిస్తే యీయన ఇంకా చాలా మంచి కథలు రాయగలరు.

రంధి సోమరాజుగారి 'దుఃఖితులు' అన్న నవల చాలా విలక్షణమైనది. చిత్రలేఖనానికి సంబంధించిన ఇతివృత్తాన్ని కవిత్వంలా చెప్పారు యీ నవలలో. కవీ చిత్రకారుడూ, భావుకుడూ అయిన రచయిత, సౌందర్య దృష్టిగలవాడు శ్రీ సోమరాజు. మధ్యతరగతి కుటుంబాల యీతిబాధలు, నగర జీవితంలో ఇరుకువాడలూ, అక్కడనే సౌందర్య పిపాసా అడుగడుక్కి బ్రతుకులోని సంఘర్షణలూ యీ నవలలోని ఇతివృత్తం కరుణరస భరితమైన కావ్యంగా దీనిని రచించారు శ్రీ సోమరాజుగారు.

మొత్తం యాభై పుస్తకాలలోనూ విశ్వనాథ, వేణుగోపాలరావు, మారుతీ రావు, చలం, ద్వివేదుల విశాలాక్షి, పిలకా గణపతిశాస్త్రి వీరాజీ, మంజుశ్రీ గార్లవి రెండు రెండు పుస్తకాలు వెలువడ్డాయి. వీరుకాక ఇంకా ముప్పైనాలుగు మంది రచయితల రచనలు యీ ఎమెస్కో సంవత్సరంలో, ఎమెస్కో వారు ప్రచురించిన యాభై పుస్తకాల్లోనూ వున్నవన్నమాట

ఇక రచయిత్రుల రచనలను గూర్చి చెప్పాలి. బాగా ప్రసిద్ధులైన తెలుగు దేశపు రచయిత్రులందరూ కూడా యీ యాభై పుస్తకాలలో చేరారనే చెప్పాలి. శ్రీమతులు ద్వివేదుల విశాలాక్షి, ముప్పాళ రంగనాయకమ్మ, యద్దనపూడి సులోచనారాణి, ఆనందారామం, ఉన్నవ విజయలక్ష్మి, ఇల్లిందల సరస్వతీదేవి, కోమలాదేవిగార్ల రచనలు వారపత్రికలలో తరచు వెలువడుతూనే వున్నాయి. కనుక వీరంతా సుప్రసిద్ధులు. కుమారి గంటి వేంకటరమణగారు యీ మధ్య ఆంధ్రప్రభ నవలల పోటీలో 'చదరంగం' అన్న నవలకు బహుమతి నందుకున్నారు వీరుకూడా బహుళ ప్రచారంగల మన వారపత్రికలలో ఇప్పుడు తమ రచనలను సీరియల్‌గా వెలువరిస్తూనే వున్నారు. అద్దేపల్లి వివేకానందదేవిగారు తమ రచనలను వారపత్రికలలో ప్రచురించకపోయినప్పటికీ, మంచి నవలను ప్రకటించినందుకు చాలా అభినందనీయులు. రేవనూరి శమంతగారు వొకటి రెండు కథల సంపుటాలు మాత్రమే ఇదివరలో ప్రకటించివున్నారు. ఇప్పుడీ యాభై పుస్తకాలలో వారి 'రత్నకంబళం' అన్న నవల వెలువడింది.

మాలతీ చందూర్ గారి నవల 'లావణ్య' అన్నది చాలా విశిష్టమైన నవల దీన్ని చిన్న నవలిక అనవలసి వుంటుందేమో! ప్రేమలూ, సంఘర్షణలూ, అర్థం చేసుకోవటాలూ, ఆర్థికమైన ఇబ్బందులూ మొదలైన చర్వితచర్వణమైన ఇతి వృత్తాన్ని కాకుండా, సున్నితమైన మనస్తత్వంగల, గొప్పధనవంతుల ఏకైక గారాబు పుత్రి కథ ఇది. రమణీయంగా చెప్పారు ఈ చిన్న నవలికతోపాటే, కోడికూత, బ్యాంక్ ఉద్యోగిని, పరీక్ష అన్న మరిమూడు కథలు కూడా యీ పుస్తకంలో చేర్చారు. ఈలాంటి కథలు యీ మధ్య రావటంలేదని మిత్రులొకరు వీటిని ప్రశంసించారు. ఇవి చాలా మంచి కథలు. మనుష్యుల సమస్యలకు దూరమైన అభూతకల్పనలు, అమాయకధోరణులతో విసిగి వేసారి వున్న పాఠక లోకానికి యీ పుస్తకం గొప్ప సంతృప్తినే ఇవ్వగలదని చెప్పాలి.

శ్రీమతి ఏ. లక్ష్మీరమణగారి 'బ్రతుకుజోడు' అన్న నవల షార్లట్ బ్రాంటీ రాసిన 'జేన్ ఏర్'కు స్వేచ్ఛానుసరణం అన్న విషయం చెపితే తెలుసుకో వలసిందే మౌలికమైన నవలలాగానే రచించారు ఆసాంతమూ చక్కని శైలి. తప్పక చదవదగిన నవల ఇది. దయనీయమైన స్థితిలో నిబ్బరంగా జీవితంలోని వొడిదుడుకుల నన్నిటినీ అధిగమించుకుంటూ వచ్చి, చివరకు గమ్యస్థానం చేరిన ముద్దరాలి కధ యీ నవల

శ్రీమతి డి. కామేశ్వరిగారి 'కొత్తనీరు' అన్న నవల వరద వెల్లువలాంటి ఆధునాతన నాగరికతను, తత్పర్యవసానాలను నేర్పుగా చిత్రీకరిస్తున్నది. ఒక మోస్తరు కలిగిన కుటుంబంలో ముగ్గురు కొడుకులూ, ముగ్గురు కూతుళ్ళూ. వీళ్ళూ పెరిగి పెద్దవాళ్లయి ఉద్యోగాలూ పెళ్ళిళ్ళు చేసుకుంటూ, తమ తమ మార్గాలలో పయనించటం ఇతివృత్తం. కాలంతో వచ్చిన మార్పులను, చెదరి పోతున్న ఎల్లలనీ ప్రతి విషయంలోనూ అనుసరిస్తున్న ఈ రోజులనూ యీ నవలలో రచయిత్రి చక్కగా వర్ణించారు. తల్లిదండ్రులుపిల్లల భవిష్యత్తునంతా తామే దిద్దితీర్చగలమనీ, శాసించగలమనీ అనుకోవటడ వెట్టి అనీ, అటువంటి భ్రమా ప్రమాదాలలో పడకుండా వుండటమే మంచిదనీయీ నవలలోని తాత్పర్యం.

నందుల సుశీలాదేవిగారు రచించిన 'సరళీస్వరాలు' జీవితంలో తారుణ్యపు తొలిరోజుల్లోని ముగ్ధత్వాన్ని మనోహరంగా వర్ణించిన నవల యువతీ యువకుల ప్రేమలూ, మధ్యలో ఉప్పతిల్లే అవాంతారాలూ, చివరకు కథ సుఖాంతం కావటం ఆకర్షణీయంగా వర్ణించిన నవల ఇది.

శ్రీమతి అద్దేపల్లి వివేకానందా దేవిగారి 'కళ్యాణ ఘడియ' అన్న నవలలో తెలుగుదేశపు రైతు కుటుంబాలు, వారి వారి కుటుంబ మర్యాదలూ, ఆడవాళ్ళు కూడా మగవాళ్ళతో సమానంగా చదువుకోవటమనే కాలం తెచ్చిన మార్పు, విదేశాలకు సైతం వెళ్ళటం,సంప్రదాయానికీ,సంస్కారానికీ మధ్య సంఘర్షణలూ, పాతతరంవాళ్ళ నివ్వెరలూ, కొత్తతరంవాళ్ళ ఉత్సాహోద్రేకాలూ కమనీయంగా వర్ణించారు

ఇల్లిందల సరస్వతీదేవిగారు జగమెరిగిన రచయిత్రి. ఈ నవలను గూర్చి 'ఇందులో పాత్రల వైవిధ్యం, స్త్రీల మనఃప్రవృత్తుల నిరూపణ, నిర్దుష్టమైన భాష కనవస్తాయి, అన్నారు పరిచయం చేసినవారు.

రేవనూరి శమంతగారి 'రత్నకంబళి' తొలినవల, సుఖం, దుఃఖం, సంతోషం, విషాదం ఎన్ని ఎగుడు దిగుళ్ల దీనికంతా అర్థం ఏమిటి? ఏమీలేదు. మానవ జీవితం రత్నకంబళం వంటిది రత్నకంబళానికి అర్థం లేదు. జీవితానికి అర్థంలేదు పరమార్థానికే అర్థంవుంది. అది జీవితాతీతం' అంటారు నవలను ముగిస్తూ రచయిత్రి

కోమలాదేవిగారు రచించిన 'పూలతెరలు' అన్న నవల మనస్సౌకు మార్యం, భావుకతాగల ముద్దరాలికి ప్రపంచంలో తనచుట్టూ పూలతెరలే కనపడే భ్రాంతి కలుగుతుందనీ, కాలం గడిచిన తరువాత తన చుట్టూ వున్న వ్యక్తుల నిజస్వరూపం బోధపడిన తరువాత ఆమె జీవితంతో రాజీ పడుతుందనీ, ఒక విధమైన నిబ్బరమూ మానసిక పరిపక్వతా ఆమెకు అనుభవాల పరంపర ద్వారా సంక్రమిస్తవనీ తెలియజేస్తుంది కోమలాదేవి గారి భాష గాంభీర్యంతో తొణికిలాడుతూ వుంటుంది బరువైన భాష, గంభీరమైన పాత్రలు యీమె తమ నవలల్లో ప్రదర్శిస్తారని చెప్పవచ్చు

ఉన్నవ విజయలక్ష్మిగారు తమ 'నిరీక్షణ' అన్న నవలలో చిన్నతనం లోనే భర్తను పోగొట్టుకొని అనేక బాధలకు లోనై మరల తన మోడుబారిన జీవితం ఒక సహృదయుని ప్రేమాభిమానాలతో చిగిరింపచేసుకున్న యువతి దయనీయమైన గాథను చిత్రించారు మధ్య తరగతి కుటుంబాలలోని కామనలూ, కష్టాలు సుఖాలూ, ఆశలూ, అడియాసలూ యీ నవలలో చిత్రింపబడ్డవి

కుమారి గంటి వేంకటరమణగారి 'పూదోటలో గంటుముళ్లు' అన్న నవల విచిత్రంగా వున్నది చురుకైన వాక్యాలూ కరుణావిలమైన సన్నివేశాలూ కొన్ని వున్నా అనవసరంగా పెరిగిపోయింది కథ 'స్వీట్ హోం'లోని బుచ్చిబాబు ముప్పాళ రంగనాయకమ్మ గారి కలలూ, ఆశలూ, కామనలూ పండించే పాత్ర అయినట్టే, పూదోటలో గంటుముళ్ళలో వేంకటరమణగారు శాయిరామ్ పాత్రను సృష్టించారు. చెడును చెడు మార్గంలోనే జయించిన ధీరురాలి కథ అన్నారు పరిచయం చేస్తూ యీ నవలగూర్చి చెడుమార్గం మాత్రం కావలసినంత వుంది ఇందులో. ఇటువంటి రచనల వల్ల ప్రయోజనం ఏమిటో మరి! సందేశం సాంఘిక ప్రయోజనం లాంటి గొప్పవిషయాలు కాదు నేను చెప్పేది - కనీసం చదివి ఆనందించటానికైనా అనువైదిగా వుండాలిగా?సాహిత్యం అర్థ9భావాలను

కలగజేసి మనిషిని కొంచెం సంస్కారవంతుణ్ణి చేయకపోయినా, అభూత కల్పనలూ, ఆవేశాలూ అనర్థకాలు సాహిత్యంలో

శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి గారి రచనలన్నిటా సాహిత్యశిల్పమూ, సాహిత్య ప్రయోజనమూకూడా కనవస్తాయి ఒక చిన్నకథ వ్రాసినా, పెద్దనవల వ్రాసినా నిశితమైన పరిశీలనాశక్తి, జీవితసత్యాలను విశ్లేషించి చూపటమూ, వీరి రచనల్లోని ప్రధాన గుణాలు మధ్యతరగతి కుటుంబాలలోని పంతాలూ, పట్టింపులూ, అభిమానాలూ, అర్థంలేని ఆడంబరాలూ, అనావశ్యకమూ, అర్థరహితమూ అయిన ఆచారాలూ, మారుతున్న వ్యవస్థలో వేగంతో మారలేని జీవితాల్లోని ఒడుదుడుకులూ, బాధా, భయం, బెంగా, కసీ చుట్టుముట్టుకున్న సమయాల్లోనే ఆత్మవిశ్వాసం, స్వశక్తి స్వాభిమానం, స్వంత ఆలోచనగల మంచి పాత్రలు పుట్టుకొనివచ్చి కథనంతా నడుపుతారు 'గ్రహణం విడిచింది' అన్న నవలలో భర్తను చిన్నతనంలోనే - అదిన్నీ వివాహమైన కొద్దికాలంలోనే పోగొట్టుకున్న అభాగ్యురాలు తనచుట్టూ చేరే మనుషుల్ని ఏవిధమైన అపనమ్మకంతో, సంకోచంతో, సందేహంతో చూస్తుందో వర్ణించారు కాని, ఆమె జీవితంలో పట్టిన గ్రహణం చివరకు విడుస్తుంది 'వారధి' అన్న నవలలో మారుతున్న విలువలకూ, మారనంటున్న మనస్తత్వాలకు మధ్యన ఏర్పడే సంఘర్షణను సమర్థంగా చిత్రించారు నవీన సంఘంలోని సమస్యలను లెస్సగా అర్థం చేసుకుని వాటికి తగిన పరిష్కారాలనుకూడా సూచిస్తాయి వీరి రచనలు ఆర్థికమైన ఇబ్బందులు' హార్దికమైన 'సెంటిమెంట్లూ' జీవితంపు చిక్కుముళ్ళూ వీరి పాత్రలనన్నిటినీ' మనకు చేరువగా తీసుకొని వస్తాయి. జీవమూ జవమూగల భాషా, మంచి ఉపమానాలూ, చక్కని ప్రకృతి వర్ణనలూ, వీరి రచనా సౌందర్యాన్ని ఇనుమడింప చేస్తాయి స్త్రీ రచయితలలో వీరికొక విశిష్టమైన స్థానమున్నది. ఎమెస్కో పాకెట్ బుక్స్‌లో మొదటి యాభై పుస్తకాలలో వీరివి రెండు పుస్తకాలు వెలువెడటం గమనార్హం

శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మగారు సుప్రసిద్ధురాలైన రచయిత్రి సాహిత్యాభిమానం ఏమాత్రమైనా కలిగివుండి, వర్తమాన ధోరణులను గమనిస్తున్న పాఠకులు వీరి రచనలను తప్పక చదవవలసి వుంటుంది.

ఈవిడగారు లబ్ధప్రతిష్ఠురాలు. రచయిత్రులలో అగ్రశ్రేణిలో వున్నవారు వేగవంతమైన శైలి, చురుకైన భాష, సంభాషణలు చాలా చాతుర్యంతో నడప గల శక్తి యీమె రచనల్లోని జీవగుణం.

బహుళప్రచారంగల నవలల నెన్నిటినో వీరు రచించారు ప్రస్తుతం వీరి నవలలు పొందినంత ప్రాచుర్యం, పొందుతున్నంత ప్రాచుర్యం ఇతరుల రచన లేవీ పొందటం లేదనటం కూడా అతిశయోక్తికాదేమో?

ఈ ఎమెస్కో పాకెట్ బుక్స్‌లో వెలువడిన వీరి నవల 'స్వీట్ హోమ్' అను రాగలహరిలో మంచి ప్రాణస్నేహితుల తీరున ఒకరికన్నా ఒకరు ఎక్కువ వారు తక్కువవారు అని లేకుండా, తేలిపోతున్న ఆలుమగల సంసారంలోని మధురిమ నాలుగు ఘట్టాలుగా ఇతివృత్తమైంది యీ నవలలో.

ఈ నవలకు వీరువ్రాసిన సుదీర్ఘమైన ఉపోద్ఘాతం ప్రతివారూచదవతగింది, 'ఏ ఆదర్శాలూ వద్దు. ఆలుమగల బ్రతుకులు రామాయణాల్లో, భారతాల్లో. భాగవతాల్లోలాగ ఉండకూడదు', వాళ్ళు మొగుడు పెళ్ళాల జీవితాల్ని భయంక రంగా చేశారు, భార్యాభర్తలు కలసిమెలసి ఆడుతూ సంసారాలు చేస్తే, ఆ యిల్లే స్వర్గం, ఆడదాని కష్టసుఖాలన్నీ మొగవాడి మంచితనంలో వున్నాయి కట్టు కున్నదాన్ని పెళ్ళాంఅన్న అభిమానంతోటీ, ఒక మనిషి అన్న గౌరవంతోటీ ఎవడు చూస్తాడో వాడే దేవుడు. పతిదేవుడు. అదీ స్త్రీ తత్త్వం అన్నది శ్రీ రంగ నాయకమ్మగారు ప్రతిపాదించిన ఫిలాసఫీ ఈ దృష్టితోనే వీరు యీ నవల లాంటిది వ్రాశారు అయితే, చివర చివర భారత, భాగవత, రామాయణాలను హాస్యంచేస్తున్నాననుకుంటూ విమల మాట్లాడిన మాటలు, విసరిన విసుర్లూ హాస్యాస్పదంగా వున్నాయి వెకలిగానూ, అందర్భంగానూ, అప్రశస్తంగానూ ఉన్నాయి.

విమలకు భగవద్గీతకూ భాగవతానికీవున్న తేడా తెలియదు (పుట 136)

"సీత ('శ్రీరామపత్నీ, జనకస్యపుత్రీ' సాంఘిక నవలల్లో సీత అను కునేరు) శక్తిపోయినా ఉపయోగించక, ప్రాణంపోయినా ఉపయోగించక ఎందు కూరుకుంటుంది? శక్తి వుండికూడా మానం పోగొట్టుకుంటే ఆవిడ పతివ్రత ఎలా

అవుతుంది?" అంటూ విమల బుచ్చిబాబును నిగ్గదీస్తుంది పాపం బుచ్చిబాబు పతిదేవుడాయె మరి. ఏంచేస్తాడు? ఈవరకు పురాణాల్లోనూ, ఇతిహాసాల్లోనూ పతిదేవతలుండేవారు. ఇప్పుడిలాంటి పతిదేవుళ్ళవలన కూడా అంతే ప్రమాదం అనిపిస్తుంది.

"నా తల్లో తిక్కో పాడో ఏదో వుండేది— నీకసలు తలే లేదు." అంటుంది విమల బుచ్చిబాబుతో రెండూ నిజమే. బుచ్చిబాబుకి 'తెల్లచీరకీ ఎర్ర చీరకీ తేడా తెలీదు" భార్య వేలు తెగిపోయి ఎర్రగా కనబడుతున్నప్పుడు గోరింటాకు పెట్టుకున్నావా? అని పరామర్శిస్తాడు. "ఎలా వుంది, బాధగా వుందా?" అని అడగడు అన్నం కలిపి నోట్లో పెట్టలేదనీ, కనీసం పెడతానని అయినా అనలేదనీ విమల ఉసూరుమంటే, యీసారి తెగితే తప్పక పెడతాను అంటాడు బుచ్చిబాబు భీమాంజనేయ యుద్ధం నాటకంలో కూచుని మర్నాడు సెషన్‌కోర్టులో రేప్‌కేసు తాలూకు అప్పీలు గూర్చి తలచుకోగలడు బుచ్చిబాబు బుచ్చిబాబుకు లోపలంతా ప్రేమ విమల మీద అయితే, చాలా అమాయకుడు. వేలు నోట్లో పెట్టినా కొరకటం తెలీని వాడు. ఆడవాళ్ళు ఇంత అమాయకులుగా, ఏమిటి తెలీనివాళ్ళుగా, సాధువులుగా, గంగిగోవులుగా వుంటే మగవాళ్ళు కూడా విమలలా జీవితం చరితార్థం చేసుకుంటారేమో తెలీదు. ఒకచోట శరత్ సృష్టించిన బడదీదీలోని కథానాయకునిలా శుద్ధ బుద్ధావతారంలాంటి వాడు బుచ్చిబాబు అంటారు.

బుచ్చిబాబు రచయిత్రి ఊహాలోకపు స్వర్గ ద్వారాలపైని నిలచిన ధీర సాధువు కావచ్చును. మగవాడికొక నీతి, ఆడదానికొక నీతీ అని బుద్ధిమంతులెవరూ అనరు. స్త్రీకి చాలా అన్యాయం జరిగిపోయిందని రంగనాయకమ్మగారి సిద్ధాంతం. భారతంలో శకుంతల - "ధర్మార్థ కామసాధన కుపకరణమ్ము, గృహనీతి విద్యకు గృహము, విమల చారిత్ర శిక్షణాచార్యకమ్ము సద్గతికి నూత" యీ విధంగా గృహిణి యొక్క గొప్పతనాన్ని వర్ణిస్తుంది. అయితే, ఇప్పటి వరకూ స్త్రీని ఆ దృష్టితో చూశాడా పురుషుడు? అన్న ప్రశ్న వస్తుంది. గాంధీ గారి సిద్ధాంతాల నిప్పుడెవరు అనుసరిస్తారు? అనుసరిస్తున్నారు? ఆయన పోయి ఇరవై ఏళ్ళే కదా నిండింది! స్త్రీని విలాస వస్తువుగా, కామసాధనంగా చూడమని ఎవరూ అనకూడదు మన పురాణాలనిండా, ఇతిహాసాలనిండా అలానే వున్నదని రంగనాయకమ్మగారి భావన అయివుండవచ్చును! ఆలుమగలు ఆడుతూ పాడుతూ తేలిపోవగా, కలిసి ప్రయాణంచేసి హాయిగా వుండాలనే

రంగనాయకమ్మగారి ఆశయమైతే, ఆ ఆడటం, పాడటం విమలా, బుచ్చిబాబుల వలెనైతే ఎట్లా వుంటుందో మరి! ఇంత అమాయకుడైన బుచ్చిబాబుకి నాటకాల సరదాలున్నాయి నాటకాల్లో వేషంకట్టే పద్మావతితో వెళ్ళి "బుచ్చిబాబు ఎప్పుడో అర్ధరాత్రి వచ్చాడు" ఇంట్లో చిన్నపిల్లలకి వొళ్ళు సలసలా కాగిపోతుంటే ఇదెక్కడి స్వర్గధామమో? అతడికి పేకాట నేర్పించింది విమల అది పేకుమేకై కూర్చుంది ఇట్లా ఇట్లా.

"విమల, బుచ్చిబాబుల సంసారనౌక మధుర సుధారసవాహినిలో సున్నితంగా వూగులాడుతూ ఆహ్లాదకరంగా ప్రయాణిస్తోంది" అంటుంది రచయిత్రి. కేవలం హాస్యరచన అనుకుంటే బావుండేది దీన్ని. కాని అలా అనుకోలేకపోవటానికి కొన్ని బాధకాలున్నాయి. చిన్నపిల్ల అమ్మ కొట్టిందని తండ్రి దగ్గర ఫిర్యాదుచేస్తే,ఆ తండ్రి బుచ్చిబాబే,దెబ్బల సంఖ్య,సాక్ష్యాధారాలూ అడుగుతాడు ఇది హాస్యం కాదా? పరధ్యానం, సౌందర్యావధి బుచ్చిబాబులో విమల చాచా చురుకైంది, తెలివితేటలు కలది. విమల వంటి అర్ధాంగులూ, బుచ్చిబాబు వంటి పతిదేవుళ్ళూ సంసారం సంసారం ప్రేమసుధాసారం - అంటూ ఇల్లూ వాకిలీ స్వర్గం చేయగలరని రంగనాయకమ్మగారు యీ నవలలో చిత్రించారు.

శ్రీ ఎ సి ఆనందారామంగారి నవల 'ఆత్మబలి' సినిమా కథల పోటీకి రాయబడింది కాబట్టి, ఆ లక్షణాలన్నీ వున్నాయి ఈ నవలలో ఉత్తర, దక్షిణ ధృవాలకున్నంత అంతరం వున్న మనస్థితిగల అక్కచెల్లెండ్ర గాథ ఇది. తెగువకూ, సాహసానికీ, మార్పుకూ ఒకరు ప్రతీక ఇంకొకరు తలవొగ్గటమే తప్ప తల యెత్తటం తెలీని అబల వీళ్ళ ఇద్దరి జీవితాల్లోని పర్యవసానాలను వేగవంతమైన శైలిలో రచించారు రచయిత్రి

ఏది ఏమైనా ఇంత చక్కగా, ఇంత చవుకగా, ఇంత వైవిధ్యంతో పుస్తకాలు ఇదివరలో ఎవరందిచ్చారు? ఇటువంటి రూపరేఖలు ఇదివరలో మనం చూశామా పుస్తకాలకు! ఇంత వైవిధ్యం ఎరుగుదుమా? ఈ విధంగా మన ఇంటికి పంపటం ఎరుగుదుమా? ఒక్క రచయితలూ, పాఠకులూ కాక ఎవరైనా వీరి యీ ఉద్యమం జయప్రదం కావాలనే కోరుకుంటారు! అవుతుందికూడా

ఈ విపులమైన సమీక్షలో ఏవైనా తప్పులు అనుకోకుండా దొర్లివుంటే తోటి రచయితలూ, పాఠకులూ అతిశయమూ, అవినయమూ అనుకోక అజ్ఞానమని గ్రహించకోరతాను.

(పుస్తక ప్రపంచం, 1968 అక్టోబరు)

# వీరేశలింగం పంతులుగారి నాటకాలు

వీరేశలింగం పంతులుగారి కాలానికి తెలుగులో నాటక రచన ప్రాచుర్యం పొందలేదు ఇంచు మించుగా ఆంగ్లేయ సాహిత్య ప్రభావంతో పుట్టిన అన్ని ప్రక్రియలను పంతులుగారే మొదట తెలుగులోకి తెచ్చి, స్థితినీ, ప్రాచుర్యాన్నీ కలిపించారు వాటికి అని చెప్పాలి పంతులుగారికి పూర్వం క్వాచిత్కంగా నాటక రచనపట్ల శ్రద్ధా సక్తులు చూపినవారు లేకపోలేదు పంతులుగారు చేపట్టటానికి పూర్వమే ఆంగ్ల రూపకానువాదం, స్వతంత్ర నాటక రచన తెలుగులో వెలసినయ్. ప్రహసనం మాత్రం, అంటే ఆధునికమైన స్ఫూర్తితో పంతులుగారికి ముందు పుట్టినట్లు లేదు

సంస్కృత నాటకాన్ని తొట్టతొలుతగా తెలుగులోకి తెచ్చింది శ్రీకోరాడ రామచంద్రశాస్త్రి గారని పరిశోధకులు నిరూపించారు. తెలుగులో స్వతంత్రంగా రూపక నిర్మితి కూడా వీరి కీర్తిని అచిరం చేస్తున్నది అయితే మొదట సంస్కృత నాటకాన్ని తెలుగులోకి అనువదించింది కొక్కొండవారా, కోరాడవారా అన్న వివాదం కొంత తల యెత్తింది. మొట్టమొదట అచ్చుపడ్డ సంస్కృతానువాద రూపకం కొక్కొండవారి నరకాసుర విజయవ్యాయోగం. అచ్చుపడకపోయినా ముందు రచింపబడింది కోరాడవారి వేణీసంహారానువాదం అని పరిశోధకులు నిష్కర్షించారు.

వీరేశలింగం పంతులుగారికి పూర్వం నాటక రచనలో జరిగిన కృషి సంక్షిప్తంగా ఇట్లావుంది

తెలుగులో మొట్టమొదట అనువదింపబడిన సంస్కృత రూపకం వేణీ సంహారం, కర్తకోరాడ రామచంద్రశాస్త్రి గారు.

తెలుగులో మొట్టమొదట రచింపబడిన స్వతంత్ర రూపకం మంజరీ మధు కరీయం కర్త కోరాడవారే

తెలుగులో మొట్టమొదటి ఆంగ్లరూపకానువాదం 'సీజరు చరిత్రము ' కర్త శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు ఇది షేక్స్పియర్ జూలియస్ సీజర్ నాటకానికి అనువాదం.

ఇక పంతులుగారు వెలయించిన రూపక సాహిత్యంలో ప్రహసనాలు, సంస్కృత రూపకానువాదాలు, స్వతంత్ర రూపకాలూ ఉన్నాయి

అయితే ఆధునిక కాలాన, ఆధునికార్ధంలో, తొట్టతొలుతగా తెలుగు నాటకాన్ని ప్రదర్శించిన కీర్తి వీరేశలింగం గారిదేనని వారి స్వీయచరిత్ర వల్ల తెలుస్తున్నది.

1880వ సంవత్సరంలో తాము రచించి వ్యవహార ధర్మబోధిని అనబడే ప్లీడరు నాటకాన్ని వినోదార్థంగా విజయనగరం మహారాజావారి బాలికా పాఠశాలలో విద్యార్థులచే ప్రదర్శింప జేసినప్పుడు నూరుల కొలది జనులు చూచి ఆనందించారని పంతులుగారి స్వీయ చరిత్ర చెబుతున్నది.

ఆ తరువాత పంతులుగారు కళాశాల విద్యార్థులతో ఒక నాటక సమాజం స్థాపించారు ధార్వాడ నాటక సమాజంవారు ఆ సంవత్సరం ఆంధ్రదేశం పర్యటించి అక్కడక్కడ నాటకాలాడుతూ, రాజమహేంద్రవరంలో కూడా నాటకాలాడి వేరే చోటికి తరలిపోగా, ఆ పాక విప్పివేయకముందే వీరేశలింగం పంతులుగారు శ్రీ హర్షదేవ విరచితమైన రత్నావళిని, షేక్స్పియర్ విరచితమైన "ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్" అన్న నాటకాన్ని తెలుగులో రత్నావళి, చమత్కార రత్నావళి అన్న పేర్లతో అనువదించి, విద్యార్థులచే ప్రదర్శింపచేశారు. అటు తరువాత నాటక రచనం, నాటక ప్రదర్శనం బాగా వ్యాప్తిపొందాయి.

వీరేశలింగం పంతులుగారు నాటక రచనకు 1975 లో పూనుకున్నారు. వారు రచించిన నాటకాలలో చివర నాటకం 1894 లో రచించారు. కాబట్టి పంతులుగారు తాము రచించిన నాటకాలన్నీ ఇరవై సంవత్సరాల కాల వ్యవధిలో రచించారని చెప్పాలి.

పంతులుగారి నాటక రచన ఆంగ్ల రూపకానువాదంతో ప్రారంభమైంది. షేక్స్పియర్ నాటకమైన "ది కామెడి ఆఫ్ ఎర్రర్స్"ను అదే పేరుతో, అవే దేశ కాల పాత్రములతో, యథాతథంగా ద్విపద కావ్యంగా సంతరించటానికి పంతులుగారు ప్రయత్నించారు. రెండంకాలు పూర్తి కాగానే యీ ప్రయత్నం విడిచిపెట్టారు. ఈ విధంగా యథాతథానువాదం వారికి తరువాత అంగీకార్యం

కాలేదు ఈ రెండంకాలూ తాము నిర్వహించిన వివేక వర్ధనిలో ప్రకటించారు. ఇంతకు పూర్వమే వావిలాల వాసుదేవ శాస్త్రిగారి సీజరు చరిత్రం, తేట గీతుల్లో వెలువడింది పంతులుగారి నీ ప్రయత్నం కూడాఆకర్షించలేదు తామూ ప్రయత్నించి చూసి, వదిలివేశారు పంతులుగారిప్రయత్నం 1875 లో చేశారు వెంటనే అభిజ్ఞాన శాకుంతలం ఆంధ్రీకరించటానికి పూనుకున్నారు ఆ తరువాత చాలా సంస్కృత రూపకానువాదాలూ, స్వతంత్ర రూపకాలూ, ఆంగ్ల రూపకానువాదాలూ, ప్రహసనాలూ పంతులుగారు ప్రచురించారు వీటిలో అసంపూర్ణాలుగా నిలిచి పోయినవి కూడా కొన్ని వున్నాయి శాకుంతలానికీ, ప్రబోధచంద్రోదయానికీ బాగా పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. పంతులుగారి నాటక రచన కాలక్రమాను సారంగా ఈ కింది విధంగా నిరూపణం అవుతున్నది:

| | | |
|---|---|---|
| ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్ | 1875 | |
| అభిజ్ఞాన శాకుంతలం | 1875 | (రెండంకాలు మాత్రం) |
| బ్రాహ్మ వివాహం | 1876 | |
| వ్యవహార ధర్మబోధిని | (1878 - 1880) | |
| స్త్రీ పునర్వివాహ సభా నాటకం | 1879 | |
| చమత్కార రత్నావళి | 1880 | |
| రత్నావళి | 1880 | |
| వినీసువర్తక చరిత్రం | 1880 | |
| వివేక దీపిక | 1880 | |
| శాకుంతలం | (1880 - 83) | |
| మాళవికాగ్నిమిత్రం | 1885 | |
| ప్రబోధ చంద్రోదయం | 1885 | |
| రాగమంజరి | 1885 | |
| దక్షిణ గోగ్రహణం | 1885 | |
| ప్రహ్లాద | 1885 | |
| సత్యహరిశ్చంద్ర | 1886 | |
| కళ్యాణ కల్పవల్లి | 1894 | |

ఇవికాక లెక్కకు మిక్కిలి ప్రహసనాలు పంతులుగారు రచించారు తిర్యగ్విద్వన్మహాసభ, మూషికాసుర విజయం మొదలైన ప్రహసన ప్రాయము

లైన రూపకాలు చాలా రచించారు హిందూమత సభ, మ్యునిసపల్ నాటకం, కలిపురుష శనైశ్చర విలాసం, దంభాచార్య విలసనము మొదలైన ప్రహసనాలు ఆ రోజుల్లో సంఘంలో చాలా సంచలనాన్నే తెచ్చాయి న్యాయసభల్లో పంతులు గారిపై ప్రయోగాలు మోపటంవరకూ యీ ప్రహసనాలు సాధించాయి పంతులు గారి నాటకాలు ఇతివృత్తాన్నిబట్టి కింది విధంగా విభాగం చేయవచ్చును.

ఆంగ్లరూప కానువాదాలు

ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్, వినీసువర్తక చరిత్రం, చమత్కార రత్నావళి, రాగమంజరి, కళ్యాణ కల్పవల్లి

సంస్కృత రూప కానువాదాలు

అభిజ్ఞాన శాకుంతలం, రత్నావళి, ప్రబోధచంద్రోదయం మాళవికాగ్ని మిత్రం

స్వతంత్ర పౌరాణిక నాటకాలు

దక్షిణ గోగ్రహణం, ప్రహ్లాద, సత్యహరిశ్చంద్ర.

స్వతంత్ర సాంఘిక రూపకాలు

వ్యవహార ధర్మబోధిని, బ్రాహ్మ వివాహం, స్త్రీ పునర్వివాహ సభా నాటకం, వివేక దీపిక

అయితే ఆంగ్లరూపకానువాదాలలోని కామెడి ఆఫ్ ఎర్రర్స్, వినీసు వర్తక చరిత్ర అసంపూర్ణంగా నిలిపివేయబడ్డాయి సాంఘికేతివృత్తంగల స్వతంత్ర రూపకాలలో స్త్రీపునర్వివాహ సభా నాటకం, వివేకదీపిక కూడా అసంపూర్ణాలే. ఈ వివేకదీపిక తప్ప, తక్కిన అసంపూర్ణ నాటకాలన్నీ పద్య నాటకాలు కావటం కూడా గమనార్హం

పంతులుగారి నాటకాలన్నీ పరిశీలిస్తే ఈ విషయాలు బోధపడతాయి అనువదించిన ఇంగ్లీషు రూపకాలలోనూ, సంస్కృత రూపకాలలోనూ పంతులుగారు మూలంలో లేని మార్పులు కొన్ని చేశారు చాలా రూపకాలలో దేశ కాల పాత్రాదులు మార్చారు అట్లా మార్చిన సందర్భాలు కొన్ని ఎబ్బెట్టుగానూ, కృతకంగానూ కూడా పరిణమించాయి ఆంగ్ల రూపకానువాదం షేక్స్పియర్ నాటకానువాదంతోనే తెలుగున ప్రారంభమైంది పంతులుగారికి పూర్వం ఆంగ్ల నాటకాలననువదించిన ఇద్దరూ కూడా షేక్స్పియర్ నాటకాలనే అనువదించారు. వావి

లాల వాసుదేవశాస్త్రిగారూ, గురజాడ శ్రీరామమూర్తిపంతులూ ఆ ఇద్దరూ సీజరు చరిత్రం, వెనీసువణిజ నాటకం ఆ రెండు నాటకాలూ పంతులుగారు కామెడీ ఆఫ్ ఎర్రర్స్‌ను మొదట పద్యాత్మకంగా అనువదించటానికి పూనుకొని, ఆ ప్రయత్నం విడిచిపెట్టి, గద్యాత్మకంగా చమత్కార రత్నావళి పేరుతో అనువదించారు షెరిడన్ నాటకాలను, పంతులుగా రనువదించటానికి కారణం ఆ నాటకాలలో సంఘ దురాచార నిరసనం ప్రధాన స్థాన మాక్రమించటమే అనుకోవాలి పంతులుగారికి వ్యంగ్య విమర్శపట్లా సాంఘిక దురాచారాలను అవహేళన చేయటంపట్లా ప్రీతి అధికం గద్యపద్యాత్మకములుగా ఉన్న ఆంగ్ల నాటకాలను పంతులుగారు గద్యాత్మకంగానేఅనువదించారు దేశీయాచారాలను, అనువాదంలో చొప్పించారు. మూల సన్నివేశాలను విపులంగా చెప్పవలసిన చోట్ల చెప్పారు

సంస్కృతానువాదాలలో పూర్వపద్ధతులుకాక కొత్త పద్ధతులు ప్రవేశపెట్టారు నీచ పాత్రలకు కూడా సరళగ్రాంథికాన్నే ఉపయోగించారు ప్రస్తావనలో తమ పేరు ప్రతిష్ఠలు చెప్పుకోలేదు సంస్కృత రూపకానువాదాలలో పాటలు రచించే పద్ధతి కూడా పంతులుగారే ప్రవేశపెట్టారు తరువాత నాటకకర్తలందరూ పౌరాణిక నాటకాలలోనూ, స్వతంత్ర నాటకాలలోనూ పాటలు రచించటం గమనించాలి భావానుసరణం ప్రధానంగా అనువాదంలో కొంత స్వేచ్ఛను అవలంబించారు పంతులుగారు పౌరాణికేతివృత్తాలలో కూడా సంఘ సంస్కారానికి, తమ అభిరుచిలకు అనుగుణమైన సన్నివేశాలూ, సంభాషణలూ, మార్పులూ పంతులుగారు తెచ్చిపెట్టారు సాంఘిక రూపకాలను వ్యవహారిక భాషలోనే రచించారు దీని కుదాహరణంగా బ్రాహ్మ వివాహం, వ్యవహార ధర్మబోధినులను గ్రహించవచ్చు ప్రహసనాలలోనూ, సాంఘిక రూపకాలలోనూ సమకాలీన సంఘాన్ని కథావస్తువుగా స్వీకరించారు వీటిలో కటు వ్యంగ్యమూ, మృదుహాస్యమూ కూడా కనబడతాయి.

పంతులుగారే మొట్టమొదట నాటక సమాజం స్థాపించారు ప్రదర్శనను నిర్వహించారు ఇంగ్లీషు నాటకాలలో మాదిరి తెలుగున కూడా అంకాలను రంగాలుగా విభజించే పద్ధతి ప్రవేశపెట్టారు సమకాలీన సంఘాన్ని పంతులుగారి నాటకాలూ, ప్రహసనాలూ చాలా ప్రభావితం చేశాయి ప్రబోధ వాఙ్మయ నిర్మాతగా పంతులుగారు ప్రసిద్ధి పొందటానికి అధిక భాగం వారి నాటకాలూ, ప్రహసనాలే దోహదం చేశాయి.

(నాట్యకళ, 1969)

# పంధొమ్మిదో శతాబ్దంలో తెలుగు నాటకరంగం

"మనవారు మేకదాటుగా చిరకాలము పురాణముల నాంధ్రీకరించి తర్వాత ప్రబంధంబుల విసిగి యిపుడు అన్యములం దొడంగినారు. మరియు గీర్వాణ నాటకముల నెరింగియు హూణ నాటకములం జదువువరకు నాటకముల వ్రాయ రైరి. గీర్వాణకథల నెరింగియు హూణ నవలలం గాంచిన దనుక నవలల పయిం బడరైరి."

గ్రామ్యభాషాప్రయోగ నిబంధనమనే తమ ఉపన్యాసంలో మహామహో పాధ్యాయులు, కళాప్రపూర్ణులు, సర్వస్వతంత్రులు శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రి గారు పైన పేర్కొన్న అభిప్రాయాన్ని ప్రకటించారు అంటే ఇగ్లీషు సాహిత్యం లోని ప్రక్రియా వైవిధ్యం మన సాహిత్యపరులను ఆకర్షించిన తరవాతమాత్రమే తెలుగులో కూడా నాటక రచన చేయాలన్న అభిలాష వారికి కలిగిందన్న మాట. ఇంగ్లీషువారితో విద్యా, సాంస్కృతిక, సాహిత్య రంగాలలో భారతీయులకు బాగా పరిచయం కల్గిన తర్వాతనే సర్వభారతీయ భాషా సాహిత్యాలలో ఒక వికాసం, ఒక నవ్యత, ఒక ఉజ్జీవనం కలిగిన విషయం విద్వాంసులందరికీ తెలిసిందే.

పందొమ్మిదో శతాబ్ది పూర్వార్థంలో సాంఘిక వ్యవస్థాపరమైన, రాజకీయ మైన మార్పులనే చూడవచ్చునుగాని, సాహిత్యంలో నవ్యరీతులు నెలకొనలేదు. 1857 నాటి సిపాయి విప్లవం తర్వాత, ఇంగ్లీషు ప్రభుత్వం మరింత బలపడి, స్థిరపడటం, కలకత్తా, బొంబాయి, మద్రాసులలో విశ్వవిద్యాలయాల స్థాపన, ప్రభుత్వోద్యోగాలకోసం ఇంగ్లీషు నేర్వడం, సంఘ సంస్కరణదృష్టి ప్రబలడం, సాహిత్యంలో నవ్య ప్రక్రియలను తీసుకొనిరావాలనే ఆకాంక్ష, వీటన్నిటివల్ల పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో సాహిత్యరంగంలో ఎన్నో మార్పులు వచ్చాయి. విద్యుచ్ఛక్తిని కనుక్కొన్న తర్వాత పారిశ్రామిక రంగంలో ఎటు వంటి అపూర్వమైన మార్పులు వచ్చాయో- అత్యాశ్చర్యకరమైన ఫలితాలు

సాధించడం జరిగిందో, ముద్రణయంత్రాలు వచ్చింతర్వాత సాహిత్య రంగంలో కూడా అటువంటి అపూర్వమైన వికాసం విస్తరించింది పదిమందికి ప్రతులు లభ్యం కావడం, సాహిత్యపిపాస పెరగడం, విమర్శక రీతులు వృద్ధి పొందడం, గ్రంథ రచయితలలో సృజనాత్మకత, నవ్యతలపట్ల అభిలాష మిక్కుటం కావడం వీటన్నిటితో ఇతరు లిదివరలో తొక్కని మార్గాలు చూపాలని ప్రయత్నాలు చేశారు సాహితీపరులు.

కాకపోతే నన్నయ్యగారే "నాటక క్రమములు'' పెక్కు చూచి ఉన్నా, "ఘనరస పాత్రమైన నాటక ప్రయోగము'' ఎరిగే ఉన్నా; పాల్కురికి సోమన, శ్రీనాథుడు నాటకాలను గురించీ, యక్షగానాలు గురించీ ప్రస్తావించి ఉన్నా, రఘునాథనాయకుడు నాటకశాలలు పెక్కు నిర్మించి ఉన్నా, తొమ్మిదివందల సంవత్సరాల కాలంలో తెలుగు నాటక రచనకు కవులు పూనుకోకపోవడానికి మరో కారణం చెప్పలేము విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో శ్రవ్య కావ్యమే కావ్యమనీ, అది రచించినవారికే ఉత్తమ గతులని వ్రాశాడనీ, అందు వల్లకూడా మనవారికి నాటక రచనపట్ల కుతూహలం కలగపోయి ఉంటుందనీ, వేదం వారే వివరించారు శ్రీనాథుడిదని చెపుతున్న క్రీడాభిరామంలో అప్రశస్తమైన వర్ణనలూ, అశ్లీలాలు లేకపోతే, రూపకరచన శ్రీనాథుడి కాలంనుంచే అభివృద్ధి పొంది ఉండేదని కూడా వేంకట్రాయశాస్త్రిగారు అభిప్రాయపడ్డారు.

ఏది ఏమైతేనేం, ఆధునిక కాలాన తెలుగులో నాటకాలు ఎప్పుడు రాయడం మొదలైంది? ఎప్పుడు ఆడడం మొదలైంది? అనే విషయాలు తెలుసుకోవాలి. కిందటి శతాబ్దంలో విశాఖపట్నం వాస్తవ్యులైన ఒక మహామహోపాధ్యాయుడైన పండితుడు ఉండేవారు. వారిపేరు శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్యులవారు. ఇటీవలి పరిశోధనలవల్ల సాక్ష్యాధారాల వల్ల తెలుగు నాటకరచనం మొట్టమొదట చేపట్టినవారు వీరేనని తెలుస్తున్నది ఇప్పటిదాకా శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి గారని అనుకుంటూ వచ్చారు పరిశోధకులు, సాహిత్య చరిత్రకారులు 1860 న సంవత్సర ప్రాంతంలో 'మంజరీ మధుకరీయ' మనే స్వతంత్ర నాటకాన్ని, 1870 ప్రాంతాలకల్లా 'వేణీ సంహార' మనే సంస్కృత నాటకానువాదాన్ని శ్రీకోరాడ రామచంద్రశాస్త్రిగారు పూర్తిచేశారని, ఆయన శిష్యుడిగా తనను గూర్చి

చెప్పుకొన్న శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు వ్రాశారు ఈ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు ఉత్తర రామచరిత్రను అనువాదం చేసి పుస్తకరూపంలో ప్రకటించేప్పుడు, తమ గురువుగారైన శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారే మొట్టమొదటి సారిగా స్వతంత్ర రూపకాన్ని రచించారనీ, సంస్కృతం నుంచి నాటకానువాదం చేయటంలో కూడా ఆయనే మొదటివారనీ పీఠికలో ప్రస్తావించడం జరిగింది. అంతేకాక, వీరి తరవాతే కొక్కొండ వేంకటరత్నం పంతులు గారు సంస్కృత రూపకానువాదం నిర్వహించారని స్పష్టంగా పేర్కొనడం కూడా జరిగింది

అయితే, ఈమధ్య శ్రీమాన్ పరవస్తు వేంకట రంగాచార్యులవారి స్వీయ జీవిత వృత్తాంతంవల్ల, శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి గారికన్నా పూర్వమే సంస్కృత నాటకానువాదం రంగాచార్యులవారు ప్రారంభించినట్లు తెలిసింది. కాగా ప్రాథమ్యం రంగాచార్ల వారిదే అవుతున్నది. ఇంచుమించుగా ఐదారు లేదా పదేండ్ల వ్యవధానంలో సంస్కృతానువాదం, స్వతంత్ర రచన, ఇంగ్లీషునుంచి అనువాదం- మూడూ కూడా ప్రారంభమైనట్లు భావించవచ్చు. పరవస్తు వేంకట రంగాచార్యుల వారిని గురించి వ్రాసిన శ్రీపురిపండా అప్పలస్వామిగారు, పరవస్తు వారే రామచంద్రశాస్త్రికన్నా సంస్కృత నాటకానువాదం ముందుగా ప్రారంభించారు అని వ్రాశారు

ఇంగ్లీషునుంచి నాటకాన్ని మొట్టమొదట అనువదించి ప్రకటించినవారు శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు జూలియస్ సీజర్ నాటకాన్ని సీజరుచరిత్రం పేరుతో వావిలాలవారు అనువదించారు. ఈ అనువాదంలో ఒక విశేషం కూడా వుంది. ఇది ఈ నాటకమంతా ఒకే ఛందంలో అనువదించడం. ఈ ఛందం మంజరీ ద్విపద ఇటు తరవాత వీరేశలింగంగారు కూడా 'ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్' అనే షేక్స్పియర్ నాటకాన్ని ఇదేవిధంగా ఒకే ఛందంలో అనువదించడానికి ప్రయత్నించారుగాని, అది ఆయనకు రుచించినట్లు లేదు మధ్యలోనే విడిచిపెట్టేశారు 1880 వ సంవత్సరంలో గురజాడ శ్రీ రామమూర్తిగారు 'దిమర్చెంట్ ఆఫ్ వెనిస్' అనే నాటకాన్ని గద్య పద్యాత్మకంగా అనువదించారు. అదే సంవత్సరం వీరేశలింగం 'ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్' నాటకాన్ని వచనంగా అనువదించారు. అటుతరవాత ఆంగ్లనాటకానువాదాలు కొన్ని బయలుదేరాయి. సంస్కృత నాటకానువాదాలూ విరివిగానే వెలువడ్డాయి.

ఇంకొక ప్రయోగాన్ని కూడా యీ కాలంలో విశేషమైనదిగా భావించ వచ్చు. అది స్వతంత్ర నాటకాన్ని కూడా ఆసాంతం పద్యాలలోనే నిర్వహించడం. వావిలాల వాసుదేవశాస్త్రిగారే 1880 వ సంవత్సరంలో 'నందకరాజ్య' మనే పేరుతో ఒక నాటకం వ్రాశారు ఇందులో మరొక విశేషంకూడా వుంది. ఇది తెలుగులో సాంఘికేతివృత్తం గల మొట్టమొదటి రూపకం. మొత్తం నాటకమంతా 'తేటగీతు'ల్లోనే వుంది బహుశా తెలుగులో నాటక రచన చేయడానికి పూనుకున్న తొలి రోజుల్లో ఈవిధంగా పద్యాల్లో వ్రాయడంపట్ల ఆకర్షణ ఉండేదేమో అనుకో వలసి వస్తున్నది వీరేశలింగం కూడా మూడు నాలుగు నాటకాలు - అను వాదాలూ, స్వతంత్రరూపకాలు కూడా పద్య నాటకాలుగా మొదలుపెట్టి, రెండు మూడంకాలు వ్రాసి తరవాత విడిచి పెట్టడం జరిగింది

1883 లో వీరేశలింగం శాకుంతలానువాదం పుస్తకరూపంలో ప్రచు రించారు ఇదే సంవత్సరం వావిలాల వాసుదేవశాస్త్రిగారు 'ఉత్తర రామ చరిత్ర' అనువాదాన్ని కూడా ప్రకటించారు దీని కాయన ఇంగ్లీషులో పీఠిక వ్రాశారు తెలుగులో నాటక వాఙ్మయాన్ని గూర్చిన మొట్టమొదటి ప్రస్తావన లేదా సమీక్ష, ఇదేనేమో ననుకోవాలి అయితే, అంతకుపూర్వమే వేంకటరత్నం పంతులుగారు కూడా తమ నరకాసుర విజయ వ్యాయోగమనే నాటకానువాదం గూర్చి కూడా, తెలుగులో ఇదే మొదటి అనువాదం అని ప్రస్తావించారుకాని, వాసుదేవశాస్త్రిగారు తెలుగు నాటక రచనా చరిత్రను తమ పీఠికలో ప్రస్తా వించారు.

మొదటి ప్రయత్నాలలో దేశకాల పాత్రలలో మార్పులేమీ చేయకుండా, ఇంగ్లీషు నాటకాలను యథాతథంగా అనువదించడానికి పూనుకోవడం చూడ వచ్చు అటుతరవాత పాత్రల పేర్లు, దేశకాలాదులు మార్పుచేసి అనువదిం చడం జరిగింది. సీజరు చరిత్రము, వెనీసు వణిజ నాటకము లేదా సుహృత్సుభా షితము అని వావిలాల వాసుదేవశాస్త్రిగారు, గురజాడ శ్రీరామమూర్తిగారు అను వాదనాటకాల పేర్లు పెట్టగా, వీరేశలింగంగారు 'ది కామెడీ ఆఫ్ ఎర్రర్స్'ను 'చమత్కార రత్నావళి' అనే పేరున అనువదించడం జరిగింది.

అయితే ప్రదర్శనలు ఎప్పుడు ప్రారంభమైనట్లు?

1880 వ సంవత్సరంలో ధార్వాడ నాటక సమాజంవారు తెలుగుదేశంలో ప్రదర్శన లిచ్చారు. అప్పటికి ఆ ప్రదర్శనలు నూతన ఆకర్షణలతో వుండేవి. ఈ విధంగా రాజమహేంద్రవరంలో వారు నాటకాలాడిపోయిన పాకలో వీరేశలింగం పంతులుగారు 'చమత్కార రత్నావళి' నాటకాన్ని తమ శిష్యులతో ఆడించారు. ఇట్లానే శ్రీహర్షుని రత్నావళిని అనువదించి, దానినికూడా ప్రదర్శింపజేశారు ఈ ప్రదర్శనలకన్నా ముందేకూడా వ్యవహార ధర్మబోధినిని ప్రదర్శింపజేశారు. రాజమహేంద్రవరంలోనే విజయనగరం రాజావారి బాలికా పాఠశాలలో, ప్లీడరు నాటకంగా ప్రసిద్ధిపొందిన యీ వ్యవహారధర్మబోధిని అనే ప్రహసనప్రాయమైన-రచనను పంతులుగారు ప్రదర్శింపజేయగా నూరులకొలది జనులు వచ్చి ఆనందించారని ఆయన స్వీయచరిత్రలో వ్రాశారు. ఈ వ్యవహార ధర్మబోధిని ఏ ప్లీడరు గారి నుద్దేశించి వ్రాసిందో, ఆ ప్లీడరుగారి మేనల్లుడే ఆయనగారి 'గౌను'తో సహా వచ్చి వేషం కట్టగా, ఆ మర్రోజునుంచి ఆ ప్లీడరుగారు కోర్టుకు వెళ్ళి తోటివారి హేళనలను, జనుల పరిహాసాన్ని భరించలేక కోర్టుకు వెళ్ళడం కూడా మానుకున్నారట. దీనితో తమ సంఘసంస్కరణ కార్యక్రమంలో నాటక ప్రదర్శనల విలువ, ప్రహసన రచనల ప్రయోజనమూ తమకు బాగా అవగతమైనాయని వీరేశలింగంగారు స్వీయచరిత్రలో వ్రాశారు

అందువల్ల ఒక నాటక సమాజాన్ని స్థాపించాలని ఆయనగారికి కోర్కెబలపడింది. ఇంతలో ధార్వాడ కంపెనీవారు వచ్చి నాటకాలాడిపోయినారు. వీరేశలింగం నాటక సమాజాన్ని స్థాపించి, తమ శిష్యులకే తర్ఫీదు ఇచ్చి రత్నావళి, చమత్కార రత్నావళి నాటకాలాడించారు ఒకటి సంస్కృతానువాదం. రెండోది ఆంగ్ల నాటకానువాదం. ఈ నాటక ప్రదర్శనలకు మంచి ప్రోత్సాహమే లభించింది కాని విద్యార్థుల సంరక్షకులు, పోషకులు ఈ విధంగా తమ పిల్లలు నాటకాల వెంబడి తిరగడం ఇష్టపడలేదు అందువల్ల యీ నాటక సమాజం ఎక్కువనాళ్ళు పనిచేసినట్లు కనపడదు. ఆ రోజుల్లో నాటకాలాడడం గౌరవమైన వృత్తిగా పరిగణించేవాళ్ళుకాదు అది చెడిపోవడానికి చక్కని రాజమార్గమనీ, ప్రభువు మర్యాదలకు లోపం వాటిల్లుతుందనీ ఎంచేవారు ఈ విషయం వీరేశలింగం. నిడుదవోలు లక్ష్మీనరసింహం, కొండ వెంకటప్పయ్య, ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు మొదలైనవారి స్వీయచరిత్రలు చదివితే తెలుస్తుంది.

దీన్నిబట్టి మనం తెలుసుకోవాల్సింది ఏమంటే, 1880 వ సంవత్సర ప్రాంతంనుంచి తెలుగుదేశంలో నాటకాలాడడం ప్రారంభమైందని. అంతకు ముందు బయలాటలు, యక్షగానాలు మొదలైన ప్రదర్శనలు లేవనికాదు. ఆధునిక కాలంలో తెలుగు నాటకపు ఉద్భవ వికాస పరిణామాలను గూర్చి పరిశీలించేప్పుడు, ధార్వాడ నాటక సమాజంవారి నాటకాలు ఆయా ప్రాంతాలలో తెలుగుదేశంలో కూడా కొన్ని నాటక కంపెనీలు పుట్టడానికి, ఈ కంపెనీల కోసం కొందరు నాటక రచనకు పూనుకోవడానికీ కారణమైనాయి. గుంటూరులో హిందూ నాటక సమాజం, పస్తు కంపెనీ మొదలైనవి ఇట్లా పుట్టినవే. కొండుభట్ల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఈ నాటక కంపెనీల వారికోసం కీచక వధ, ద్రౌపదీ వస్త్రాపహరణం, గయోపాఖ్యానం మొదలైన 31 నాటకాలదాకా వ్రాశారుట. ఈ సమాజాలు 1881 పూర్వమే స్థాపితమైనట్లుగా 'వీరేశలింగయుగం' అనే సాహిత్య చరిత్ర గ్రంథంలో శ్రీ కల్లూరు వేంకట నారాయణరావు గారు వ్రాశారు. కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి నాటకాలాడించడం చాలా ప్రీతి పాత్రంగా వుండేదనీ, తమను ఒక జట్టుగా ఏర్పరచి, తర్ఫీదు ఇచ్చి, నాటకాలాడించడానికి రాజమండ్రి తీసుకొని వెళ్ళారని కొండ వెంకటప్పయ్య పంతులు గారు స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు. తాము రాజమండ్రి వెళ్ళటం, నాటకాలాడడం, వీరేశలింగంగారిని దర్శించడం, ఆనాటి రాజమహేంద్రవరపు స్థితిగతులు, నాటక ప్రదర్శనల విశేషాలు ఆయన వివరించారు. ప్రథమాంధ్ర నాటక రచయితలలో సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి విశిష్టమైన స్థానమే వున్నది.

పందొమ్మిదో శతాబ్దపు తెలుగు నాటక రంగ చరిత్రను పరిశీలించేటప్పుడు కొన్ని ప్రధానమైన ఘట్టాలను గుర్తుంచుకోవలసి ఉంటుంది. "స్వతంత్ర నాటక ప్రదర్శనమున తెనుగులో మొదటివారు బళ్ళారిలోని ధర్మవరము రామకృష్ణమాచార్యులవారే! వీరి సరసవినోదిని సభ 1885 నుండియు నుత్తమ స్వతంత్ర నాటకములను ప్రదర్శించి విఖ్యాతమైనది. ఆంధ్రదేశమున నాటకముల కెంతో కీర్తి దెచ్చినది ధర్మవరం రామకృష్ణమాచార్యులవారే యనవలయును. కవియే పాత్రధారిగను వెలయుటచే వీరి నాటకములు మిక్కిలి రక్తి గట్టినవి. వీరి నాటకములలో ప్రబంధ సరణి, గేయముల ప్రాముఖ్యము, వెల్లివిరిసియున్నను పాశ్చాత్య వైఖరి పూర్తిగా రసానుభూతిలోనికి, నడువులోనికి దెచ్చుకొన్న వారగుటచే రామకృష్ణమాచార్యులు సారంగధర, పాదుకా పట్టాభిషేక, చిత్రనళీ

యాదుల స్వగతముల చేతను, సమయానుకూల సురుచిర వాక్య ఫణితులచేతను, ప్రేక్షకులను తన్మయులుగా జేయుచుండిరనుట చూచినవారంద రెఱింగినదియ. కాననే వారికి ఆంధ్ర నాటక పితామహులన్న బిరుదన్వర్థమై రాణించినది" అన్నారు శ్రీ కల్లూరు వెంకటనారాయణరావుగారు వీరేశలింగయుగంలో

వడ్డాది సుబ్బరాయ కవీంద్రులు కూడా నాటకంలో పాత్రధారణ చేసే వారు. వీరి వేణీసంహారం 1883 లోనే ప్రదర్శితమైనదట కూడా. అంతకు పూర్వమే వ్యవహార ధర్మబోధిని, చమత్కార రత్నావళి వీరేశలింగంగారు ప్రదర్శింపజేశారు అయితే వ్యవహార ధర్మబోధిని ప్రహసనప్రాయమైన రచన, సంఘ సంస్కారోద్బోధకము; దానికి స్వతంత్ర నాటక ప్రతిపత్తి లేదు వడ్డాది సుబ్బారాయుడుగారిది కాని, వీరేశలింగం గారివి కాని అనువాదాలు అందువల్ల ఆధునిక కాలాన ధర్మవరం వారికే ఆంధ్రనాటక పితామహత్వం లభించింది. ధర్మవరంవారి విశిష్టత ఏమంటే - ఇంగ్లీషు నాటక శిల్పాన్ని కూడా బాగా ఆక శించుకోవడమే. అంకములు, రంగములు, సెట్టింగులు రసనిష్యందంగా దిద్ది తీర్చారు ఆయన నాటకాలన్నిటా కన్నడ నాటక రచన, ప్రదర్శనల పరిచయం కూడా వీరికి పుష్కలంగా వుంది.

1886 లో ధర్మవరంవారి చిత్రనళీయం రావడం, ప్రదర్శన పొందడం తెలుగు నాటక చరిత్రలోనే కొత్త మలుపు

1890 వ సంవత్సర ప్రాంతానికే రామకృష్ణమాచార్యుల వారి ప్రతిభ, కీర్తి ప్రతిష్ఠలు, తమిళులను కూడా ఆకట్టుకొన్నాయి. 97 నాటకాలు రచించి తమిళ నాటక పితామహుడని కీర్తిపొందిన సంబంధ మొదలియారు ధర్మవరం వారికి ఏకలవ్యశిష్యుణ్ణి అని చెప్పుకొనేవారట రామకృష్ణమాచార్యుల వారి పాదుకా పట్టాభిషేకం నాటకం ప్రదర్శనలో కంట తడిపెట్టని ప్రేక్షకుడుండ గలిగితే, ఆ ప్రేక్షకుడికి బహుమానమిస్తామని ప్రదర్శనకు ముందు కరపత్రాలలో ప్రకటించేవారుట ఇరవై సంవత్సరాల వయసుననే నాటక రచన కుపక్ర మించారు ధర్మవరంవారు బళ్ళారిలో సరసవినోదిని సభను స్థాపించి, తమ నాటకాలు తామే ప్రదర్శింప చేసేవారు. దశరథ, బాహుక, రాజనరేంద్ర పాత్రలు ధరించి, బంగారు పతాకాలు పొందారు చిత్రనళీయం,ప్రమీలార్జునీయం,

సారంగధర, బృహన్నల, చిరకారి, మదనవిలాసము మొదలైన నాటకాలు వీరివి పద్యాలుగు అచ్చుపడినవి ఇవికాక ఇంకా పద్యాలుగు నాటకాలు అచ్చు పడనివి ఆచార్యులవారివి వున్నట్లుగా తెలుస్తున్నది

ధర్మవరం వారిని గూర్చి ప్రస్తావించినప్పుడు వెంటనే స్మరణకు వచ్చే వారు కోలాచలం శ్రీనివాసరావుగారు వీరిది కూడా బళ్లారే ఈయనగారు కూడా సుమనోరమ సభను నెలకొల్పి, స్వయంగా నాటకాలు రచించి, ఆడించారు. రామరాజు చరిత్రము, సుల్తానా చాందుబీబీ, మైసూరు రాజ్యము, శిలాదిత్య, ప్రతాపాగ్చరీయము, సుఖమంజరి, చంద్రగిరి అభ్యుదయము, మొదలైన చారిత్రక నాటకాలు, శ్రీరామజననం, సీతాకళ్యాణం. పాదుకాపట్టాభిషేకం, లంకాదహనం, కుశలవ, ద్రౌపదీవస్త్రాపహరణం, కీచక, బభ్రువాహన, ప్రహ్లాద మొదలైన పౌరాణిక నాటకాలు, సునందినీ పరిణయం లాంటి స్వతంత్ర నాటకాలు, ఇంకా కొన్ని ప్రహసనాలు వీరు వ్రాశారు రామరాజు నాటకానికి గొప్ప ప్రసిద్ధివచ్చింది బళ్లారి రాఘవవంటి మహా ప్రతిభావంతుడు ఇందులో పఠాన్ వేషం ధరించి, నాటకానికి, తనకూ గొప్ప కీర్తి ప్రతిష్ఠ లార్జించాడు.

చిత్రనళీయానికి పదేళ్ళ తర్వాత తెలుగు నాటక రంగం మరో గొప్ప మలుపు తిరిగింది. ఆ మలుపు ప్రతాపరుద్రీయం. 1896 లో వేంకట్రాయశాస్త్రి గారు ప్రతాపరుద్రీయం రచన ముగించారు తెలుగు నాటక చరిత్రలో ప్రతాపరుద్రీయం అపూర్వ సృష్టి లోక వృత్తాన్ని అంతా అత్యంత ప్రతిభాస్ఫోరకంగా వేంకట్రాయశాస్త్రిగా రీనాటకంలో ప్రతిబింబింపజేశారు పాత్రోచిత భాష అనే వాదము, సిద్ధాంతము ఉద్యమరూపంగా విస్తరించింది లోకజ్ఞత కూడ ఒక గొప్ప కావ్య శిల్పంగా, గుణంగా నన్నయగారు పేర్కొన్నారు ఇంకా యీ సామర్థ్యాన్నే ప్రప్రథమంగా ఆయనగారు పేర్కొనడం జరిగింది 'బహుశ్రవావలోక చణత' యందు కడు నేర్పరి శుచిముఖి అని పింగళి సూరన తాను సృష్టించిన ఒక పాత్రయొక్క ప్రతిభను ప్రస్తావించాడు. ఈవిధంగా వేదం వేంకట్రాయ శాస్త్రిగారు ప్రతాపరుద్రీయంలో గొప్ప లోకజ్ఞతను ప్రదర్శించారు బహుశ్రవావ లోక చణతను నిరూపించారు మానవ జీవితానికి సమీపంగా, సమీచీనంగా కావ్య రచన ఉండాలి, అప్పుడే కావ్య ప్రయోజనం సిద్ధిస్తుంది, ఉత్తమ కావ్యసృష్టి జరుగుతుంది అన్న కావ్యాదర్శం ప్రతాపరుద్రీయ నాటక రచన, ప్రదర్శనల

ద్వారా ఫలించింది సిద్ధాంతితమైంది మరొకమారు పండితులు, రసజ్ఞులు,వేత్తలు ప్రతాపరుద్రీయాన్ని ఎంతగానో మెచ్చుకున్నారు" దీనివంటి యద్భుత నాటకమును మేము కనివిని యెరుంగము ఇంత రసపుష్టి గలిగినట్టియు, నింత ప్రౌఢమగునట్టియు, నింత సలక్షణ మైనట్టియు నాటకము వేరొండుదానిని మేము చూడలేదనియు విన్నవించుచున్నారము" అన్నారు ప్రఖ్యాత పండిత విమర్శకులు శ్రీ వూండ్ల రామకృష్ణయ్యగారు ప్రతాపరుద్రీయం ఆంధ్రదేశంలో చాలా ప్రసిద్ధిని పొందింది ఎన్నిచోట్లనో ప్రదర్శనలు కూడా పొందింది సుమారు ముప్ఫై సంవత్సరాల కాలం వేంకట్రాయ శాస్త్రిగారు తమ శిష్యులకు తర్ఫీదు ఇస్తూ, సంస్కృత నాటకాలు, తెలుగు నాటకాలు వారిచేత ప్రదర్శింపజేశారు చాలా మంది క్రిస్టియన్ కాలేజీలో వీరివద్ద శిష్యత్వం నెరపినవారినే పోగుచేసి ఒక నాటక సమాజం స్థాపించి; వాచికం, ఆంగికం, ఆహార్యాదులలో అతికఠినమైన శిక్షణ వారికి కలుగజేస్తూ, నాటక ప్రదర్శన లిప్పించారు శాస్త్రిగారు వాళ్ళకు శిక్షణ ఇచ్చే సమయాలలో అవసరమైతే చేతిలోని కర్రతో కొట్టడానికి కూడా వెనుకాడేవారు కాదని సమకాలికుల కథనం. తరగతులలో ఆ సంవత్సరం చదివిన నాటకం, ప్రతి సంవత్సరం ఆడటం పరిపాటిగా చేశారుట శాస్త్రిగారు సంస్కృత నాటకాలను పాఠం చెప్పేటప్పుడు ఆ సంవత్సరం విద్యార్థులు చదువు కుంటున్న షేక్స్పియర్ నాటకంతో తులనాత్మకంగా పరిశీలన చేస్తూ "ప్రాచ్య పాశ్చాత్య రూపక సామాన్య లక్షణములను" శాస్త్రిగారు బోధించేవారుట వేంకట్రాయశాస్త్రిగారికి ఆంగ్లేయ నాటక శాస్త్రంలో కూలంకషమైన పాండిత్యం ఉండేదని పెద్దలు చెపుతారు ఆయనే ఇట్లా ప్రస్తావించారు కూడా తమను గురించి-"హూణరూపక రసం బుదరంబు నిండార ద్రావిగ్రుడ ద్రేన్చి తనిసినారు" అని ప్రతాపరుద్రీయం లాగా ప్రఖ్యాతికి రాకపోయినా వేంకట్రాయ శాస్త్రిగారి అభిజ్ఞాన శాకుంతలం, బొబ్బిలియుద్ధము, ఉష నాటకాలు కూడా ప్రదర్శనలు పొందినవి.

ఇంచుమించుగా ప్రతాపరుద్రీయంతోపాటుగానే, తెలుగు నాటకచరిత్రలో మరొక ఉజ్జ్వల ఘట్టాన్ని సృష్టించిన కన్యాశుల్కం కూడా 1897 వ సంవత్సరం లోనే మొదటిసారి వెలువడింది. గురజాడ వేంకట అప్పారావుగారికి వేదం వారిపై భక్తిప్రపత్తులున్నవి. అయితే ప్రతాపరుద్రీయమే కన్యాశుల్క రచనకు మార్గదర్శక మైందనిమాత్రం చెప్పకూడదు. దాని ప్రయోజనం వేరు దీని ప్రయోజనం వేరు

సమకాలీనత అనే విశిష్ట లక్షణం, సామాజిక ప్రయోజనపరత అనే మహదాశయం కన్యాశుల్కానికి ప్రత్యేకత నాపాదిస్తున్నవి. పాత్రోచిత భాషతోనే ఆగిపోకుండా ఇంకా ముందుకువెళ్ళి, శిష్టవ్యావహారికాన్ని నాటకీయ భాషగా ప్రతిపాదించారు అప్పారావుగారు

1870 వ సంవత్సరంలో అనువాదమైనా, స్వతంత్ర రచనే అయినా, ఆధునిక కాలాన తెలుగు నాటక రచన ప్రారంభమైందని అనుకొంటే, ఇంకా పది సంవత్సరాలకు పూర్వమే ప్రారంభమైనట్లు, అత్యంతాధునికంగా లభ్యమైన సాక్ష్యాధారాలు పలుకుతున్నా, 1897 వ సంవత్సరం నాటికి, ఒక గొప్ప పరిణతిని, ప్రౌఢిని, పరిపూర్ణమైన ప్రజ్ఞను తెలుగు నాటకం సాధించినట్లుగా చెప్పవచ్చు కన్యాశుల్కం నాటక రచన, ప్రదర్శనలు తెలుగు నాటకంలో అపూర్వమైన, అద్భుతమైన సంచలనాన్ని సృష్టించినవి కన్యాశుల్కంలోని సంభాషణలు తెలుగునాట నానుడ్లు అయినవి మహా ప్రతిభాపూర్ణులైన గోవింద రాజుల సుబ్బారావు, స్థానం నరసింహారావుల వంటి నటకుల సామర్థ్యం కూడా యీ శతాబ్దిలో కన్యాశుల్కం నాటక ప్రఖ్యాతికి దోహదం కలిగించివుండవచ్చు

పందొమ్మిదో శతాబ్దం తెలుగు నాటకరంగాన్ని గూర్చి ప్రస్తావించేటప్పుడు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిని కూడా తప్పక స్మరించుకోవలసి ఉంటుంది. నవలా రచయితగా, కవిగా, హాస్యరచయితగా, సంస్కర్తగా చిలకమర్తివారికి పేరు ప్రఖ్యాతులున్నా, ఆయన గయోపాఖ్యాన నాటకానికి వచ్చినంత ప్రసిద్ధి మరే నాటకానికీ, నాటక రచయితకు కూడా రాలేదేమో ననిపిస్తుంది. తెలుగు పుస్తకాలలో లక్షప్రతులు చెల్లిన దీ నాటకం అంటూ గయోపాఖ్యానం గూర్చి పొగడటం కద్దు. రాజమహేంద్రవరం కేంద్రస్థానంగా, ఇమ్మానేని హనుమంత రావు నాయుడు, దుగ్గి గోపాలకృష్ణారావు, టంగుటూరి ప్రకాశం, చిలకమర్తి లక్ష్మీనరసింహం కిందటి శతాబ్దం చివరి దశకంలో నాటకరచన, ప్రదర్శనల విషయికంగా ఉజ్జ్వలాధ్యాయాన్నే సృష్టించారు ఈ విశేషాలన్నీ చిలకమర్తి స్వీయచరిత్రంలోనూ, ప్రకాశం పంతులుగారి స్వీయచరిత్రం ద్వారాను తెలుసు కోవచ్చు

మొత్తానికి పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో నాటక రచనకు చాలా ప్రాచుర్యం లభించినట్లుగా ఎంచవచ్చు మొదటి స్థానం కూడా ఆధునిక ప్రక్రియ లన్నిటా నాటక రచనమే వహించినట్లుగా కూడా తెలుసుకోవచ్చు. 1850 నుంచి 1900 సంవత్సరం వరకూ సాహిత్య చరిత్రను అధ్యయనం చేసేప్పుడు నాటక రచనలో కనపడినంత మౌలికత, ఉపజ్ఞ, సృజనాత్మకత మరి ఇతర ప్రక్రియ లలో కానరావేమో ననిపించవచ్చు ఇంకొక విశేషమేమంటే - ఇంచుమించుగా సుప్రసిద్ధ కవి పండితులు, సాహితీవేత్తలు అందరూ కూడా నాటకరచనపట్ల ఆసక్తిని కనబరచినవారే ఈ యుగప్రవర్తకుడైన వీరేశలింగం సంస్కృతాను వాదం, ఆంగ్లానువాదం, స్వతంత్ర రచనం నిర్వహించినా, ఆయనకు స్వతంత్ర నాటక రచయితగా విశిష్టమైన స్థానం లేదు వారి అభిజ్ఞాన శాకుంతలాంధ్రీకరణం మాత్రం తక్కినవారి అనువాదాలకన్నా ప్రసిద్ధి పొందింది ప్రదర్శనలు కూడా పొందింది

పందొమ్మిదో శతాబ్దపు తెలుగు నాటక బ్రహ్మకు (సృష్టికి) ధర్మవరం, వేదం, గురజాడ, చిలకమర్తి నాలుగు మోములు

(తెలుగు నాటకంపై ప్రత్యేక సంచిక - 1975)

# తెలుగు కథ—వాస్తవికత

తెలుగు కథ పుట్టి ఇంకా అరవై ఏళ్ళన్నా కాలేదు. అంటే అంతకు పూర్వం మనకు కథాసాహిత్యమే లేదనికాదు ఈ కథానిక ప్రక్రియ ఆధునిక మైన దృష్టితో చూస్తే ఖండకావ్యం, నవల, నాటిక, పత్రికావ్యాసం, సాహిత్య విమర్శలలాగా చాలా ఇటీవలగా పుట్టిందనీ, ఇంగ్లీషు సాహిత్య ప్రభావంవల్లనే ఆధునిక ప్రక్రియ లన్నిటిలాగా, పరి పుష్టి చెందుతూ వచ్చిందని తెలుసుకోవచ్చు. సంస్కృత సాహిత్యంలో కథాసరిత్సాగరం, దశకుమార చరిత్రం మొదలైన కథాసాహిత్యం ఉన్నది కాని, ప్రపంచ భాషల్లో ఇప్పుడు ప్రాచుర్యం పొందిన కథ శిల్పవిన్నాణానికి, సంస్కృతంలోని ఆ పాతకథలకు పోలికలు లేవు. అయితే కథానిక ప్రక్రియ భారతీయులకు కొత్త కాదనీ, పంచతంత్రం కథలు మొదలైనవాటిలో కథానికాశిల్పం నిక్షిప్తంగా లేకపోలేదనీ చెప్పుకోవచ్చు

ఏదిఏమైనా ఇప్పుడు చిన్నకథ, కథ, కథానిక అన్న పేర్లతో వ్యవహృత మవుతున్న సాహిత్య ప్రక్రియను, ఆధునికమైన దృష్టితో విశ్లేషించి చూసి నప్పుడు ఇంగ్లీషు ప్రభావమే దానిపైన ఎక్కువ అని, పాశ్చాత్య దేశాల్లో ఈ ప్రక్రియా సంబంధులుగా విలసిల్లిన, విలసిల్లుతున్న శిల్పవిన్నాణాలూ, ప్రయో గాలూ, రూపరేఖా విలాసాలూ అన్నీకూడా దేశీయ భాషల్లోని కథమీద తమ ప్రభావాన్ని చూపుతూనే ఉన్నాయనీ స్పష్టపడుతున్నది. పారిశ్రామిక యుగ ప్రభావము, యాంత్రిక నాగరికత, ప్రపంచ భాషల్లో, సాహిత్యప్రక్రియల్లో కథానిక స్థానాన్ని ప్రముఖం చేశాయి ప్రపంచ వ్యాప్తంగా చూసినా, ఆధునిక నాగరిక భాషల నన్నిటినీ పరిశీలించినా చిన్న కథకున్న ప్రాచుర్యం మరే ఇతర ప్రక్రియకూ లేదేమో ననిపిస్తున్నది గడచిన శతాబ్దాలలో మాదిరిగా కాకుండా మానవుడి కిప్పుడు విశ్రాంత జీవనము, స్వేచ్ఛ, వైయక్తిక స్వాతంత్ర్యం, పరిమితమైపోతున్నాయి సాహిత్యము, లలితకళలు మొదలైనవి మానవజీవితాన్ని అనుశాసనంచేసే పద్ధతుల్లోను, ప్రభావితంచేసే తీరుతెన్నుల్లోను కూడా మార్పులు వచ్చాయి మానసికమైన ఉల్లాసాన్ని కలిగించేందుకు ఆధునిక

నాగరకతలో వినోద సాధనా లనేకం పుట్టాయి సినిమా, సర్కస్, రేడియో, టెలివిజన్, వార్తాపత్రికలు మొదలైనవాటి నెన్నిటినో ఇవాళ్టి మానవుడు ఆశ్రయించవచ్చు అందువల్ల మానసికోద్వేగంనుంచి విశ్రాంతిని కోరుకునేవ్యక్తి సాహిత్యాభిరుచి కలవాడైతే, ఆ సాహిత్యానందాన్ని కూడా అతడు వీలైనంత తక్కువ వ్యవధానంలో పొందాలనే వాంఛిస్తున్నాడు అందువల్ల మహాకావ్యాలను, బృహద్గ్రంథాలను చదివే ఓపిక, ఆసక్తికూడా తగ్గిపోతున్నాయి తనకు లభించే విరామమే తక్కువ ఆ విరామంలోకూడా యంత్రయుగం తాలూకు ఉద్వేగప్రవృత్తి, సంచలనం మనస్సుని అంటుకొనే ఉంటాయి. ఎక్కడనో ప్రయాణం చేస్తూనో, లేక ఏ నిరీక్షణల మధ్య ఇంచుకంత విరామాన్ని సృష్టించుకొనో, ఏదైనా చదువుకొని కాలక్షేపం చేసేవాళ్ళకు కథానిక కన్నా చేరువయ్యే సాహిత్య ప్రక్రియ ఇంకొకటి ఉండదు అందుకని ఆ కథకూడా యాంత్రిక నాగరికతతో, సంచలన శీలమైన ప్రాపంచిక ప్రవృత్తితో మారిపోతూ రోజు రోజుకు కొత్త కొత్త శిల్పాలను ఆశ్రయిస్తున్నది కొత్త రూపరేఖలను ఏర్పరచుకొంటున్నది. పాశ్చాత్య దేశాల్లో పుట్టిన చిన్న కథ నూరు నూటయాభై సంవత్సరాలనుంచీ ఆకృతిని దిద్దుకొంటూ వస్తున్నది కాబట్టి, ఒక లక్షణాన్ని నిరూపించుకొన్నదని చెప్పవచ్చునేమోగాని, తెలుగులో మాత్రం అరవై సంవత్సరాలన్నా నిండని ఈ ఆధునిక ప్రక్రియ ఇంతవరకూ ఒక నిర్దిష్టమైన ఆకృతిని ధరించలేదనే చెప్పాలి అంటే తెలుగులో చిన్న కథకు స్పష్టమైన లక్షణాన్ని నిరూపించడం కష్టమని దీని అర్థం.

ఆధునికమైన రూపరేఖలను దృష్టిలో పెట్టుకొని చూసినప్పుడు ఇప్పుడు చిన్నకథగా చెలామణి అవుతున్న దాని పూర్వరూపం 1912 లో మొట్టమొదటి సారిగా వెలుగు చూసినట్లు సాహిత్య విమర్శకులు నిర్ధారించారు. 1912 లో బందరు నుంచి వెలువడుతూ వచ్చిన 'ఆంధ్రభారతి' అన్న పత్రికలో ఆధునికమైన రూపరేఖలతో ఆ కథ వెలువడ్డది. భారతీయ భాషలలో మొట్టమొదట కథానిక వంగభాషలో వెలువడింది అయితే ఆ కథ వాస్తవానికి పంచతంత్రం కథలనే పోలిఉన్నది. ఒంటె, లోడేలు, ఎలుగుబంటి, గాడిద మొదలైన జంతువులన్నీ సృష్టికర్త వద్దకు పోయి, తమతమ అంగనిర్మాణ వైఖరిలోని లోటుపాట్లను విన్నవించుకొని పరితాపం పొందినట్లూ, ఆయా జంతువులన్నీ తమకు ఏయే అవయవాలు, ఎట్లెట్లా ఉండాలో కోరుకొన్నట్లూ, ఒకదానికి మిక్కిలి

ప్రయోజనకరంగా కనిపించింది మరొకదానికి ఏ విధంగా బాధక హేతువైందో అవి తమంతతాముగా విన్నవించుకొన్న మాటల్లోనే బోధపడి, మరి మాట్లాడకుండా వెళ్ళిపోయినట్లూ, ఆ కథ కల్పించబడింది అయితే వస్తువు పాతదే అయినప్పటికి, సంవిధానం కొత్తగా రూపించడంతో దానిని చిన్నకథగా వేత్తలు గుర్తించడం జరిగింది ఆధునికమైన విలువలతో, రూపరేఖలతో తెలుగులో మొదటికథ గురజాడ అప్పారావుగారే వ్రాశారని విమర్శకులు స్థిరీకరించారు 1914 వ సంవత్సర ప్రాంతంలోనే తణుకునుంచి ఒక కథల సంపుటి మదరాసు కథలనే పేరుతో వెలువడినట్లుగా శివశంకర స్వామి వ్రాశారు అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులు సంపాదకత్వం వహించిన త్రిలింగ పత్రికలో కూడా కథలను ప్రోత్సహించినట్లుగా తెలుస్తున్నది అటుతరువాతి సంవత్సరం ప్రత్యేకంగా కథలతోనే, కథలకే ప్రాధాన్యం ఇస్తూ ఒక మాస పత్రికను నిర్వహించాలన్న ప్రయత్నంకూడా జరిగింది కాని, ఆ ప్రయత్నం నెరవేరలేదు 1920 వ సంవత్సరంలో సాహితీ సమితివారు సాహితి మాసపత్రికను స్థాపించిన తరవాత తెలుగులో కథకు మంచి ప్రోత్సాహం లభించింది 1922లో బందరు నుంచి శారద, 1923 లో మదరాసునుంచి కళ, 1924 లో మద్రాసు నుంచే భారతి, 1926 లో గుంటూరు నుంచి సఖి మొదలైె సాహిత్య మాస పత్రికలు బయలుదేరడంతో చిన్నకథ బాగా రూపరేఖలు దిద్దుకొంది. తొలి రోజుల్లో వచ్చిన చాలా కథల్లో ఇతివృత్తం కాని, రచనావిన్యాసం కాని నవీనమైన ధోరణి నాశ్రయించలేదు చారిత్రక, పురాణ ఇతివృత్తాలను వచనంలో సంక్షేపంగా చెప్పి, వాటిని కథలుగా సాధించడంకూడా కనపడుతుంది వచనంలో చెప్పడం, సంక్షిప్తత మాత్రమే కథానిక ముఖ్యలక్షణాలుగా తొలిదశలో రచయితలు భావించినట్లుగా కనపడుతుంది అందరూ వ్యావహారిక భాషలోనే రచిస్తున్నామని చెప్పినా, ఆ భాష వ్యవహారానికి చేరువగా ఉన్నదని మాత్రమే చెప్పవచ్చునుగాని, పూర్తిగా వ్యావహారిక మనటానికి వీలులేదు గురజాడ అప్పారావుగారు సంఘ సంస్కర్తలను గూర్చి, సమకాలీన సాంఘిక స్థితిగతులను గూర్చి నాలుగైదు కథలు వ్రాశారు. మీ పేరేమిటి, దిద్దుబాటు, సంస్కర్త హృదయం మొదలైన కథలు శిల్పందృష్ట్యా చూసినా నేటికి మంచి కథలుగానే నిలిచిపోతాయి. అయితే, భాషమాత్రం ఇప్పటి దృష్టికి పాతగానే కనపడుతుంది.

అటుతరువాత సాహితీ సమితి సభ్యులందరూకూడా కథానికను సాహిత్య ప్రక్రియగా శిల్పసమన్వితమైన దృష్టితో దిద్దితీర్చినవాళ్ళే చింతా దీక్షితులు, నోరి నరసింహశాస్త్రి, చలం, విశ్వనాథ సత్యనారాయణ మొదలైన వాళ్ళంతా తెలుగుకథను తొలిదశలో రూపిస్తూ వచ్చారు. అటు తరువాత కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్, బుచ్చిబాబు మొదలైన వాళ్ళంతా తెలుగుకథను సుసంపన్నం చేశారు అయితే మొదటి నుంచీ తెలుగులో కథకులు వాస్తవికత పట్ల చూపవలసినంత దృష్టిని చూపినట్లుగా తోచదు. కథానిక కేవలం ఆధునిక సాహిత్య ప్రక్రియ కాబట్టి, సామాజికమైన దృష్టికి అత్యధికమైన ప్రాధాన్యం ఇవ్వటం సబబు ఇక్కడ సామాజికమైన దృష్టి అంటే వాస్తవికత అనే భావం ఉత్తమ కళాఖండంగానో, శిల్ప సౌందర్య పరమావధిగానో కథానికను రూపొందించే ప్రయత్నం చిత్రకళకు సంబంధించీ, కవిత్వానికి సంబంధించీ భాసించినంతగా కథకు నప్పదు కథను చదివి ఆనందించే పాఠకవర్గం బాహుళ్యాన్నిబట్టిచూస్తే కథ పాఠకులలో కలిగించవలసిన అనుభూతి, అనేది వాస్తవికతకు దగ్గరగా ఉన్నప్పుడే ఎక్కువగా సాధించగలదేమోననిపిస్తున్నది కవిత్వదృష్టి, భావుకతా, పాండిత్యప్రాగల్భ్యం చిన్నకథ కనవసరం సూటిదనము, విస్పష్టత, సంక్షిప్తత, కథ మొదలు పెట్టినప్పటినుంచి చిట్టచివరవరకు, పెంపొందే ఉత్కంఠతా చిన్న కథకు ముఖ్యం. అగ్ని పురాణంలో వచనకావ్యభేదాలను వివరిస్తూ- ఆఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథా, కథానికా అని పంచవిధాలైన గద్యకావ్యాలు పేర్కొనబడ్డాయి ఇవన్నీ కూడా కథాసాహిత్యానికి సంబంధించినవే. కథానిక లక్షణం అగ్నిపురాణంలోనే ఈ విధంగా నిర్వచించబడింది. 'భయానకం సుఖ పరం గర్భే చ కరుణోరసః, అద్భుతోంతే సుక్లప్తార్థోనోదాత్తా సా కథానికా.' దీన్నిబట్టిచూస్తే అతిదీర్ఘంగా ఉండగూడదు కథ. కథ చివరలో అద్భుతమైన సంఘటన ఉండాలి సుఖదుఃఖాలు రెండూ ఇతివృత్తంగా ఉండవచ్చు కరుణను కూడా చూపవచ్చు అంటే 'పాథోస్' అన్నమాట ఈ నిర్వచనాన్నిబట్టి చూస్తే కూడా చిన్నకథకు వాస్తవికత ప్రాణభూతమైన విషయం అని స్పష్టం.

సంగీతంలో శాస్త్రీయ సంగీతానికి, లలిత సంగీతానికి మధ్య అంతర మెంతో సాహిత్యంలో ప్రౌఢప్రక్రియకు, కథానికకు ఉండే అంతరం అంత అని చెప్పవచ్చు. కథానిక లలిత సంగీతం వంటిదన్నమాట. కథానిక ఎత్తుగడలో, నిర్వహణలో శిల్పం చూపకూడదని కాదుగాని, అన్నిటా వాస్తవికత పర్యవ

సిస్తేనే అది తన ప్రయోజనాన్ని ఎక్కువగా సాధించగలుగుతుంది వాస్తవికత అంటే కేవలం యథార్థమైన సంఘటనలు కాని, నూటికి నూరుపాళ్లు యథార్థాలుగా కనపడే సంఘటనలేకాని చిత్రించాలని కాదు అట్లా కేవలం యాథార్థ్యాన్నే ఆశ్రయిస్తే అవి దినచర్యా వృత్తాంతాలుగానో, మానవ జీవితంతో యాదృచ్ఛికంగానో అవగాహన కతీతంగానో సంభవించే సంఘటనల చిత్రీకరణంగానో రూపొందవచ్చు. కట్టుకథకన్నా కూడా ఒక్కొక్కసారి నిజజీవితంలోని యథార్థ సంఘటనలే విచిత్రంగానూ, విడ్డూరంగానూ కనపడవచ్చు 'కల్పన కన్నాకూడా సత్యమే ఒక్కొక్కప్పుడు విభ్రాంతిని కలిగిస్తుంది' అన్న ఆంగ్లసూక్తిలోని అంతరార్థం కూడా ఇదే కాబట్టి వాస్తవికత అనగానే విధిగా యథార్థమైన, లేదా సత్యమైన సన్నివేశ నిరూపణమే కానక్కరలేదు కథానికకూడా శిల్పకళారూపమే కాబట్టి కల్పనకు, ఊహకు, భావుకత్వానికి సముచితమైన స్థానం ఉండకపోదు. ప్రకృతి దృశ్యాలనుకాని, మానవ మూర్తులనుకాని ఫోటోతీసేటప్పుడుకూడా దానికి సంబంధించిన శిల్పము, నేర్పు చూపవలసే ఉంటుంది పనితనం ఉంటుంది. కళాకారుని కౌశలానికే అక్కడకూడా ప్రాధాన్యం ఎక్కువ వాస్తవిక చిత్రణ అంటే అధిక సంఖ్యాకుల అనుభవానికి విరుద్ధంగానూ, అతీతంగానూ ఉండక పోవడమే. ఒకవేళ ప్రత్యేకమైన మనస్తత్వాన్నో, మానవస్వభావాన్నో, సన్నివేశ ప్రాబల్యాన్నో చిత్రించవలసి వచ్చినప్పుడు, ఆయా పరిస్థితుల్లో ఆ ఉద్రేకాలు, చిత్తక్షోభం, మానసికావేశం సర్వమానవ సామాన్యంగా, స్వాభావికంగా, అనుభవంలోకి వచ్చేవే అన్న విషయం నిరూపించబడేట్టుగా రచన, పాత్రపోషణ ఉండాలి. అంతేకాని, మనస్తత్వ చిత్రీకరణం పేరుతోను, చైతన్యస్రవంతి పేరుతోను అస్పష్టతతో నింపివేయకూడదు భావదోరణి ప్రతీకాత్మంగా ఉన్నా, రచయిత తానుమాత్రమే వివరిస్తేతప్ప తెలియబడకపోతే, ఆ కళప్రయోజనం సరిగా సిద్ధించినట్లుకాదు అందువల్ల శిల్పకళాదృష్టి ఎంతవున్నా, వాస్తవిక దృష్టిని ప్రధానంగా పెట్టుకొంటే, ఏ ప్రయోజనాన్ని ఆశించి కళారూపాన్ని సృష్టిస్తామో ఆ ప్రయోజనానికి వైరుధ్యం కలగదు.

మొట్టమొదటినుంచీకూడా కల్పనకు, ప్రతీకాత్మకమైన ధోరణికి, సాంకేతికమైన విలువలకు, సిద్ధాంతాలకు ప్రాధాన్యం ఇచ్చినంతగా తెలుగు కథకులు వాస్తవికతకు ప్రాధాన్యం ఇవ్వలేదేమోననిపిస్తుంది.

నోరి నరసింహశాస్త్రిగారు రచించిన 'మరు విషయం' మంచికథ పేరు లోనే విషయనిగరణం ఉన్నది. ఇందులో ప్రాతిపదికమైన తాత్త్విక సత్యం త్రైకాలికమైన విలువలు కలది. ఈ కథానకము అత్యుదాత్తమైనదని శివశంకర స్వాముల వారభిప్రాయపడ్డారు ఇది నాది నాది అని వ్యక్తులు, జాతులు, దేశములు, పరమార్థం కానిదానికై పెనుగులాడి, నష్టపడి, కష్టపడి, పెద్దలైన వాళ్ళు బోధించినప్పుడు వివేకోదయమైతే, తామెంత అవివేకంగా కలహించారో తెలుసుకోవటం స్థూలంగా ఇందులో ఇతివృత్తం వెనక పురాణాలలో, ఇతిహాసా లలో అర్థవాదానికై వ్రాసిన కథల్లాంటిదే ఈ కథకూడా అంగదేశము, విదేహ దేశము ఇరుగుపొరుగు దేశాలు చాలాకాలంగా బద్ధమత్సరులై ఈ దేశాధిపతులు ఒకరితో ఒకరు కలహిస్తూ ఉంటారు ఈ రెండు దేశాలమధ్య పెద్ద ఎడారి ఉన్నది. ప్రధానంగా ఆ ఎడారిపైన ఆధిపత్యం ఎవరిదన్నదే కలహమాతృక వారి మధ్య ఒట్టి మరుభూమి అది అంతులేని ఎడారి. అయినా ఆ మరుభూమి గూర్చిన వివాద ఏమిటన్న వివేకం ఆ రాజుల ఎవరికిన్నీ కలుగలేదు ఒకసారి పెద్ద యుద్ధం జరిగింది అటు ఆ రాజు, ఇటు యీ రాజు ఎడారిలో తమ చతు రంగ బలాలతో మోహరించుకొని వచ్చారు అంతులేని ఆ ఎడారి మధ్య ప్రదేశంలో ఒక నందీశ్వర శిల్ప మున్నది. ఆ ప్రాంతంమాత్రం కొంతలో కొంత తృణకాష్ఠ జలసమృద్ధంగా ఉంటుంది. అది స్థల మాహాత్మ్యం. అక్కడ విశ్వామిత్ర గోత్రంలోని విశ్వామిత్రుడనే పేరుగల గొప్ప మునీశ్వరుడు తపస్సు చేసుకొంటూ ఉన్నాడు యుద్ధానికి తలపడి, అశేష సైన్యం నష్టం అనుభవిం చారు రెండు పక్షాలు ఒక రోజున యుద్ధవిరామంతో ఇద్దరు రాజులు విశ్వా మిత్రర్షిని దర్శించటానికి వెళ్ళారు. అప్పటికే అక్కడ విశ్వామిత్ర మహర్షిని మధ్యవర్తిగా ఉంచుకొని అంగదేశంనుంచి వచ్చిన పూర్వమీమాంసకుడు, విదేహనుంచి వచ్చిన ఉత్తర మీమాంసకుడూ వివాద పడుతున్నారు. ఇంతలో ఇద్దరు పిల్లలు చాలా ఉద్రేకంతో కలహించుకొంటూ అక్కడికి వచ్చారు. వాళ్ళ చేతుల్లో చినిగిన గుడ్డపేలికలాగా, పాతదైపోయిన రంగు కాగితం ముక్క లాంటిది ఒకటి ఉన్నది ఆ నందీశ్వర ప్రతిమ నోటిలోంచి దాన్ని వాళ్ల వెలికి తీశారు ఆ కాగితాన్ని విశ్వామిత్రర్షి ఆ పండితులతో చదివించాడు. పూర్వ మెప్పుడో తరతరాలనాడు అంగదేశాధీశుడు, విదేహరాజ్య రమావల్లభుడు పంచ భూతాల సాక్షిగా, మహర్షుల మధ్యవర్తులుగా వ్రాసుకొన్న సంధిపత్రం అది. ఆ నందీశ్వర ప్రతిమే తన చూపులతో రెండు రాజ్యాల సరిహద్దు నిర్ణయం

చేస్తున్నదని అందులో ఒడంబడిక వ్రాసుకొన్నారు ఆ రాజులు ఈ ఒడంబడికకు వ్యతిక్రమం జరిగితే ఆ ప్రాంతమంతా ఎడారి అయిపోతుందన్న శాపం కూడా ఉన్నది అందులోనే. దాంతో రాజు లిద్దరూ పశ్చాత్తాప పడ్డారు పండితు లిద్దరూ కూడా ఒప్పందం కుదుర్చుకున్నారు. ఇంతటితో కథ ముగుస్తుంది.

కథా ప్రారంభంలోనే ఒక అవాస్తవికమైన విషయం ఉన్నది. ఆ అవాస్తవికమైన సన్నివేశానికి తరవాత కథలో మళ్ళీ మళ్ళీ ప్రసక్తి ప్రాబల్యం రావటం కూడా విపరీతమే అనిపిస్తున్నది చారిత్రకమైన, పౌరాణికమైన సన్నివేశాలను ఇతివృత్తంగా స్వీకరించినప్పటికీ శిల్పదృష్ట్యాను, వస్తుదృష్ట్యాను అవాస్తవికతను పరిహరించవచ్చును అసలు కథ అంగరాజు ధర్మాసనం మీద కూర్చుని మహాధనికులైన ఇద్దరన్నదమ్ముల పంపకాల సంబంధమైన విచారణచేస్తూ ఉండటంతో ప్రారంభమవుతున్నది చాలా రోజులనుంచీ ఈ విచారణ సాగుతున్నది అహోరాత్రులు వారివారి ఆస్తిపాస్తుల నన్నిటిని స్వయంగా విచారించి పంపకాలు కుదురుస్తున్నాడు రాజు మరువిషయంలో వారికున్న భూముల గురించే ప్రధానమైన వివాదం పరిష్కరింపబడవలసి ఉంది ''మనుష్యులు ప్రవేశించుటకే కష్టసాధ్యమగు మరువిషయంలో ఆ సోదరులకున్న భూముల వివాదము ఇంకను వినుట తరువాయిగా ఉన్నది " తరతరాలుగా మరుభూమిగా ఉన్న ఆ ఎడారిలో వాళ్ళకు భూములు ఉండటం వింత. తరవాత అంగరాజు విదేహరాజుపైకి యుద్ధానికి బయలుదేరినప్పుడు ఆ శ్రేష్ఠి సోదరులు కూడా మరుభూమిలోని తమ తమ వివాద ప్రాంతాలను స్వయంగా చూపుతామని రాజుగారిని అనుసరించారట. అలా రాజుగారిని అనుసరించి వస్తూ, ''ఈ ప్రదేశము నాది—కాదు నాది' అని చెప్పుచు వివరించుచున్నారు'' అని వర్ణించటం వాస్తవికతకు భంజకం తరతరాలనుండి పాడుపడిపోయిన ఎడారి భూములను గూర్చిన వివాదం కాని, ఆ భూములను గూర్చిన యాజమాన్యం కాని సంభవం ఎట్లా అవుతాయి? అన్నది ఇక్కడ ప్రశ్న. అయితే కేవలం పనికిమాలిన, స్వప్రయోజనమైన వాటికోసం మానవులు వివేకహీనులై పోట్లాడుకొంటారు అన్నదానికి ఉపబలకంగా, భంగ్యంతరంగా, అర్థవాదంగా ఈ ఉపకథ చోటుచేసుకొన్నదని చెప్పవచ్చునేమో! కాని ప్రతీకాత్మకంగా వ్రాసినా, వాస్తవికతను దృష్టిలో పెట్టుకొంటే ఇంతకంటె

జాగ్రత్తవహించడం అవసరం శ్రేష్ఠి సోదరుల అవాంతరకథ లేకపోయినా ప్రధానకథ కేమీ భంగం కలగదు శ్రేష్ఠిసోదరుల వివాద విచారణతో కథ ప్రారంభమైంది కాబట్టి, కథ ముగింపుదాకా వాళ్ళ ప్రసక్తి కొనసాగింది. అందు వల్ల కొన్ని అవాస్తవికమైన సన్నివేశాలు కథలో చోటుచేసుకొన్నాయి

కొడవటిగంటి కుటుంబరావుగారి 'అక్క-పెళ్ళి' అన్న కథలో వారు చెప్పదలచిన దేమిటో తెలియదు. ఇది ఇతర భారతీయ భాషలలోకి అనూదితం చేయబడటానికి ఎంపికైన కథ కుటుంబరావుగారి కథలన్నీ అర్థవాదాలే. వారి సామాజిక, రాజకీయ దృక్పథాల, సిద్ధాంతాల ఆవిష్కరణమే వారి కథల పర మార్థం మానవ మనస్తత్వంలో వారికి సుపరిచితమైన విపరీత ధోరణులను ఆయనగారు తమ కథల్లో పాత్రలనుగా మారుస్తారు. ఈ దృక్పథం వాస్తవిక ధోరణికి విరుద్ధమైనటువంటిది ఇందులో ఒక గృహస్థుడు, ఇద్దరు కూతుళ్ళు ఆ కూతుళ్ళకు పరాన్వేషణకు సంబంధించిన ప్రయత్నాలు ఏ విధంగా పర్యవ సానం పొందాయో ఇతివృత్తం తండ్రికి పెద్దకూతురంటే ఇష్టం లేకపోగా, పైపెచ్చు ఒక విధమైన అయిష్టం కూడా ఉన్నట్లు, జుగుప్సతో కూడిన నిరా దరణ ఉన్నట్లు భార్య, భర్తను ఎత్తిపొడిచే మాటలనుబట్టి ధ్వనిస్తూ ఉంటుంది. చిన్నకూతురు పట్ల ప్రత్యేకమైన అభిమానం ఉన్నా పెద్దకూతురు తన అభిరుచు లకు, ఆశయాలకు అనుగుణమైన ప్రవృత్తిని కనపరచకపోయినా, కన్నతండ్రి కడుపున బుట్టిన కూతురిని నిరసించటం విపరీతం కథంతా చదివినా, పెద్ద కూతురిలోని దోషమేమిటో, చిన్న కూతురిలోని వైలక్షణ్యం ఏమిటో కూడా బోధపడక పోవటం ఈ కథలోని లోపం తండ్రి ఇద్దరు కూతుళ్ళను అనుమా నించే విషయంలో చూపే అంతరాలకు కథలో నిరూపణం లేదు చిన్నపిల్ల చాలా చురుకైనదనీ, పెద్దపిల్ల అంటే తండ్రి కిష్టంలేదని చెప్పినంతమాత్రాన అది మంచి కథ అయిపోలేదు "ఒక ఇంట్లో ఒక కుటుంబంలో ఉన్నమనుషులు ఒకరి నొకరు పరీక్షకుపెట్టి మార్కులువేస్తూ కూర్చోవటంతోనే సరిపోతే, ఇక వాళ్లు కలిసి జీవించే దెప్పుడు? ఒకరికొకరు సహాయపడే దెప్పుడు?" అంటాడు రచయిత. ఇలాగా కుటుంబంలోని అందరు వ్యక్తులు చిత్రవిచిత్రమైన మనస్త త్వాలతో ప్రవర్తించటం చాలా అవాస్తవికమైన విషయం. ఇందులో యజమాని పేరు శ్వేతాంబరం చాలా విడ్డూరంగా వుంది ఈ పేరు చాలా అవాస్తవికంగా ఉంది.

మొక్కపాటి నరసింహశాస్త్రిగారి 'ఆఖరిమాట' మంచి కథ. పార్థసారథి నాయుడనే వ్యాపారస్థుడు జీవితంలో చేసిన తప్పులన్నీ తలచుకొని తలచుకొని పశ్చాత్తాపపడి ఆత్మహత్య చేసుకోవటం ఇతివృత్తం అలాగా అంత ధనికుడు, వేరే చీకుచింత లేనివాడు అంతరాత్మ పెట్టే బాధకు ఓర్చుకోలేక ఆత్మహత్య చేసుకోవడం వాస్తవికమైన చిత్రణ కాదని కొందరంటారేమోకాని, అతడు పడిన బాధను, అతడు చేసిన ఘోరమైన తప్పుడు పనులు అతడి మనస్సుపైన ఎంత గాఢంగా పనిచేశాయో కథలో చాలా బాగా వర్ణించారు బీచిదగ్గర దిక్కులేని, అసహాయురాలై తననే నమ్ముకొని తనవెంట వచ్చిన ముద్దరాలిని, దుష్టకాముకుడై పార్థసారథి ఏ విధంగా చంపేశాడో హృదయవిదారకంగా చిత్రించారు రచయిత ఆ పిల్ల కొత్తగా బంధువులింటికి వచ్చింది ముక్కోటి ఉత్సవంనాడు తప్పిపోయింది రాత్రి చాలా పొద్దుపోయింది ఆ ప్రాంతపు భాష ఆమెకు రాదు రౌడీలు ఆమెను నిలవేసి భయపెడుతున్నారు ఇంతలో కారులో పార్థసారధినాయుడు ఆ దారిని రావటం తటస్థించింది ఆ పిల్లను రక్షించాడు మొదట ఆ అమ్మాయిని చూసినప్పుడు అతడికేమీ దురుద్దేశం లేదు ఆ పిల్లను వాళ్ళ యింటి దగ్గర దించివద్దామనే అనుకున్నాడు నెమ్మదిగా ఆమెకు నమ్మకం పుట్టేట్టుగా అభయమిచ్చాడు. కారు ఎక్కగానే అతడి మనస్సు మారిపోయింది నిర్మానుష్యమైన ఆ రాత్రివేళ, ఆ పిల్లను బీచి వొడ్డుకు తీసికొని వెళ్ళి కారు ఆపి, ఆమెను దిగమన్నాడు విపరీతమైన భయాందోళలను వర్ణించాలంటే, పై ప్రాణాలు పైనే పోయాయని వర్ణిస్తారు మామూలుగా ఆ పిల్ల కారు దిగడమే అట్లా దిగింది. అతడి దురుద్దేశం ఆ అమ్మాయికి అర్థమైపోయింది ఇసుకలో కూలబడింతర్వాత అతడామెను స్పృశించగానే భయంగా వణికిపోతూ, అతడివేపు చూసింది ఆ కళ్ళు పిచ్చిగా తనను చూడటం అర్థం చేసుకోలేకపోయినాడు పార్థసారథి ఆ కళ్ళలోంచి ఆ పిల్ల ప్రాణం పోయింది ఆ కళ్ళు అలానే పిచ్చిగా అతడివేపు చూస్తున్నాయి అతడి జీవితంలో ఈఆఘాతం అతణ్ణి వెన్నంటి తరిమింది ఇంకొకసారి తమ ఇంట్లో గొప్ప దోపిడి జరిగింది, దొంగ లెవరో తెలియదు ఇంటి ముందు ప్రశాంతంగా చెట్టుకింద కాపరం చేసుకుంటున్న కుటుంబాన్ని పోలీసులు నానా బాధలు పెట్టినా, పార్థసారథి నాయుడు కల్పించుకోలేదు పోలీసులా బిచ్చగాణ్ణి చావచితకగొట్టి జైల్లో వేశారు జైలునుంచి విడుదలై వచ్చి, ఘోరమైన జబ్బుపడి ఆ బిచ్చగాడు చనిపోయాడు నిజంగా అతడు దొంగ కాదని

తనకు తెలిసినా, దొంగే అని తనకు తెలియకపోయినా, ఆ అన్యాయాన్ని తాను సాక్షిభూతుడుగా చూస్తూ వున్నాడే కాని, చక్కదిద్దలేకపోయినాడు, తన జీవితంలో తనకేమాత్రమూ మనశ్శాంతి లేకుండా చేసి పట్టిపాలారుస్తున్న ఈ సంఘటనలను కొడుక్కు తెలియజేస్తూ, మానవత్వాన్ని ఎప్పుడూ కోలుపోవద్దని ఆఖరు మాటగా హెచ్చరిస్తూ, తండ్రి కొడుక్కు వ్రాసిన ఉత్తరం రూపంలో ఈ కథ ఉన్నది. ఈ కథ సమాజంలోని అన్యాయాలను, అక్రమాలను తీవ్రంగా నిరసిస్తున్నది హృదయాన్ని కదిలించివేసే శక్తితో సామాజిక ప్రయోజనాన్ని కూడా సాధిస్తున్నది పొయెటిక్ జస్టిస్‌ను రచయిత ఈ కథలో సాధించారు.

చింతా దీక్షితులు వ్రాసిన 'శిలాప్రతిమ' కథ ఈ సమాజానికి, ఈ యుగానికి చెందింది కాదు. అచ్చమైన కల్పనతో నిండిన కథ రాజుగారు కోట కట్టడానికిగాను జరిగే నరబలిలో, తనను తాను త్యాగం చేసుకొన్న వీరుడి కథగా రూప కల్పన చేశారు ఆ వీరుడి ప్రియురాలు విషాదాన్ని భరించలేక శిలా ప్రతిమ అయిపోయింది. ఇందులో వాస్తవికత ప్రసక్తేలేదు అతిమానుషములు, అమానుషములు, అద్భుతాలు అయిన సంఘటనలతో రూపొందిన కథలతో వాస్తవికతను ప్రమాణంగా చేసుకోలేము

తెలుగులో చిన్న కథ తొలినాళ్ళలో రూపరేఖలు దిద్దుకొంటున్న తరుణంలో సాంఘిక దృక్పథం ఎక్కువగా ఉండేదని చెప్పడం వాళ్ళను చిన్న పుచ్చటమేమీ కాదు ఆకృతి కూడా ఇదమిద్ధంగా ఏర్పడని ఆ రోజుల్లో ఇతివృత్తము, శిల్పము, నిర్వహణ మొదలైన వాటిలోనే వాళ్ళు నిమగ్నులై ఉండే వాళ్ళు. సామాజిక దృక్పథం, వాస్తవికత అప్పుడప్పుడే వాళ్ళను ఆకర్షిస్తూ ఉండేవి కళ'లో వచ్చిన కథానికలలో సామాజిక జీవనంలోను, కట్టుబాట్లలోను రావలసిన భావవిప్లవాన్ని గూర్చిన కథలు కొన్ని ఆ రోజుల్లో వెలువడకపోలేదు. ఎక్కువగా మగవాడు వెలిచవులు మరిగిన్ని, తాగుబోన్నూ అయి సంసారంలో సృష్టించే ఘోరాలూ, స్త్రీ సహనము, శాంతము చూపి వారిని చక్కదిద్దడము మొదలైన కథలే మొదటి రోజుల్లో ఎక్కువగా వెలువడేవి అయితే, వీటన్నిటా కొంత అతిధోరణి మాత్రం కనపడేది

తొలి రోజుల్లోనే శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు గొప్ప కథలు వ్రాశారు. వాస్తవికత, సామాజిక దృక్పథం వీరి కథల్లో తలస్పర్శిగా కనపడతాయి.

'డిప్రెషన్ - చెంబు' అన్న కథలో ఉన్న ఆస్తిపాస్తులను అమ్ముకొని, పెద్ద పెద్ద చదువులు చదివి, తగిన ఉద్యోగాన్ని పొందలేకా, వచ్చిన ఉద్యోగం చేయ లేకా ఆర్థికంగా నలిగిపోయిన మధ్యతరగతి కుటుంబాల మనస్తత్వాన్ని హృద యంగమంగా చిత్రించారు శివరామశాస్త్రిగారు శాస్త్రిగారు ఆధునిక భావాలు, దృక్పథము, గొప్ప వ్యుత్పత్తి ఉన్నవారు కావటంచేత విద్యాధికుల సమస్యలను, సున్నితమైన సాంఘిక సమస్యలను చక్కగా అర్థం చేసుకోగలిగారు ఆ రోజుల్లో డిప్రెషన్ వచ్చి ధరలన్నీ పడిపోయినయ్ రూపాయి పుట్టడమే కష్టమై పోయింది. రామారావనే యువకుడు ఆనర్స్ ప్యాసై, అతడికి నచ్చిన ఉద్యోగం దొరకక నిరుద్యోగిగా కాలం గడపటమూ, అతడికోసం కుటుంబ సభ్యులందరూ చేసే త్యాగము, ఆ విషయాన్ని అతడు గ్రహించలేక నిర్బాధకంగా తప్పించు కొని తిరగడము, చివరకు తన భార్యే కర్తవ్యోపదేశం చేయడమూ జాలి పుట్టేట్లు వర్ణించారు రచయిత తెలుగులో వచ్చిన చాలా తక్కువ గొప్ప కథల్లో యీ 'డిప్రెషన్ - చెంబు' ఒకటనటంలో సందేహం ఉండకూడదు. అయితే, శివరామశాస్త్రిగారు వ్యావహారికంలోనే రచన చేసినా, ఆ భాష ఇప్పటి కథానిక భాషగా కనపడదు ఇప్పటి వ్యవహారానికి, అప్పటి వ్యవహారానికి కూడా చాలా అంతరం ఉన్నట్లుగా అప్పటి కథలను, ఇప్పటి కథలను పోల్చిచూస్తే తెలుస్తుంది

విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన 'సప్తాశ్వం' లాంటి కథలు అర్థంగావు. ప్రతీకాత్మకమైన ధోరణి ఎక్కువ ఆయన కథల్లో కాని, 'ఏమి సంబంధం' వంటి చక్కని కథలను కూడా సత్యనారాయణగారు వ్రాశారు. సత్యనారాయణగారు గొప్ప కవితావేశము, భావుకతా ఉన్నవారు కనుక, ఆయన కథల్లో, ఆయన నమ్మిన సిద్ధాంతాలు, తాత్త్వికచింతన కూడా చోటు చేసుకోవటం చూడవచ్చు అటువంటప్పుడు, కథాసన్నివేశ ప్రాబల్యంకన్నా రచయితలు తాము నమ్మిన సిద్ధాంతాల ప్రచారాన్నే కథాకథనంలో ప్రధాన ధ్యేయంగా భావించవచ్చు ఆ సమయాలలో కథాసాహిత్యంలో వాస్తవికత దెబ్బ తింటుంది. ఇప్పుడు ఆధునికు లెందరో వ్రాసే కథల్లో యీ లోపం కనబడు తుంది. సంఘంలోని ఒక వర్గం వారి సమస్యను మాత్రమే చిత్రించటం వల్ల వాస్తవికతా దృష్టి ఈ కథల్లో పరిమితమైపోతున్నది ధనవంతులు దరిద్రులను కాల్చుకు తినడం ఈ వర్గం కథకుల అభిమాన వస్తువు. బలవంతులు బలహీను లను అణగద్రొక్కడం లేదనీ సంఘంలో నీతి, న్యాయం, సమానత్వం పొంగి

పొరలుతున్నాయని ఎవరూ అనరు, అనకూడదు ఎందుకంటే, అది అవాస్తవిక మైన ధోరణి కనుక అయితే, కరుణకన్నా కార్పణ్యం ప్రధాన స్థానం వహించ కూడదు ఇట్లా అంటే, అత్యంతాధునిక దృక్పథం ఉన్నవాళ్ళు ప్రత్యాఖ్యానం చేస్తున్నారు కరుణమార్గం మార్గమే కాదనీ, మనిషి మనసును ప్రభావితం చేసి తద్వారానే ఏ సంస్కరణమూ సాధించలేమని వారంటున్నారు. అందువల్ల సాంఘిక సమానతలను సాధించటానికి హింస ఒక్కటే మార్గం, ఆ మార్గం సుకరమూ, సుగమమూ కాకపోయినా, సాంఘిక శ్రేయస్సాధనకు అవశ్యమూ ఉపాదేయమూ అని వారి ప్రతిపాదన.

సాహిత్యం మనుషుల్లో సాంఘిక దురన్యాయాల పట్ల దృష్టిని ప్రసరింప జేసి, ఉన్నవారిలో మనఃపరివర్తనాన్ని తెచ్చి, లేనివారి కష్టాలను పంచుకొనే ట్లుగా చేయజాలదని, అట్లా ఎవరైనా విశ్వసిస్తే అది వారి అజ్ఞానమనీ ఆధు నికుల అభిప్రాయంగా కనబడుతుంది. ఆ విధంగా సాహిత్యానికా ప్రభావమే ఉన్నట్లయితే ఇన్ని వేల సంవత్సరాలుగా వెలువడిన ప్రబోధ సాహిత్యం ఏం సాధించ గలిగిందని వారు ప్రశ్నిస్తారు కాబట్టి సాయుధమైన విప్లవమే సాంఘిక శ్రేయస్సాధనకు మార్గంగా కొత్తగా పుట్టిన రచయితల వర్గం వారు భావిస్తూ, అట్టి సాహిత్యం రచించడమే తమ ధ్యేయంగానూ, అటువంటిదే ఉత్తమ సాహిత్యం కాగలుగుతుందనీ ప్రచారం చేస్తున్నారు అంతేకాని, మనిషి యొక్క మనఃప్రవృత్తిని ధర్మపన్నాల వల్లను, నయబోధ వల్లను మార్చ లేమనీ, అలా మార్చవచ్చునన్న ప్రచారమూ, నమ్మకమూ శాశ్వతంగా దగా పడినవారిని మోసగించడమే ననిన్నీ సిద్ధాంతీకరిస్తున్నారు సాహిత్యం ద్వారా మానవ మనఃప్రవృత్తిలో మార్పును తీసుకొని రాలేమని చెపుతూ తమ సిద్ధాంత ప్రచార సాధనంగా సాహిత్యాన్నే ఆశ్రయించడం స్వవచన వ్యాఘాతంగా కనిపి స్తున్నది ఇది వాస్తవికమైన ధోరణి కాదు సాహిత్యం కూడా సంఘాన్ని ప్రభా వితం చేయగలదన్న నమ్మకం ఉండబట్టే తమ నమ్మకాలను, సిద్ధాంతాలను కథానికారూపంగానూ, కవిత్వరూపంగానూ ఆధునిక రచయితలు ప్రచుర పరుస్తున్నారు. అతి నవ్య ధోరణి నాశ్రయించిన కథకులు కొందరి కథల్లో, సంఘంలో ఒక వర్గంవారు సాగిస్తున్న దోపిడీ విధానానికి బక్కవాళ్ళు ఎలా బలి అయిపోతున్నారో చూపటమే ప్రధానేతివృత్తంగా ఉంటున్నది. అవినీతి, స్వార్థపరత్వం, అతికాముకత్వం, హింసాత్మక ప్రవృత్తి సంఘంలో ఏ విధంగా

చెలామణి అవుతున్నాయో సాంఘికంగా గాని, రాజకీయంగాకాని అటువంటి దుష్ట శక్తుల నిగ్రహించే ప్రయత్నాలు కూడా ఏ విధంగా లేకుండా పోతున్నాయో చూపే కథలు వ్రాస్తున్నారు. ప్రధానంగా వీళ్ళు వ్రాసే కథలలో వీళ్ళు నమ్మిన రాజకీయ సిద్ధాంత ప్రాబల్యం కానవస్తుంది ఇంకా కొందరు చైతన్యస్రవంతి అనబడే ధోరణిలో శిల్ప ప్రాధాన్యంగా కథలు వ్రాస్తున్నారు ఈ కథల్లో వాస్తవికతను నిరూపించే ప్రయత్నం ఫలితాన్ని ఇవ్వలేదు ఎందుకంటే, వాస్తవికత అనే లక్షణం ఆత్మాశ్రయమైన అనుభవాన్నో, అనుభూతినో ఆధారం చేసుకొని ఉంటుందాకథల్లో అనంతమైన ప్రకృతులున్న, విశాల రంగస్థలమైన ఈ ప్రపంచంలో దేనినీ అవాస్తవికమనే అవకాశం కూడా ఉండదు అయితే, ఏదైనా సన్నివేశాన్ని గాని, సంఘటనను గాని, సంఘర్షణను గాని కథావస్తువుగా స్వీకరించినప్పుడు శిల్పం దృష్ట్యా కాని, ఇతివృత్తం దృష్ట్యా కాని అధిక సంఖ్యాకుల అనుభూతికి అది చేరువగా ఉన్నప్పుడు వాస్తవికత ఎక్కువగా ఉంటుంది

ఇప్పుడు ఔత్సాహికులు వ్రాసే కథల్లో బొత్తిగా వాస్తవికత ఉండటం లేదు. కల్పనకు ప్రాధాన్యాన్ని ఇచ్చి, యాథార్థ్యాన్ని పట్టించుకోవటంలేదు. అభూతకల్పనలు, హఠాత్సంభవాలు, కొసమెరుపు కథలు ఎక్కువగా వ్రాస్తున్నారు. ఆధునిక కాలంలో మనం ఎదుర్కొంటున్న సాంఘిక సమస్యలుగాని, రాజకీయ సమస్యల పరిజ్ఞానం గాని కొత్తగా వ్రాసే కథకుల దృష్టిని ఆకర్షించటం లేదు తరుణ వయస్కుల ప్రేమ వృత్తాంతాలు, నిరాశలు, ఉద్రేకాలు వారపత్రికల్లో వెలువడుతున్న కథల్లో నూటికి ఎనభై వంతుల్లో చోటు చేసుకుంటున్నాయి. సామాజిక సమస్యల స్వరూపం బాగా అర్థమైతే తప్ప, కథల్లో వాస్తవిక దృష్టి బాగా చోటు చేసుకొనేందుకు అవకాశం ఉండదు.

(శారదామంజీరం - 1972).

# నవల–వస్తువు

నవల వ్రాసేటప్పుడు ఇతివృత్తాన్ని ఈ విధంగా ఎంచుకోవాలని ఎవరు చెప్పగలుగుతారు? వైయక్తికమైన అనుభవాలను వివరించవచ్చు కాని, నవలా రచనలో ఇతివృత్తం ఇట్లా ఉండాలని కాని, ఇట్లా ఉంటే బావుంటుందని కాని, సలహాలు, చిట్కాలు చెప్పటం కష్టం నవల గూర్చి చెప్పగలిగితే కథను గూర్చి, కవిత్వాన్ని గూర్చి చెప్పగలము అప్పుడు చిత్రలేఖనాన్ని గురించి, శిల్పం గురించి కూడా చెప్పవచ్చుకదా! కాబట్టి స్థూపజ్ఞంగా, తన మనసులోని సంచల నాన్ని, ఆర్తిని, తన మనసులో పుట్టిన భావాలను ఆకృతి ధరింపజేసి, ఇతరు లకు కనపరచాలన్న తీవ్రమైన ఆసక్తి, తపన, అట్లా చేసినప్పుడు, స్వాంత స్సుఖమూ, ఉపశాంతి, బరువు తీరిపోయిన అనుభూతి ఏ కళాకారుడికైనా ప్రాథమికంగా ఉండవలసిన లక్షణాలన్నమాట! సాధనవల్ల కొంత దూరం వెళ్ళిన తరవాత ప్రయత్నం లేకుండానే, కవిత్వం చెప్పవచ్చు కథ వ్రాయవచ్చు, బొమ్మ గీయవచ్చు, కాని తన మనసు వినిపించాలని, తన గొంతు పెకలించా లని, అంతరాంతరాలలో ఒక ఉత్కంఠ, ఉత్సాహం తప్పక ఉండాలన్న మాట! "గుండె గొంతుకలోన కొట్లాడుతాది, కూకుండ నీదురా కూసింత సేపు" అనే భావం ఇదేనన్నమాట! ఇరుసంజలు రంగుల వాకిటుల్ అన్నాడు కవి ఉమర్‌ఖయ్యాము ఉదయ సంధ్య చూడండి తూర్పు దిక్కున ఆకాశం నిండా కాషాయ వస్త్రాలు ఆరవేసినట్లు మబ్బులు, నీలపుమబ్బుల కొసలవెండి జరీ అంచుల్లా, ఉదయకిరణాల సోగ వెలుగులు. ఎర్రటి పట్టు సెల్లాల తెరలు తొలగించుకొని కర్మసాక్షి రంగ ప్రవేశం చేస్తాడు. మళ్ళీ పడమటి దిక్కున ప్రతిరోజూ ఇదే నాటకం. సాయం సంధ్య ఎంత బావుంటుంది! పడమట ఆకాశంలో రంగురంగుల మబ్బులన్నీ గుములు గూడుతాయి. వాటిని నా చిన్న తనంలో ఎవరు చెప్పారో గుర్తులేదుకాని గంధర్వుల మేడలని చెపితే నిజమేనని నమ్మే వాణ్ణి నమ్మినా ఎంతో ఆనందంగా ఉండేవి ఆ దృశ్యాలు. రంగురంగుల వాకిళ్ళలోంచి ఒక దాంట్లోనుంచి వచ్చి ఒక దాంట్లోనుంచి వెళుతున్నాడు సూర్యుడు. కవి మాత్రమే చూడగలిగిన దృశ్యం ఇది. ఇదే విధంగా కవిత

వ్రాసినా, కథ వ్రాసినా, నవల వ్రాసినా, మరే కళాకృతిని సృష్టించినా తన చుట్టు ఉన్న ప్రపంచాన్ని, అంటే ప్రకృతిని, మనుషులను, సంఘటనలను, సంఘర్షణలను, చర్మచక్షువులతోను, మనో నేత్రం ద్వారాను, గుచ్చిగుచ్చి పరిశీలనగా చూడటం చాలా ముఖ్యం.

అట్లా చూసినప్పుడు మన మనసులో ఒక అనుభూతి, ఒక సంచలనం కలగాలి. కలిగినప్పుడు దాన్ని వ్యక్తీకరించాలి వ్యక్తీకరించగలిగితే రచయిత లేకపోతే కేవలం ప్రేక్షకమాత్రుడు. బాగా సంగీత పరిజ్ఞానం వున్నవాళ్ళు, అభిరుచివున్నవాళ్లు, మంచి సంగీతం వినపడినప్పుడూ లేక ఉరకలువేసే ఉత్సాహం వచ్చినప్పుడూ కూనిరాగాలు తీస్తారు తల ఊరికే ఆ లయను ఆస్వాదించే సూచనగా తిప్పుతుంటారు. ఆ ప్రయత్నంగానే వాళ్ళ మనస్సులో ఆ ప్రతిచలనం కలుగుతున్నదన్నమాట. అట్లానే ప్రపంచాన్ని మనం చూస్తున్న సన్నివేశాలలో, పుస్తకాల ద్వారా అర్థం చేసుకొంటున్న సంఘటనలలో గొప్ప సౌందర్యాన్ని చూసినప్పుడు, ఈర్ష్యాద్వేషాలను చూసినప్పుడు, త్యాగాన్ని చూసినప్పుడు, ప్రేమను దర్శించినప్పుడు కథా వస్తువును మనస్సులో కల్పన చేసుకోవాలి అట్లా అట్లా దాన్ని విస్తరించాలి, ఏ కథలోనూ, ఏ నవలలోనూ, ఆయా పాత్రల మూల ప్రకృతులు కనీసం ఛాయా మాత్రంగానైనా రచయిత అనుభవంలోకి రాకుండా ఉండటానికి అవకాశంలేదు. దీనికి పూర్తిగా అపవాదాలు ఉండ వనటానికి వీల్లేదుకాని, కనీసం ఏ పుస్తకాలలోని పాత్రలనుంచైనా ప్రేరణ లేకుండా, ఏ రచనా ఎవరూ చేయలేరు. ముఖ్యంగా సాంఘికేతివృత్తం ఎన్నుకొంటే, ప్రత్యక్షంగా కాకపోయినా, ఎక్కడెక్కడో, ఎప్పుడెప్పుడో, మన మనసులో కొన్ని భావాలు, అనుభూతులు ప్రవేశించి, అవి మనం మరచిపోయిన తరువాతనైనా మనకు తెలియకుండానే రచనలోకి రావచ్చు మరీ ప్రాథమిక దశలో, ఊహాగానం ఎక్కువై, పూర్తిగా కల్పనలతోనే నిండిన రచనల్లో తప్ప, ఈ రచనల్లో సైతం ప్రత్యక్ష ప్రపంచ ప్రభావం లేకపోయినా, పరోక్షంగా ఏ రచయితో, ఏ శైలో, ఏదో వొక ప్రభావం లేకుండా, ప్రేరణ లేకుండా రచన చేయరు ఎవరూ. అయితే ఊహ, కల్పన, భావావేశము తప్పకుండా ఉంటాయి. లేకపోతే అవి రచన లనిపించుకోవు 'Truth is Stranger than fiction' అంటే కట్టుకథలకన్నా, గడ్డు సత్యాలు విచిత్రంగా ఉంటాయన్న లోకానుభవాన్ని నిరూపించే సూక్తివున్నా, మనం నిత్యం చూసే చిత్ర విచిత్రాలైన

జీవిత సత్యాలకన్నా, వేన్నీళ్ళూ చన్నీళ్ళు లాగా, ఎండావానాలాగా, కల్పన జోడించిన కథ మాత్రమే మనకు నచ్చుతున్నది

యథాతథంగా మనకు తెలిసిన సంఘటనలను, సన్నివేశాలను, వ్యక్తులను దృష్టిలో పెట్టుకొని వ్రాయకూడదు అయా వాటి ప్రేరణ ఉండవచ్చు. యథాతథంగా వ్రాస్తే, మన దృష్టి, మనం తీసుకొనే ఇతివృత్త పరిధి - అంటే 'కేన్వాసు' సంకుచితమైపోతాయన్న మాట!

ఒకసారి ఒక గడియారం కొందామని, గడియారాల షాపులోకి వెళ్ళాను. షాపులో అడుగుపెట్టేవారి దృష్టి ఆకర్షించటానికన్నట్లు, కాలం విలువ తెలుసుకోండి అని హెచ్చరించటానికన్నట్లు అందమైన సూక్తి, చక్కని గిల్టు అక్షరాలతో, కంటిని ఆకర్షించే విధంగా ప్రదర్శించాడు యజమాని. ఒక నేమ్‌ప్లేట్, దానిమీద ఆ సూక్తి వ్రాసి చూసేవాళ్ళ కళ్ళ ఎదుట వేలాడగట్టారు.

ఆ సూక్తి ఇది "It is strange how Men find time to hate, when life is too short for love." ఈ వాక్యం గుర్తువచ్చినప్పుడల్లా కొన్ని పాత్రలు సృష్టించుకొని, అందమైన కథో, నవలో వ్రాయాలనిపిస్తుంది. ఒకసారి ఒక మారుమూల గ్రామం, చాలా పల్లెటూరు ఎందుకో వీధిబడికెళ్లాను వీధిబడిలో వెలసిపోయిన నల్లబల్ల మీద ఇంగ్లీషు పారం కాబోలు వ్రాశాడు మేష్టారు. ఆ టీచర్‌కి ఇరవై ఏళ్ళు కూడా ఉండవు. ఆ పిల్లలు పది మంద్రైనా ఉన్నారో లేదో. ఐదో తరగతి క్లాసది

"Boats sail on the rivers
And ships sail on the seas
But clouds that sail across the sky
Are prettier far than these."

—అన్నవి ఆవాక్యాలు. వాళ్ళ ఊరికి సక్రమమైన కారు రోడ్డుకూడా లేదు. పన్నెండు మైళ్ళ దూరాన కాని రైలు కనపడదు ఆ వీధి బడి, ఎండ, నేలమీద కూలబడి. ఆ పారాన్ని పిల్లలు వ్రాసుకొని- అర్థం పర్థం మనసుకి పట్టించుకోకుండా వల్లించటం, ఆ టీచర్‌కైనా ఆ పద్యంలోని అనుభూతి అర్థమవుతుందో

లేదో! ఎప్పుడో తరువాత కథలోనో, నవలలోనో, ఏదో సందర్భానికి గుదిగుచ్చి ఈ సన్నివేశం వర్ణించాలి ఒక కుర్రాడు చింపిరి తలతో, చీమిడి ముక్కుతో ఆ బళ్ళో చదివి ఇంతింతై ఆంతంతై పెద్దవాడై విమానంలో వెళుతూనో, సముద్రంలో పెద్ద ఓడమీద ప్రయాణం చేస్తూనో, చిన్ననాటి వీధిబడి పంతుల్నీ, ఆ పద్యాన్నీ గుర్తు చేసుకున్నాడంటే సరిపోదా? మనకు కళ్ళుండాలికాని, కళ్ళ ముందు ఎంత విచిత్రమైన నాటకం జరుగుతున్నది! 'చూడచూడ రుచుల జాడ వేరు!' ఖగోళశాస్త్రాన్ని గూర్చిన ఒక తెలుగు పుస్తకంలో నక్షత్రాలనిగూర్చి ఋగ్వేదంలో ఇలాంటి వర్ణన ఉన్నదని చదివి హృదయం గొప్ప ఆనందంతో నిండిపోయింది. "కాలపురుషుడు ఆకాశపు నడవాలో ముత్యాలన్నీ వొలక పోసుకొని రాత్రిపూట ఏరుకోలేక ఉపేక్షించినట్లున్నాయి నక్షత్రాలు" చాలా బాగాలేదా ఈ దృశ్యం! "రాత్రి అనే గుర్రాన్ని ముత్యాల జాలర్లతో మహా ఆర్భాటంగా అలంకరించి నట్లున్నది ఆకాశములోని నక్షత్రాలను చూస్తే" అనీ ఋగ్వేదంలో ఉన్నదట. నల్లటి గుర్రానికి తెల్లని ముత్యాలదండలు అలంకరిస్తే ఎలా వుండేను? మనచుట్టూ ప్రకృతినీ మానవ ప్రకృతినీ, పరిశీలించాలి బాగా ఇతివృత్తం దానంతట అదే స్ఫురిస్తుంది ఎర్రటి ఎండాకాలం ఒక ఈళ్లో ఒక వింత దృశ్యం చూశాను ముచ్చటైన రామచిలకల పదువు వేపచెట్టుమీద వాలాయి. అందులో రెండు అందమైన ఆకుపచ్చ పట్టుకుచ్చుతోక ఈకలెత్తి, వేపకాయలు కొరికి, అందులో రసం మాత్రంపీల్చి, విత్తులతోసహా పెచ్చులను కిందికి పడ వేస్తున్నాయి ఏం ఖర్మ! ఏం చిత్రం! చూడచక్కని జామ పళ్ళను, దానిమ్మ పళ్ళను, సపోటాలను ముక్కుతో పొడవ్వాలసిన రామచిలకలు వేపకాయలను, వేపపళ్ళను కొరకటం, అంటే ఋతుధర్మం! ఎర్రటి ఎండాకాలంలో ఆ పళ్ళన్నీ ఉండవేమో? అట్లానే శిశిర వసంతౌ పునరాయాతః అని పెద్దలన్నారు ఆకు రాలిన మోడులే నవనవలాడుతూ, చిగుళ్ళ సింగారపు చీరలు కట్టుకుంటాయి. పూలసొమ్ములు పెట్టుకుంటాయి మానవజీవితం కూడా ఇంతే! కష్టాల తరువాత సుఖాలు వస్తాయి ఈ కష్టాలొస్తాయని మనమనుకున్నామా, ఆ సుఖాలు రావను కొనేందుకు? అంచేత ఆశ పెంచాలి. నూరు శరత్తులదాకా చూడాలని కోరు కోవాలి మళ్ళీ జామపళ్ళ కాలం రాదా రామ చిలుకలకు? ఈ ఆలోచనలు అట్లా అట్లా అల్లుకోగా నవల వ్రాశాను. నా భావ వినిమయంలో వాస్తవికత ఉన్నదో లేదో, సత్యం ఉన్నదో లేదోకాని, పరిశీలన వల్లనేకదా? మనస్సులో ప్రేరణ కలిగేది. రైల్లో, కార్లో, వీధిలో, మనచుట్టూ చిత్ర విచిత్రమైన ప్రకృతులు ఆ పరిశీలనాత్మక దృష్టి ఉంటే తప్ప ఇతివృత్తం దొరకదు

ఒకసారి సిటీబస్ ఎక్కుతూవుండగా, ఎక్కిన తరువాతనో, ఎక్కబోతూ ఉండగానో కండక్టరు దింపేశాడు అప్పుడు ఆడవాళ్ళ సీట్లు వెనకనే ఉండేవి కిందకు దిగి నిలబడగానే బస్ వెళ్ళిపోయింది మనసులో మెరపులా ఒక సన్నివేశం మెదిలింది. ఆ బస్‌లో అందమైన నవనాగరికత ఉట్టిపడుతున్న, విద్యావతి అయిన, చల్లని, అమాయకమైన కళ్ళతో చూస్తూ ఒక తరుణి కూచుని వుంది పరిగెత్తుకొనివచ్చి ఆత్రంతో, జాలిచూపులతో, అందదేమో నన్న భయంతో, అలసటతో, చిక్కిపోయిన, తడబడే చూపులుగల యువకుడొకడు వచ్చి, ఒక్కగంతున ఎక్కి, తన కళ్ళను నమ్మలేనట్లు, నిప్పుమీద కాలేసినట్లు, ఎక్కుతూ ఉండగనే కనపడే సీటుమీద కూచునివున్న ఇందాకటి యువతిని చూశాడు వెంటనే గుర్తుపట్టాడు కొరడాతో చెళ్లున కొట్టినట్లు అప్పుడే కదులుతున్న కార్లోంచి ఆత్రంగా దిగి జారిపోయినాడు. 'గెటిన్' అన్ని కండక్టరు హెచ్చరిస్తున్నా వినిపించుకోలేదు కారు కదిలింది ఆ కుర్రాడు అక్కడే ఉండిపోయాడు. ఇక కథా కథనం ఏమిటంటే, ఆ అందమైన యువతి అక్కయ్య. ఈ ఆత్రంగా దిగిపోయినవాడు తమ్ముడు చితికిపోయిన మధ్యతరగతి కుటుంబంలో, తల్లిలేని సంసారంలో, అదృష్టవశాత్తూ గొప్పింటి అంటే డబ్బున్న సంస్కారవంతుడు ప్రేమిస్తే ఎలాగూ తండ్రీ, తమ్ముళ్లూ తన పెళ్ళి చేయలేరని ప్రేమించిన శాఖాంతరపు యువకుణ్ణి, (కులాంతరం అప్పటికి నాకిష్టంలేదు.) గుళ్ళో పెళ్ళి చేసుకొని, మహానగరానికి అతడివెంట లేచి వచ్చేసింది లేచిపోయిందని కొందరు కిట్టనివాళ్ళన్నారు. ఏ ఊరు పోయిందో, ఎక్కడ ఊరేగిందో, ఎవరికి పట్టిందో? తమ్ముడు ఆ నగరానికే ఉద్యోగం వెదుక్కుంటూ వచ్చాడు. ఇదిగో, ఇక్కడ సిటీబస్సులో అనుకోకుండా అక్కను చూశాడు అక్క మంచి గంధంలా చల్లనిది. మల్లెపూవ్వులా స్వచ్ఛమైంది తమ్ముడు గంగిగోవు! అలా ఎందుకు చేసిందని మనసునిండా దుగ్ధ అక్క కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి ఆ రాత్రి భర్త గుండెపైన తలచేర్చి భోరున ఏడ్చింది. నా వాళ్ళకు నాతో పీల్చేగాలి పంచుకోవటం కూడా ఇష్టం లేకపోయింది అని అతడు మంచివాడు కాబట్టి వోదార్చాడు. "పిచ్చిదానా, నేనులేనా? కనుక్కుంటానులే"అని తమ్ముడు కూడా ఆ రాత్రి తన చిన్ననాటి నేస్తుడి గదిలో పరిపరి ఆలోచనలతో నిద్రపోలేకపోయినాడు. తరవాత ఎంత కథో నడుస్తుంది ఈ నవల కొత్తబాట. ఆవాళ ఆ సిటీబస్సులోంచి, చప్పున వెనక్కుదిగి పోవటం ప్రాతిపదికగా అలా అలా అల్లుకొనిపోవడం జరిగింది. అయితే, సామాజిక దృక్ప

థమూ, సామాజిక సమస్యల ప్రతిపాదన లేకుండా, ఊహాలోకంలో విహరిస్తూ, కల్పనలను ఆశ్రయిస్తూ, ఏవో ప్రేమకథలూ, మధ్యతరగతి సంసారికేతి వృత్తాలు, సెంటిమెంట్లతో మలుపులు, కరుణరస సన్నివేశాలు, ఇవి ఉత్తమమైన ఇతివృత్తాలవుతాయా అంటే, అవుననీ, కాదనీ చెప్పడం కష్టం. రచయిత ఎప్పుడూకూడా తన అనుభవానికి చేరువకాని సన్నివేశాల, సంఘటనల, పాత్రల జోలికి పోకూడదు మద్య మందిరాలు, వ్యభిచార గృహాలు, క్లబ్బులు, ఖరీదైన కార్లు, కరవొచ్చే కుక్కలూ గూర్చి వ్రాస్తే మంచి నవల అవుతుందనుకోవడం భ్రమ ఇవన్నీ సత్యాలు కావచ్చు కాని,సాహిత్యం కావటానికి రచయిత చాలా గొప్ప ప్రతిభకలవాడై ఉండాలి ఉన్నా ఆ స్థాయి జీవితంతో పరిచితి, దగా పడిన జీవితాలపట్ల సానుభూతి, ఆర్ద్రమైన చిత్తవృత్తితో వాళ్ళనుగూర్చి వ్రాయా లన్న కోరికా ఉండాలి

తనకు చేతనైనంతవరకైనా, తనచుట్టూ మనుషులను, వాళ్ళ ప్రవృత్తులను అర్థం చేసుకోవాలి. అర్థం చేసుకోకుండా, పుస్తకాలు చదివిన జ్ఞానంతోను, వాళ్ళూ వీళ్ళూ చెప్పిన జ్ఞానంతోను వ్రాయకూడదు ప్రపంచ సాహిత్యంలో ఉత్తమోత్తమ రచనలుగా ప్రసిద్ధికెక్కిన గ్రంథాలు సమర్థులైన రచయితలెందరో తెలుగు చేశారుకదా! అవి చదివితే వింత ప్రపంచపు విచిత్రద్వారాలు మన కళ్ళ ముందు తెరుచుకొంటాయి హోవర్డ్ ఫాస్ట్ రచించిన 'స్పార్టకస్' అన్న నవల చాలా గొప్పది ఆకెళ్ళ కృష్ణమూర్తి అన్నవారు అద్భుతంగా తెలుగుచేశారు చాలాకాలంక్రితం రోమా రోలండ్ అన్న మహారచయిత వ్రాసిన జేన్ క్రిస్టోఫ్ అన్న నవలను విద్వాన్ విశ్వం తెలుగు చేశారు. ఛార్లెస్ డికెన్స్, టాల్‌స్టాయ్, జేన్ ఆస్టిన్, సోమర్‌సెట్ మాం మొదలైనవారి రచనలు తెలుగులోకి వచ్చాయి శరత్, టాగోర్, ప్రేమచంద్‌ల రచనలు వచ్చాయి,మనకు విశ్వనాథ, బాపిరాజు, గోపీచంద్, బుచ్చిబాబు ఎందరో వున్నారు బాగా చదవడమూ, ప్రపంచాన్ని ఆసక్తితో, నిశితంగా పరిశీలించడమూ ముఖ్యం

అయినప్పటికీ "No writer duplicates nature, no writer could If a writer presumed to follow a human being through even one day of his life, reporducing on paper everything that happened to this person, everything that occupied or intruded upon his consciousness, everything he saw, felt, tasted, was aware of everything he said, everything he re- called out of his past - if a writer presumed to such a task,

he could fill hundreds of sheets of paper and still never come to an end if he did accomplish the task, the product would hardly be art but rather a detailed and pointless gibberish "

"As I noted before, art is a synthesis, the artist is not and never can be a machine His product is creative, he is the creator and he works with the materials of life.

(Literature and Reality-Howard Fast-1952 Page 32 Peoples Book Home Ltd Bombay )

కాబట్టి రచయిత ఫోటోగ్రాఫర్ కాదన్నమాట రచన ఫోటోగ్రాఫీ కాదు. రచన చిత్రకళ వంటిది. ఇతివృత్తం మన జీవితానుభవాన్ని బట్టి, సాహిత్య సంస్కారాన్ని బట్టి; మనం చూసీ, మాట్లాడి, లావాదేవీలు జరిపిన మనుషులను బట్టి మనకు లభిస్తూ ఉంటుంది

ఇప్పుడు మన సామాజిక సమస్య లేవి?

సంఘంలో కొందరు ఎందుకు బాధపడుతున్నారు? కొందరు ఏవిధంగా అందరినీ మించి సుఖపడుతున్నారు? ఈ రకమైన పోటీ, పరస్పరం మోసగించు కోవాలన్న ప్రయత్నాలు, ఆడపిల్లల పెళ్ళిళ్ళు, వరాన్వేషణలు, కట్నాలు, డబ్బున్నవాళ్ళ మదం, సంస్కార హీనత్వం, క్షుద్రమైన రాజకీయాలు, పరువు ప్రతిష్టల కోసం పెనుగులాటలు, అధికారుల అవినీతి, ఆశ్రిత పక్షపాతం, మదాంధత - ఇవన్నీ ఇతివృత్తాలుగా మలుచుకోవచ్చు కరుణ, హాస్యము సాహిత్యానికి రెండు కళ్ళు.

రెండూ ఉంటే చాలా మంచిది ఒకటైనా ఉంటే కొంతవరకు నెట్టుకొని పోవచ్చు. మనిషిలో కొంత ఆలోచనను ప్రేరేపించి, మనసు మెత్తపరచి, ఓర్పును, సహనాన్ని, మనిషి చేసే తప్పులను దిద్దే ప్రయత్నాన్ని అందించే కథగాని, నవలగాని ఉత్తమస్థాయిలోకి చేరుతుంది

వెనక తరాలను గూర్చిన అవగాహన, ముందు తరాలను గూర్చిన బాధ్యత రచయితకు ఉంటే మంచిది కవులకన్నా కథకులకు, నవలారచయితలకు సమకాలిక సాంఘిక సమస్యలపట్ల సమ్యవగాహన ఎంతైనా అవసరం

కవులు, అంటే సామాన్యార్థంలో రచయితలు శాసకు లన్నమాట నిజం. సాంఘిక చైతన్యాన్ని ప్రబోధించేది వీళ్ళే సాంఘిక చైతన్యంపైననే పరిపాలకుల మంచిచెడ్డలు, అంటే దేశ రాజకీయాల స్థాయి ఆధారపడి ఉంటుంది. ప్రజల సామాజిక జీవనమూ తద్వారా నిరూపణం అవుతుంది. (స్రవంతి - 1972)

# తెలుగులో మహిళలు సృష్టించిన సాహిత్యం

అన్ని దేశాల్లో అన్ని రంగాల్లో పురుషులతోపాటు మహిళలు కూడా ఘన కార్యాలు సాధించినట్లుగా, తెలుగు దేశంలో కూడా ఘనత వహించిన స్త్రీలు లేక పోలేదు రాణి రుద్రమ్మ, వీరపత్ని మాంచాల, మధుర కవయిత్రి మొల్ల మొదలైన వాళ్ళు ఆయా రంగాల్లో చెప్పుకోదగ్గవాళ్ళుగా నిలిచిపోయినారు

అయితే చారిత్రక రాజకీయ, సామాజిక పరిస్థితులవల్ల స్వేచ్ఛా స్వాతంత్రాలకు, విద్యావికాసానికి క్రమక్రమంగా వాళ్ళు దూరమైపోవలసి వచ్చింది సంఘంలోని స్వార్థపరుల డంబాచారాలకు, కుచ్ఛితాలకు, కూహకాలకు వాళ్ళు గురిఅయిపోయి, మూకీభావం వహించవలసి వచ్చింది ఇంగ్లీషువాళ్ళు ఈ దేశంలో పాలకులుగా స్థిరపడనున్న తరుణంలో, ఈ దేశంలో మహిళల జీవితస్థాయి దయనీయంగా ఉండేదనటం చారిత్రక సత్యం ఆధునిక యుగంలో మహానుభావుడు రాజారామ్మోహనరాయ్ సాంఘిక దురాచారాలను రూపుమాపి, మహిళా లోకాన్ని ఉద్ధరించిన మతాచార్యుడు ఆయనది ఆధునిక మతం

తెలుగు దేశంలో కూడా వీరేశలింగమనే మహా పురుషుడు ఉద్భవించి, చీకటింట్లో కిటికీలు తెరచి, సూర్యుడి వెలుగును, చంద్రుడి వెన్నెలను ప్రసరింపజేసి, దుమ్ముదులిపి, బూజు తుడిచి, మనుషుల్లో మంచి కొంచెం పెంచి, మానవత్వాన్ని నిలిపిన దాకా మహిళల స్థితిగతులు దుస్సహంగానే ఉండేవి ఆయన తెచ్చిన సంఘసంస్కరణం సూర్యుడి వెలుగు ఆయన ఇచ్చిన సాహిత్యం చంద్రుడి వెన్నెల తెలుగు దేశమే చీకటిల్లు ప్రత్యేకంగా స్త్రీలకోసంకు ఆయన పత్రికలు నడిపాడు, 'సతీ హితబోధిని' అన్న పత్రిక ద్వారా స్త్రీల విజ్ఞాన, వినోదాలకై ఆయన ఎటితగానో కృషిచేశాడు .

అప్పటినుంచీ మహిళల సామాజిక స్థాయి క్రమక్రమంగా పురుషుడితో సమానంగా పెరిగింది. సరిగ్గా ఆయన కృషికి పూనుకొన్న డెబ్బై, ఎనభై సంవత్సరాలలో ఇప్పుడు స్త్రీలు, పురుషులతోపాటు అన్నిరంగాలలోను సమానులు.

ఆయనగారు అప్పుడే ఈ మాట చెప్పాడు - స్త్రీలను చీకటిలో ఉంచి, పురుషు లెన్నటికీ వెలుగు చూడలేరని, స్త్రీలలో విద్యా, విజ్ఞానాలు, వికాసమూ పెంపొంది నప్పుడు మాత్రమే, ఆ సమాజం కాని, ఆ దేశంకాని ఉన్నతిని సాధించగలదని. పువ్వు ఎంత అందంగావున్నా, పరిమళం లేకపోతే విలువ ఏముంటుంది?

తెలుగు సాహిత్యంలో ఇప్పుడు మహిళలు ఎన్నో సుగంధ పుష్పాలు పూయిస్తున్నారు. నవలలు, కథలు, సాహిత్య విమర్శ, కవిత- అన్నిటా పురుషు లతోపాటు సమంగా వ్రాస్తున్నారు సాహిత్య చరిత్రలో ఈ ఘట్టం అపూర్వం. 11 వ శతాబ్దంలో ఉదయించిన తెలుగు సాహిత్యం, ఇప్పటివరకు ఎన్నెన్నో మార్పులకు లోనై, ఆధునిక యుగంలో ఎన్నెన్నో కొత్త ప్రక్రియలను సంత రించుకొని ఎంతగానో అభ్యుదయాన్ని సాధించింది. అయితే, యీ గడచిన ఎనిమిది వందల సంవత్సరాల సాహిత్య చరిత్రలో ఏ పదిమంది పేర్లనో మాత్రమే మనం మహిళల్లో లెక్క పెట్టవచ్చు. మొల్ల రామాయణం తరవాత దక్షిణాంధ్ర యుగంలో రంగాజమ్మ, రామభద్రాంబ, ముద్దుపళని మొదలైనవాళ్ళు కనపడ తారు సమకాలీన సామాజికాభిరుచులనుబట్టి, తమకు ప్రాపునిచ్చినవారి సంస్కా రాలను బట్టి, తమ శక్తియుక్తులను పురస్కరించుకొని ఆ కాలానికి తగిన సాహిత్యాన్ని వాళ్ళు సృష్టించారు. సంగీత సాహిత్యాల్లో మంచి ప్రజ్ఞనే సాధిం చినా, నాటి సామాజికాభిరుచులకు దర్పణప్రాయంగా వాళ్ళు రచనలు చేశారు ఆ రచనలను ఉత్తమ సాహిత్య స్థాయికి తీసుకొనిరాలేము.

కిందటి దశాబ్దంలో తాళ్ళపాక తిమ్మక్క, తరిగొండ వేంగమాంబగారలు సాహిత్యంలో గొప్ప కృషి చేశారు మంచి గ్రంథాలు వ్రాశారు. తరిగొండ వేంగమాంబగారి రాజయోగసారమూ, తాళ్ళపాక తిమ్మక్కగారి అష్టమహిషీ కల్యాణమూ ఉత్తమ సాహిత్యంగా పరిగణించవచ్చు. కిందటి శతాబ్దపు ఉత్త రార్ధంలోనూ, ఈ శతాబ్ది పూర్వార్ధంలోనూ శతకాలు, దండకాలు, వేదాంత పరమైన కీర్తనలు రచించిన రచయిత్రు లెందరో ఉన్నారు మదిన సుభద్రమ్మ గారనే ఆమె చాలా శతకాలు రచించింది. ఈమె వ్రాసిన గ్రంథాలన్నీ ఒక్క సంపుటంగా వెలువడటం జరిగింది. మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్లవారి సోదరీమణి రంగమ్మగారు చాలా శతకాలు రచించారు. ఈమె ఒకసారి ఒక సభలో నిలిచి ఉపన్యసించి, సభ్యులందరినీ ఆశ్చర్యంలోనూ

ఆనందంలోనూ ముంచి ప్రఖ్యాతికెక్కారు వీరేశలింగంపంతులుగారికి పూర్వమే పరవస్తు వేంకట రంగాచార్లవారు సంఘసంస్కరణ కృషికి పూనుకోటం గమనించదగిన అంశము.

కిందటి శతాబ్ది ఉత్తరార్ధ ప్రారంభం నుంచీ కూడా సంఘంలో స్త్రీ విద్య పట్ల శ్రద్ధాసక్తులు పుట్టి, ఉద్యమంగా పెద్దలు సాధించారు శిష్టు కృష్ణమూర్తిగారి వంటి పూర్వాచార పరాయణులు కూడా 'స్త్రీ నీతిదీపిక' వంటి స్త్రీ విద్యా ప్రోత్సాహకరమైన గ్రంథాలు రచించడం, ఈ సత్యాన్నే వెల్లడిస్తున్నది స్త్రీలు ఎప్పుడైతే విద్యావంతులవుతూ వచ్చారో, సాహిత్య కృషిని కూడా ప్రారంభించి, ఉత్తమ రచనలు వెలువరిస్తూ వచ్చారు. "పోతం జానకమ్మ యను విదుషీమణి 1874 సంవత్సరమున ఫిబ్రవరి 24 తేది నొక్క వ్యాసమును విదేశియాత్రల గూర్చి వ్రాసి శ్రీ మదాంధ్ర భాషా సంజీవనిలో బ్రకటించియున్నది. ఆ వ్యాసము నందలి శైలి, యందలి యుక్తులు మిక్కిలి ప్రౌఢముగా నున్నవి ఈమె తన భర్తతో నింగ్లాండు వెళ్ళివచ్చి పిమ్మట నీ వ్యాసమును వ్రాసి ప్రకటించినది" అని 1913 వ సంవత్సరంలో ఆర్యమతబోధిని అనే పత్రిక వ్రాసింది అంటే ఇంచుమించుగా నూరేళ్ళకు పూర్వమే మహిళలు పత్రికల్లో రాయడం ప్రారంభమైందన్నమాట! ప్రథమాంధ్ర పత్రికా రచయిత్రి శ్రీమతి పోతం జానకమ్మగారేనేమో! ఎవరికి తెలుసు? ఈ విధంగా ఒక శతాబ్దం నుంచి గొప్ప చైతన్యం మహిళాలోకంలో కనబడుతున్నది

ఆధునికులలో అబలా సచ్చరిత్ర రత్నమాలను రచించిన భండారు అచ్చమాంబగారు పేర్కొనవలసినవారు. అబలాసచ్చరిత్ర రత్నమాలను బట్టి పూర్వకాలంలో మన మహిళల వైదుష్యం, గొప్పతనమూ మనం తెలుసుకోవచ్చు ఎందరెందరో మహిళలు వైద్యము, జ్యోతిష్యము, వేదాంతాది శాస్త్రిలలో ప్రావీణ్యం సంపాదించారని పాత పత్రికలలో ముఖ్యంగా ఆంధ్రభాషా సంజీవని, ఆర్యమతబోధిని వంటి పత్రికలలో స్త్రీ విద్యను గూర్చిన వ్యాసాలవల్ల తెలుస్తూవున్నది వీరేశలింగం పంతులుగారు పెంచి పెద్దజేసిన కొటికెలపూడి సీతమ్మగారు వీరేశలింగం పంతులుగారి జీవితాన్ని పద్యకావ్యంగా వ్రాసింది.

కాంచనపల్లి కనకమ్మగారు, కనపర్తి వరలక్ష్మమ్మగారు ఆధునిక కాలంలో గొప్ప వైదుష్యాన్ని సంపాదించి, గ్రంథాలు రచించారు నాళం కృష్ణారావుగారి కుమార్తె ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు బహు గ్రంథకర్త మాత్రమే కాకుండా, మంచి ఉపన్యాసకురాలు కూడానూ ఇటీవల, రచయిత్రుల సభలను నిర్వహించి, ఈ తరం కథా రచయిత్రుల కథా సంకలనాన్ని ఈమె వెలువ రించారు. ఈ కాలంలోకూడా వెనుకటిలాగానే, రామాయణ మహాకావ్యాన్ని తెలుగున సంతరించిన మహిళలు కొందరున్నారు బసవరాజు రాజ్యలక్ష్మమ్మ, చావలి బంగారమ్మ మంచి కవిత్వము వ్రాశారు. యూనివర్సిటీలలో పరిశోధనా రంగంలో కృషిచేసి, సాహితీ వేత్తృత్వాన్ని నిరూపించి, పిహెచ్ డి పట్టాలను పొందిన మహిళలెందరో ముందుకు వస్తున్నారు శ్రీమతులు వి రాజేశ్వరి, నాయని కృష్ణకుమారి, పి. యశోదారెడ్డి బి భారతి మొదలైనవారు ఈ గణ్యతను సాధించి సాహిత్య కృషి చేస్తున్నారు

సాంఘిక చైతన్యాన్ని కలిగించి, రాజకీయరంగంలో కూడా కృషిచేసిన వారిలో శ్రీమతి ఎల్లాప్రెగడ సీతాకుమారి గారు, సంగం లక్ష్మీబాయమ్మగారు మొదలైనవారు ముఖ్యులు ఇల్లిందల సరస్వతీదేవిగారు, నందగిరి ఇందిరాదేవి గారు మొదలైనవారు కథా సాహిత్యంలోనూ, నవలా సాహిత్యంలోనూ బాగా కృషిజేశారు. రాజకీయాలలో పూర్తిగా మునిగిపోక సాహిత్యకృషిని కొనసాగించి ఉన్నట్లైతే సంగం లక్ష్మీబాయమ్మగారు గొప్ప రచయిత్రి అయివుండేవారు. 'నా అనుభవములు'ని ఆమె ప్రకటించిన గ్రంథాన్ని బట్టి చూస్తే ఆమె కథలో, నవలలో రచించివుంటే, కలకాలం నిలవదగ్గ రచనలు చేసేవారనిపిస్తున్నది. దురదృష్టవశాత్తూ ఆమె సాహిత్యానికి దూరమైపోయినారు శ్రీమతి ఎల్లాప్రెగడ సీతాకుమారిగారు మంచి కథలు, వ్యాసాలు వ్రాశారు. సాంఘిక సేవాసక్తితో ఉన్నతాశయాలతో ఆమె దేశసేవ చేశారు, చేస్తున్నారు

ఇప్పుడు పత్రికా రచయిత్రులుగా, శ్రీమతులు, ముప్పాళ్ళ రంగనాయకమ్మ, ద్వివేదుల విశాలాక్షి, మాలతీచందూర్, కె రామలక్ష్మి, లత, యద్దనపూడి సులోచనారాణి, కోడూరి కౌసల్యాదేవి, సి ఆనందరామంగారలు లబ్ధప్రతిష్ఠలు. పాఠకులు విశేషాదరంతో వీళ్ళరచనలు చదువుతున్నారు. అయితే వీళ్ళలో కొందరికి సామాజిక అవగాహన బొత్తిగా మృగ్యం. తరుణ వయస్కుల

ప్రేమోద్రేకాలు, అభిప్రాయభేదాలు. అనుమానాలు - ఇంకా జమీందారీ వ్యవస్థ నాటి సామాజికాభిప్రాయాలు, సంఘర్షణలు వ్రాస్తున్నారు శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మగారు చాలా మంచి రచయిత్రి ఈమె ఊహ పదునుగాను, శైలి చురుకుగాను ఉంటాయి తీవ్రమైన ఆవేశము, భావోద్వేగము,స్ఫూర్తిమంత మైన శైలిఉన్నా, సామాజిక స్వరూపావగాహనలో అతివాదధోరణివల్ల - ప్రేమ్ చంద్, శరత్, టాగోర్ లాంటి రచయిత్రి కాలేకపోయింది శ్రీమతి మాలతీ చందూర్ గొప్ప ఉపజ్ఞ కల రచయిత్రి విశేష గ్రంథ పరిశ్రమవల్లా, లోకజ్ఞత వల్లా ఈమె సుప్రసిద్ధ వారపత్రికలో నిర్వహించే ప్రశ్నలు సమాధానాల శీర్షిక చాలా ఆకర్షణీయంగా ఉంటుంది ప్రేమకథలను, తారుణ్యపు తొలిరోజుల ముగ్ధత్వాన్ని ప్రదర్శించే నవలలు, కథలు కొన్ని కె రామలక్ష్మిగారు వ్రాశారు. శ్రీమతి యద్దనపూడి సులోచనా రాణీగారిది లలితమైన శైలి, ఆకర్షకమైన రచనాపద్ధతి. పసితనం విడిచి యవ్వనంలో అడుగుబెడుతూన్న తరుణీతరుణు లను బాగా అలరించే రచనలు చేస్తున్నారు ఈమె ఈమెది లలితసంగీతం బాణీ. ప్రజ్ఞావంతురాలైన రచయిత్రి ద్వివేదుల విశాలాక్షిగారి రచనల్లో సామాజిక సమస్యలు, మారిపోతున్న కాలపరిస్థితులు కనపడతాయి కథను ఉత్కంఠతో చదివించటంలోనూ, అట్టడుగున మనుషుల భావోద్రేకాలను సున్నితంగా వెలికి తీసుకొనివచ్చి ప్రదర్శించటంలోనూ ఈమె నేర్పరి

లతగారు తీవ్రమైన ప్రవృత్తికల రచయిత్రి. ఈమె గారు కొంతకాలం క్రితం ధారావాహికంగా ఒక పత్రికలో నిర్వహించిన శీర్షిక 'ఊహాగానం' పాఠకులను విశేషించి ఆకర్షించింది ఈమెగారి నవలల్లోకూడా ఈ ఊహాగానమే ఎక్కువై, వాస్తవికత తక్కువైందేమో ననిపిస్తుంది ఉద్విగ్నమైన శైలి, తీవ్రమైన భావావేశమూ ఉన్నప్పటికీ దృఢమైన నమ్మకాలు, జీవితదృక్పథమూ, ఈమె రచనల్లో కనబడవు.

కోడూరి కౌసల్యాదేవిగారి రచనల్లో కల్పన ఎక్కువ కృతకమైన శైలి, అవాస్తవికమైన సన్నివేశాలు హఠాత్సంభవాలు, ఊహాలోకపు పరిభ్రమణ వల్ల ఒక వర్గం పాఠకులు అభిమానించటంలో వింతలేదు తెలుగులో ఇంతవరకూ అపరాధ పరిశోధక నవలల జోలికి రచయిత్రులు వెళ్ళినట్లు కనపడదు. ఆధునిక కవిత్వ సంబంధిగా కూడా వీళ్ళ ప్రాబల్యం కనపడదు.

కథా రచయిత్రిగా మాత్రమే పరిచితురాలు ఆంధ్రపత్రికలో వచ్చిన శ్రీమతి రంగనాయకమ్మగారి కథ 'పల్లెటూరు' ఆ రోజుల్లో అందరినీ ఆకర్షించింది.

మద్రాసునుంచి శ్రీ ధనికొండ హనుమంతరావు 'జ్యోతి' మాసపత్రికను ఆ రోజుల్లోనే పునరుజ్జీవింపచేయడం జరిగింది శ్రీయుతులు రావూరి భరద్వాజ, తాళ్ళూరి నాగేశ్వరరావు, శిపం, కందుకూరి లింగరాజుగారలు 'జ్యోతి'లో ఆ రోజుల్లో మంచి కథలు ప్రకటిస్తూ వచ్చారు

స్వర్గీయ దేవరకొండ బాలగంగాధర తిలక్ కథకుడుగా పుట్టింది ఈ ఇరవై ఏళ్ళలోనే. సుందరీ-సుబ్బారావు వంటి హాస్యచమత్కార భరితమైన కథలే కాకుండా నల్లజెర్లరోడ్డు, కదిలే సీడలు వంటి అత్యద్భుత శిల్పప్రతిభగల కథలని ఆయన రచించారు శ్రీ తిలక్ వ్రాసిన 'ఓడిపోయిన మనిషి'లో ఆయన తాత్త్వికచింతనం కనిపిస్తుంది కవితాత్మగల భావుకుడైన, స్వేచ్ఛావిహంగమ ప్రకృతి నభిలషించే వ్యక్తికి ఈ సమాజం నీతులు, ఆచారాలు, మర్యాదలు, హద్దులు, కృత్రిమాలు ఎంత బాధాకరం అంటారాయన కేవలం కథను కథా దృష్టితో మాత్రమేకాక, తాత్త్విక అవగాహనతో, సామాజిక స్పృహతో వ్రాయాలన్న ధోరణి ప్రబలడం ఈ ఇరవై ఏళ్ళలో ఈ ప్రక్రియ సాధించిన గొప్ప పరిణామంగానే పేర్కొనాలి.

సతత హరిత వృక్షం వంటి శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు ఈ ఇరవై ఏళ్ళలోను కథలు వ్రాస్తూనేవచ్చారు. కాని కథలకన్నా ఆయన నవలికలే ఎక్కువ వ్రాశారు.

## ప్రక్రియల్లో ప్రయోగాలు

చిన్న కథకు సంబంధించి ప్రక్రియా సంబంధమైన ప్రయోగాలెన్నో ఈ ఇరవై సంవత్సరాల కాలంలోనే ఆయా రచయితలు, పత్రికా నిర్వాహకులు, ఆకాశవాణి నిలయంవారు చేపట్టడం జరిగింది. 1962 ప్రాంతాలలో హైదరాబాదు ఆకాశవాణివారు ఒక అపూర్వమైన కథక సమ్మేళనం ఏర్పాటు చేశారు.ఐదు నిమిషాల వ్యవధిలో కథ పొదిగిపోవాలి. ఆహ్వానితులైన ప్రేక్షకుల

సమక్షంలో రచయితలే చదవాలి 'ఏకాదశి' అనే పేరుతో పదకొండు మంది రచయితల, రచయిత్రుల కథలను ఈ విధంగా ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం ప్రసారం చేసింది శ్రీమతి సులోచనారాణి, శ్రీ పోరంకి దక్షిణమూర్తి, శ్రీ వాకాటి పాండురంగారావు, శ్రీమతి యశోదారెడ్డి వంటి ప్రముఖులెందరో ఈ కార్యక్రమంలో పాల్గొని, తమ ఐదు నిమిషాల కథను వినిపించారు. ఇందు కోసంగా వ్రాసిన వాకాటి పాండురంగారావు కథ 'డాక్టరుకు ప్రాణంపోశాడు' చిన్న కథలో అనల్పశిల్పానికి, ఇతివృత్త ఉదాత్తతకు ఒక సంకేతంగా భావుకుల ప్రశంసల నందుకొంది.

శ్రీయుతులు ఇచ్ఛాపురపు జగన్నాథరావు, బలివాడ కాంతారావు, అవసరాల రామకృష్ణారావు, హితశ్రీ, అర్ ఎమ్ చిదంబరం, వేదుల లక్ష్మణమూర్తి, శాండిల్య మొదలైన రచయితలెందరో ఈ ఇరవై ఏళ్ళ తొలి సగమైన కాలంలో వివిధ పత్రికలలో విరివిగా వ్రాశారు ఈ ఆధునిక ప్రక్రియ సర్వవ్యాపి ఇతివృత్తంగాని, శిల్పంగాని, పాత్రల మనోభావ చిత్రణగాని, సామాజిక పరిస్థితుల ప్రతిబింబంగాని, అనంత వైవిధ్యంతో చిన్న కథలో నిర్వహించవచ్చు. అందుకే ఈ ప్రకియ ఇంతగా ప్రీతిపాత్రమైంది సాహిత్య భావుకులకు చిన్న కథలో ఒక విలక్షణత కూడా వున్నది, మరో సాహిత్య ప్రక్రియలో నిర్వహించడానికి అవకాశం కనిపించనిది.

ఏమంటే, చిన్నకథ సమాహార ప్రక్రియ సమగ్ర ప్రక్రియ అందువల్లనే వెనకటితరంలో శ్రీ వేలూరి శివరామశాస్త్రి, మొక్కపాటి నరసింహశాస్త్రి వంటివారు కథలు వ్రాయడం జరిగింది శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సర్వ ప్రక్రియలను చేపట్టినా- చిన్న కథలో కూడా తమ ప్రత్యేకతను చూపుకున్నారు. 'సప్తాశ్వము' 'మాక్లీ దుర్గంలో కుక్క' వంటి వారి కథలు బాగా ప్రసిద్ధి పొందినవి.

ఈ ఇరవై ఏళ్ళ తెలుగుకథను సమీక్షించుకొనేప్పుడు, అత్యంత ప్రతిభాశాలురైన కథకులిద్దరు ముందుగా, మునుముందుగా వచ్చి నిలుస్తారు. రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావు గారలు వాళ్ళు. బడుగు

మనిషి బాధలు, బక్కచిక్కినవారి గాథలు, వీరి కథా వస్తువులు ఈ ఇరవై సంవత్సరాల పరిణామంలో తెలుగు కథ ఎంతగానో సామాజిక స్పృహను, వాస్తవికతను, బాధ్యతను సంతరించుకుంది. సమాజంలోని వర్గ సంఘర్షణ, అట్టడుగు తరగతులవారి దయనీయ జీవనం, వారి జీవితతత్వచింతనం, వారి విలువలు ఈ రచయితలు అత్యంత వాస్తవికంగా ప్రతిభతో చిత్రించగలరు విశ్వనాథ శాస్త్రిగారి ఆరు సారా కథలు, కాళీపట్నం రామారావుగారి యజ్ఞం, తీర్పు, శిక్ష మొదలైన కథలు సంపుటాలుగా వచ్చాయి.

## మనోవిశ్లేషణ

శ్రీ ఆర్ ఎస్ సుదర్శనం మేధావివర్గ రచయిత. వీరి కథలు మనో విశ్లేషణతోను, ఆంతర లోకాల సందర్శనంతోను సాగుతాయి ఆయా పరిస్థితులలో ఆయా వ్యక్తులు ఎందుకావిధంగా ప్రవర్తిస్తారు - అనే విషయాన్ని విశ్లేషించి చూపి, మనో విజ్ఞానాన్ని ప్రదర్శించే కథలు వీరివి శ్రీమతి ఆర్. వసుంధరగారు, చాలా మంచి కథలు వ్రాశారు నిత్య జీవితంలో తారసపడే పాత్రలను, మనో ప్రవృత్తులను, అధివాస్తవిక ధోరణిలో చిత్రించే నేర్పు ఈ రచయిత్రికి పుష్కలంగా ఉంది ముఖ్యంగా ఈ ఇరవై సంవత్సరాల కాలంలో వస్తువు దృష్ట్యా, శిల్పం దృష్ట్యా ప్రయోగాత్మకమైన కథలు చాలా వచ్చాయి.

భావ విప్లవానికి సంబంధించి సంకేత ప్రాయమైన కథలు 'శ్రీపతి' వ్రాశారు నర్తోడు, ఉదయం మొదలైన కథలు, శిల్పం దృష్ట్యా చూసినా, సామాజిక చైతన్యోద్దీపనం దృష్ట్యాచూసినా ఇవి మంచి కథలు. అతివాద ధోరణులు గల పత్రికలు కొన్ని రాజకీయ సిద్ధాంత వాహికగా కూడా కథా ప్రక్రియ నుపయోగించు కోవచ్చునని నిరూపించాయి.

అవసరాల రామకృష్ణారావుది తెలుగు కథకులలో ఒక ప్రత్యేకమైన బాణీ. ఈయన అర్థమున్న కథలు, అయిదురకాల ఆత్మహత్యలు- తెలుగుదేశపు మధ్య తరగతి కుటుంబాల మర్యాదలు, సమస్యలు, కామనలు, కష్ట సుఖాలు చిత్రించే కథలు సుకుమారమైన భావుకతతో, చురుకైన హాస్యంతో, సంస్కారం మప్పే ధోరణితో, సాహిత్య ప్రయోజనాత్మకంగా వుంటాయి వీరి కథలు.

ఈ ఇరవై సంవత్సరాల కాల వ్యవధిలో తొలి పదేళ్లు విరివిరిగా కథా రచన చేసినవారు శ్రీ రంధి సోమరాజు ఈయనది అచ్చమైన కవితా హృదయం. కొన్ని ఇంతకు పూర్వమే వ్రాసినా వీరి కథలన్నీ సంపుటాలుగా రావడం మాత్రం ఈ కాలంలోనే జరిగింది సోమరాజుగారి 'కన్నె మనస్సు' వంటి కథ ఎన్నడూ తొడిమ పీడని, వాడని పుష్పం వంటిది. దేవుడైన మానవుడు, ఈ లోకం-ఈ మనుషులు, మొదలైన కథలు,భావుకతా స్ఫోరకంగా ఉంటాయి

ఏక రక్తం, మరో నిష్క్రమణం, రంగుటద్దాలు మొదలైన కథానికలు వ్రాసిన ఇచ్ఛాపురపు జగన్నాథరావుగారు మంచి కథా శిల్పి పరువమైన భాష, సున్నితమైన, ఆర్ద్రమైన భావుకత,అత్యంత వాస్తవికంగా జీవితంలో ఎదురయ్యే సన్నివేశాలు ఈయన సమర్థంగా చిత్రించగలరు.

శ్రీ మధురాంతకం రాజారాం గారు అచ్చమైన తెలుగు కథకుడు. అంటే శిల్పం, వస్తువు, భావుకత, ధోరణీ అన్నీ తెలుగుతనం తొణికిసలాడే కథలు వ్రాశారు తాను వెలిగించిన దీపాలు, కమ్మ తెమ్మెర, దుష్ట సమాసం, రుద్ర భూమి, పిచ్చి వెంకట్రావు వంటి కథలు తెలుగు సాహిత్యానికే వన్నె తెస్తాయి జీవితానుభవంతోను, గొప్ప పరిశీలనతోనూ మాంసలంగా వుంటాయి రాజారాం గారి కథలు రాజారాం గారి కథలు ఇటీవల సంపుటాలుగా వచ్చి, తెలుగు కథా సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి.

బలివాడ కాంతారావు మంచి కథలు వ్రాశారు నిత్య జీవితంలో కనిపించే సన్నివేశాలనే లోతుగా చూసి, ఆర్ద్రంగా అర్థం చేసుకొని, వాస్తవికంగా చెప్పగల నేర్పు వీరికున్నది. వీరు ఢిల్లీ మజిలీ కథల పేరుతో, భారతదేశ రాజధానిలోని ఆధునిక మానవ జీవిత చిత్రణను ఆసక్తికరంగా వ్రాశారు ఈ సంపుటాలు ఆధునిక కథా సాహిత్యానికి అలంకారాలు కాగలవు. మంచి ముత్యం, కన్న కడుపు మొదలైన కథలు గుర్తుంచుకో వలసిన కథలు

వాకాటి పాండురంగారావు కథల్లో చురుకైన వ్యంగ్యం, సున్నితమైన హాస్యం ఎక్కువ వ్యక్తులలోని విలక్షణతలను కథా వస్తువులుగా ఈయన వ్యాఖ్యానించగలరు ఇటీవల వీరు వ్రాసిన ఏడువారాల కథలు కథా సాహిత్యంలో వైవిధ్యాన్ని, శిల్పం దృష్ట్యాను, వస్తువు దృష్ట్యాను తెచ్చిపెట్టాయి.

యువ కథకుల్లో వి రాజారామమోహనరావు కథా రచనలో మంచి శిల్పం చూపుతున్న రచయిత ఈయన ఇతివృత్తం ఎన్నుకోవడంలోనే తన ప్రత్యేకమైన వ్యక్తిత్వపు ముద్రను ప్రదర్శించగలడు సునిశితమైన పరిశీలనంగల కథారచయిత

'నీళ్ళు' వంటి మంచి కథలు వ్రాశారు పెద్దిభొట్ల సుబ్బరామయ్య రచయిత ప్రాథమిక యోగ్యత అయిన మంచి పరిశీలనా శక్తి వీరికి పుష్కలంగా వుంది.

ఈతరం రచయితలలో విశిష్టమైన కథారచయిత శీలా వీర్రాజు. సమాధి, పగా మైనస్ ద్వేషం, హ్లాదినివంటి కథా సంపుటాలు ఈయనవి ఇదివరలో వెలువడ్డాయి ఇటీవల ఊరు పిడ్కోలు చెప్పింది అనే కథా సంపుటం వెలువడింది. ఈ సంపుటంలో ఉన్నవి ఆరు కథలు ఈ ఆరు కథల్లోనూ ఎంతో వైవిధ్యముంది సమాజంలోని అవివేకం, నిస్సహాయత, క్రౌర్యం, మోసం, వంచన, దగా మొదలైన మానవత్వపు ప్రవృత్తులను, లోటులను వ్యాఖ్యానించారు రచయిత ఈయన పాత్రలు జీవిత వాస్తవాలను భ్రాంతులకు బలిచేసి పారిపోయే వ్యక్తులు కారు నేటి మధ్య తరగతి కుటుంబాల సామాజిక సమస్యలను, వారి కామనలను, కాంక్షలను, ఆంక్షలను, నేర్పుతో చిత్రించగల రచయిత శ్రీ వీర్రాజు ఒక్కొక్కప్పుడు కట్టు కథలు కూడా గడ్డు నిజాలకు తీసి కట్టే అంటారు ఓడిపోయాక, చావద్దు- వీర్రాజుగారు వ్రాసిన ఇటువంటి కథలు. ఊరు పిడ్కోలు చెప్పింది అనే కథ కూడా కరుణరసార్ద్రమైన కథ కథనమూ, పాత్రల చైతన్యమూ వీర్రాజుగారి కథలను ఆకర్షకంగా చేస్తవి నీడ 'అనే కథలో ఈ దేశంలో స్త్రీ వ్యక్తిత్వం తరతరాలుగా ఏ విధంగా సర్దుబాటు చేసుకొంటూ, పురుషునివ్యక్తిత్వానికి నీడలాగా పరిణమిస్తూ వస్తూన్నదో చిత్రించే కథ.

ఇక శైలి గురించి, తక్కిన కథకులకన్నా ఈ రచయిత ఒక విలక్షణతను ప్రదర్శిస్తారు శబ్ద చిత్రాలు, పదగమకాలు, ఉపమానాలు, రంగు రంగుల్లో ముంచి గీసే కుంచె గీతలూ ఈయన కథల్లో కనపడతవి. సౌందర్య షర్మం ఎరిగిన రచయిత శ్రీ వీర్రాజు కవీ, కథకుడూ, చిత్రకారుడూ కూడా కావడంతో రంగూ రుచీ, వాసనా సాహిత్యంలో ఈయన చూపగలడు.

ఈ ఇరవై సంవత్సరాల తెలుగు కథని సమీక్షించేప్పుడు, "త్రిపుర" పేరుతో వచ్చిన కథలు తప్పకుండా ప్రస్తావించవలసివుంటుంది ఇవి మన స్తత్వ నిరూపణాత్మకమైన కథలు. 'పాము' అనే అద్భుతమైన కథను వీరు వ్రాశారు. మానవుని అంతరంగంలో- ఆలోచనా విధానం ఎంత చిత్ర విచిత్రంగా ఆతణ్ణి నడపగలదో నిరూపించే కథలు ఇవి వచన కవిత్వంలోని వేగం, ఈయనగారి శైలిలో చూడవచ్చు.

ఈ ఇరవై సంవత్సరాల తెలుగు కథలో చాలా ప్రయోగాలు వచ్చాయి. ఎత్తుగడలో, ముగింపులో, నిర్వహణలో అనంతమైన వైవిధ్యం ప్రదర్శితమైంది. తెలుగులో సంతృప్తికరమైన కథానికా, కవిత్వమూ వచ్చాయి కాని, నవల రాలేదన్నాడు శ్రీశ్రీ ఇది నిజమేననాలి ఇరుగు పొరుగు భాషల ఆధునిక సాహిత్య రీతులతో తెలుగు సాహిత్య ధోరణులను పోల్చి చూసుకున్నప్పుడు చిన్న కథ విషయంలో తెలుగువారి ప్రత్యేకత కనపడుతూ వుంటుందని విమర్శకులంటారు ముఖ్యంగా స్వాతంత్ర్యానంతరం తెలుగు సాహిత్యంలో ఎన్నదగిన మంచి కథలు ఎన్నో వచ్చాయి ప్రతి వారపత్రికలోను, మాసపత్రికలోనూ బహుళ సంఖ్యలో వెలువడేవి కథలే కేవలం కథల పత్రికలే నడిపే ప్రయత్నాలు కూడా ఇటీవల కొన్ని బయలుదేరాయి కాని అవి ఫలించలేదు

## మహిళలు

వర్తమాన సాహిత్య ధోరణిలో వైశిష్ట్యం, మహిళలు సాహిత్య సృష్టికి ముందుకురావడం ఇవాళ మహిళలు వ్రాస్తున్న నవలలకు పత్రికలలోను, పాఠకులలోను మంచి పలుకుబడి వుంది శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి, ఐ వి. ఎస్ అచ్యుతవల్లి, పరిమళా సోమేశ్వర్, సి ఆనందారామం, మాదిరెడ్డి సులోచన, యద్దనపూడి సులోచనారాణి, గోవిందరాజు సీతాదేవి, కళ్యాణసుందరీ జగన్నాథ్ చాలా మంచి కథలు వ్రాసి, ఈ ప్రక్రియలో కూడా తమ వైశిష్ట్యాన్ని నిరూపించుకున్నారు కాని, ఏ ఒకర్కిద్దరో తప్ప రచయిత్రుల కథాసంపుటాలు వచ్చినట్లుగాలేదు శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మిగారి కథల సంపుటి ఒకటి ఇటీవల వచ్చి, సమీక్షకుల ప్రశంసల నందుకుంధి,

వర్తమాన సాంఘిక పరిస్థితులను, రాజకీయాలను, సామాజిక దృక్పథాలను, అత్యంత సమర్థంగా హాస్య, చమత్కార, వ్యంగ్య, అధిక్షేప వైభవంతో, అచ్చమైన తెలుగు నుడికారంతో, తెలుగు వాతావరణంతో గొప్పగా కథానికలు వ్రాసే రచయిత శ్రీ కలువకొలను సదానంద ఇటీవల వీరి 'నవ్వే పెదవులు-ఏడ్చేకళ్ళు' అనే కథాసంపుటి వచ్చింది ఇందులో 'తాత దిగిపోయిన బండి' 'రామదాసు చెర' 'బాలామణి' వంటి కదలు ఏ ప్రమాణాలతో చూసినా గొప్ప కథలు. మానవ మనస్తత్వ పరిజ్ఞాత వలె ఈ కథల నాయన గొప్పగా వ్రాశారు. వీటిని తెలుగువారు సగర్వంగా మా కథలని ప్రకటించుకోవచ్చు. అఖిల భారతీయమైన దృష్టినేకాక, అంతర్జాతీయమైన దృష్టిని కూడా ఆకర్షించవలసిన కథలివి. సార్వకాలికమైన, విశ్వజనీనమైన కథలివి.

నేటి సామాజికమైన వొడిదుడుకులను, తరాల అంతరాలను, వర్గసంఘర్షణను, కలిమిలేముల ఘర్షణలను కొత్త నుడికారాలతో శ్రీయుతులు ముక్కామల వేంకటేశ్వరరావు, డి వెంకట్రామయ్య, కొంపెల్ల విశ్వం వంటి యువ రచయితలు వ్రాస్తున్నారు కలల్లో కాకుండా, తాము చూస్తున్న సమాజాన్ని అర్థం చేసుకుంటూ, పరిశీలిస్తూ, చెప్పే ఇతివృత్తమే కాకుండా, చెప్పవలసిన విధానంలో కూడా కొత్తదనాన్ని సృష్టిస్తూ, ఆలోచనాత్మకమైన కథలు వ్రాయడం ఈ రచయితల ప్రత్యేకత. ముక్కామల వేంకటేశ్వరరావు బాణీ విలక్షణమై, 'రైల్వే నాగభూషణం', 'టాయిలెట్' వంటి పద చిత్రాలతో కూడిన మంచి కథలు వ్రాశారు. శ్రీ డి. వెంకట్రామయ్యగారికి వర్తమాన సామాజిక పరిస్థితుల పట్ల మంచి అవగాహన వున్నది. ఇటీవలే వచ్చిన విశ్వం కథలలో ముసుగు, వ్యవస్థ వంటి మంచి కథలున్నాయి.

ఇటీవలి పది సంవత్సరాలలో కథకులుగా ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంపాదించుకున్నవారు విహారి, శాలివాహన అనే జంట రచయితలు ఇటీవలనే వీరి 'శిలలో సెలయేరు' అనే కథల సంపుటి వచ్చింది. మధ్యతరగతి కుటుంబపు ఇతివృత్తాలనే తీసుకొని, కవితాస్ఫూర్తితో వీరు నిర్వహించగలరు. అతి సామాన్యమైన కథావస్తువునుంచి అసామాన్యమైన జీవితసత్యాలను వీరు ప్రతిపాదించగలరు

తెలుగు కథకు గణనీయమైన గతం వుంది. మురిపించే వర్తమానం వుంది ఉజ్జ్వలమైన భవిష్యత్తు వుంది

(ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక - 1976)

# దక్కన్ కవుల జీవితచరిత్ర

కావలి వెంకటరామస్వామి కిందటి శతాబ్ది ప్రథమ పాదంలో ఆనాటి భారతదేశపు సర్వేయర్ జెనరల్ కల్నల్ కాలిన్ మెకంజీ (1754-1821) దగ్గర చరిత్ర పరిశోధకుడిగా, ద్విభాషిగా, విషయ సంగ్రాహకుడుగా పనిచేశాడు ఈ రామస్వామి మాత్రమేకాక, ఇతడి సోదరులైన వెంకట బొర్రయ్య, వెంకట లక్ష్మయ్యలు కూడా కల్నల్ కాలిన్ మెకంజీ దగ్గర పనిచేసి, ఆయన మెప్పుకు పాత్రులైనారు

ఆధునిక యుగంలో భారతదేశ చరిత్ర పరిశోధన కార్యక్రమం పాశ్చాత్య విజ్ఞానవేత్తలు చేపట్టారు చరిత్ర పరిశోధకులలో కావలి సోదరులది అగ్రేసర స్థానమని చెప్పాలి భారతదేశంలోనే పురాతత్త్వశాస్త్ర విజ్ఞానం పట్ల దృష్టి ప్రసరించకముందే, ఆంధ్రదేశంలో పుట్టిపెరిగిన కావలి సోదరులు, మెకంజీ వంటి గొప్ప చరిత్రకాధ్యయన వేత్తకు గురుత్వం నెరపడం గొప్ప విశేషం. 'భారతీయ మహా విజ్ఞాన సౌధానికి తెరిచిన ద్వారంవలె బొర్రయ్య నాకు లభించాడని' కల్నల్ కాలిన్ మెకంజీ బొర్రయ్యను ప్రశంసించాడు. బొర్రయ్య పుట్టి రెండువందల సంవత్సరాలైంది. 1776 లో ఆ మహా మనీషి జన్మించాడు. నిజానికి సంవత్సరం బొర్రయ్య ద్విశతజయంతి వత్సరమన్నమాట. 1803 లో బొర్రయ్య పరమపదించే నాటికే ఆయన ఇంగ్లీషులో రచనలు చేయటం, అవి విజ్ఞుల మెప్పునుకూడా పొందడం జరిగింది తొలి భారతీయాంగ్ల రచయితలలో బొర్రయ్య అగ్రగణ్యుడు కొందరు పరిశోధకులు రాజా రామమోహనరాయల కన్నా పూర్వమే బొర్రయ్య ఆంగ్లరచనలు చేసినట్లుగా ప్రతిపాదించి, సాక్ష్యాధారాలు చూపారు. బొర్రయ్యగారి రచనలు ఆ రోజులలోనే ఏషియాటిక్ జర్నల్ వంటి పత్రికలలో ప్రచురితం కావడం- ఆయన ఎంతటి ప్రతిభావంతుడో నిరూపిస్తున్నది.

ఇరవై ఆరేళ్ళు నిండీనిండని పిన్నవయసున ఈ మహాప్రతిభాశాలి పరమపదించాడు. కల్నల్ కాలిన్ మెకంజీ చాలా దుఃఖించాడు. బొర్రయ్య మరణా

నంతరం ఆయన తమ్ముళ్లైన వెంకట లక్ష్మయ్యను, వెంకటరామస్వామిని మెకంజీ ఆశ్రయమిచ్చి చేరదీశాడు

ఈ సోదరులు కూడా గొప్ప ప్రతిభావంతులే మెకంజీ 1821 వ సంవత్సరంలో చనిపోయిన తరవాత, మెకంజీ సంపాదించిన సంపుటాలన్నిటికి వివరణాత్మకమైన 'కేటలాగ్' తయారుచేయడంలో లక్ష్మయ్య చాలా శ్రమించాడు. వెంకట లక్ష్మయ్య, వెంకట రామస్వామి ఇద్దరు కూడా కలకత్తాలో, భారతీయ పురాతత్వ విజ్ఞానానికి సంబంధించిన కృషిలో, గణనీయమైన పాలు పంచుకొన్నారు

1829 వ సంవత్సరానికే కవుల చరిత్ర రచించాలన్న తలంపు కలగటమే ప్రశంసనీయం అదిన్నీ ఇంగ్లీషులో రచించడానికి పూనుకోవడం ఆ రచయిత గొప్ప ప్రతిభకు నిదర్శనం విస్మయంగొలిపే విషయం ఏమిటంటే- తెలుగువాళ్ళు వ్రాసిన స్వీయచరిత్ర, కవుల చరిత్ర వంటి ఆధునిక ప్రక్రియలు మొట్టమొదట ఇంగ్లీషులో వెలువడటం- నాటి మేధావులపైన ఇంగ్లీషుసాహిత్య ప్రభావాన్ని ఈ అంశం చాటి చెపుతుంది

మెకంజీ వ్రాయించి సంపుటీకరించిన స్థానిక చరిత్రలనుంచి అయా కవుల వృత్తాంతాలు, వివరాలు తాను సేకరించినట్టుగా వెంకటరామస్వామి ఉపోద్ఘాతంలో పేర్కొన్నారు ఈ దక్కన్ కవుల జీవితచరిత్రలకు రామస్వామి మంచి పీఠికను కూర్చారు ఆ పీఠికద్వారా నాటి మేధావుల ఆలోచనాధోరణులు, చారిత్రక విషయ సామగ్రి సేకరణకు ఆనాటి యూరోపియన్ అధికారులు, జిజ్ఞాసువులు చూపిన శ్రద్ధాసక్తులు తెలుసుకోవచ్చు

ఈ గ్రంథంలో సంస్కృత, తమిళ, మహారాష్ట్ర, తెలుగు కవులకు సంబంధించిన సంగ్రహవృత్తాంతాలు నూట ఎనిమిది మందిని గూర్చి వ్రాయడం జరిగింది. ముందు సంస్కృత కవులు, ఆ తరవాత తెలుగు కవులు, అటుతరవాత తమిళ కవులు, పిమ్మట మహారాష్ట్ర కవులు వర్ణించబడినారు

నేటి ప్రమాణాల దృష్ట్యా, విలువల దృష్ట్యా, అభిరుచుల దృష్ట్యా చూస్తే కవి జీవితాల కోవకి ఈ సంగ్రహ వృత్తాంతాలు చేరకపోవచ్చు. అయినా సుమారు నూటయాభై సంవత్సరాలకు పూర్వం ఇటువంటి గ్రంథరచన చేయడమే గొప్ప విశేషం.

అనుబంధంలో చేర్చిన కవిని కూడా కలుపుకొని సంస్కృత కవులు 37 గురిని గూర్చి, తెలుగు కవులు 46 గురిని గూర్చి, తమిళకవులు 13 గురిని గూర్చి, మహారాష్ట్ర కవులు 12 గురిని గురించి ఇందులో వర్ణించడం జరిగింది విశేషం ఏమిటంటే- కావలి వెంకటబొర్రయ్య జీవిత చరిత్రను కూడా ఆయన తమ్ముడైన రామస్వామి కొంత వివరంగానే ఇందులో చేర్చాడు. ఆ దృష్ట్యా చూసినా ఇది నిస్సందేహంగా విలువైన గ్రంథం

తెలుగులో కవి జీవితాలు నిబంధించడానికి తొలిప్రయత్నం చేసిన గురజాడ శ్రీరామమూర్తిగారు పుక్కిటి పురాణాలకు, జనశ్రుతికి, అభూత కల్పనలకు, అతిమానుష సంఘటనలకు కూడా కవుల చరిత్రలో చోటు కల్పించినట్లే వెంకటస్వామి కూడా కొన్ని కొన్ని చారిత్రక విరుద్ధాలు, సమన్వయించడానికి వీలులేని విషయాలూ వ్రాసి ఉన్నాడు అయితే, ఆ నాటికే అల్లసాని పెద్దన, శ్రీకృష్ణదేవరాయలు, మోహనాంగి, మొల్లలను గూర్చి వ్రాయడం సంతోషం కలిగించక మానదు. ఈ రచయితకు భట్టుమూర్తిపైన ఎక్కువ అభిమానం ఉన్నట్లుగా కనిపిస్తున్నది వసుచరిత్రలోని కొన్ని పద్యాలు కూడా ఆంగ్లీకరించాడీయన శంకరవిజయం ఆధారంగా శంకరాచార్యుల వారి చరిత్రం వ్రాసినట్లుగా ఆయన వ్రాసుకొన్నాడు కవి కాలాదులు, వారి వారి జన్మస్థలాలు, గ్రంథరచనా వివరాలు అక్కడక్కడ వ్యత్యస్తమైనాయి అయినప్పటికీ అఖిల భారత సాహిత్య రంగం నుంచి నూటఎనిమిది మంది కవులను గూర్చి ఆనాడే వ్రాయడం చాలా గొప్ప విషయం

ఈ పుస్తకానికి ఇది నాలుగో ముద్రణ మొట్టమొదట 1829 లో కలకత్తాలో ఇది ప్రచురితమైంది

దీనిని ఆనాటి గవర్నర్ జెనరల్ విలియం బెంటింక్‌కు రచయిత అంకితం చేసినట్లుగా కొందరు పరిశోధకులు వ్రాశారు అందులోని యాథార్థ్యం తెలియటం కష్టం ఏమంటే, ఆ 1829 ప్రచురణ చూస్తేగాని ఈ విషయం తెలియదు. ఈ విధంగా చెప్పిన పరిశోధకులైనా ఆ అంకితం ఇచ్చిన వాక్యాలు ఉదాహరించలేదు,

1847 వ సంవత్సరంలో ఈ గ్రంథం బొంబాయిలో ద్వితీయ ముద్రణం పొందింది అప్పుడీ గ్రందం సర్ ఎరిస్కైన్ పెర్రీ గారికి అంకితం చేయడం జరి గింది. ఈ బొంబాయి ముద్రణను అముద్రిత గ్రంథ చింతామణి ప్రస్తావించింది అముద్రిత గ్రంథ చింతామణి కిందటి శతాబ్దం చివరి దశకంలో వెలువడిన గొప్ప సాహిత్య మాసపత్రిక అమూల్యమైన రచనలెన్నో ఇందులో వెలువడుతూ ఉండేవి

1888వ సంవత్సరంలో మళ్ళీ ఇది కలకత్తాలో ముద్రణం పొందింది. అయితే ప్రకాశకులు దీనిని రెండో ముద్రణగానే భావించే భ్రమకు లోనైనారు.

ఇప్పుడిది నాలుగోముద్రణం అపురూపమైన ఈ గ్రంథాన్ని విలువగల, అపురూపమైన అనేక విషయాలు 'నోట్సు' ఇస్తూ వెలుగులోకి తెచ్చిన డా॥ సి.వి. రామచంద్రరావుగారు సర్వదా అభినందనీయులు పుస్తకానికి ఆయన కూర్చిన నోట్సుద్వారా ఆయన పడినశ్రమ, తీసుకొన్న శ్రద్ధ, చూపిన ఆసక్తి అడుగడు గున కొట్టవచ్చినట్లు కనిస్తున్నవి కీ శే కొమర్రాజు లక్ష్మణరావు మహో దయులు, కీ శే మల్లంపల్లివారు కావలి సోదరుల గూర్చి పరిశోధించారు అటు పిమ్మట శ్రీ నిడదవోలు వెంకటరావుగారు పరిశ్రమించారు కీ శే కోన వెంకట రాయ శర్మగారు తమ 'చరిత్ర పరిశోధకు'లనే గ్రంథంలో కావలి సోదరుల గూర్చిన వివరాలు కూర్చారు ఇటీవల డా॥ జె మంగమ్మగారు కావలి సోదరు లను గూర్చిన పరిశోధనాత్మకమైన వ్యాసం తమ 'భారతదేశంలోని గ్రంథ ముద్రణం' అనే పుస్తకంలో అనుబంధంగా కూర్చారు

డా॥ చల్లా రాధాకృష్ణశర్మగారు కూడా కావలి సోదరులను గూర్చి పరిశో ధిత విషయాలు ప్రచురపరచారు

కావలి సోదరుల చరిత్ర పరిశోధనను గూర్చి, వారి గొప్ప స్థానాన్నిగూర్చి సర్వంకషంగా పరిశోధించి, ఈ గొప్ప గ్రంథాన్ని, అందుబాటులో లేనిదాన్ని ప్రచురించినందుకు డా॥ సి. వి. రామచంద్రరావు అభినంద్యుడు.

(తెలుగు - 1976)

# తెలుగుసాహిత్యంపై శరత్ ప్రభావం

శరత్‌బాబు తెలుగు రచయితేనేమో అన్నంత ఆత్మీయుడైనాడు తెలుగు పాఠకులకు! బహుశా భారతీయ సాహిత్యాలన్నిటా కూడా, తెలుగు సాహిత్యాన్నే ఎక్కువగా ఆయన తన రచనల ద్వారా ప్రభావితం చేసివుండవచ్చు తెలుగు వాళ్ళకూ బెంగాలీలకూ చాలా సామ్యాలు ఉన్నాయి భావోద్వేగమూ, భావుకతా ప్రవృత్తీ ఉభయులకూ ఎక్కువే ప్రాంతీయ భౌగోళిక స్వరూపంలో కూడా పోలికలున్నాయి.

ఉభయప్రాంతాలు తీరరేఖను అంటుకొని ఉన్నాయి విదేశీయ నాగరికతా ప్రభావం కూడా ముందుముందుగా బెంగాలీలను, తెలుగు వారినే ప్రభావితం చేసింది ఇక్కడే విదేశీయులు ముందుగా కాలుపెట్టి స్థిరంగా నిలదొక్కుకున్నారు దక్షిణ భారతదేశంలో బ్రహ్మసమాజం ముందుగా తెలుగుదేశాన్నే ఆకర్షించింది. ప్రభావితం చేసింది బ్రహ్మ సమాజ నాయకులు, ప్రచారకులు తెలుగు దేశంలో ఎక్కువగా పర్యటనలు చేస్తూ వుండేవారు. వంగదేశంలో పుట్టిన ఏ ఉద్యమమైనా గానీ, తెలుగు వాళ్ళను ఇట్టే ఆకర్షిస్తుంది దానికి అనుయాయులు ఇక్కడ బయలుదేరుతారు ప్రచారం లభిస్తుంది. నాటిచైతన్యుని మధురభక్తి మొదలుకొని ఇటీవలి హరనాథబాబా భజనలవరకూ తెలుగుదేశంలో బాగా ప్రచారం పొందడం చూడవచ్చు తెలుగుదేశంలో వీరారాధన తత్పరత్వం, మహాపురుషారాధన తత్పరత్వం, ఇతర ప్రాంతాల వారితో పోల్చిచూస్తే కొంత ఎక్కువే అని చెప్పాలి. చూడండి- తెలుగుదేశంలో కనపడినంతమంది రామమోహన్‌లు, టాగోర్‌లు, బోస్‌లు, చిత్తరంజన్‌దాసులు, అరవిందఘోష్‌లు, వివేకానందులు మరోప్రాంతంలో కనపడకపోవచ్చు ఇది అనుకరణ శీలం కాదు, భావోద్వేగ ప్రవృత్తి. ఒక్క వంగీయుల పేర్లేకాదు- బాలగంగాధరతిలక్, గోపాలకృష్ణ గోఖలేల పేర్లు కూడా తెలుగువారు పెట్టుకున్నారు

## తెలుగులో "గీతాంజలి"

శరత్ రచనలకన్నా ముందే టాగోర్ భక్తి రచనలు, పూర్వ భారతీయ సంస్కృతిని, ఔన్నత్యాన్ని ప్రబోధించే ఆయన రచనలు తెలుగు వాళ్ళను ఆకర్షించాయి బహుశా 'గీతాంజలి'కి తెలుగులో వచ్చినన్ని అనువాదాలు మరే ఇతర భారతీయ భాషలోనూ వచ్చి వుండవేమో! టాగోర్ కన్నా కూడా పూర్వమే ధీరేంద్రనాథ్‌పాల్ 'మొగలాయి దర్బార్', పాంచకడీదేవ్ అపరాధ పరిశోధక నవలలు తెలుగులోకి అనువాదం పొందాయి తెలుగు పాఠకులు విశేషించి ఈ రచనలను అభిమానించారు కూడా. బంకించంద్రుని నవలలు, 'కృష్ణకాంతుని వీలునామా', 'దుర్గేశనందిని', 'విషవృక్షం', ఎప్పుడో ఈ శతాబ్ది తొలి పాదం లోనే తెలుగులోకి అనువాదం పొందాయి గిడుగు రామమూర్తి పంతులుగారి వంటి మహాభాషావేత్త వ్యావహారిక భాషోద్యమానికి ఆధునిక బెంగాలీ సాహిత్యాన్ని ప్రమాణంగా తీసుకొని, టాగోర్ ప్రచారం చేసిన 'చలిత్‌భాష' బెంగాలీలో ఆధునిక ప్రామాణిక వ్యావహారిక భాష అని తెలుగువాళ్ళకు నచ్చచెప్పారు. గురజాడ అప్పారావుగారిపైన ప్రత్యేకించి కలకత్తా ప్రభావం, ఆధునిక వంగ సాహిత్య ప్రభావం ఎంతో ఉంది ఆయన రోజుల్లో కలకత్తా నుంచి వెలువడుతూ వచ్చిన 'రీస్ అండ్ రయత్' అనే ఇంగ్లీషు వారపత్రికలో గురజాడ రచనలు వెలువడుతూ వుండేవి ఈ పత్రికా సంపాదకులైన శంభుచంద్ర ముఖర్జీతో గురజాడ అప్పారావుగారికి సన్నిహితమైన పరిచయం కూడా వుండేది

తెలుగు వాళ్ళను శరత్‌బాబు ఆకర్షించటానికి ఆయన ఆధునిక దృష్టి, మానవోద్యమ ప్రభావమూ ప్రధాన కారణాలు తెలుగువాళ్ళు సంప్రదాయాన్ని పూర్తిగా నిరసించరుగాని, ఆధునిక దృక్పథాన్ని, హేతువాదాన్ని, తర్కాన్ని, సంస్కారాన్ని ఎంతగానో అభిమానిస్తారు. వంగదేశంలో నిజంగా జరిగిన ఒక గాథ తెలుగు సాహిత్యంలో ఆధునిక కావ్య వస్తువుగా రూపొందింది వరకట్న దురాచారానికి బలి అయిపోయిన 'స్నేహలతాదేవి లేఖ' తెలుగులో నవ్యకావ్యమై పోయింది శరత్ రచనలలో భారతీయ మహిళ వ్యక్తిత్వానికి యోగ్యమైన స్థానం కల్పించటానికి ఆయన కృషి చేశాడు తరతరాలుగా అజ్ఞానంలో, అంధకారంలో పురుషుడు సతీత్వపు విలువను ఏ విధంగా కించపరుస్తూ వచ్చిందీ, అందువల్ల సమాజం ఏ విధంగా అధోగతి పాలైందీ ఆయన తన రచనల ద్వారా

వెల్లడించారు 'శేషప్రశ్న'లో కమలవంటి పాత్ర అరవిందుని సహితం ఆకర్షిం చిందంటే, శరత్ సిద్ధాంతీకరించిన మానవత్వపు విలువలను అంచనా వేయవచ్చు

# శరత్ సృష్టించిన స్త్రీ మూర్తి

శరత్ సృష్టించిన పాత్రలన్నీ సంఘంలో అత్యంత వాస్తవికమైనవి, పరిపూర్ణమైనవి జీవితానుభవంలోంచే ఆయన తన పాత్రలను మలుచుకున్నాడు ఆయన పరిశీలన శక్తి అమోఘమైనది తాను చూడకుండా, పరిశీలించకుండా, అనుభూతికి లోనుగాకుండా రచన ఏదీ చేయలేదని ఆయన మిత్రులకు తెలిపాడు ఇంగ్లీషు సాహిత్య ప్రభావంవల్ల, బ్రహ్మ సమాజంవారు ప్రచారం చేసిన సంస్కార భావాలవల్ల, ఆధునిక భారతీయ సంఘంలో మహిళల పట్ల మార్దవ భావము, గౌరవము, నాగరిక దృష్టి పెంపొందాయనడం సబబు ఈ సంస్కారాన్ని తన రచనల ద్వారా శరత్‌బాబు ప్రచారం చేశాడు. కరుణామయి, త్యాగశీలి, అత్యంత సహన పరురాలు, ప్రేమ స్వరూపిణి అయిన తల్లిగా, చెల్లిగా, అక్కగా, పత్నిగా, వదినగా, ప్రియురాలిగా, ఆయన నవలల్లో, కథల్లో స్త్రీమూర్తి సాక్షాత్కరిస్తుంది పతితలను కూడా ఆత్మీయంగా భావించగల రసార్ద్రమైన ఉదాత్తస్థితికి పాఠకులను తీసుకొనిపోతాడు శరత్‌బాబు వాళ్ళ లోపాలుకాని, పాపాలుకాని పాఠకులని విముఖులను చేయవు వాళ్ళలోని మాన వత్వం, ఆ పరిస్థితుల్లో వాళ్ళలోని త్యాగశీలత, వ్యక్తిత్వం, మానసిక సౌకు మార్యం, దృఢసంకల్పం పాఠకులను ఆకర్షించి, వాళ్ళ మనసుల్లో చిరస్థాయిగా నిలుస్తారు వాళ్ళు 'పరిణీత' వంటి చిన్న కథనుంచి 'శ్రీకాంత్' వంటి పెద్ద నవల వరకూ అసంఖ్యాకమైన పాత్రలలో, చిత్ర విచిత్రమైన ప్రవృత్తులలో, అభూత కల్పనలు, అవాస్తవిక సన్నివేశాలు ఏవీ ఉండవు మానవత్వంతో, మానవ ప్రవృత్తితో పాత్రలన్నీ సజీవంగా ప్రవర్తిస్తాయి దురాశాపరులుగాని, లోభులుగాని, జూదగాండ్రు, తాగుబోతులు మొదలైన వ్యసనపరులు గాని మానవ సమాజంలో అత్యంత సహజమైన ఒక భాగంగానే ఆయన రచనల ద్వారా కనిపిస్తారు కాని, అసహ్యించుకొని శిక్షించదగిన వ్యక్తులుగా అనిపించరు. మానవ జీవితంలోని అతి సహజమైన, అతి ఉదాత్తమైన సన్నివేశాలను ఆద ర్శోన్ముఖమైన వాస్తవిక చిత్రణతో ఆయన సాధించగలడు

'బిందుగారబ్బాయి' అనే పెద్ద కథలో అన్నదమ్ముల అనుబంధం, తోడికోడళ్ళ ఆత్మీయత చూడలేని దగ్గర బంధువుల అసూయలు, ఎంతో వాస్తవికంగా చిత్రించాడు శరత్‌బాబు

శరత్‌బాబును తెలుగు వాళ్ళకు మొట్టమొదట పరిచయం చేసింది వేలూరి శివరామశాస్త్రిగారు అని చెబుతారు. ఈయన గొప్ప పండితుడు సముద్రంవలె అగాధమైన పాండిత్యం కలవాడు ఎన్నో భారతీయ భాషలలో గొప్ప ప్రవేశ మున్న మనీషి తెలుగులో చిన్న కథ నుంచి 'అరవిందయోగ దర్శనం', కాశ్మీర యోగిని 'తాత్త్విక చింతనం' వరకు ఎన్నో రచనలు చేశారు వేలూరి శివరామ శాస్త్రిగారు 'బిందుగారబ్బాయి'ని తెలుగు చేసి, శరత్ సాహిత్యాన్ని తెలుగు వాళ్ళకు పరిచయం చేశారు ఆనాటి నుంచి శరత్ సంపూర్ణ సాహిత్యం తెలుగులో ఎన్నో ముద్రణలు పొందింది. బహుశా శరత్‌ను తెలుగులోకి తెచ్చిన అనువాద రచయితలు కనీసం ఇరవై మంది అయినా ఉంటారు

బహుశా కొందరు హిందీ ద్వారా తెలుగు చేసి శరత్‌కు అన్యాయం చేశారు వంగ భాష నుంచే నేరుగా అనువాదం చేసిన రచయితలు చాలా మంది వున్నారు సుప్రసిద్ధ సినిమా నిర్మాత, సాహిత్యవేత్త శ్రీ శే చక్రపాణి 'వాగ్దత్త' మొదలయిన శరత్ నవలలను అనువాదం చెశారు. బొందలపాటి శివరామకృష్ణ, శకుంతలాదేవి సంపూర్ణ శరత్ సాహిత్యాన్ని, శరత్ మిత్రులకు వ్రాసిన ఉత్త రాలతో సహా 14, 15 సంపుటాలలో అనువదించారు బహుశా ఇప్పటికి శరత్ రచనలు తెలుగులో పది ముద్రణలయినా పొంది వుంటాయి నీలకంఠం, పురాణం కుమార రాఘవశాస్త్రి, దిగవల్లి శేషగిరిరావు, నన్నపనేని సుబ్బారావు మొదలైనవారు శరత్ అనువాదకులుగా ప్రసిద్ధులు గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు శరత్ దర్శనం పేరిట, శరత్‌బాబు సమగ్ర జీవిత చరిత్రను, ఆయన సాహిత్య సమీక్షతో కలిపి వెలువరించారు ఒక సుప్రసిద్ధ పుస్తక ప్రచురణ కర్త, విక్రేత, తన భవనానికి, 'శరత్ భవన'మని కూడా పేరు పెట్టుకున్నాడు!

## యువతరంలో ప్రేరణ

ముఖ్యంగా యువ రచయితలలో, శరత్ ప్రభావం ఎక్కువగా కన్పి స్తుంది. ఈ శతాబ్ది తొలిపాదంలో భావకవిత్వం, అమలిన శృంగారం, స్త్రీని

ఆరాధ్య దేవతగా భావించడం, ఆధునిక సాహిత్యాన్ని ప్రభావితం చేశాయి 1930 ప్రాంతాల నుంచి వచన రచనలు విరివిగా వెలువడ్డాయి కొత్త కొత్త పత్రికలెన్నో వెలుగులోకి రావడంతో వచన రచనల ఆవశ్యకత ఎంతో ఎక్కువైంది చిన్న కధకు, నవలకు, చాలా ప్రాముఖ్యం వచ్చింది మౌలికమైన వచన రచనలతోపాటు శరత్ సాహిత్యం కూడా, తెలుగు కాల్పనిక సాహిత్యాన్ని బాగా ప్రభావితం చేసింది 1950 సంవత్సరం వచ్చేసరికి, యువ రచయితలలో శరత్‌బాబును చదవడం, ఒక ధ్యేయంగా చేసుకున్నారు వారిలో రచన చేయాలనే ప్రేరణకు శరత్‌బాబు రచనలు ఎంతగానో తోడ్పడ్డాయి బహుశా శరత్‌ను చదవకుండా, ఈతరం రచయితలెవరూ కలం పట్టలేదేమో ననడం అతిశయోక్తి కాదు. మరిన్నీ 1955, 56 సంవత్సరాలు వచ్చేసరికి శరత్‌లాగా వ్రాస్తాడు, తెలుగులో శరత్‌లాంటి రచయిత అనిపించుకోవడం, గొప్ప గుర్తింపుగా, గణ్యతగా రచయితలు భావించుకోవడం జరిగింది కొందరు రచయితలు శరత్ బాబును అనుకరించడం కూడా జరిగింది, అనువాద రచనలలోని వికృతమైన వాక్య నిర్మాణంతో సహా ఆధునిక సంస్కారాన్ని సూచించే పేర్లూ, అనువాదాలవల్ల సరిగ్గా అర్థం చేసుకోలేని, శరత్‌బాబు తన పాత్రల ద్వారా జీవితాన్ని గురించి చేసే తర్కమూ, పరిస్థితులకు బానిసలై చితికి పోవడమూ, గొప్ప గొప్ప త్యాగాలు చేయడం కొందరు రచయితలు తెలుగు రచనలలో ప్రవేశ పెట్టారు

## కర్తవ్యం గూర్చి చర్చలు

పాదధూళి తీసుకొని నొసట ధరించడం, పరిమళాలను వదలిపెట్టి పాత్రలు వెళుతూ వుండటం, ఎగువ తరగతి కుటుంబాలలో వల్లమాలిన ప్రేమలు- ఇవన్నీ తెలుగు సాహిత్యంలోకి బెంగాలీలో నుంచి దిగుమతి అయినవే మొదటి రోజుల్లో కొమ్మూరి వేణుగోపాలరావు వ్రాసిన నవలల్లో శరత్‌బాబు ప్రభావం బాగా కనపడుతుంది పి.ఎస్. నారాయణ అనే రచయిత వాక్య నిర్మాణం దగ్గరనుంచి శరత్‌బాబు అనువాద రచనలను అనుకరించాడు శైలజ, శేఫాలి, సరోజిని, సావిత్రి, పార్వతి వంటి పేర్లు వంగ సాహిత్యం నుంచే తెలుగు సాహిత్యంలోకి సమాజంలోకి ప్రవేశించాయనుకోవాలి

ఇక ఇటీవల - అంటే ఇంచుమించు ఇరవై సంవత్సరాల కాలంలో శరత్ బాబు నవలలు, మూడు నాలుగు తెలుగు సినిమాలుగా వచ్చాయి. అంతటితో

మధ్యతరగతి పాఠకులకు, తారుణ్యపు జీవన ప్రాంగణంలో అడుగు పెడుతున్న సాహిత్య ప్రియులకు, శరత్‌బాబు మరింత సన్నిహితుడైనాడు 'దేవదాసు,' 'బడదీదీ,' 'నిష్కృతి' మొదలైన నవలలు, పేర్ల మార్పుతో తెలుగు సినిమాలుగా రూపొంది, తెలుగు వాళ్ళను ఆకర్షించాయి. అన్నిటికన్నా ఆశ్చర్యకరమైన విషయం 'దేవదాసు' నవలను ఒక తెలుగు కవి పద్యకావ్యంగా వ్రాశాడు అందునా సంప్రదాయ సిద్ధమైన ఛందస్సుతో! ఆయనను ఎంతగా ఈ ఇతివృత్తం ఆకర్షించిందో మరి పదిహేను తరంగాలుగా, పద్యకావ్యంగా వ్రాశాడు. ఈ రచయిత పేరు కె వి జి రామారావు.

ఆధునిక తెలుగు రచయితలలో ఏ ఒక్కరినో ఇద్దరినో మినహాయిస్తే తప్ప, ఎవరి రచనలూ శరత్ రచనలంత విరివిగా ప్రచారం పొందలేదన్నా, అమ్ముడు పోలేదన్నా సత్యదూరం కాదు

ఈ సృష్టిలో కల్లా అతి ముఖ్యమైన దాంపత్య జీవితాన్ని, స్త్రీ పురుషుల ప్రణయాన్ని, మోహాన్ని, పరవశింపజేసే ఆకర్షణను, ఈ జీవిత పరమార్థాన్ని శరత్‌బాబు వలె తరచితరచి అవగతం చేసుకున్నవారు, రచయితలలో చాలా అరుదు తరతరాలుగా వస్తున్న సాంఘిక వ్యవస్థలో ఈ స్త్రీ పురుష పరిణామాలను, ఆయన తాత్త్విక అవగాహనతో, తన రచనలలో ప్రతిపాదించాడు అందువల్ల ఆయన పాత్రలన్నీ సజీవ శిల్పాలుగా, చైతన్యమూర్తులుగా ప్రత్యక్షమవుతాయి

శరత్‌బాబు గొప్ప మానవతావాది, అందువల్ల ఆయన రచనలు, ఆదర్శోన్ముఖమైన వాస్తవికతకు దగ్గరగా వుంటాయి. మానవ జీవితంలోని ఘర్షణ, అల్పత్వం, బలహీనతలు, ఉదాత్తత, ఆయన సానుభూతితో, మెప్పుతో సంయమంతో చిత్రించాడు శరత్ రచనలలో విశ్వజనీనమైన, సార్వకాలికమైన సాహిత్యపు విలువలు ఉన్నాయి.

తెలుగులో ఇప్పుడు వ్రాస్తున్న రచయితలలో అధిక సంఖ్యాకులపైన కూడా శరత్ సాహిత్య ప్రభావం వుందనే చెప్పాలి ఏమైనా, గత పాతిక సంవత్సరాలుగా, ప్రతిభావంతులైన తెలుగు రచయితలు తెలుగు కాల్పనిక సాహిత్యాన్ని ఎంతగా ప్రభావితం చేశారో, శరత్‌బాబు కూడా, ముఖ్యంగా ఆధునిక నవలా సాహిత్యాన్ని, రచయితలను అంతగా ప్రభావితం చేశాడని చెప్పాలి.

(ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక - 1977)

# బాలసాహిత్యంలో తొలిరచనలు

పువ్వు పుట్టగానే పరిమళించాలంటే ఆ పూసే మొక్కో, తీగో, చెట్టో మంచి పూలు పూసేదై వుండాలికదా! నేటి బాలలే రేపటి పౌరులు అన్న సూక్తి అవసరం వచ్చినప్పుడల్లా వినపడుతూనే వుంబుంది. కాని యీ సంఘంలో ముందు తరాలవారికోసం బాధ్యతతో, పట్టుదలతో కృషిచేసే మహనీయులసంఖ్య తక్కువగానే వుంటుంది

మేలి విత్తనాలు కూర్చుకోలేని జాతి వ్యవసాయం దుర్వ్యవసాయమే దౌర్భాగ్యమే. ఇక దుర్భిక్షమే అందుకని, తెలుగుదేశం సర్వతోముఖంగా ఉన్నతి సాధించాలని తన జీవిత కాలమంతా కృషిచేసిన వీరేశలింగం మహిళాభ్యున్నతి కోసం మరింత పాటుపడ్డాడు వాళ్ళు పాదులు. సంఘంలో వికాసం పాదుకొల్పా లంటే సరైన దోహదం చేయడమేకాక, చీడపీడల నుంచి కూడా కాపాడవలసి వుంటుంది

ఆధునిక కాలంలో మహిళాభ్యున్నతికోసం త్రికరణశుద్ధిగా కృషి చేయడం బ్రహ్మసమాజ ప్రభావమేనని భావించవచ్చు తెలుగుదేశంలో కూడా కిందటి శతాబ్దపు పూర్వార్ధంలోనే మేధావులు బాలబాలికల విద్యాభ్యాసంకోసం, మహిళల మానసిక వికాసంకోసం ఉద్యమించారు పందొమ్మిదో శతాబ్ది ఉత్త రార్ధం వచ్చేసరికి బాలబాలికలు, స్త్రీలు చదివి ఆనందించడానికి మంచి పుస్త కాలు కూర్చాలన్న ఆశయం గొప్ప గొప్ప పండితులైనవారుకూడా ప్రకటించి, అందుకు పూనుకోవడం గమనార్హం అందువల్లనే గొప్ప పండితులైనవారు కూడా నీతిదీపికలు, నీతిమంజరులు, నీతిసంగ్రహాలు, వివేక సంగ్రహాలు ప్రచురించడం జరిగింది అప్పుడప్పుడే బాలికా పాఠశాలల స్థాపనం కూడా నెలకొనడంతో ఈవిధంగా చిన్న తరగతుల బాలబాలికలకు నీతులు బోధించవలసి ఈ పుస్త కాలు ప్రచురించారు. శిష్టు కృష్ణమూర్తిగారివంటి అసమాన పండితులు స్త్రీ నీతి

శాస్త్రమని పద్యకావ్యాన్ని కూర్చారు గజ్జెల రామానుజులు నాయనివారు 1874వ సంవత్సరంలో కడపలో డిస్ట్రిక్టు మున్సిఫ్‌గా వుండేవారు ఇటువంటి ఉన్నత మైన ప్రభుత్వోద్యోగాన్ని చేస్తూ కూడా సతీహిత సంగ్రహం, వివేక సంగ్రహం వంటి చక్కని బాల సాహిత్యం ప్రకటించారు. మొదటి పుస్తకమేమో బాలికల కోసం, రెండోపుస్తకమేమో బాలురకోసం ఉద్దేశించినట్లుగా వారే పేర్కొన్నారు

"సతీహిత సంగ్రహము - ఇది బాలికలకు నుపయుక్తముగ కడపలో నుండెడు గజ్జెల రామానుజులు నాయనివారిచే రచింపబడి, చెన్నపురి శాఖానగర మగు తిరువల్లిక్కేణిలో నెక్కొనియున్న సంజీవని ముద్రాక్షరశాలలో ముద్రింప బడియె 1874 సం। జూన్ నెల 9వ తేది" - అని ముఖపత్ర సమాచారం తెలియ జేస్తున్నది ఈ పుస్తకం ఈవిధంగా రచించడానికి శిష్టుమూర్తిశాస్త్రిగారి సతీహిత సంగ్రహం కూడా ప్రేరకమైందనీ, సహాయకమైందనీ రామానుజులు నాయని వారు పేర్కొన్నారు

"వివేక సంగ్రహము - బాలురకొరకు గజ్జెల రామానుజులు నాయని వారిచే విరచితమై కొక్కొండ వేంకటరత్నము పంతులచేత బరిష్కృతమై చెన్నపురి శ్రీనికేతన ముద్రాక్షరశాలయందు ముద్రితంబై, కలియుగాబ్దము 4974 వది యగు నాంగిరసనామ సం॥ శ్రావణ శు॥ 13 శుక్రవారము నాడు ప్రక టితమయ్యెను" - అని మొదటి కూర్పులో వుంది రెండు సంవత్సరాలన్నా తిరగ కుండానే రెండో ముద్రణ కూడా అవసరమైంది యీ పుస్తకానికి భావనామ సంవత్సరం అంటే 1874 లో రెండో కూర్పు ప్రకటించబడింది. గరిమెళ్ళ వెంకయ్య అనే కవివరుని సహాయం పొంది యీ వివేక సంగ్రహం రచించి నట్లుగా రామానుజులు నాయనివారు పేర్కొన్నారు. ఇది చాలా చిన్న పుస్తకమే అయినా ఇటువంటి ప్రయత్నం కొనియాడదగిందికదా! అయితే ఇలాంటివే చిన్న చిన్న శతకాలు బాలబాలికలకోసం కుమారశతకం, సుమతీశతకం లాంటివి ఇంతకుముందు లేవా అంటారేమో? ఉంటే వుండవచ్చు వాటి లక్ష్యం కేవలం బాలబాలికల మనోవికాసం మాత్రమేకాదు లోక వృత్త చిత్రణం కూడా. బాలికా పాఠశాలలు ఏర్పడి పనిచేయడం మొదలైన తరవాత, కేవలం బాల బాలికల కోసమే వ్రాసినవి పుస్తకాలు

గజ్జెల రామానుజులు నాయనివారి వివేక సంగ్రహం, సతీహిత సంగ్రహాలకన్నా కూడా ముందే స్త్రీ నీతిసంగ్రహ మనేపేరుతో ఇంకో చిన్నపుస్తకం వెలువడింది దీని వివరాలివి:

"స్త్రీ నీతి సంగ్రహము - పూర్వము హైయిస్కూలాంధ్రోపాధ్యాయులలో నొక్కరగు కొమ్మి రంగయ్యగారిచే బాలికలకు మిగుల నుపయుక్తంబుగా రచియింపబడిన స్త్రీ నీతి సంగ్రహము, ముందు ప్రతికి సరిగ చిలుకల పొట్టినాయుడు చేత, అబ్బరాజు వెంకట్రాయుల వారి సర్వవిలక్షణ విద్యావిలాస ముద్రాక్షరశాలయం దచ్చువేయించి ప్రకటింపబడియె 1871 వ సం॥ ఫిబ్రవరి 28 వ తేది." ఈ వివరణలోనే ముందుప్రతికి సరిగా దీన్ని కూర్చడం జరిగిందని ప్రస్తావించి వున్నందువల్ల ఈ పుస్తకం 1871 కన్నా ముందే ప్రచురితమై వుండవచ్చు.

ఆ రోజుల్లో పాఠశాలల మేనేజిమెంటువారు తమకు నచ్చిన పుస్తకాలను పాఠ్యపుస్తకాలుగా నిర్ణయించుకోగలిగిన అవకాశం వుండేది కాబట్టి, గ్రంథకర్తలకు ఇది ప్రోత్సాహకరంగా వుండేది

ఆ రోజుల్లో గజ్జెలవారి వివేక సంగ్రహానికి మంచి ప్రాచుర్యం వున్నట్లుగా భావించవచ్చు

'తల్లిదండ్రిగారు ధనవస్తువులుగావు
బంధుజనులు నాత్మబవులుకారు
విద్య తోడునీడ వేయేల దానినే
గన్నవారు సకల మున్నవారు ' (19 వ ప వివేక సంగ్రహం)

'మంచివారి పొందు మానక చేసిన
జాలమేలు గలుగు జనుల కెపుడు
గంధపంకమందు గపురంబు జేర్చిన
నిండు దావి గలిగి యుండునట్లు ' (37 వ ప ,, )

కొక్కొండ వేంకటరత్నం పంతులవారిచే పరిష్కృతమైనది కాబట్టి, ఆనాటికి వ్యాకరణం తూ చా తప్పకుండా పాటించవలసిందే కాబట్టి సంధులు,

అరసున్నలూ కూడా యథాశాస్త్రంగా కనబడతాయి వివేక సంగ్రహంలో ఈనాటి దృష్ట్యా చూస్తే, బాలసాహిత్యమంటున్నారుకదా ఇంకాస్త సారళ్యముంటే బాగు కదా అనిపించవచ్చు బహుశా వీరేశలింగం గారు దీన్ని దృష్టిలో పెట్టుకొని 'కఠిన సంధులు లోనుగా గలవి' విడిచిపెట్టి తేటగా వుండేట్లు వ్రాయడం జరిగింది వీరేశలింగం పంతులుగారు బాలబాలికలకై నీతిదీపిక, స్త్రీ నీతిదీపిక, నీతికథామంజరి అనే ఈసప్ నీతికథలు, చిన్న చిన్న పద్యాలలోను, సులభమైన వచనంగానూ వ్రాశారు ఇవికాక సతీహితబోధిని అనే పత్రికలోను, ఇంకా కొన్ని పత్రికలలోను కణుమరీగ, బాదంకాయ, వరికంకులు, బ్రాహ్మణి-ముంగిస, పరోపకారము అనే చిన్నచిన్న కథలు వ్రాశారు అబద్ధమాడకూడదని చెప్పటానికి, అబద్ధాలాడటంవల్ల వచ్చే అనర్థాలు వివరించటానికి 'సత్యసంజీవని' అనే పెద్ద కథను వ్రాశారు మాణిక్యం అనే పేరుగల తొమ్మిదేళ్ళ పిల్ల తన అక్క భ్రమరాంబ ముత్యాలహారం అవ్వకూ, అక్కకూ తెలియకుండా మెళ్ళో వేసుకొని, చుట్టాలింటికి భోజనానికి వెళ్ళడం, అక్కడ పిల్లలతో ఆటల సందడిలో వుండగా, ఆ ముత్యాలహారం తెగిపోవడం, ఇక అక్కడినుంచి ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చడానికి ఇంకొక అబద్ధం చొప్పున ఎన్నో అబద్ధాలు చెప్పడం, అవన్నీ చివరకు అక్కరకురాక, అవమానంపాలు కావడం, యీ మొదలైన సన్ని వేశాలన్నీ తొమ్మిది ప్రకరణాలలో పంతులుగారు చాలా ఆసక్తికరంగా వ్రాశారు. వీరేశలింగం పంతులుగారు చిన్నపిల్లల మనస్తత్వాన్ని చక్కగా అర్థం చేసు కొన్న మహానుభావుడు 'మనం కొత్త వాళ్ళింటికి పిల్లలతోనూ, పెద్దలతోనూ వెళ్ళినప్పుడు పెద్దవాళ్ళు పెద్దవాళ్ళతోను, చిన్న పిల్లలు చిన్నవాళ్ళతోనూ కబుర్లు చెప్పుకోవటానికి ఒకచోట చేరుతారు - చూడటంలేదా? మరి చిన్నపిల్లలకూ, ఏళ్ళు పైబడినవాళ్ళకూ పెళ్ళి చేయటం ఏం న్యాయం? ఏం ధర్మం? ఏం సబబు? ఏ వయసువాళ్ళ కావయసుకి కొంచెం హెచ్చుతక్కువలైతే ముచ్చటగా వుంటాయి ఆ దాంపత్యాలు' - అని వ్రాశారు పంతులుగారు చిన్నపిల్లలను చూడండి - తమ యీడుపిల్లలు కనపడితే ముఖాలు మురిసిపోతాయి, విప్పారు తాయి.

ఆధునిక సాహిత్యంలో శాస్త్రీయ దృక్పథంతో బాలసాహిత్యాన్నికూడా ప్రారంభించింది పంతులుగారే ఈసప్ నీతికథలు తొలిసారిగా తెలుగు బాలల కందించింది వీరేశలింగం పంతులుగారే. ఈ కథలకు బొమ్మలు కూడా కూర్చి

ముద్రించారు ఇంచుమించుగా తొంభై సంవత్సరాలకు పూర్వమే నీతికథామంజరి పేరుతో, చిత్రపటాలతో రెండు సంపుటాలుగా యీ కథలు ప్రచురింపబడ్డాయి ఈసప్ నీతికథలలో మొత్తం 158 కథ లనువదించారు పంతులుగారు మొదటి సంపుటంలో 75 కథలు, రెండో సంపుటంలో 83 కథలు చేర్చారు ప్రతి కథకు చివర ఒక చిన్నపద్యం వుంటుంది రెండు పంక్తుల్లో కథ సారాంశమూ, రెండు పంక్తుల్లో నీతి కూర్చారు కథలన్నిటి చివరన కూడా

వసుధ లోపల నరులను బాడుచేయ
స్తోత్ర పారుల మించు శత్రువులు లేరు
లాభమొంద ముఖస్తుతు ల్సలుపువారి
వలల దగులక కనుగల్గి మెలగవలయు

కష్టపడు నట్టివారు లోకంబుతోడ
మొత్తు వెట్టరు తమ కష్టములను గూర్చి
వట్టివారలె యరతురు మిట్టిపడుచు
గొడ్డుగేదెల కరవులు గొప్పగావె!

అనుభవంబును బట్టియే యవనియందు
జనులకును దెల్వియబ్బుట సహజగుణము
కాలుగాలి శ్రమంపడు గండుబిల్లి
నిప్పువద్దకు బోవునే యెప్పుడైన!

వీరేశలింగం పంతులుగారు ధవళేశ్వరం దేశభాషా పాఠశాలలో కొన్నాళ్లు ప్రధానోపాధ్యాయులుగా పనిచేశారు అది 1872 వ సంవత్సర ప్రాంతం. అప్పు డాయన చిన్నపిల్లలకు ఉపయోగపడే నిమిత్తం నీతిదీపికను రచించారు.

'తాత ముత్తాత లెంతెంత ధనము కూడ
బెట్టి, పెట్టెలు నిండంగ బెట్టియున్న
గష్టపడి, తాను న్యాయమార్గమున బడయు
స్వార్జితం బొక గవ్వతో సమము గాదు.'

ఈ విధంగా నీతులున్నాయి ఈ పుస్తకంలో ఈ పుస్తకం నిండా సులభమైన గీత పద్యాలే వున్నవి కిందితరగతుల బాలురకోసం చాలా కాలం చాలా పాఠశాలల్లో యీ పుస్తకం ఉపయోగించబడిందని వీరేశలింగంగారే వ్రాశారు స్వీయచరిత్రలో 1913 వ సంవత్సరానికి ఈ నీతిదీపిక 17 ముద్రణలు పొందడం ఆరోజుల్లో ఈ పుస్తకానికి ఎటువంటి ప్రచారం, విలువ వుండేవో తెలియజేస్తున్నది.

ఈ విధంగా బడిపిల్లలకు యోగ్యమైన పుస్తకాల ఆవశ్యకతవల్ల, పెద్ద పెద్ద పండితులు కూడా ఇటువైపు దృష్టి ప్రసరించడం జరిగింది ఇది చాలా మేలే అయింది లేకపోతే చాలా గొప్ప పండితులైన, శబ్ద రత్నాకర నిఘంటు నిర్మాతలైన బహుజనపల్లి సీతారామాచార్యులవారి వంటి మనీషివర్యులు చిన్న పిల్లల పుస్తకాలవైపు దృష్టి మరలిస్తారా? ఈ విషయం చిత్రగించండి

"సతీధర్మ సంగ్రహము-టిప్పణము తోడిది. ఇది విద్యాభ్యాసము చేయు బాలికలకొరకు బ సీతారామాచార్యుల వారిచే భారతాది గ్రంథములందుండి ఏర్చికూర్చబడినది-1882."

ఇదేవిధంగా కేవలం బాలికలకు మాత్రమే ఉద్దేశించి వీరేశలింగం పంతులుగారు స్త్రీ నీతి దీపిక అనే పేరుతో నీతిబోధకమైన శతకాన్ని రచించారు.

'ఆపదలు వచ్చినప్పుడు నలరుబోండ్లు
తాము ధైర్యంబు విడువక, తక్కుగలుగు
వారి నూరార్చి దుఃఖంబు బాపవలయు
ధైర్యమున నాపద సగంబు తగ్గిపోవు'

వీరేశలింగం పంతులుగారికి సమకాలికుడైన మహావిద్వాంసులు శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు నీతిదీపికను ఎంతగానో ప్రశంసించారు ఈ వాసుదేవ శాస్త్రిగారు ఆ రోజుల్లో బి ఏ పరీక్షలో రాజధానికంతా ఫస్టున కృతార్థులై ఇంగ్లీషు పాండిత్యానికి బంగారు పతకం పొందిన మహనీయులు. వీరేశలింగం గారి వివేకవర్ధనిలో 1875 వ సంవత్సరంలో 'శ్రీ కందుకూరి

వీరేశలింగ కృత సంగ్రహ వ్యాకరణ, నీతిదీపికా ప్రశంస' పేరుతో వాసుదేవ శాస్త్రిగారి అభిప్రాయాన్ని చిత్తగించండి అయితే ఆనాటి సంప్రదాయాన్ని బట్టి, భాష కొంత చమత్కారంగా వుంటుంది పండితులు ఉత్తరాలు కూడా ఆరోజుల్లో ఇటువంటి భాషలోనే వ్రాసుకుంటూ వుండేవారు

"బాలుర కుపయోగకరముగా నేతత్కవి విరచితమగు నీ పొత్తంబు సత్తమ చిత్తంబులకు మోదంబు హత్తించెడు. సరిగ బరికించిన నీ నూరు పద్యంబులు నూరువరా లనవచ్చును

"నీతి యెరుంగని మన బాలురకు దీపము వెలుంగుజూపి పదార్థజ్ఞానంబు గలిగించునట్లు నయానయ వివేకంబు బాల్యంబుననే తెలిపి, పెద్ద పెరిగిన మీదట దుర్ణయ వర్తనులు గాకుండునట్లు చేయుట కిది ముఖ్యాధారభూత మనుటకు సందేహ మొక్కింతయును లేదు"- 1875 అక్టోబరు, వివేకవర్ధని.

సమకాలికుల మెప్పు పొందడం ఎవరికైనా కష్టసాధ్యమే. అటువంటిది పండితులు, ఉన్నత విద్యావంతులు అయినవారిచే వీరేశలింగం ఆ రోజుల్లోనే మెప్పుపొందాడు.

వీరేశలింగం స్త్రీలకోసం సతీహితబోధిని అనే పత్రిక నడిపారు ఇందులో ఎన్నెన్నో కథలు, వ్యాసాలు ఆయన ప్రచురిస్తూ వుండేవారు. స్త్రీలలో చదవాలని, తెలుసుకోవాలని అభిలాష కలిగించడమే ప్రధానోద్దేశం కాబట్టి, లోకజ్ఞానానికి ఆవశ్యకమయిన శాస్త్రీయ విషయాలు తెలుసుకోవటానికి ఆయన వ్రాసిన వ్యాసాలలో మధ్యమధ్య చిన్న చిన్న కథలు కూడా కూర్చేవాడాయన చాలా సులభశైలిలో, ఆసక్తికరంగా వుండేవి ఈ వ్యాసాలు 'తోటకూరనాడే మందలిస్తే, నాకీ దురవస్థ తప్పేదికదా?' అని, దొంగతనం చేసి కఠినదండన ప్రాప్తమైన దొంగ తన తల్లితో మొత్తుకోవడం - ఒక కథగా వ్రాశారు పంతులు గారు స్త్రీలకోసం వ్రాసిన సాహిత్యాన్ని కూడా కొంచెం ఇంచుమించుగా బాల సాహిత్యంగానే భావించవచ్చు.

పంతులుగారు నడిపిన చింతామణి, సతీ హితబోధిని, సత్యసంవర్ధని మొదలైన పత్రికలలో ఆయనగారు చిన్న చిన్న కథలు వ్రాశారు. 'బాదంకాయ'

అనే కథలో ఒక బాదంకాయ కోసం, ఇద్దరు పిల్లలు నాది నాది అని పోట్లాడుకుంటూ వుంటే, కొట్టి పప్పు చెరిసగం పంచుతానని ఒక పెద్దవాడు కొట్టి ఆ పప్పు తానే నోట్లో వేసుకోవటం, రెండు పిల్లులు రొట్టెకోసం వాదులాడి కోతిపాలు చేసిన కథలాగా వుంది బహుశా యీ కథను దృష్టిలో పెట్టుకొనే వీరేశలింగం బాదంకాయ కథ వ్రాసి వుండవచ్చు ఇటువంటిదే ఒక తమాషైన కథను కల్పించి ప్రహసనంగానూ వ్రాసారు పంతులు గారు 'ఉలాయశాస్త్రి' అని యీ ప్రహసనం పేరు లేని పాండిత్యం నటిస్తూ డాబులు పలుకుతూ, విర్రవీగే ఒక అహంకారి భంగపాటు ఈ ప్రహసనంలో చాలా నవ్వు తెప్పిస్తుంది కరక్కాయవైద్యం అనే కథలో ఒక వైద్యుడి మూర్ఖత్వం చూసి జాలీ, నవ్వూ కూడా పుట్టేట్లు వీరేశలింగం వర్ణించారు

జంతుస్వభావ చరిత్ర మనే శాస్త్రీయ గ్రంథంలో కూడా వీరేశలింగం గారు కోతులను గూర్చి చాలా ఆసక్తికరమైన చిన్న చిన్న కథలు కూడా కూర్చారు.

వీరేశలింగంగారు బాల సాహిత్యానికి సంబంధించిన కృషి ఇంకొక విధంగా కూడా చేశారు. ఏమంటే, చిన్న తరగతుల పిల్లలకు వాచక పుస్తకాలు రచించడం పంతులుగారిది సలక్షణమైన, సులభమైన వచనరచన పింగళి లక్ష్మికాంత మహాశయులీ వాచక పుస్తకాలను గూర్చి ఏమన్నారో చూడండి·

"గద్యతిక్కన అయిదు, ఆరు, ఏడు తరగతులకు వాచకములు వ్రాయబూనుట మహా భాష్యప్రవచనముచేయు పండితుడు శబ్దమంజరిని గూడ పాఠము చెప్పటవంటిది చిన్నపనియని ఈసడింపక, విద్యాశ్రేయస్సును గోరి ఆయన ఆ వాచకములను వ్రాయదలచు కొనెను గావుననే ఆనాటి విద్యార్థులు వారి వారి వయో బుద్ధులకు అనుగుణమైన భాషను, విషయమును సముపార్జించుకొనగలిగిన భాగ్యశాలురైరి" అని, అంటూ తరవాత వచ్చిన లెక్కలేనన్ని వాచకపుస్తకాలలో ఈ మేలిమి లేదని నిర్మొహమాటంగా ప్రకటించారు లక్ష్మీకాంతం పంతులుగారు దీనికి కారణం పిల్లల చిత్తవృత్తికి అనుగుణమైన విషయ సంగ్రహణంగాని, భాషా వివేచనగాని వాచక పుస్తక రచయితలలో లేకపోవడమే అని తమ అభిప్రాయాన్ని తెలిపారు వాచక పుస్తక రచయితలను తీవ్రంగా విమర్శించారు.

వీరేశలింగం పంతులుగారి వాచక పుస్తకాల కాలానికి ఇప్పటికి మధ్య సుమారు డెబ్భై అయిదు సంవత్సరాల అంతరమున్నా, బాలసాహిత్యం సర్వసమగ్రంగా అభివృద్ధి చెందవలసిందిపోయి, ఇంకా ముక్కు పచ్చలారని ప్రయత్న స్థితిలోనే వుండడం చాలా విచారకరం!

తెలుగుదేశంలో అన్ని రంగాలలోను పునరుజ్జీవనోద్యమం నూరు, నూట పాతిక సంవత్సరాలక్రితమే ప్రారంభమైంది కిందటి శతాబ్దపు ఉత్తరార్ధంలోని ఆనాటి సాంఘిక పరిస్థితులకు, నేటి సాంఘిక పరిస్థితులకు ఎంతో వ్యత్యాస మున్నది

అయినా - బాలసాహిత్యం విషయంలో మాత్రం, అన్య భారతీయ భాషల విషయం నాకు తెలియదుకాని, తెలుగులో జరగవలసినంత కృషి జరగలేదు. ఇంకా ఎంతో ఎంతో సాధించవలసి వుంది

(బాలల మహాసభల ప్రత్యేక సంచిక - 1977.)

# వీరేశలింగంపై అభియోగాలు

వీరేశలింగం పుట్టి నూట ముప్పయి సంవత్సరాలు గడిచాయి

పరమపదించి సుమారు అరవై ఏళ్ళు కావస్తున్నది.

ఇప్పుడాయన ఆధునికుడు కాడని, అధమ రచయిత అనీ, స్వాతంత్ర్యోద్యమాన్ని సమర్థించలేదని అవివేక ప్రసంగాలు చేస్తున్నారు కొందరు.

వాళ్ళు ఇంకా కొంచెం నేర్పుగా, చురుకుగా ఆలోచిస్తే వీరేశలింగంపై ఇంకా కొన్ని అభియోగాలు కూడ మోపవచ్చు ఆయన శాకుంతలం అనువదించాడు కాబట్టి అభివృద్ధినిరోధకుడు శాకుంతలం ఫ్యూడల్ వ్యవస్థను ప్రశంసిస్తుంది కదా! బహు భార్యాత్వాన్ని కూడా సమర్థిస్తుంది. అంతేకాదు- అమానుషమైన, అతిమానుషమైన సంఘటనల మాటేమిటి! అభ్యుదయ దృక్పథం వున్న వాడెవడూ శాకుంతలం అనువదించటమా?!

ఇంతేకాదు - తరువాత కాలంలో తన చిన్ననాటి రచనలను మెచ్చక పోయినా, సమర్థించక పోయినా అసలు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం- ఆ తర్వాత ఎవరో చమత్కారానికి నీరసం కూడ చేర్చారు - రచించి ఉండవలసింది కాదు అంతటితో ఊరుకున్నాడా? శుద్ధాంధ్రోత్తర రామాయణం, శుద్ధాంధ్ర భారత సంగ్రహం, రసిక జనరంజనం - కనీసం మూడొందల ఏళ్ళ కిందటి అభిరుచు లాయనవి పాతపండితుల, కవి చంద్రుల మస్తిష్కపు బూజు వాసన మాకు కొడుతున్నది సరే, ఈ పద్యాల కూర్పు కూర్చాడే అనుకుందాం. తన గ్రంథాలన్నీ సంపుటాలుగా వేసుకొనేటప్పుడు (1897 నుంచి 99 వరకు రెండేళ్ళు శెలవు పెట్టి తన రచనలన్నీ పది సంపుటాలుగా ఆయనే అచ్చు వేయించుకున్నాడు) వీటన్నిటినీ తగలెట్టి కుకవిత్వ దగ్ధకర్ముడు కాకూడదా?! ఆయనకు అభ్యుదయ భావాలు లేవని మేమంటామంటే అనమా?

1881 వ సంవత్సరం డిశెంబర్ 11 వ తేదిన ఆయన తెలుగు దేశంలో అగ్రవర్ణాల వారిలో మొదటిసారిగా స్త్రీ పునర్వివాహాన్ని తమ ఇంట్లోనే చేశాడు అంతకు ముందే రెండు మూడేళ్ళగా పూర్వరంగాన్నంతా సిద్ధం చేసు కుంటున్నాడు అంతకు ఇంచు మించుగా పాతిక సంవత్సరాలకు పూర్వమే 'వితంతు వివాహాన్ని శ్రుతి స్మృతులు కాని, పురాణేతిహాసాలు కాని నిషేధించడం లే'దంటూ కలకత్తాలో ఈశ్వరచంద్ర విద్యాసాగరుడనే గొప్ప పండితుడు, కారుణ్యవాది, సంఘసంస్కర్త, దేశభక్తుడు, వంగసాహిత్యంలో అధునాతన వచన రచనకు వరవడి పెట్టినవారు, ఒక గ్రంథం బెంగాలీలో ప్రకటించారు బొంబాయి రాష్ట్రంలో కూడా, వీరేశలింగం నడుంకట్టి పూనుకోడానికి ముందే స్త్రీ పునర్వివాహం శ్రుతి, స్మృతి విరుద్ధమా - కాదా అని వాద వివాదాలు చెల రేగాయి ఖండన మండన గ్రంథాలు వెలువడ్డాయి 1872 వ సంవత్సరంలో బందరు నుంచి వెలువడుతుండిన పురుషార్థ ప్రదాయిని అనే పత్రికలో 'విధవా వివాహము శాస్త్రసమ్మతము కా'దనుట, 'వితంతు వివాహఖంగము, సమర్థనము' అంటూ చర్చలు వెలువడ్డాయి కొందరు పిదప కాలం వచ్చిందని తిడుతూనూ, కొందరు శాస్త్ర ప్రమాణాలు ఇందుకు వ్యతిరేకం కాదని వివరిస్తూనూ రాశారు, ఆ పత్రికలో

వీరేశలింగం కూడ శ్రుతులు కాని, స్మృతులు కాని స్త్రీ పునర్వివాహానికి అభ్యంతరం చెప్పడం లేదని అదృష్టవశాత్తూ తనకు కనబడిన ఉపపత్తులను చూపాడు తప్పేమిటి? శ్రుతులు స్మృతులు ఒప్పక పోతే తన సంస్కరణ కార్య క్రమాలన్నీ నిలుపు చేస్తానని అనలేదే! జన్మాంతరము, వర్ణము, ఈశ్వరదత్త పుస్తకములు, దయ్యములు, మత ద్వేషము, విగ్రహారాధనము మొదలైన వ్యాసాలలో ఆయన శ్రుతి, స్మృతి ప్రమాణాల వక్రభాష్యాలను ఖండించాడే! స్వార్థపరులు, స్వప్రయోజన కాంక్షులు, కపటులు, కల్లరులు, డాంబికులు, కూటసాక్షులు నిజమైన సంప్రదాయాన్ని ఏ విధంగా భ్రష్టుపరచారో చెప్పడం తప్పా? ఇదిన్నీ నూరేళ్ళ నాటి సమాజాన్ని గూర్చి ఏమాత్రం ఆలోచించగల వాళ్ళకైనా, ఆ విధంగా వీరేశలింగం చేయడం ఎంత తప్పనిసరో అర్థంకాకుండా ఉండదు అభ్యుదయోల్బణంతో ఉక్కిరి బిక్కిరై పోతున్న ఆధునికోగ్ర వాదులకు కాదు ఆయన శ్రుతి స్మృతి ప్రమాణాల ప్రస్తావన తీసుకొని రావడం! ఆనాటి పీఠాధిపతులకోసం, ధర్మతాచార్యుల కోసం వాళ్ళను ఎదుర్కొవాలి.

వాళ్ళ సిద్ధాంతాలలోని, వాళ్ళు చూపుతున్న ప్రమాణాలలోని లోపాలను వాళ్ళకు తెలియజెయ్యాలి అంతకు తప్ప వేరే మార్గమేముంది? మీవి వక్రభాష్యాలని వాళ్ళకు చెప్పాడు శ్రుతి, స్మృతి, శిష్టాచారం - ఈ మూడున్నూ పూర్వ పూర్వ బలీయాలు ప్రాధాన్యం కలవి కాబట్టి ఈ మూడందాల స్త్రీ పునర్వివాహం శాస్త్ర సమ్మతమేనని ఆయన చూపవలసి వచ్చింది వేదాల్లో ఆడవాళ్ళు చదువుకో డానికి సమర్థనం వున్నదయ్యా అని ఎవరైనా అంటే, అట్లా అయితే మేం మా ఆడవాళ్ళకు చదువు చెప్పించం అంటారా ఎవరైనా?

వీరేశలింగంగారి అతి దుష్ట శత్రువులూ, పరమ క్రూర విరోధులూ కూడా ఆ రోజుల్లోనే మోపలేని నిందను మోపడమే ఇప్పుడు ఆయన శ్రుతి స్మృతులను పట్టుకొని తల కిందులుగా తపస్సు చేశాడనడం ఇంత కన్నా అనౌచిత్యం ఇంకొకటి ఉండదు ఇటీవల సాహిత్య వివాదాలలో ఇంత కన్నా ఘోరమైన, అసత్యమైన ప్రతిపాదనం, అసలు నిజనిజాలు తెలుసుకోకుండా దానికి కొందరు వంత పాట పాడడం జరిగి ఉండదు; జరగలేదనే అనుకుంటున్నాను, నా మట్టుకు నేను

నూరేళ్ళు గడిచిన తర్వాత కూడా ఇవాళ అభ్యుదయ భావాలున్న వాళ్ళ మంటూ చెప్పుకునే వాళ్ళు కూడా ఎంతగా సంప్రదాయ బద్ధులై ఉన్నారో ఆలో చించగల వాళ్ళకు తెలియకపోదు సంప్రదాయ మంటే సామాజిక ప్రయోజనం కలిగి, తరతరాలుగా అపరిహార్యమైన ఒక ఆచారం సంగతికాదు ప్రస్తావించడం. ఎందుకో తెలీక పోయినా, ఆలోచన లేకుండానే ఆచరించడం సంగతి - సంధ్యా వార్చక పోయినా జంధ్యం వేసుకోవడం మాననట్లు ఇవి ఉండాలి వీళ్ళకు అని నిర్దేశితమై ఉన్నవాళ్ళే నూటికి తొంభై తొమ్మిది, ఇంకా మించి కూడ 'పిలక' (శిఖ) వదిలేశారు నూటికి తొంభై మంది జంధ్యం (యజ్ఞోపవీతం) వేసు కుంటున్నారు వీటి మంచి చెడ్డలను కాని, వీటి విషయమై నమ్మకం ఉన్న వాళ్ళను హాస్యం చేయడం కాని, వాళ్ళకు నొప్పి కలిగించడం కాని ఇక్కడ ఉద్దేశం కాదు ఇవాళ్టికి మన సంఘం స్థూలంగా గతానుగతమైన ఆచారబద్ధమయ్యే ఉంది కదా అని మీ దృష్టికి తీసుకొని రావడమే అభ్యుదయ భావుకులు కూడా కర్మ కాండను, మూర్తి పూజను వదలలేదు. (మంచి చెడ్డల సంగతి కాదు నేను నాస్తికుణ్ణికాను, వేంకటేశ్వరుడి పట్ల వైరభక్తి ఉన్నవాణ్ణి కాను) మరి డెబ్బై

రెండు సంవత్సరాల క్రితం యజ్ఞోపవీతం విసర్జించాడు వీరేశలింగం (గురజాడ అప్పారావుగారు వీరేశలింగం కన్న గొప్పవాడనే వాళ్ళు, రమణారెడ్డి గారు ఈ విషయమై ఏమన్నా భోగట్టా చేశారేమో కనుక్కోందురు గాక!)

ఇంకొక విషయం మనవి చేయాలి వీరేశలింగానికీ, గురజాడకీ తులనాత్మక పరిశీలనం ఏమిటి? శ్రీశ్రీ విశ్వనాధ శాస్త్రి కన్న తక్కువ రకం, లేదా తిట్ట దలుచుకుంటే తుక్కు(వ?) కథలు రాస్తాడని ఘోషించడంలాగు వీరేశలింగం కార్యక్షేత్రం వేరు ఆయన పరిధి వేరు ఆయన మూర్తిమంతం వేరు ఆయన మహత్వం వేరు వీరేశలింగం 1910 వ సంవత్సరానికి ఇంచుమించుగా ఉడిగి పోయినాడు కృతజ్ఞత లేకపోగా కృతఘ్నత మాత్రం కావలసినంత కనపరుస్తూ వీరేశలింగం పై తెలుగువాళ్ళు ఆనాడే అపవాదులు ప్రచారం చేశారు 1910 లో కథకుడుగా పుట్టినవాడు గురజాడ అప్పారావు కన్యాశుల్కం రెండో ముద్రణంలో వ్యవహారికానికి పట్టం కట్టినవాడు వీరేశలింగం కన్న గురజాడ గొప్ప శిల్పి ఫలాని వారికన్న ఇంకో ఫలానివారు గొప్పశిల్పి అన్నంత మాత్రాన వొరిగే దేమిటి? వీరేశలింగం మెట్రిక్యులేటే గురజాడ బియ్యే కూడా కుతుర్కమూ, వితండవాదమూ గురజాడ గొప్పతనాన్ని భంగంచేయడంలోనూ ప్రవేశ పెట్టవచ్చు ఉదాహరణ కావాలంటే - పాషాణ హృదయుడికైనా కన్నీరు తెప్పించే పూర్ణమ్మ కథలో దుర్గ గుడి ప్రసక్తి ఎందుకు? పూర్ణమ్మ కళ్ళను కలువలతో పోల్చడం అరిగి పోయిన కవి సమయం కాదా? దుర్గను చేరెను పూర్ణమ్మ అనడం ఏం బాగుంది? ఇత్యాదయః. ఇంకా అతి తెలివికి పోతే 'సరుల చెమటను తడిసి మూలం ధనం పంటలు పండవలెనోయ్' - మూల మంటే దేశమనియెడి దొడ్డ వృక్షం మూలమా? వైరములు వాణిజ్యమందే - పెట్టుబడిదారీ వ్యవస్థ లోని పోటీ వాసనకొడుతూంది "దేవుళ్ళారా మీ పేరేమిటి" కథ రాసిన గురజాడ 'దుర్గ గుడి' ప్రస్తావన తేకుండా వుండాల్సింది గురజాడ బొట్టు పెట్టుకోవడం చాలా తప్పు, ఆయన తన పిల్లలకు తన శాఖలోనే వివాహాలు చేశాడా?- ఇదంతా విమర్శ కిందనే లెక్కా?

రామాయణంలోని పిడకల వేట లాగా గురజాడను తీసుకొని రావడం తప్పే ఇక్కడ.

1919 వ సంవత్సరంలో వీరేశలింగం చనిపోవటానికి మూణ్ణెల్ల ముందు ఆయన వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజానికి అధ్యక్షుడుగా వుండటానికి వొప్పుకున్నాడు వాడుక భాషనే రాయాలి అన్నది ఆ సమాజం ధ్యేయం గిడుగు రామ్మూర్తి సేకరించిన ప్రయోగాలన్నిటిని ఉపయోగించి వీరేశలింగం వ్యాకరణం రాయడం కూడా ఆ సమాజం వారి లక్ష్యాలలో ఒకటి దాని కనుగుణంగా నవ్యాంధ్ర వ్యాకరణం - అని మొదలుపెట్టి ఐదారు పుటల నోట్సు రాసుకున్నాడు వీరేశలింగం అందులో మొదటి వాక్యం ఏమిటో మీకు తెలుసా? "కవిత్వము ద్వివిధము సశృంఖలము విశృంఖలమూ" అనీ విశృంఖల కవిత్వ మంటే వచన కవిత్వాన్ని ఆనాడే ఆయన క్రాంత దర్శిగా ప్రతిపాదించాడనుకుందామా? ముది మది తప్పిన చాదస్తంతో ఏదో రాశాడంటారా? తన జీవిత మంతా ప్రయోగాలతో, సంఘర్షణలతో పోరాటాలు సాగించిన వీరేశలింగానికి మరొక రచయితకు పోలికేమిటి? ఇవాళ చదువుతున్నా ఆయన వచన రచనలు సరళమైన శైలిలోనే కనపడతాయి కాని అన్వయ కాఠిన్యం, పాండిత్య ప్రదర్శనం కనపడవే! కాకపోతే కాస్త పొడుగాటి వాక్యాలూ, అమాయకమైన నిష్కల్మష మైన తర్కం, ముడి సరుకు అనిపించే భావాలూ అక్కడక్కడా కనపడితే కనపడతాయిగాక- అంతమాత్రం చేత ఆయన్ను గొప్ప రచయిత కాదనడం న్యాయమా? భావ్యమా? వాడుక భాషకు వికాసం కలిగిస్తూ, దాన్ని పఠన పాఠన యోగ్యమూ, సమర్థమూ చేయాలన్న సాహిత్య సంస్థకు వీరేశలింగం అధ్యక్షుడూ, రామ్మూర్తి కార్యదర్శీ కావడంలోనే వీరేశలింగం ఆధునిక దృక్పథం సువాసించడం లేదా?

డెబ్బై సంవత్సరాల జీవిత కాలంలో నిరంతరం వెన్నంటి తరిమే అనారోగ్యమూ, సంస్థలు స్థాపించడంతో, సంస్కరణ కార్యక్రమాలతో ఉత్పన్నమైన సమస్యలతోనూ ఆయన సతమతమైనాడు ఒక్క క్షణం విశ్రాంతి లేదు రాసింది రెండోసారి రాయడం లేదు అటువంటప్పుడు ఫలాని వారి పాండిత్యం, శిల్పం ఈయనకు లేదనడం సబబు కాదు. వెనకటికి కొందరు గురజాడను అకవి బిరుద పాత్రుణ్ణి చేయడంలో ప్రదర్శించిన అనౌచిత్యం కంటే ఎన్నో రెట్లు అవివేకాన్ని ప్రదర్శించడం వీరేశలింగాన్ని అధమ రచయిత అనడం కన్యాశుల్కం గొప్ప రచన కావచ్చు. తిర్యగ్విద్వన్మహాసభ కూడా గొప్ప రచనే అంటాను నేను బ్రాహ్మ వివాహం, వ్యవహార ధర్మబోధిని

కనీసం ఇరవై యేళ్ళ కన్నా ముందే, గురజాడ కన్యాశుల్కం రాయడానికి ముందే వీరేశలింగం రాశాడు అవి మంచి రచనలు కావా? ఎందుకావు? పైన వాడుకభాషలో కూడ రాశాడు

గిడుగు రామ్మూర్తి కూడ నిజమైన సంప్రదాయం వాడుకభాష రాయడమే అన్నాడని - ఆయన్ను తిరోగమనవాది అందామా? వెనకటి మతలబులూ, దస్తావేజులూ, కవిలెకట్టలు, స్థానికగాథలూ, శాసనాలూ సాక్ష్యంగా తెచ్చాడు కదా! అట్లానే శ్రుతి, స్మృతులు వీరేశలింగం ఒప్పుకున్నాడనుకో కూడదా? అదిన్నీ హేతువాదమూ, మానవానుభవమూ, అభ్యుదయమూ భంగం కానంతవరకే పురుష సూక్తాన్ని ఆయన ప్రక్షిప్తం అన్నాడు అది చెప్పే అవయవార్థం ఆయన వొప్పుకోలేదు

ఆయన రాసిన రాజశేఖర చరిత్ర ఏమైపోయింది? కవుల చరిత్ర ఏమైపోయింది? విజ్ఞాన శాస్త్రాలన్నీ ఏమైపోయినాయి? మార్గదర్శకత్వం ఏమైపోయింది? గొప్ప త్యాగమంతా ఏ గంగలో కలిసింది? ఆయన సుడివాదాన్ని, పిడివాదాన్ని, అస్తిత్వవాదాన్ని, ఇంకో చట్టుబండల వాదాన్ని ఎరగడనడంతో ఆధునిక భావాలు లేనివాడు కావలసిందేనా? ఆయన గ్రాంథికం రాయడం నేరమేమీ కాదు నవ్యులు కనీసం ఆయనలా అర్థమయ్యేట్లు కూడా రాయడం లేదు కొందరు - విరవీగడం తప్ప ఇట్లా అంటే గ్రాంథికం సమర్థించడంగా పొరపాటు పడగూడదు.

నూరేళ్ళ వెనుక ఏ పరిస్థితులున్నాయో, ఆ పరిస్థితులలో తరతరాలుగా వేళ్ళు తన్ని ఉన్న దురాచారాలను, అంధ విశ్వాసాలను పెకలించివేసే ప్రయత్నం ఆయన ఏ విధంగా చేశాడో, ఎంతవరకు కృతకృత్యుడైనాడో, ఆ ప్రయత్నంలో సాహిత్యాన్ని ఏ విధంగా సాధనం చేయకున్నాడో, ఆ సాహిత్యంలో అందచందాలు అసలేమైన ఉన్నాయో లేవో నిర్మమంగా, ఆవేశ రహితంగా అంచనా వేయాలి అదీ సబబు.

అసలు తెలుగు సాహిత్యంలో లౌకికదృక్పథం ప్రవేశపెట్టిన వాడు వీరేశలింగమే కదా! ఇంచుమించు తొమ్మిది వందల సంవత్సరాలుగా, వచనం కాని, పద్యంకాని, యక్షగానంకాని, జానపదంకాని, భారత రామాయణాలు, పురాణాలు,

ఇతిహాసాల నుంచి మాత్రమే స్వీకరిస్తూ వచ్చిన ఇతివృత్త స్వీకరణం మార్చి వేసిందెవరు? రాజశేఖ చరిత్రం, పెద్దయ్యగారి పెండ్లి పుస్తకం, ప్లీడరు నాటకం, సత్యవతీ చరిత్రం తెచ్చిందెవరు? వాదానికి పాల్కురికి సోమన బసవపురాణం కథలున్నాయి గదా అంటారేమో! అవి కూడా దివ్యగాథలే కదా - దేవతల ప్రత్యక్షాలూ, వరాలూ ఇత్యాది కేవలం భూమి మీద సంచరిస్తూ, పుట్టిగిట్టే మనుషులను సాహిత్యంలోకి తెచ్చింది వీరేశలింగమే! ఇది కూడా ఆయన గొప్పతనం కాకపోతుందా?

ఇక వీరేశలింగం స్వాతంత్ర్యోద్యమంలో పాల్గోలేదనే అపవాదు ఒకటి వుంది ఇవాళ్టి ఘనుల్లాగా కాదు - ఆ రోజుల్లో ఇంగ్లీషువాళ్ళ నాయన తీవ్రంగా విమర్శించాడు అవసరం వచ్చిన చోట్ల తప్పులు తప్పులని స్పష్టంగా చెప్పాడు. ఆయన ఇంకా ఇరవై ఏళ్ళు ఆగి పుట్టకపోయినాడా అంటే ఎంత సొగసుగా వుంటుందో, బ్రిటిషువాళ్ళను స్వాతంత్రం కోసం ఖండించ లేదనడమూ అంతేగా ఉంటుంది

వీరేశలింగానికి ఎవరూ వకాల్తా తీసుకోవల్సిన పనిలేదు అయితే ఒకచోట ఆయన రాసినట్లు, విద్యాధికులు సత్యాన్ని అంగీకరించడం నేర్చుకుంటేనే దేశానికి మేలు అంటూ జరుగుతుంది.

ఈ అభిప్రాయాలను ఇంతకన్నా హేతుబద్ధంగానూ, వినయంగానూ, సంక్షేపంగానూ, సూటిగానూ చెప్పలేక పోయిన నా అశక్తతకు విచారిస్తున్నాను, సిగ్గుపడుతున్నాను

(అభ్యుదయ - 1978)

# ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ

''గాంధీ మహాత్ముడు బయలుదేరగా
కలకల నవ్వింది జగత్తు కలకల నవ్వింది
గాంధీ మహాత్ముడు చకచక నడువగ
కంపించిపోయింది, భూదేవి కంపించిపోయింది
గాంధీ మహాత్ముడు కన్నువిప్పగా
గడగడ వణకింది, అధర్మము గడగడ వణికింది
గాంధీ మహాత్ముడు నవ్వునవ్వగా
కన్నుల గట్టింది, స్వరాజ్యం కన్నుల గట్టింది
"
(బసవరాజు అప్పారావు)

అని తెలుగు కవులు పరవశంతో గానం చేశారు ఆయనను దర్శించి తమ జన్మ ధన్యమైనట్లు తెలుగు ప్రజలు పొంగిపోయినారు ఆయనను అవతార పురుషుడిగా కొలిచారు కొత్త యేసు అవతరించాడనీ, హిందూపైగంబర్ జన్మించాడనీ, 'ఈశ్వరుడే గాంధీగా ఇల నవతరించాడని', ఆయన పలుకు వేణునాదమనీ కవితలల్లారు నిజంగా ఆధునిక భారతదేశ చరిత్రలో అత్యద్భుత దివ్యోజ్జ్వలగాథ గాంధీ మహాత్ముడి నాయకత్వంతో సాగిన స్వాతంత్ర్య సమరం సుమారు ముప్పై సంవత్సరాల కాలం భారతదేశపు రాజకీయ భవితవ్యాన్ని ఆయన శిల్పించుకుంటూ వచ్చారు ఆయన అవతార సమాప్తి కూడా ఐతిహాసిక లక్షణాన్ని వ్యక్తం చేస్తున్నది ఒక కాలంలో, ఒక జాతిని, ఒక దేశాన్ని ఉద్ధరించడానికి వచ్చిన దివ్యపురుషుడు గాంధీజీ దేవదూత ప్రపంచమంతటినీ ప్రభావితం చేసినవాడు ప్రవక్త. ఆయన జీవితం విషయంలో పుట్టుకతోనే ఆపాదించవలసిన మహత్తర దివ్యసంఘటన లేవీ లేవు అతి సామాన్యమానవు డాయన. అయినా మహాపురుషుడు కాగలిగాడు రానున్న కాలంలో, ఆగామి శతాబ్దాలలో ఆయన జీవితగాథలకు కాంతిపరివేషాలు కూడుకుంటాయి మహాత్ముడు నడిచిన

దారిలో మంగళనీరాజనాలెత్తారు ప్రజలు ఆయనపై పుష్పవృష్టి కురిపించారు శిథిల జీవితాలలోంచి చైతన్యాన్ని, మంటిముద్దలనుంచి మహావీరులను సృష్టించిన మహాశిల్పి ఆయన ఆత్మశక్తి అజేయమని నిరూపించిన దివ్యసందేశాన్ని మానవాళికి ప్రసాదించాడు.

1969 వ సంవత్సరంలో మహాత్ముడి శతజయంతి జరిగింది ఈ శత జయంతిని ఘనంగా జరుపుకొనే ఉద్దేశంతో ఐదు సంవత్సరాలపాటు దేశ వ్యాప్తంగా జయంత్యుత్సవాలు నిర్వహించాలనీ, ఆ నాటికి భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో మహాత్ముడు సంచారంచేసి ఏ విధంగా ప్రజలను ప్రబోధితులను చేసిందీ, ఆ వివరాలన్నీ గ్రంథరూపంగా ప్రచురించాలని గాంధీజీ స్మారక సంగ్రహాలయం, గాంధీ స్మారకనిధి అనే అఖిల భారతీయ సంస్థలవారు సంయుక్తంగా చేసిన నిర్ణయాన్ని హర్షించి, ఆమోదిస్తూ భారతప్రభుత్వం 1964 వ సంవత్సరంలోనే, ఆయా రాష్ట్రప్రభుత్వా లన్నిటికీ ఈ కార్యక్రమాన్ని చేపట్టవలసిందిగా వర్తమానం పంపడం జరిగింది గాంధీజీ శత జయంతి సంవత్సరానికి ఇటువంటి చరిత్రాత్మక ప్రశస్తిని నిరూపించే గ్రంథాన్ని ప్రతి రాష్ట్రమూ వెలువరించాలనేదే భారతప్రభుత్వంవారి ఆశయం ఈ సదాశయం మేరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు 1964 వ సంవత్సరంలో బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతతో ప్రముఖ స్వాతంత్ర్యయోధులు, దేశభక్తులు కొందరు సభ్యులుగా ఒక సంఘాన్ని నియమించారు ఇంచుమించు ఒకటిన్నర దశాబ్దాలకాలం ఎంతో శ్రమించి ఈ గ్రంథాన్ని ఆ సంఘం వెలువరించగలిగింది. మద్రాసు, ఢిల్లీ, హైదరాబాద్‌లలో గల పురాపత్ర నిలయాలు, ప్రభుత్వాధీన సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, వ్యక్తిగత సంగ్రహాలు, పత్రికా కార్యాలయాలు మొదలైన అన్ని ఆకరాలనుంచీ విషయ సేకరణంచేసి ఇటువంటి అమూల్యమైన బృహద్గ్రంథాన్ని ప్రచురించినందుకు, ఈ మహద్విశిష్ట కార్యక్రమంలో పాల్గొన్న వారందరూ అభినందనార్హులే. ఈ కార్యక్రమం ఎన్నో వొడుదుడుకులకు గురి అయినా, అనుకున్నది సాధించగలిగి, ఆంధ్ర ప్రజలకు ఒక గొప్ప పుస్తకాన్ని అందించగలిగారు - 'ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ పర్యటన'ను సంకలనం చేయడానికి బాధ్యత స్వీకరించిన సంఘంవారు

స్వాతంత్ర్యానంతరం తెలుగులో వచ్చిన గొప్ప పుస్తకాలలో ప్రథమ గణ్యమైన వాటిలో ఈ విలువైన గ్రంథాన్ని కూడా నిస్సందేహంగా చేర్చవచ్చు విషయ విన్యాసానికి రూపమిచ్చి, ఆకర్షణీయంగా చేసిన సంపాదకులు శ్రీ కొడాలి ఆంజనేయులుగారి కృషి మెచ్చదగినది కోదాటి నారాయణరావుగారి ప్రస్తావనలో ఈ గ్రంథాన్ని యీ విధంగా ప్రచురించడానికి ఎదుర్కొన్న సాధక బాధకాలను, పడిన శ్రమను గూర్చి తెలుసుకోవచ్చు ఎన్నో కష్టనిష్ఠూరాలను అధిగమించి నిర్వాహకులు ఈ గ్రంథాన్నీవిధంగా తీసుకొనిరాగలిగారు నిర్వాహణ కార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావుగారే ప్రస్తావించినట్లు, ఇంకా కొంత సమాచారం, ఇతరత్రా ఆధారాలద్వారా సేకరించడానికి అవకాశం తప్పకుండా ఉండి ఉంటుంది దేనినీ సర్వసమగ్రమని చెప్పడానికి అవకాశం లేదుకదా! ఆనాటి గాంధీజీ తెలుగు దేశపర్యటన విశేషాలను వివరాలను ముఖ్యంగా ఆంధ్ర పత్రిక, కృష్ణాపత్రికల వంటి తెలుగు పత్రికల ద్వారానూ, హిందూ, మెయిల్ వంటి ఇంగ్లీషు పత్రికలద్వారాను గ్రహించినట్లుగా కనపడుతుంది ఆంధ్రదేశంలో ఆనాటి స్వాతంత్ర్యసమరయోధులుగా ప్రసిద్ధికెక్కిన దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావుగారి స్వీయచరిత్రలనుంచి కూడా ఆయా సందర్భానుసారంగా కొన్ని విషయాలను సేకరించారు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని కారాగారవాసాన్ని అనుభవించడమే కాక, గాంధీజీతో సన్నిహిత పరిచయం ఉన్న ఈ నాయకుల ఆత్మకథలనుంచి ఆయా విషయాలు ఉదాహరించడం బాగానే ఉంది అయితే ఈ శతాబ్ది పూర్వార్ధంలో జాతీయోద్యమంలో యథోచితంగా, యథాశక్తిగా పాల్గొన్న కొందరు తెలుగువారు ఇతరులు కూడా తమ తమ స్వీయచరిత్రలు రాసుకున్నారు మిక్కిలి సంగ్రహంగానే అయినా, వారి వారి స్వీయానుభవాలను గూర్చిన ప్రస్తావనలు కూడా అనుబంధంగానైనా చేర్చివుంటే, పాఠకులు ఈ గ్రంథాల ఉనికిని గూర్చి తెలుసుకొనడానికి అవకాశం ఉండేది ఉదాహరణకు దరిశి చెంచయ్యగారి 'నేను-నా దేశం', డా॥ పి తిరుమలరావుగారి 'గడచిన రోజులు', గొట్టిపాటి బ్రహ్మయ్యగారి 'నా జీవితనౌక' మొదలైన స్వీయచరిత్రలలో తెలుగుదేశంలో గాంధీజీ కలిగించిన సంచలనాన్ని గూర్చిన వివరాలున్నవి కోటంరాజు రామారావు, డి ఎస్. శర్మగారు ఇంగ్లీషులో రాసుకున్న స్వీయచరిత్రలలో కూడా ఆసక్తికరమైన విషయాలున్నవి సర్వ దుఃఖ నివారణోపాయమన్న పేరుతో రాసుకున్న బులుసు వెంకటేశ్వర్లుగారి

ఆత్మకథలో గాంధీజీ హాస్యప్రవణతకు నిదర్శనమైన ఒక చిన్న సంఘటన వర్ణితమై ఉంది తణుకులో ఎర్రమిల్లి రామనాథంగారి ఆతిథ్యంలో గాంధీజీ గడిపినప్పటి సన్నివేశమది దువ్వూరి సుబ్బమ్మగారికీ, మహాత్మాగాంధీకి మధ్య నడిచిన హాస్య సంభాషణ అది పట్టాభి సీతారామయ్యగారు వాళ్ళిద్దరిమధ్యా ద్విభాషిగా వ్యవహరించారు కవికొండల వెంకటసత్యనారాయణమూర్తిగారి స్వీయచరిత్ర ఇంకా అముద్రితం ఈయన ఇప్పుడు శతవృద్ధు ఈయన ఆనాటి విశాఖమండలం జాతీయోద్యమంలో దట్టిబిగించి పనిచేసినవారు. వీరి స్వీయచరిత్రలో గాంధీజీ వీరికి రాసిన ఉత్తరం ఒకటి కనపడుతుంది. ఈ విధంగా పరిధిని విస్తృతం చేసినకొద్దీ, గాంధీజీని గూర్చి ఇంకా ఇంకా విశేషాలు, వివరాలు తెలుసుకొనే అవకాశం లేకపోలేదు మాదల వీరభద్రరావుగారు గుంటూరు జిల్లా స్వాతంత్ర్యోద్యమ చరిత్రను గ్రంథస్థం చేసినట్లుగా ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలకు సంబంధించి స్వాతంత్ర్యోద్యమ చరిత్రను సంకలితంచేసే ప్రయత్నం చేస్తే మరిన్ని విశేషాలు తెలుసుకొనే అవకాశం ఉంటుంది

'ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ' అని ఈ గ్రంథానికి నామకరణం చేసినా, స్థూలంగా స్వాతంత్ర్యం రాకపూర్వం తెలుగు సంస్కృతి ఏయే ప్రాంతాలలో దర్శనీయంగా ఉండి తెలుగు ప్రజలు నివసిస్తూ ఉండేవారో, ఆయా ప్రాంతాలు గాంధీజీ పర్యటించినప్పటి విశేషాలు కూడా గ్రంథస్థమై ఉన్నాయి మద్రాసు, బళ్ళారి, గంజాం జిల్లాలోని బరంపురం మొదలైనచోట్ల గాంధీజీ పర్యటన విశేషాలు కూడా సవివరంగా ఈ గ్రంథంలో పొందుపరచడం జరిగింది ఈ ప్రాంతాలన్నీ ఆనాడు అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఉండేవి. అంతేకాక, తెలుగువాళ్ళు కూడా అక్కడ గణనీయమైన సంఖ్యలో ఉంటూ, స్థానికంగా ప్రాముఖ్యంవహించి ఉండేవారు. గాంధీజీ బళ్ళారిలో ప్రవేశించగానే ఆంధ్రనాటకపితామహ ధర్మవరం కృష్ణమాచార్యుల వారింటికి వెళ్ళి (పుట 313) అక్కడ వారితో పదినిమిషాలు గడిపారని తెలుసుకోవడం తెలుగువారికి సంతోషదాయకం కదా! అట్లాగే మద్రాసులో దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు, గద్దె రంగయ్యనాయుడు, టంగుటూరి ప్రకాశం మొదలైన వారంతా గాంధీజీ సపర్యలలో ఉంటూ ఉండేవారు. ఆనాటి తెలుగు ప్రాంతాలుగానే పరిగణించవలసిన ప్రదేశాలతో కలుపుకొని, పూర్వ హైదరాబాదు రాష్ట్రంలో గాంధీజీ పర్యటనలను కూడా లెక్కలోకి తీసుకొని, ఈ గ్రంథంలో మహాత్ముని సంచారాన్ని గూర్చిన వివరాలున్నవి. ఈ

పరిగణనం సముచితంగా ఉంది. ఈ విధంగా 1896వ సంవత్సరంలో దక్షిణాఫ్రికానుంచి తొలిసారిగా వచ్చి మద్రాసు నగరాన్ని సందర్శించినప్పటినుంచి 1946 లో దక్షిణభారత హిందీ ప్రచారసభ పట్టప్రదానోత్సవానికి మద్రాసు నగరం విచ్చేయడం వరకూ, పన్నెండుసార్లు గాంధీజీ తెలుగువారుండే ప్రాంతాలను దర్శించి వాళ్ళను చైతన్యవంతులను చేయడం జరిగింది ఒక్కొక్కసారి ఆయనకొన్ని జిల్లాలు మాత్రమే పర్యటించి వెళుతూ ఉండేవారు. మార్గమధ్యంలో ప్రజలంతా దైవదర్శనానికి గుమికూడినట్లుగా కూడుతూ, ఆయన్ను దర్శించి ధన్యత నందినట్లు భావించేవారు 1946 లో మద్రాసునుంచి వార్ధాకు తిరుగు ప్రయాణం చేస్తున్నప్పుడు ఖమ్మం, వరంగల్ మొదలైన చోట్ల మహాత్ముణ్ణి సందర్శించటానికి తెలుగు ప్రజలు ఎంత ఆత్రుతచెంది, అసంఖ్యాకంగా హాజరైందీ ఈ పుస్తకంలో చదువుతున్నప్పుడు అద్భుతమైన అనుభూతి కలుగుతుంది

గాంధీజీ తెలుగువారిపట్ల ఎంతో అభిమానం చూపారు. వారిని గూర్చి ఎంతగానో ప్రశంసించారు అయితే, అవసరమనుకొన్నప్పుడు వారిని గట్టిగా మందలించారు వారి లోపాలను ఎత్తిపొడిచారు. 'నాకు తెలుగు తెలుసు నాకు తెలుగు అర్థమవుతుంది తెలుగువాళ్ళంటే నాకు చాలా ప్రీతి తెలుగువాళ్ళు ఉదారులు, ఉన్నతాశయాలు కలవాళ్ళు, త్యాగసహిష్ణులు, ఉద్రేకపరులు' అంటూ తెలుగుదేశపు సౌందర్యాన్ని, సౌభాగ్యాన్ని, ఔన్నత్యాన్ని పొగిడారు అయితే తెలుగువాళ్ళలో అనుచరులుగా ఉండటం కంటే నాయకులుగా ఉండటానికే అంతా అభిలషిస్తారని గాంధీజీ సున్నితంగా విమర్శించేవారుకూడాను తనకు సమర్పించిన విలువైన ఆభరణాలను, నగలను, వస్తువులను వేలంవేస్తూ ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు అంటూ తాను నేర్చిన మూడు తెలుగు మాటలు కూడా ఉపయోగించేవారుట గాంధీజీ (పుట 476). తెలుగు దేశాన్ని గూర్చి చెపుతూ "అక్కడ కవిత్వమున్నది, ధర్మమున్నది, త్యాగబుద్ధి ఉన్నది. జాతీయ పాఠశాలలు చాలా ఉన్నాయి చాలామంది లాయర్లు ఉద్యమంలోకి వచ్చారు" (పుట 263) అని యంగ్ ఇండియా పత్రికలో ఆయన రాశారు 'హిందూదేశమంతటిలో ఆంధ్ర స్త్రీలు నూలు వడికినట్లు మరొకరు వడకరు' (పుట 313) అన్నారు ఆంధ్రుల ధైర్యసాహసాలను, కార్యనిరతిని, త్యాగశీలాన్ని శ్లాఘించారు. (పుట 336) "డబ్బు, నగలు కావాలి" అనే మాటలు కూడా తెలుగులోనే అంటూ తెలుగువాళ్ళని గాంధీజీ బాగా ఆకర్షించేవారుట.

"రాజమహేంద్రవరంలో జరిగిన బహిరంగ సభానంతరం గాంధీజీ గోదావరి స్టీం లాంచ్‌లో కూర్చున్న తరవాత ఒక యువకుడు వచ్చి గాంధీజీని తెలుగులో సంతకం చేయమని కోరనాడు గాంధీజీ సాంబమూర్తిగారి వంక చూసినారు సాంబమూర్తిగారు "గాంధీ" అనే అక్షరాలు వ్రాసి ఇచ్చినారు గాంధీజీ దానిని దిద్ది యువకునికి ఇస్తూ "నా తెలుగు సంతకం బాగుందా?" అన్నారు యువకుడు "చాలా బాగుంది" అన్నాడు గాంధీజీ నవ్వుతూ "బాగుండ కేంజేస్తుంది?" అన్నారు అంతట ఆ యువకుడు గాంధీజీకి చదరంగపు పెట్టె ఇవ్వబోయినాడు "చదరంగపు ఆట ఎవరికి తెలుసు?" అన్నారు గాంధీజీ "నాకు తెలుసు" అన్నారు బులుసువారు "అయితే మీకు నేను భయపడవలసే ఉంటుంది" అన్నారు గాంధీజీ నవ్వుతూ (పుట 733) గాంధీజీ తెలుగుదేశం సంచారంలో నవరసభరితమైన ఇటువంటి ఘట్టాలు చాలా ఉన్నాయి మహాత్ముని సమయపాలనం, సంయమం, పేదలపట్ల,దుఃఖితులపట్ల, వంచితులపట్ల ఆయనకు గల కరుణ, వారిపట్ల ఆయన చూపిన విహ్వలత, తపన, కన్నీరు తెప్పించే ఘట్టాలు కూడా ఈ గ్రంథంలో ఉన్నాయి మహాత్ముని మహోన్నోత్యాన్ని వర్ణించిన ఆనాటి పత్రికల సంపాదకీయాల నుంచి భాగాలు, రచయితల అక్షర నివాళులు సముచితంగా పొందుపరచడం జరిగింది బరంపురం నుంచి బళ్ళారి వరకు, చిత్తూరు నుంచి శ్రీకాకుళం వరకు ఆనాడు ఆంధ్రదేశంలో గాంధీజీ కలిగించిన చైతన్యం ఈ గ్రంథంలో వర్ణించడం జరిగింది

నిజాం రాష్ట్రంలో గాంధీమహాత్ముడు ప్రజల నేవిధంగా ప్రభావితం చేశాడో, హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాలలో ఆయన పర్యటించినప్పుడు, ప్రజలలో రాజకీయ చైతన్యం ఏ విధంగా ఉద్బుద్ధమైందో, నిర్మాణాత్మక కార్యక్రమానికి వారంతా ఏ విధంగా సన్నద్ధులైనారో వివరించడం జరిగింది మొత్తం ముప్పైరెండధ్యాయాలలో సుమారు వెయ్యి పుటల గ్రంథంలో గాంధీజీ మానవాళికి విన్పించిన సందేశమూ, తత్త్వచింతనమూ ఆయన రాజకీయ, సాంఘిక, మతనైతిక సిద్ధాంతాలు ఈ గ్రంథం ద్వారా సుబోధకంగా గ్రహించవచ్చు.

గాంధీజీ కైవల్యంపొంది ముప్పై సంవత్సరాలు గడిచినా ఆయన ఆశించిన సాంఘికార్థిక రాజకీయాదర్శాలు మన దేశంలో ఇంకా సిద్ధాంతపరంగా మాత్రమే వినపడుతున్నాయి ఆచరణలో పూర్తిగా ఫలితాలు సాధించలేదు

"ఏపని అయినా పరమావధికి చేరితేనేకాని సంతృప్తి పడకూడదు తేలికగా సంతృప్తిపడడం మంచిదికాదు తేలికగా సంతృప్తిపడడం అంటే అభివృద్ధిని నిరోధించడం అందువల్ల పురోగమనం లేకపోవడం అట్లా ఉండగా తుదకది తిరోగమనంగా కూడా పరిణమించవచ్చు పైకి ఎక్కడంకంటె దిగజారటం ఎన్నో రెట్లు తేలిక' (పుట 554) అని హెచ్చరించారు గాంధీజీ మద్యపాన నిషేధాన్ని గురించీ, అస్పృశ్యతానివారణాన్ని గూర్చీ, భారతదేశంలోని ఏడు లక్షల గ్రామాల స్వయంపోషకత్వమూ, అభ్యుదయ వికాసాలను గూర్చి గాంధీజీ ఎంతగానో ఆవేదన చెందారు నిర్మాణాత్మకమైన కార్యక్రమాల నెన్నిటినో ప్రబోధించారు

స్వరాజ్యమంటే అర్థం 'మనశ్శాంతి', 'ప్రజాశాంతి' అని తమ అభిప్రాయ మని స్పష్టంచేశారు గాంధీజీ 1929 లోనే (పుట 421) ప్రజలపట్ల సానుభూతి లేని ప్రభుత్వం పాపపు ప్రభుత్వమని నిరసించారు (పుట 181)

ప్రజాభిప్రాయాన్ని తృణీకరించి నిరంకుశాధికారం చెలాయించే ప్రభుత్వం తనంతట తాను అదృశ్యమవుతుందనుకోవడం వట్టి పొరపాటు (పుట 334) అని, ప్రజలు సంస్కారపరులై జాగ్రత్త వహించాలని కూడా హెచ్చరించారు

గాంధీజీ ఆశయాలను, బోధనలను చిత్తశుద్ధితో, పట్టుదలతో, తీవ్రమైన అభినివేశంతో ఆచరణలోకి తెచ్చినట్లైతే, భారతదేశం నేడు మరింత పురోగతిని సాధించి ఉండేది

"నాయకులయినవారు తాము చెప్పినది చేస్తుండినట్లయితే ప్రజాసామాన్యం నుంచి తగినంత సహకారం పొందటంలో మనకేమీ కష్టముండదు కాబట్టి నాయకవర్గాలవారు ముందుగా మార్పుచెందవలె అది జరిగినప్పుడు తక్కినపని అంతా సులభమవుతుంది" (పుట 553) అని 1929వ సంవత్సరంలో గాంధీజీ ఆంధ్ర నాయకులపైన కొన్ని ఫిర్యాదులు తమ చెవిసోకగా 'యంగ్ ఇండియా' పత్రికలో వారికి హితవు చెప్పారు. ఈ ప్రబోధం త్రికాలాబాధితమైన సత్యం

ఆసేతుశీతాచలం ఆయన బోధించిన తత్త్వత్రయం ఖద్దరు కట్టండి, తాగుడు మానండి, అస్పృశ్యత మరిచిపొండి - అనేవే. ఈనాటికి కూడా నవ భారత నిర్మాణాన్ని గూర్చి గాంధీజీ కన్నకలలు నెరవేరలేదనే చెప్పాల్సి ఉంది.

ఈ గ్రంథంవల్ల ఈ శతాబ్ది ప్రథమదశకం నుంచి స్వాతంత్ర్య సముపార్జనం వరకు తెలుగుదేశపు సాంఘిక పరిస్థితులను గూర్చి తెలుసుకొనే అవకాశం వుంది ఆనాటి పల్లెసీమలలో అమాయకులైన ప్రజల జీవన విధానమూ, వారి దేశభక్తి, త్యాగజీవనమూ మొదలైన వాటిని గూర్చి తెలుసుకోవచ్చు. తెలుగుదేశపు ప్రకృతి రామణీయకతను గూర్చి కూడా గాంధీజీ ఎంతగానో ముగ్ధులైనారు మన జాతీయ పతాకానికి తుదిమెరుగు దిద్ది దానికి గాంధీజీచే ఆమోదింపజేసిన వ్యక్తి తెలుగువాడు కావడం తెలుగువాళ్ళు ఆనందించవలసిన విషయం. గాంధీజీ అల్లూరి సీతారామరాజును గూర్చి యంగ్ ఇండియా పత్రికలో ఎంతో ప్రశంసిస్తూ రాశారు 1929వ సంవత్సరంలో తెలుగుదేశాన్ని పర్యటించినప్పుడు ఆయనకు అల్లూరి సీతారామరాజు చిత్రాన్ని ఎవరో బహూకరించగా, సీతారామరాజు జీవితచరిత్రను గురించి సర్వసమగ్రంగా తెలుసుకొని ఆయన ఎంతో ఉత్తేజకరంగా, సుదీర్ఘంగా 'యంగ్ఇండియా' పత్రికలో ప్రచురించారు

తొలితరం నాయకులైన కొండ వెంకటప్పయ్య, న్యాపతి సుబ్బారావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కల్లూరి సుబ్బారావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు మొదలైన వారిపట్ల గాంధీజీకి ఎంతో అభిమానం వుండేది కొండ వెంకటప్పయ్యగారిగూర్చి 'నా హెడ్ జైలర్'అంటూ ఆయన హాస్యమాడుతూ వుండేవాడు అంటే తాను వెంకటప్పయ్యగారి అధీనుణ్ణి అని ఆయన భావం తెలుగుదేశంలో గాంధీజీ సంచారం చేసినప్పుడల్లా వెంకటప్పయ్య పంతులు ఆ కార్యక్రమాన్నంతా అజమాయిషీ చేస్తుండేవారు ఒకసారి రాజమహేంద్రవరం సభలో న్యాపతి సుబ్బారావు పంతులు గాంధీజీ వేలానికి పెట్టిన ఖద్దరు శాలువను కొనడం జరిగింది అప్పుడు గాంధీజీ "తన సహజమంద హాసంతో వేదికపైనున్న శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారిని ఆలింగనం చేసుకొని ఆయన వేలంలో కొన్న శాలువను ఆయనకు కప్పినారు" (పుట 689)

నేడు భారతరాష్ట్రపతిపదవి అలంకరించిన శ్రీనీలం సంజీవరెడ్డిగారిగురించి చెపుతూ నలభై నాలుగు సంవత్సరాల క్రితం అంటే 1934లో అనంతపురంలో "గాంధీజీ తన దగ్గర ఉన్న వస్తువునువేలంపెట్టగా ఆ సభలో ఉన్న నీలం సంజీవరెడ్డి గారు కొన్నిటిని పోటీపడి కొన్నారు. అప్పటినుంచి ఆయన గాంధీజీ ఉద్యమంలో

పాల్గొంటూవచ్చినారు" (పుట 732) అని ఉంది గాంధీజీ తాము నూటపాతిక సంవత్సరాలు జీవించాలని అభిలషిస్తున్నట్లుగా చెప్పేవారట స్వతంత్ర భారతదేశ ప్రగతిని చూసి ఆయన ఖేదమోదాలు కూడా పాలయ్యేవారేమో!

మద్రాసు దగ్గర పెరంబూరులో గాంధీజీకి సమర్పించిన స్వాగతపత్రం ఆయన మహత్వాన్ని నూటికి నూరుపాళ్ళు చక్కగా వ్యక్తం చేసింది

"మిమ్మలను గొప్ప సత్యద్రష్టగా మేము పేర్కొనడం లాంఛన ప్రాయ మయిన శుష్క ప్రలాపం కాదు మీరు ప్రజలకు నిత్యం బోధించడమేకాక మీరు దానిని నిత్యం మీ జీవితంలో అనుష్ఠిస్తున్నారు మహమ్మద్‌లోని ధైర్యమూ, బుద్ధునిలోని హృదయమూ, జోరోష్టర్‌లోని పవిత్రత, జీసస్‌లోని క్షమ, వివేకానందునిలోని దూరదృష్టి, దయానందునిలోని భక్తి, రామమోహన్ రాయ్‌లోని సమైక్య భావము, రామకృష్ణునిలోని మతసామరస్యమూ సిద్ధి నీలో ఉన్నాయి అన్ని మతాలలోని ఉత్తమ లక్షణాలు నీలో సూక్ష్మరూపంలో మూర్తీభవించాయి నీ జీవితం స్ఫూర్తికి, ఉత్సాహానికి, ఉత్తేజానికి తార్కాణము జాతి, మత రంగు భేదాలతో నిమిత్తం లేకుండా మానవకోటి మంచికోసం సత్యం అనుష్ఠిస్తూ అందరినీ ఎక్కువగా ప్రేమిస్తూ, అంతకంటె ఎక్కువగా ప్రేమించబడుతూ జీవిస్తున్న లోకోత్తర పురుషులలో మీరొకరు అందువల్ల నేడు మీరు హరిజనాభ్యుదయంకోసం మీ యావత్తు కాలాన్ని, శక్తినీ వినియోగించడంలో ఎంత మాత్రం ఆశ్చర్యంలేదు" (పుట 659)

గాంధీజీలో హాస్యప్రవృత్తి ఎక్కువగా ఉండేది ఆయన సాధ్యమైనంత వరకు ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ తనచుట్టూ ఉన్న వాతావరణాన్ని ఆహ్లాదమయం చేస్తూ ఉండేవారు. ఇటువంటి సన్నివేశాలెన్నో ఈ గ్రంథంలో వర్ణితమైనాయి

ఈ గ్రంథంలోని విషయం ఎన్నెన్ని చోట్లనుంచో స్వీకరించినప్పటికీ, అనువదించి కూర్చడం అగత్యమై వున్నప్పటికీ, శైలి చాలా ఆకర్షకంగా ఉంది సూటిదనము, స్పష్టత, సుందరత ఈ శైలిలోని విశేషాలు ఉదాత్తమైన ఇతివృత్తానికి తగినట్లుగా ఉదాత్తమైన శైలీ విన్యాసాన్ని చూపారు గ్రంథ నిర్మాతలు.

ఇది ఒక లోపం కాదుగాని - ఈ గ్రంథంలో ముఖ్యంగా ముందుభాగాల్లో కనిపించే ప్రముఖులను గూర్చి సంగ్రహంగా ఫుట్‌నోట్‌లోనో లేదా అనుబంధం లోనో తెలియజేస్తే మరింత బాగా వుండేది గాజుల లక్ష్మీనరసుచెట్టి, జి పరమేశ్వరన్ పిళ్ళై, జి ఎ నటేశయ్యర్, కస్తూరి రంగయ్యగారు, గద్దె రంగయ్యనాయుడు మొదలైన వారిని గూర్చి లఘు వివరణలు చేరిస్తే గాంధీజీ స్వాతంత్ర్యోద్యమ నేతృత్వ నేపథ్యమూ, ఆ రంగస్థలమంతా ఏ విధంగా సిద్ధమవుతూ వచ్చిందీ కూడా తెలుసుకోవడానికి అవకాశం ఉండేది

'ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ' చాలా గొప్ప పుస్తకం ప్రతివారూ చదివితే ఎన్నో విషయాలు తెలుసుకోగలుగుతారు

(తెలుగు - 1978)

# సమకాలీన సంఘం, సాహిత్యం

ముందేంజరుగుతుందో స్పష్టంగా తెలియదు కాబట్టి, వర్తమాన పరిస్థితులను గడచిన కాలంలో క్రమక్రమంగా వచ్చిన మార్పులతో పోల్చుకుంటూ దిగులుపడటమో, ధైర్యం తెచ్చుకోవడమో ఏదో చెయ్యాలి

ఇప్పటి పరిస్థితులను గూర్చి నింపాదిగా, శ్రద్ధగా, జాగ్రత్తగా ఆలోచిస్తే చాలా నిరాశకే అనుకూలంగా వున్నాయి, ఆలంబనంగా వున్నాయి ఇప్పటి పరిస్థితులు ఏమిటి? వీటిని ఏ విధంగా చక్కదిద్దుకోవాలి? అని బుద్ధిమంతులు ఆలోచించడం లేదు నిరాశపడిపోయి చేతులు పిసుక్కుంటూ కూచొనిపోవడం మంచిది కాదు కాని ఏదో చేస్తున్నట్లు, చూస్తున్నట్లు, ఆలోచిస్తున్నట్లూ హంగామా చేయడం వల్ల ప్రయోజన మేముంది? ఎక్కడ చూసినా అలసభావం, అవగాహన లేకపోవడం, ఏదో విధంగా అప్పటికాపబ్బం గడుపుకొని దాటుకొని పోవడానికే చూడ్డం, చదువుకున్న వాళ్ళనిలేదు, చదువుకోని వాళ్ళనిలేదు, నా పని గడువుకుంటే చాలు,నాకు కావలసిన ప్రయోజనం సిద్ధిస్తే చాలు అనుకోవటమే ఇప్పుడు కనపడుతోంది

ఇటీవల ఆంధ్ర బ్యాంక్ వాళ్ళు 200 గుమాస్తా ఉద్యోగావకాశాలను ప్రకటిస్తే డెబ్బై అయిదువేల దరఖాస్తులు వచ్చినట్లు హిందూ పత్రిక రాసింది మహా భయంకరమైన ప్రమాణాలతో నిరుద్యోగ సమస్య తరుముకొని వస్తున్నది అయినా కమిటీలు, సలహాలు, సంప్రదింపులు, వృత్తి విద్యావకాశాలు, ఉపాధి కల్పన కోర్సులు అంటూ పెద్ద పెద్ద కబుర్లు పత్రికల్లో కనబడ్డం తప్ప నిర్మాణాత్మకంగా, సుసంఘటితంగా సమాజ చైతన్యం ముందుకు కదలటం లేదు

విశ్వవిద్యాలయాలలో అవినీతి, ఆశ్రిత పక్షపాతం, స్తుతిప్రియత, కులాభిమానాలు, అర్హతకు నిరాదరణ, అనర్హతకు అవకాశాలు అని విద్యార్థులు, పిన్నలు, పెద్దలు అందరూ చెప్పుకుంటున్నారు విశ్వవిద్యాలయా లన్నిటా అలజడులు, ఆందోళనలు, అశాంతి పత్రికలలో నిత్యకృత్యాలుగా కనపడుతున్నాయి. ఈ మధ్య ఉస్మానియా విశ్వవిద్యాలయాధ్యాపకులపై కొందరు

విద్యార్థులు చేయి చేసుకోవడం జరిగింది సిటీ బస్సుల్లో ఈ దౌర్జన్య కాండకు దారితీసిన పరిస్థితులను గూర్చి, ఔచిత్యా నౌచిత్యాలను గూర్చి పౌర జనాభి ప్రాయంలో వివిధ దృక్పథాలు వెల్లడైనాయి విద్యార్థులలో అసంతృప్తికి, వాళ్ళకు జరిగిన అన్యాయాలకు అది ఒక బాహ్య ప్రకటనం మాత్రమే అన్న అభిప్రాయాన్ని వెల్లడించిన వాళ్ళు కూడా వున్నారు. చిన్న చిన్న ఉద్యోగాలకు ఇంత లంచమిచ్చాం, ఇంత ఖర్చుపెట్టామని బహిరంగంగా బస్సుల్లోనూ, రోడ్ల మీదా చెప్పుకుంటూనూ వున్నారు

సామాజికమైన బాధ్యతలు గాని, సంఘటితమైన ప్రతిఘటన కాని ఎక్కడా కనపడవు అశాంతి, అల్లరి, కసి, క్రోధం అదుపులో పెట్టుకోవడానికి అతికష్టం మీద శ్రమ పడుతున్న వాళ్ళూ, ఇది మా కర్మం, ఈ పరిస్థితులు మారవు, ఇది ఇంతే అని సరిపెట్టుకొనే నిరాశాపరులూ, అత్యున్నత స్థాయినుంచి అట్టడుగు స్థాయి వరకు ఆత్మవంచన, అబద్ధాలు- ఇవీ ఇవాళ సాధారణ పరిస్థితి

ఇటీవల అభ్యుదయ రచయితల వార్షిక సమావేశాలు జరిగాయి కదా! సాంఘిక సమస్యలను గూర్చి ఏమైనా వాళ్ళు చర్చించారా? నల్లమందు అలవాటు చేస్తున్న అల్పస్థాయి పత్రికల ధోరణులను గూర్చి ప్రకటించారా? యువ చైతన్యాన్ని సంఘటిత పరచడానికి ఏమాలోచనలు చేశారు? విశ్వవిద్యాలయాలు వాడుక భాషను ఆమోదించాలన్న తీర్మానానికి ఎప్పుడో కాలదోషం పట్టింది అదొక గొప్ప సమస్య కాదు వీళ్ళు ఏ భాషలో ప్రశ్న పత్రాలు రాసినా తర్వాత ఏం చెయ్యబోతున్నారు? కుహనా విద్వాంసులు, కపట పండితులు వీళ్ళను ఏ విధంగా ఉద్ధరించ గలుగుతారు? ఈ దేశంలో, ముఖ్యంగా మన రాష్ట్రంలో నూటికి పందొమ్మిది మందికి కూడా మహిళల్లో అక్షరాస్యత లేకపోవడం, మగ వారిలో కూడా నూటికి ముప్పైకూ్కడా అక్షరాస్యత చేరకపోవడం గురించి ఆలోచించారా? ఆధునిక భాషా శాస్త్ర పరిశోధనల పేరిట, ద్వితీయ భాషా బోధన మాధ్యమంగా తెలుగుని దిద్దితీరుస్తారట! అహో- ఆత్మవంచన, డంబాలు! అమెరికాలో తెలుగు భాషని గూర్చి అద్భుతమైన పరిశోధన జరుగుతున్నది నీకు తెలుసా, తెలీకపోతే ఎందుకు పనికి వస్తావు అంటున్నారు మాండలిక భాషాధ్య యనం స్పుట్నిక్కు వేగంతో ఆకాశపు దారులంట ప్రయాణం చేయిస్తారుట.

సుమారు నూరేళ్ళ క్రితం, అంటే 1881 జనాభా లెక్కల ప్రకారం, భారతదేశపు జనాభా 16 కోట్ల పైచిలుకు కొన్ని లక్షలు 1936 లో ముప్పై అయిదో ఆరో కోట్లు పందొమ్మిది వందల అరవై రెండు ప్రాంతంలో నలభై రెండు కోట్లు, మళ్ళీ 1981 వచ్చే నాటికి 61 కోట్లు మించవచ్చు నూరేళ్ళలో అంకెలు తిరగబడ్డా యన్నమాట గ్రామాల్లో మురికి, అనారోగ్యం, అవివేకం, అమాయకత్వం ఎప్పుడిక పరిష్కారం కావడం? నగరీకరణం ద్వారా పెరిగి పోతున్న అనర్థాలకు అంతెక్కడ?!

1881 లో విద్యాధికులలో సంఘాన్ని సరిదిద్దుకోవాలని ఎంత ఆర్తి వుండేది! ఎన్ని ప్రయత్నాలు చేశారు' ఎంతటి భావ విప్లవం తీసుకొని రావాలని కృషి చేశారు! ఇప్పుడలాటి ప్రయత్నాలు ఎక్కడైనా జరుగుతున్నాయా, సొంత లాభం చూసుకోకుండా!

స్వప్రయోజన తత్పరత్వం ఉండకూడదని ఎవరంటారు? స్వార్థం ఉండ కూడదని ఎవరంటారు? - సాముదాయిక ప్రయోజనాలకు భంగం కలిగించ కుండా వున్నంతవరకు! మంచినీళ్ళకు నోచుకోని దేశంలో వ్యక్తి స్వేచ్ఛ పేరిట మద్యపాన నిషేధాన్ని వ్యతిరేకించే మేధావి వర్గపు ఉన్మాద భావ స్వాతం త్ర్యాన్ని గూర్చి నవ్వాలా? ఏడ్వాలా? మనుషులు కల్తీసారా తాగి సామూహిక మరణాల పాలవుతున్నారు నూరు సంవత్సరాలు గడిచినా అవివేకపు మత కలహాలు మానిపోలేదు 1882 వ సంవత్సరంలో సేలంలో జరిగిన మత కలహా లలో సంభవించిన ప్రాణ నష్టాన్ని గూర్చి, ప్రజల్లోని అవివేకాన్ని గూర్చి నొచ్చుకుంటూ వీరేశలింగం వివేకవర్ధనిలో రాశాడు దేవాలయం ముందో, లేదా మసీదు ముందో, వీరి ఊరేగింపో, వారి ఊరేగింపో సాగి వెళ్ళడంలో పాటిం చాల్సిన మర్యాదలు పాటించక పోవడంవల్ల ఆ కల్లోలాలు జరగడం ఎంత సిగ్గు చేటు అన్నాడు వీరేశలింగం ఆదోనిలోనూ, అలిగఢ్‌లోనూ ఇవాళ్ళ కూడా ఈ అల్లర్లకు, అశాంతికి కారణాలేమిటి? మానవ జీవితంలో నయంకాని వ్యాధుల లాగానే, ఈ సంఘర్షణలు, సంఘాత మరణాలు సాగుతూ వుండవలసిందేనా?

''కోర్టు ల ప్రమాణా లబద్ధముల న్యాయములకు, పోలీసు స్టేషనులు దొంగ తనములకు, మ్యునిసిపాలిటీ మురికికి, దేవతాలయములు వెలయాండ్రకు,

తీర్థముల పరిశుద్ధికి, కల్మి పాపమునకు, విద్య మోసముకు హేతు భూతములుగా దోచెడిని" అన్నారు అజ్జాడ అదిభట్ల నారాయణదాసు గారు తమ నాటి పరిస్థితు లను గూర్చి చెపుతూ ఇప్పుడు దేవతాలయముల్లో వెఃయాంధ్ర గౌరవం మాత్రం కనపడదేమో!

వెలయాంధ్ర బాధే కాదు - రౌడీల ప్రాభవం కూడా తప్పిపోయింది రాజ కీయ ప్రయోజనాల విషయంలో తప్ప ఇంకా పెత్తందార్లు, వాళ్ళనమ్మినబంట్లు గ్రామీణ ప్రాంతాలలో తమ బలాన్ని అడపా దడపా ప్రదర్శిస్తూనే వున్నట్లు వింటూ వున్నాం, కంటూ వున్నాం అయితే ఏభై అరవై సంవత్సరాల క్రితం వరకూ చిన్న చిన్న నగరాలలో కూడా ఈ రౌడీ మురాలు, వారిని కొందరు పెద్ద మనుషులు పోషించటం, ఊళ్ళోవాళ్ళు ఈ రౌడీలకు భయపడటం జరు గుతూ వుండేది నాటక ప్రదర్శనల వాళ్ళూ, మున్సిపాల్టీ రాజకీయాల వాళ్ళూ ఈ రౌడీ మురాలపై ఆధారపడుతూ వుండేవాళ్ళు, ప్రకాశం పంతులుగారి స్వీయ చరిత్రలో ఆయన కాకినాడలో ఇటువంటి రౌడీ మురాతో తలపడ్డం వుంది

ఈ మధ్యనే విశ్వనాథ సత్యనారాయణగారి ఆత్మకథ వెలువడింది మేఖల అనే విశ్వనాథ స్మారక సాహిత్య పత్రికలో అందులో ఇలా ఉంది

"ఆనాడు బందరు పట్టణములో పెద్ద పెద్ద రౌడీ మురా లుండెడివి నాకు తెలిసిన దానిని బట్టి చూడగా నప్పటి బందరు బెజవాడ ఏలూరు మొదలగు పట్టణములు కొద్దిలో చికాగో పట్టణముల వంటివి ఎక్కువ భాగము రౌడీల మురాలు పరిపాలించెడునట్టివి మా పాఠశాల వెనుక పెద్ద బంగర బయలు కోపములున్నచో నక్కడికి రమ్మనుట రెండు పక్షములచ్చట చేరుట, కర్రలతో చేతులతో తలపడుట ఒక్కొక్కప్పుడు కత్తులతో "

ఈ బాధలిప్పుడు తప్పి పోయినాయి అంత తీరిక కానీ వోపిక కానీ సమాజంలో ఇప్పుడెవ్వరికీ లేదు ఇది మంచికి వచ్చిన మార్పే దరిశి చెంచయ్యా గారి 'నేనూ - నా దేశం'లో కూడా ఈ రౌడీలమూకల ప్రస్తావన వుంది కావ లిలో ఆయన ఒక రౌడీతో తలపడటం, వాడి పొగరు కాస్తా అణచటం గురించి చెప్పారు

అన్నట్లు చెంచయ్యగారు గుర్తు రాగానే ఒక విషయం బాధిస్తుంది "నేనూ-నా దేశం" వంటి గొప్పరచనను గూర్చి యువతరం వాళ్ళలో ఎందరికి తెలుసు? విద్యాలయాలలో, విద్యాధికారులలో పండితోత్తములకు, అధికారమ్మన్యులకు ఎందరకు తెలుసు? ఈ గొప్ప గ్రంథాన్ని ఏదో స్థాయిలో పాఠ్యపుస్తకంగా గాని రిఫరెన్సు గ్రంథంగా గాని పెట్టరు తలచుకోరు ఒక సాహిత్య వేత్తను, తగిన అధికారాలను అనుభవించిన వ్యక్తిని దరిశి చెంచయ్యగారి 'నేనూ-నా దేశా'నికి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం రావలసిన యోగ్యత వున్నది కదా, ఎందుకు రాలేదు? ఎప్పుడైనా ఎవరైనా అనుకొన్నారా? ఆలోచించారా? అని అడిగితే, ఇష్టంలేని ప్రశ్నను అడుగుతున్నట్లుగా ఆయన అనుకున్నట్లు స్పష్ట పడింది

బహిరంగంగా అనడానికి సంకోచించ వచ్చునేమో కాని, విశ్వవిద్యాలయ స్థాయిలో కాని, ప్రభుత్వ యంత్రాంగం పూనుకొని నిర్ణయించే స్థాయిలో కాని, పాఠ్య పుస్తక నిర్ణయంలో అవకతవకలు, అక్రమ లావాదేవీలు ఎన్నో జరుగు తుంటాయని అందరూ అనుకొంటూనే వుంటారు అంటూనే వుంటారు కాని, పిల్లి మెళ్ళో గంట కట్టడానికి ఏ ఎలుకకీ ధైర్యం వుండదు కదా! బలంలేని వాడా జోలికిపోతే భంగపాటు తప్పదనే భయం మాత్రం వుండదా?

ఇక ఘోరాతిఘోరమైన దౌర్భాగ్యం, నేటి సినిమా వ్యాపార ధోరణి జీవితంతో దానికి ఏ మాత్రం పొత్తు కలవదు అత్యంత అవాస్తవికమైన ధోరణు లతో అది తరుణ హృదయాలను భ్రమల పాలు చేస్తున్నది అంతేకాని, సామాజిక బాధ్యతాజ్ఞానాన్ని కాని, మానసిక వికాసాన్ని గాని ఏ మాత్రమూ కలిగించడంలేదు.

ఇక సాహిత్యం సంగతి - వికాసం కన్నా వినోదం ప్రాధాన్యం లేదా ఫాషనబుల్ తిరుగుబాటు ధోరణి ఆత్మ వంచనతో కూడిన వుత్తుత్తి విప్లవ దృక్పథపు కబుర్లు లేదా అర్థం కాని అతి నవ్యత వస్తువులోనూ, అభివ్యక్తీ కరణలోనూ, నేల విడిచి సాము చేయడం, నినదించడం, అస్పష్ట సాంకేతిక ధోరణుల్ని ఆశ్రయించడం మంచి పుస్తకాలకి ఆదరణ లేకపోవడం. వాటిని చదవక పోవడం, లాభసాటి వ్యాపారమే ప్రధాన ప్రయోజనమనుకొన్న వాళ్ళే గ్రంథ ప్రచురణ, విక్రయ పంపిణీ వ్యవస్థను అనుశాసించగల దౌర్భాగ్య పరి స్థితులు బలం పుంజుకుంటూ వుండడం, పబ్లిక్ గ్రంథాలయాల కొనుగోళ్ళ మీద ధ్యాసను కేంద్రీకరించి ప్రచురణకర్తలు అనుచితమైన పోటీకి దిగడం,

ఈ గ్రంథాలయాలు అనారోగ్యకరమైన కొనుగోలు విధానాన్ని అనుసరిస్తూ వుండడం, అధికార ప్రాపక రచయితల సంఖ్య పెరుగుతూ వుండడం, వాళ్ళకు ముందుగా గుర్తింపులు, బిరుదులకోసం, పదవులకోసం, గుర్తింపులకోసం, బహుమతులకోసం, ఆరాటాలు, ఆశ్రయింపులు కల్పనా సాహిత్యానికున్న గిరాకీ తక్కిన సాహిత్య ప్రక్రియలకు లేకపోవడం ఉత్తమ సాహిత్యాభిరుచులను ప్రోత్సహించే ప్రయత్నాలు సంస్థలు కాని, వ్యక్తులు కాని, రచయితల సంఘాలు కాని చేయలేక పోవడం- ఇవన్నీ నేటి సాహిత్య సమస్యలు

ఏదో ఒక ఉద్యోగం చేసుకుంటూ వున్న వాళ్ళకు అసంతృప్తి ఉద్యోగం లేని యువకులలో అశాంతి నిత్య జీవితావసర వస్తువుల ధరలన్నీ పెరిగిపోతూ వుండడం, పుండు మీద కారంలా ధరలు పెరగడం లేదు, తగ్గుతున్నాయన్న ప్రభుత్వ యంత్రాంగ ప్రచారం అధికోత్పత్తులు సాధిస్తున్నామన్న ఆర్భాట ప్రచారం. ద్రవ్యోల్బణం అరికట్టమన్న ప్రచారం- ఇవి సాంఘిక సమస్యలు.

మధ్యతరగతి కుటుంబాలలో ఆడపిల్లల పెళ్ళిళ్ళు జీవన్మరణ సమస్యగా బాధించడం కట్నాల బెడద ఏమాత్రం తగ్గకపోవడం. ఈ వ్యాధులకు మూల కారణాలేమిటన్న విచికిత్స చేసి సంగతి సందర్భాలు కనుక్కోలేక పోవడం సుమారు అరవై సంవత్సరాలకు పూర్వం వరకట్న దురాచారానికి బలి అయి పోయిన వంగ మహిళ స్నేహలతా దేవి వృత్తాంతం కవులను ఉత్తేజపరచి కావ్యాలు పలికించింది కాని కట్నాలు మాత్రం రూపుమాపలేకపోయింది

ఆచార్య ప్రఫుల్ల చంద్ర రే తన స్వీయ చరిత్రలో అర్ధశతాబ్ది క్రితమే యూనివర్శిటీ చదువుల వెర్రి వ్యామోహాన్ని గూర్చి, పట్టభద్రుల సామూహికోత్పత్తిని గూర్చి హెచ్చరించాడు స్నేహలతాదేవి విషాదగాథ వంటిదే మృత్యుంజయ సీల్ అనే తరుణ నిరుద్యోగ యువకుని ఆత్మహత్యా వృత్తాంతాన్ని తన స్వీయ చరిత్రలో ఉదాహరించాడు ఆనాటి వార్తా పత్రికలలో నుంచి ఈ వార్తను తీసి ప్రముఖంగా వ్యాఖ్యానిస్తూ ప్రఫుల్ల చంద్ర రే రాబోయే రోజులను గూర్చి హెచ్చరించాడు అయినా ఎవరూ పట్టించుకోలేదు

1878 వ సంవత్సరంలో రాజశేఖర చరిత్ర వచ్చినప్పుడు ఆధునిక సాహిత్యంలో అది ఒక పెద్ద మైలు రాయి అనుకున్నారు సాహిత్య చరిత్రలో అది ఒక పెద్ద మలుపు అనుకున్నారు సంఘంలోగల లోపాలను గూర్చి చర్చించేందుకు, చేయగల పనులు చేసేందుకు, సమాజంగా ఏర్పడడం అనేది ఆ సంవత్సరమే మొదలు. ఆ తరవాత ఇప్పటికి నూరు సంవత్సరాలు గడిచాయి.

రాక్షసుల రక్తబిందువుల నుంచి కొత్త రాక్షసులు జన్మించేట్లు, కొన్ని సాంఘిక దురాచారాలను రూపుమాపాము అనుకొంటే, అంతకన్నా తీవ్రమైనవి, వికృతమైనవి తల ఎత్తుతూ వుండడం, వీటిని పరిష్కరించుకోలేక సతమతమవుతూ వుండటం జరుగుతూన్నది

సుమారుగా ఇంకా ఇరవై సంవత్సరాలలో ఈ శతాబ్దం కూడా కాలయవనిక వెనక్కు వెళ్ళిపోతుంది ఆగామి తరాల వారు ఈ శతాబ్దంలో బుద్ధిమంతులు ఏం చేశారంటే చెప్పగలిగింది ఏమీ లేదు స్వాతంత్ర్యం సంపాదించిన మాట వాస్తవమే అయితే దాన్ని సంపాదించుకోవడానికి ప్రేరకమైన సదాశయాలను వేటినీ సిద్ధింప చేసుకోలేక పోతున్నాము 'మాలపల్లి' నవలలో స్వాతంత్ర్యం వచ్చేసిన తర్వాత భారత కేంద్ర శాసన సభ, రాష్ట్ర శాసన సభలు చేసిన చట్టాలు, చేపట్టవలసిన కార్యక్రమాలు అని భావుకతతో ఉన్నవవారు ఒక అధ్యాయంలో వివరించారు ఆయన నవల రాసిన తరువాత అర్ధశతాబ్దం గడిచినా, స్వాతంత్ర్యం వచ్చి ముప్పై సంవత్సరాలు గడిచినా, పెట్టుబడిదారీ వ్యాపార సరళి, గుత్తాధిపత్యం, స్వార్థపరత్వం, అక్రమ లాభార్జనలు విజృంభిస్తూనే ఉన్నాయి ఆగామి తరాల దేహ మనోవికాసాలను తీర్చి దిద్దవలసిన విద్యాసంస్థల నిర్వహణ విషాదకరంగా వుంది ప్రపంచ పరిస్థితులే సామాన్యంగా ఇట్లా వున్నప్పుడు మన దేశం గురించి చెప్పాల్సిందేముంది? దీన్ని చూడండి:

"I do not need to tell you that a statistical analysis of the business community in the United States, which ramifies throughout the world, reveals that the world's commerce is largely in the hands of some 330 executives who, with perhaps less than 1000 others, control the world's economy Neither schools nor churches, nor even governments, have any basic impact on the control exercised by these business executives through interlocking directorates and international cartels " చాలా ఆశ్చర్య పడవచ్చు పాండిచేరి అరవిందాశ్రమం నుంచి వెలువడే పత్రికలోని డా॥ హొవార్డ్ జాన్ జిటోక్ వ్యాసం లోనివి ఈ వాక్యాలు

అయ్యో సంఘమా? సాహిత్యమా? తమసోమా జ్యోతిర్గమయ!

(అభ్యుదయ - 1979)

# మరికొన్ని స్వీయచరిత్రలు

అసలు ఆధునికమైన ఈ సాహిత్య ప్రక్రియకు ఈ పేరు పెట్టింది గురజాడ శ్రీరామమూర్తిగారు

ఆయన ఈ సాహిత్య శాఖ నీపేరుతో పిలిచిందాకా, తెలుగు సాహిత్యంలో 'స్వీయచరిత్ర' అనే ప్రస్తావనే లేదు

తమ కవి జీవితాలకు పీఠిక వ్రాస్తూ సమకాలీనులైన కవులను గూర్చి తాము ఈ గ్రంథంలో చేర్చడంలేదనీ, ఆ కవులు స్వీయచరిత్రలు రాసుకోవడం బావుంటుందనీ శ్రీరామమూర్తి పంతులు అభిప్రాయపడటం గమనార్హం.

'స్వీయచరిత్రం' అనే ప్రయోగం పాణినీయం ద్వారా అసాధ్యమనీ, అది దుష్టప్రయోగమనీ, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు వీరేశలింగంపైన ధ్వజమెత్తారు. వీరేశలింగానికి పాణినీయం బొత్తిగా తెలీదనిన్నీ ఆక్షేపించారు ఏమైతేనేం తాను రాసుకున్న తన చరిత్ర అనే అర్థంలో తెలుగులో స్వీయచరిత్రమన్న పేరే రూఢి అయిపోయింది ఆత్మకథ అనీ, ఆత్మ చరిత్రమనీ, స్వచరిత్రమనీ, స్వ చారిత్రమనీ, అనుభవాలూ - జ్ఞాపకాలు అనీ, జీవితయాత్ర అనీ- ఈ మొదలుగాకూడా స్వీయచరిత్రకు పర్యాయనామాలుగా వ్యవహారంలోకి వచ్చాయి అయినా రాశి మీద ఈ సాహిత్య ప్రక్రియ స్వీయచరిత్రగానే సంభావితం

తనకు సంబంధించిన చరిత్రకానీ, తనకు బాగా దగ్గరవాళ్ళైన బంధు మిత్రులను గురించిగానీ ఎవరైనా రాసినప్పుడు - ఆ చరిత్రలో తనదైన పాత్ర నిర్వహణంకూడా ఉండాలి - ఆ రచనలు కూడా స్వీయచరిత్రాత్మక రచనలుగా పరిగణించవచ్చు ఆయారంగాలలో సుప్రసిద్ధులై సమాజ జీవన వికాసంలో తమ పాత్రను అంతో ఇంతో నిర్వహించిన ప్రముఖవ్యక్తుల దినచర్య వృత్తాంతాలను ప్రచురిస్తే అవి కూడా స్వీయచరిత్రాత్మక సాహిత్యం కిందికే వస్తాయి ఇదే విధంగా యాత్రాచరిత్రలు ఏకదేశంగా స్వీయచరిత్రలే అవుతాయనవచ్చు ఇంకా

విలాపరచనలు, స్మరణకావ్యాలు, స్మృతిగీతాలూకూడా స్వీయచరిత్రాత్మక సాహిత్యం కిందికే వస్తాయి వ్యక్తిగతమైన అనుబంధాలకు, సంబంధాలకు, అభియోగ ప్రత్యభియోగాలకు, పారస్పరిక జీవిత సన్నివేశాలకు, సంఘటనలకు ఎక్కువ ప్రాధాన్యాన్నిస్తూ తమ దృక్పథాన్ని వ్యక్తీకరించే సాహిత్య సంవాదాలు కూడా స్వీయచరిత్రాత్మక సాహిత్య పరిగణనంలోకి రావా? వస్తాయనే అనుకోవాలి ఉదాహరణకు చెళ్ళపిళ్ళ వారి చెరలాటం అని శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు ముదలకించగా, విక్రమ చెళ్ళపిళ్ళ అని వెంకటశాస్త్రిగారు చంక దుద్దు శరణార్థి నుడికారాన్ని తలపింపచేశారు

స్వీయచరిత్ర సాహిత్య ప్రక్రియ పరిధిని పనిగట్టుకొని విస్తృతపరచవలసిన ఆవశ్యకత లేకపోయినా, పైన ఉదాహరించిన రచనల వంటివి స్వీయచరిత్రాత్మక రచనల కోవలోకి చేర్చవచ్చునేమో ఆలోచించవలసిందిగా మనవి

డిసెంబర్ 1978 భారతిలో శ్రీ కోడూరి శ్రీరామమూర్తిగారు గడచిన మూడు దశాబ్దాలలో వెలువడిన తెలుగు సాహిత్యంలోని స్వీయచరిత్రలను గూర్చి చక్కగా సమీక్షించారు స్వీయచరిత్రకూ, స్వీయచరిత్రాత్మక సాహిత్యానికీ గల వ్యత్యాసాలను కూడా చక్కగా విశ్లేషించారు తెలుగు సాహిత్యంలో వచ్చిన స్వీయచరిత్రలను గూర్చి నేనుకూడా యథాశక్తి ఆసక్తితో కొంత కృషి చేస్తున్నాను కాబట్టి, నాకు తెలిసిన కొన్ని విషయాలుకూడా రాయడం బాగుంటుందని ఉత్సహిస్తున్నాను అయితే ఒక్క చిన్న మనవి వేత్త లాలోచించగలరు. కేవలం తెలుగులోనే వెలువడిన స్వీయచరిత్రలు, స్వీయచరిత్రాత్మక సాహిత్యమూ మాత్రమే అధ్యయన పరిశీలనంలోకి తీసుకోవడానికన్నా, తెలుగువారి స్వీయచరిత్రలు అని ఈ పరిశీలన పరిధిని ఇంకొంచెం విస్తృతపరిస్తే, ఆయారంగాలలో లబ్ధప్రతిష్ఠులైన, మేధావులైన, అగ్రగణ్యులైన తెలుగు పెద్దల జీవిత విశేషాలను, ఆంధ్రదేశం ద్వారా వారు పొందిన స్ఫూర్తిని, వారి జీవితకాలపు సాంఘికార్థిక, రాజకీయ, మతనైతిక, సాహిత్యోద్యమ విశేషాలనుకూడా తెలుసుకొనే అవకాశం ఉంటుంది అఖిలభారతస్థాయిలోనే అగ్రగణ్యులైన రాజనీతిజ్ఞులుగా, పత్రికా సంపాదకులుగా, సాంకేతిక విజ్ఞానవేత్తలుగా, విద్యావేత్తలుగా ప్రసిద్ధులైన తెలుగువారైన మహనీయులు ఎందరో ఉన్నారు కొందరు వారి వారి స్వీయచరిత్రలు కూడా రాసుకొన్నారు ఉదాహరణకు వి వి గిరి, ఆచార్య రంగా, కోటంరాజు

రామారావు, కుందూరి ఈశ్వరదత్, కె ఎల్ రావు, డి.ఎస్ శర్మ, చాగంటి సూర్యనారాయణ, పట్టాభి సీతారామయ్య, జి వి సుబ్బారావు మొదలైన వారున్నారు కొంతకాలమైనా తెలుగుదేశం రంగస్థలంగా వీరి జీవిత కృషి సాగింది ఆనాటి తెలుగుదేశపు సామాజిక జీవనం, నాటి పరిస్థితులు ఆసక్తికరంగా ప్రస్తావితమయ్యే ఉన్నవి ఈ స్వీయచరిత్రలలో ఈ స్వీయచరిత్రలను, స్వీయ చరిత్రాత్మక రచనలనుకూడా సమీక్షాపరిధిలోకి చేర్చుకోవడం చాలా ఆసక్తి దాయకంగా ఉంటుంది కొండా వెంకటప్పయ్య పంతులు గారిని గూర్చి అత్యంతాసక్తికరమైన సంఘటన కోటంరాజు రామారావుగారి ఆత్మకథనంలో చోటు చేసుకొన్నది వెంకటప్పయ్యగారి రాజకీయ జీవిత ఔన్నత్యానికి సంబంధించినదీ పూర్వగాథ స్వాతంత్ర్యోద్యమ చరిత్రను గ్రథితంచేసిన తెలుగు పెద్దల స్వీయచరిత్రలలో దేనిలోనూ ఈ సంఘటనను గూర్చిన ప్రస్తావన లేదు జైల్లో వెంకటప్పయ్యపంతులుగారి భోజన సౌకర్యంకోసం ఒక పోలీసు అధికారి రాజద్రోహ నేరంమోపి బేషుగ్గా వంట చేయగల ఒక వంట మనిషిని జైలుకి పంపించడం- ఆ వంటమనిషి ఆనందంగా జైలుకు పోవడం- ఆ సంఘటన ఇటువంటి గడచిన గాథలు ఇంకా కూడా ఉన్నవి

శ్రీరామమూర్తిగారు తమ పరిశీలనను స్వాతంత్ర్యానంతరం గడచిన మూడు దశాబ్దాల కాలానికే పరిమితం చేశారు కాబట్టి, స్థూలంగా నా పరిశీలనను కూడా ఆ కాలిక వ్యవధికే పరిమితం చేయడానికి ప్రయత్నిస్తాను. స్వీయ జీవిత వృత్తాంతాన్ని పద్యకావ్యాలుగా నిబంధించుకొన్న తుమ్మల సీతారామమూర్తిగారు, జాషువా, నాయని సుబ్బారావు, జ్ఞానానందకవి, పాలా వెంకటసుబ్బయ్య మొదలైనవారి గురించి శ్రీరామమూర్తిగారు ప్రస్తావించలేదు తిరుపతి వెంకటకవులు, మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారి వంటి మహనీయులు పూర్వపు తరాలవారు, 'పెనుమత్స' సత్యనారాయణరాజుగారి వంటి ఇప్పటి కవులూ కొందరుకూడ స్వీయ జీవిత చరిత్రను పద్యాలలో వర్ణించుకున్నారు

ఆధునిక సాహిత్య చరిత్రను అధ్యయనం చేసేటప్పుడు దినచర్య రచించిన వారి ప్రస్తావన కావలి వెంకట బొర్రయ్యగారితోనే మొదలవుతుంది అత్యంత ప్రతిభావంతుడు బొర్రయ్య ఈయన దినచర్య మచ్చుపుటలు అచ్చైనాయని కూడా పెద్దలు చెపుతున్నారు పుస్తకరూపంలోకాదు- 'టెయిలర్స్ కేటలాగ్'ల

వంటి పురావృత, గ్రంథ వివరణ సంగ్రథితాలలో దినచర్య వృత్తాంతాలు, యాత్రాచరిత్రలు, స్మృతులు, జ్ఞాపకాలు, కథలూ- గాథలూ- స్వీయచరిత్రాత్మక మైనంతవరకు- గ్రహించి లెక్కవేస్తే- తెలుగవారై యుండి ఇంగ్లీషులో రాసు కున్నప్పటికీ వాటినికూడా లెక్కలోకి తీసుకొంటే- సుమారుగా నాకిప్పటికి నూట పదహారుదాకా లెక్కతేలాయి ఈ నూటపదహారు- ఈ సంఖ్య ఇంకాస్త పెరగ వచ్చునుకూడా- ఆకరాలను జాగ్రత్తగా అధ్యయన విశ్లేషణంచేస్తే నూరు నూట ఏభై సంవత్సరాల తెలుగుదేశపు సాంఘిక చరిత్ర, సాంస్కృతికోద్యమాలు, స్వాతంత్ర్యోద్యమం, సామాజిక పరిణామాలు, సంగీత సాహిత్య నాట్య నాటక లలితకళా విలసనం, భాషోద్యమాలు ఒకటేమిటి- ఇంకా ఎన్నెన్నో అద్భుతమైన విశేషాలు తెలుసుకొనే ఆస్కారం వుంది అన్నిటికన్నా కుతూహలం కలిగించే విషయం ఏమంటే- యథార్థ జీవిత సంఘర్షణలు, వాటి స్వరూప స్వభావాలు, మానవజీవితంలోని నాటకీయ సన్నివేశాలు, మానవప్రకృతిలోని, ప్రవృత్తిలోని ఔన్నత్యాలు, బలహీనతలు, విశ్వాసాలు, ఆశాభంగాలు, నిర్వేదాలు, త్యాగాలు, భోగాలు, విలక్షణమైన, విశిష్టమైన, విపరీతమైన మనస్తత్వాలు- ఇవన్నీకూడా తెలుసుకొనే అవకాశం వుంది కల్పనకన్నా యథార్థమే విభ్రమాస్పదం అనే అర్థంఇచ్చే 'truth is stranger than fiction' అనే సూక్తి అక్షరాలా నిజ మని నిరూపితం అవుతుంది ఈ యథార్థ జీవితానుభవాలను గూర్చి తెలుసు కొన్నప్పుడు.

* * *

శ్రీరామమూర్తిగారి పరిశీలనలో చిన్న సవరణలుచేస్తే బాగని మనవి చేస్తున్నాను అవి పెద్ద దోషాలేమీకావు చిన్న సవరణలు తమ ఇష్టానుగుణంగా స్వీకరించవచ్చు అన్యథాకరించనూవచ్చు

ఇవి ఏవంటే, ఒకటి- డైరీలను గూర్చిన ప్రస్తావన ఒక్క గురజాడ అప్పారావుగారి డైరీలను గూర్చి మాత్రమే ఉటంకించారు వీరేశలింగం డైరీలు, లేఖలుకూడా ప్రకటితమైనవి ద్వితీయ ముద్రణం కూడా పొందాయి ఇటీవలనే అట్లానే కె వి. రమణారెడ్డిగారు సంకలితంచేసిన కవికోకిల లేఖలుకూడా ప్రస్తావించి ఉండాల్సింది ఈ లేఖలతోపాటు డైరీల ప్రస్తావనకూడా ఉందనుకుంటాను కవికోకిల గ్రంథావళి సంపుటాలలో

రెండోది స్వాతంత్ర్యానంతరం వెలువడిన స్వీయచరిత్రల్లో చెప్పుకోదగిన అయ్యదేవర కాళేశ్వరరావు, పెద్దిబొట్ల వీరయ్యగార్ల స్వీయ చరిత్రల ప్రస్తావన చేస్తూ శ్రీ దిగవల్లి వెంకటశివరావు గారి అభిప్రాయాన్ని ఉటంకించే సందర్భంలో శ్రీ శివరావు గారిని ప్రసిద్ధ జర్నలిస్టుగా మాత్రమే అభివర్ణించడం సముచితం కాదేమో ననుకుంటాను ఆధునికాంధ్రదేశ చరిత్రకు రూపరేఖలు దిద్దిన వారు బహు గ్రంథ నిర్మాతలు, ఉత్తమ పరిశోధకులు, సారస్వత వేత్తలు, స్వాతంత్ర్యోద్యమ నిర్మాణ కార్యకర్తలు శ్రీ శివరావు పంతులుగారు వారిని ప్రసిద్ధ జర్నలిస్టుగా సంభావించడం, ఆయన కృషిని చక్కగా అంచనా వేయడానికి చాలదు.

ఇక మూడోది- బుచ్చిబాబు రాసుకొన్న స్వీయ చరిత్రను గూర్చి ప్రస్తావిస్తున్నప్పుడు దొర్లిన చిన్న పొరపాటు ఇది అచ్చుతప్పై ఉంటుందనే భావిస్తాను కాని ఈ పుస్తకం పేరు నాలుగుచోట్ల ప్రస్తావనకు వచ్చినప్పుడల్లా పొరపాటుగానే ప్రస్తావితమైంది బుచ్చిబాబు స్వీయ చరిత్ర కాదది - స్వీయ చరిత్రాత్మక రచన దానికాయన పెట్టుకొన్న పేరు అంతరంగ కథనం. మథనం అని నాలుగు సార్లున్నూ ప్రసక్తమైంది చాలా చిన్న సవరణ అనే దృష్టితో మాత్రమే దీనిని ప్రసక్తం చేస్తున్నాను ఈ గ్రంథం - బుచ్చిబాబు అంతరంగ కథనం "ఆత్మకథ అనేది, Autobiography, చాలామంది వ్రాయ గలరు అంతరంగ కథనం బహుకొద్దిమందే వ్రాయగలరు" అంటున్న కృష్ణశాస్త్రి గారి మాటల్లో అంతరంగ కథనం విలువ ఎంతో తెలుస్తోంది తీరా చూస్తే కౌమారానికి వీడ్కోలూ, యౌవన తారుణ్యానికి స్వాగతము పలుకుతూ మానసిక దేహాళికి అటో కాలూ, ఇటో కాలుగా బుచ్చిబాబు తన అనుభూతుల్ని వెల్లడించిన అపూర్వమైన రచన ఇది పదేళ్ళ జీవితానుభవాలు, అనంతర జీవిత కాలంలో వాటి అనుభూతి ముద్రలు వివరించాడు బుచ్చిబాబు బుచ్చిబాబు ఎంత గొప్ప కథకుడు! అంతటి సౌందర్య తత్వజ్ఞుడైన తెలుగు కథకుడింకోరెవరైనా ఉన్నారా?

* * *

స్వాతంత్ర్యానంతరం మూడు దశాబ్దాలంటే 1977 వ సంవత్సరం వరకూ సమీక్షా కాలపరిధిగా స్వీకరించవచ్చు గదా! కొన్ని స్వీయచరిత్రలను గూర్చి నామమాత్రంగానే ప్రస్తావించారు శ్రీరామమూర్తిగారు. ఆ మాత్రం కూడా ప్రస్తా

వన లేనివి మరికొన్ని స్వీయచరిత్రలు, స్వీయచరిత్రాత్మకాలూ మిగిలేపోయాయి. కానీ ప్రస్తావించిన వాటి గూర్చి అయినా నాలుగు ముక్కలు చెపితే బాగుండేది

కొన్నిటి విషయంలో అదీ చేయలేదు ఆ పని నేను పెట్టుకోకపోయినా, అసలు పూర్తిగా వదిలేసిన వాటిని గూర్చి కొంత ప్రస్తావిస్తాను అన్నిటినీ గూర్చి చెప్పాలంటే గ్రంథం చాలా పెరిగిపోవచ్చు అయినా ఈ ఒక్క విషయం శ్రీరామమూర్తిగారు ప్రస్తావిస్తే ఎంత బావుండేది అనిపించిన ఒకటి రెండు సందర్భాలలో ఆయన ప్రస్తావించిన గ్రంథాన్ని గురించి కూడా చాలా సంక్షేపంగా నున్నూ ప్రస్తావిస్తున్నాను అదుగో- అలాటి సన్నివేశం ఒకటి నాకు ఎదురైంది

బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారి 'అప్పారావుగారూ - నేనూ' అనే స్వీయ చరిత్రాత్మక రచనలో అద్భుతమైన విషయం ఒకటుంది ఆసక్తిని కలిగించేవీ, మనసుని ఆర్ద్రార్ద్రం చేసేవి చాలా సంఘటనలే ఉన్నాయనుకోండి వాటితో పాటుగా చాలా ఉత్కంఠ కలిగించే- నాటకీయమేమో అనిపించే సంఘటన కూడా వొకటుంది దాన్ని శ్రీరామమూర్తిగారు వినిపించివుంటే బాగుండేది అది ఇది.

సాహితీ సమితి తొలినాళ్ళలో చాలా పలుకు విలువ కల కవి కొడవటిగంటి వెంకటసుబ్బయ్య 'ఆగు మాగుమా తెరువరీ ఆయాస ఖేదమున పనయింపుము, మా గృహాంగణ కుసుమ సముదయ ఫలము లియ్యవిగో' అని 'ఆతిథ్యం' అనే రచన వైతాళికులలో వుంది వైతాళికుల సంపుటంలో ముద్దుకృష్ణ ఈ కవిని గూర్చి ఇట్లా రాశారు· "అధ్యాత్మికమైన అన్వేషణకై కుటుంబాన్నీ మిత్రులనూ విడిచి ఏ హిమాలయాలకో వెళ్ళిపోయాడు కవిత్వంకన్నా ఎక్కువైన దానినీ కుటుంబంకన్నా' మిత్రులకన్నా చేరువైనదానినీ దేనిని సాధించాడో, ఈనాటికీ అజ్ఞాతంగానే వున్నాడు." ఈ కొడవటిగంటి వెంకటసుబ్బయ్యగారు గొప్పకవి. ఈయనకు వ్యక్తిగత జీవితంలో ఏదో ఆశాభంగాలెదురైనాయి ఒకసారి అప్పారావుగారూ, రాజ్యలక్ష్మమ్మగారూ శ్రీశైలం వెళ్ళినప్పుడు అక్కడ సత్రంలో భోజనం చేస్తుండగా ఎదుటి పంక్తిలో ఎక్కడ గుర్తిస్తారో అని విపరీతమైన ఆత్రుతతో ఆందోళనతో గబగబా భోంచేసి పొడ కూడా కానరాకుండా పరిగెత్తి మాయమైన వ్యక్తి వెంకటసుబ్బయ్యగారేనని రాస్తున్నారు రాజ్యలక్ష్మమ్మగారు. ఆయన కెదురుగా తామిద్దరూ భోజనానికి

కూచోవడంవల్ల వెంకటసుబ్బయ్యగారు చాలా ఆందోళన చెందారని రాజ్య లక్ష్మమ్మగారి భావం అప్పటికే ఆయన గుర్తుపట్టలేకుండా మారిపోయినాడట! వెంకటసుబ్బయ్యగారి గురించి మరెక్కడా నాకు ప్రస్తావన కనపళ్ళేదు. ఆయన మంచి కవి అని నవ్యాంధ్ర సాహిత్య వీధుల్లో మాత్రం ప్రసక్తం జీవించివుంటే ఆయనకిప్పుడు ఎనభై ఏళ్ళు ఉంటాయి నేటికీ అజ్ఞాతంగానే వున్నాడు

ఇటువంటిదే ఇంకో సన్నివేశం సర్వదుఃఖ నివారణోపాయమనే బులుసు వెంకటేశ్వర్లుగారి స్వీయచరిత్రలో గాంధీమహాత్ముడి ఆంధ్రదేశ పర్యటనలో తణుకులో ఎర్రమిల్లి రామనాథంగారి మేడలో గాంధీజీ దువ్వూరి సుబ్బమ్మగారు ధరించిన అతి నాజూకు ఖద్దరును గూర్చి పరిహాసమాడటం, సుబ్బమ్మగారు కిరాణాకొట్టు పెట్టుకోవలసిన వాడివి నీకు నాజూకేం తెలుస్తుంది అని తిప్పి కొట్టడం, అందుకు ఇల్లెగిరిపోయేలా గాంధీజీ నవ్వడం, పట్టాభి, ప్రకాశం, దండు నారాయణరాజు ప్రభృతులు కూడా ఆ నవ్వులో పాలు పంచుకోవడం, ఎవరికైనా నవ్వు తెప్పించే సన్నివేశం మహాత్ముడికి ఛలోక్తులాడటం, పరిహాసోక్తులకు గురికావడం, అంత ఇష్టమన్నమాట! మన దువ్వూరి సుబ్బమ్మగారిలాగా అంతమాట ఆయనను ఎవరూ ఎప్పుడూ అని వుండరు గాంధీమహాత్ముడు అవతార పురుషుడే అనడానికి ఆయన చిదానంద ప్రవృత్తికూడా తార్కాణమే బులుసు వెంకటేశ్వర్లుగారి స్వీయచరిత్రలో చాలా ఆసక్తి కలిగించే ఘట్టాలే ఉన్నాయి ఆనాటి మధ్యతరగతి కుటుంబ జీవనంలోని ఆంక్షలు, కాంక్షలు, కష్టసుఖాలు ఆయన హృదయావర్జకంగా వర్ణించారు

* * *

అసలు స్వీయచరిత్ర ఎవరైనా ఎందుకు రాసుకుంటారు? ఎలా రాసుకోవాలి? స్వీయచరిత్రాత్మక రచనకూ, అచ్చంగా స్వీయచరిత్రకూ వుండే తేడాలేమిటి? వస్తుగతంగానూ, శిల్పసంబంధిగానూ స్వీయచరిత్ర, స్వీయచరిత్రాత్మక రచనల్లో చోటు చేసుకోగల లోపా లోపాలేమిటి? ఈ రచనలు చేయాలనే ప్రేరణలేవిటి? మొదలైన విషయాలు కూడా పరిశీలించారు శ్రీరామమూర్తిగారు

"The impulse to justify or to exalt an individual led to the writing of memoirs, autobiographical and biographical" అంటోంది The Oxford Classical Dictionary (1957)

ఇదుగో ఈ నిర్వచనానికి అనుగుణంగా ఉదాహరించదగినది కామరాజు హనుమంతరావుగారు ప్రకటించిన మాతృదేవి లీల తమ ప్రేమంపు టిల్లాలిని గూర్చి రాసుకున్న రచన ఇది స్వీయచరిత్రమూ, స్వీయచరిత్రాత్మకమూ కూడా 'అప్పారావుగారూ-నేనూ' అని శోకమే శ్లోకమైన ప్రేరణగా కవబాసిన గువ్వ ఆర్తితో రాజ్యలక్ష్మమ్మగారు తమ భర్తను గురించి స్మరించుకోగా, శ్రీ హనుమంతరావుగారు ఇందుమతికోసం అజమహారాజు విలపించినంత మగ్న మనస్కతతో ఈ చిన్న పుస్తకం రాశారు 'అర్థం భార్యా మనుష్యస్య భార్యా శ్రేష్ఠ తమస్సఖా, భార్యా మూలం త్రివర్గస్య, భార్యామూలం తరిష్యతః' అని మహాభారతం ఈ సుభాషితం హనుమంతరావుగారి జీవితానికి సరిగ్గా సమ న్వయం అవుతుందనిపిస్తుంది ఈ పుస్తకం చదివితే 'నాకు ఆమె ఇల్లాలే కాదు, దైవంకూడా ఆమె మాతృత్వ పరిపూర్ణ సిద్ధిని సాధించింది' అంటారు హను మంతరావుగారి గ్రంథంలో హనుమంతరావుగారి స్వీయ జీవిత సమీక్ష 1973 లో వెలుపడగా ఈ 'మాతృదేవీలీల' అనే పేరుగల తమ ధర్మపత్ని జీవిత చరిత్రను 1955 లోనే వెలువరించారు స్వీయ జీవితాత్మక రచనల్లో ఈ పుస్తకం తప్పకుండా పేర్కొనదగింది

ఇలాగే 1968 వ సంవత్సరంలో వెలువడిన ''సీమకు స్టీమరులో'' అనేదండా వెంకట సుబ్బారెడ్డిగారి విదేశ యాత్రా వృత్తాంతాన్ని కూడా స్వీయ చరిత్రాత్మక సాహిత్యంలోనే చేర్చవచ్చుననుకుంటాను. కుతూహలో ద్వేగాన్ని మరింత మరింత పెంచుతూ సాగిపోయే గ్రంథమిది 1928 ఏప్రిల్‌లో శ్రీ దండా వెంకటసుబ్బారెడ్డిగారు స్వదేశంలో వైద్యవిద్య పూర్తికాగా లండన్‌కు వెళుతూ, తన ప్రయాణానుభవాలను డైరీ రూపంగానూ, స్వదేశంలో మిత్రులకు ఉద్దేశించిన లేఖారూపంగాను రాసిపెట్టుకున్న అనుభవాల, అనుభూతుల సంపుటి ఈ గ్రంధం. ఈ గ్రంథంలో శైలి చాలా సొగసుగా వుంది సముద్ర ప్రయా ణాన్ని గూర్చిన స్వీయానుభవ వర్ణనలు తెలుగులో ఎవరైనా రాశారా అసలు?! 1928, 30 సంవత్సరాల ఇంగ్లండు దేశాన్నిగూర్చినవి, లండన్‌పుర వర్ణనల తోనూ ఈ చిన్న పుస్తకం చాలా విలువైనది

స్వీయ చరిత్రాత్మక సాహిత్యంలోనే గుంటూరు శేషేంద్రశర్మగారి 'నా డైరీ-రక్తరేఖ' కూడా చేరదా? ఇందులో ఆయన స్వీయజీవిత వృత్తాంతం

ఏమీలేకపోయినా, తన చుట్టూ ప్రత్యక్షమవుతున్న సాహిత్య సమాజాన్ని గూర్చిన ఆయన స్పందనలు ప్రతిస్పందనలు ఈ గ్రంథంలో ఉన్నాయి అఫ్‌కోర్స్ - సాహిత్య చర్చలు, నిజమైన సాహిత్య విలువలేవీ? అనేవాటికి ప్రాధాన్యం అయినా తానుగా చూసి, భావించి, స్పందించి, తన స్నేహితుల, అభిమానుల, తనకు అయినవారి, కానివారి, సాహిత్య వ్యాసంగాన్ని కోపంగా, జాలిగా, అసహనంగా, వేదనతో బేరీజువేసే ప్రయత్నమూ, స్వీయాభిప్రాయాలు, పూర్వపక్ష ప్రతిపక్ష సిద్ధాంతాలూ, తీర్పులూ ఉన్నాయీ గ్రంథంలో 1974 లో అచ్చైంది ఈ పుస్తకం ఈ దృష్ట్యా పరిగణిస్తే తిరుపతి వెంకటకవుల కథలూ - గాథలలో స్వీయ చరిత్రాత్మక వృత్తాంతం చాలా చోటు చేసుకోవడం చూడవచ్చు ముఖ్యంగా చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి కాశీయాత్ర ఆయన స్వీయచరిత్రలో ఏకదేశమే బహూ సొగసైన పుస్తకం ఆయన గురుకులవాసం, వివాహం, ఆనాటి సాంఘిక పరిస్థితులు, తొలినాళ్ళలో వారు చేసిన అవధానాలు, ఆ సమస్యలు బహూ రంజకంగా వివరించారు వెంకటశాస్త్రిగారు కాశీలో పండితులు చదువుచెప్పే ఏర్పాట్లు, చదువుకొనే విద్యార్థుల భోజన భాజనాదు లేవిధంగా సమకూరేదీ ఆ వివరాలు అన్నీ చాలా ఆసక్తి కలిగేలా వర్ణించారు శాస్త్రిగారు ఈ పుస్తకంలో

* * *

ఇక అసలు స్వీయ చరిత్రల గూర్చి ప్రస్తావిస్తాను. ఆచంట జానకిరామ్ గారి స్మృతిపథంలో, సాగుతున్న యాత్ర - రెండు భాగాలు స్వీయచరిత్ర కిందికే వస్తాయి జననం, విద్యాభ్యాసం, కుటుంబ స్థితిగతులు మొదలైన విషయాలను గూర్చి వివరంగా చెప్పకపోయినా, స్వీయజీవితానుభూతులను భావుకతతో వివరించారు సాంప్రదాయికమైన రచనా పద్ధతిలోకాక నవ్యప్రాయోగిక రీతిని ఆయన అనుసరించారు. ఆచంట జానకిరామ్‌గారి తండ్రిగారైన ఆచంట లక్ష్మీపతిగారి స్వీయచరిత్ర వీరేశలింగం, చిలకమర్తి, పెద్దిభట్ల వీరయ్యగార్ల స్వీయచరిత్రల మాదిరిగా సంప్రదాయ రీతిలోనే సాగింది. 1973 లో పుస్తక రూపాన అచ్చై వచ్చింది. కిందటి శతాబ్దం చివరి పాదంలో గోదావరి జిల్లాలోని సాంఘిక పరిస్థితులను చక్కగా ప్రతిబింబింప చేస్తున్నది లక్ష్మీపతిగారి స్వీయచరిత్ర ఆయుర్వేద విజ్ఞానానికి లక్ష్మీపతిగారు చేసిన సేవ, ఆనాటి వైద్యనిదానం, ఆ అనుభవాలు విపులంగా ఉన్నాయి లక్ష్మీపతిగారి స్వీయచరిత్రలో. విజ్ఞాన చంద్రికా మండలి వ్యవస్థాపక సభ్యులలో శ్రీ లక్ష్మీపతిగారొకరు. అందువల్ల

శాస్త్రీయ విజ్ఞానాన్ని సుగమమైన, సులభమైన తేటతెల్లమైన తెలుగులో చెప్ప డానికీ, తెలుగువారి పురాచరిత్ర వైభవాన్ని, పునరుజ్జీవన సాంస్కృతిక వికాస వైఖరినీ సర్వులకూ తెలియబరచడానికీ విజ్ఞానచంద్రికా మండలి రూపొందించిన ప్రణాళికలలో పాల్గొన్నారు వీరు అఖిల భారత స్థాయిన ఆయుర్వేద వైద్య విజ్ఞాన ప్రచారానికి జరిగిన కృషిని గురించీ ఆయా ప్రాంతాలలో జరిగిన సదస్సులను గురించీ వివరాలున్నాయి లక్ష్మీపతిగారి స్వీయచరిత్రలో

సంజీవదేవ్‌గారి అనుభవాలు, జ్ఞాపకాలను గూర్చి నామమాత్రంగా ప్రస్తావించడం జరిగింది కాని సంక్షేపంగానైనా అపూర్వమూ అనుపమానమూ అయిన ఈ స్వీయ చరిత్రాత్మకమైన రచనలగూర్చి వివరించకపోవడం శ్రీరామ మూర్తిగారి వ్యాసంలో పెద్ద లోపం శ్రీ సంజీవదేవ్ గొప్ప భావుకులు సౌందర్య వేత్తలు మనస్వీ సౌందర్యారాధన, తత్త్వజిజ్ఞాస, ఉత్తమ కళాతృష్ణగల ప్రజ్ఞాశీలి తెగిన జ్ఞాపకాలు, స్మృతిబింబాలు, గతంలోకి అనే మూడు సంపుటాలలో పరమ రమణీయంగా, పరిపక్వమైన చిత్తవృత్తితో తమ జీవితానుభవాలను, అనుభూతులను గ్రథితం చేశారు పది సంవత్సరాలకు పూర్వమే శ్రీనార్లవారు సంజీవదేవ్‌ను గూర్చి ఇట్లా రాశారు "Sanjeev is a poet, an essayist, a photographer, a painter, an art critic and a mystic A desciple of Nicholas Roerich, a friend of Lama Govind and Asitkumar Haldar, a widely travelled man who in his youthful year wandered all over India including the enchanting Himalayan valleys, he is simple learned, unpretentious, charming, and captivating."

ఈ మాటలు నాలుగో జాతీయ పుస్తకోత్సవ సందర్భంగా నేషనల్ బుక్ ట్రస్ట్‌వాళ్ళు ప్రచురించిన ప్రత్యేక సంచికలో 1969 - 70 సంవత్సరపు పుస్తక ప్రచురణ కార్యక్రమము - కొన్ని గొప్ప పుస్తకాలు గూర్చి ప్రస్తావిస్తూ నార్ల రాశారు. తెగిన జ్ఞాపకాలు 1970 వ సంవత్సరంలో వెలువడింది అటు తర్వాత స్మృతిబింబాలు, ఈ సంవత్సరమే 'గతంలోకి' వెలువడ్డాయి. అడయార్ విశేషాలు, అనిబిసెంట్ సందర్శనం, 'జిడ్డు కృష్ణమూర్తితో పరిచయం' 'హిందీ రచయిత ప్రేమచంద్‌తో పరిచయం' 'ప్రేమచంద్‌తో గోష్ఠి' 'హిమాలయాలలో

వింత అనుభూతులు' 'ప్రసిద్ధ చిత్రకారుడు హల్దార్‌తో పరిచయం' 'రవీంద్ర కవీంద్రుని సందర్శన భాగ్యం' 'కళాతపస్వి రోరిక్‌తో పరిచయం' 'అడవి బాపిరాజుతో పరిచయం' 'రాహుల్‌జీతో నా పరిచయం' మొదలైన జ్ఞాపకాలన్నీ విమల గాంధర్వం వింటున్నప్పటి అనుభూతిని కలిగిస్తాయి పాఠకుడికి

మహాపండిత రాహుల్ సాంకృత్యాయన్ త్రిపిటకాచార్య వచ్చి తుమ్మ పూడిలో సంజీవదేవ్‌గారికి అతిథిగా వారం రోజులు గడపటమూ, ఆ చుట్టుపక్కల గ్రామాల్లో సోవియట్ రష్యా సామాజిక జీవనాన్ని గూర్చి ఆయన ఉపన్యాసాలు చెప్పటమూ, తరవాత నాగార్జునకొండ వెళ్ళి, అక్కడ తవ్వకాలలో బయటపడ్డ శిధిలావశేషాలు చూడటమూ, రాహుల్‌జీ గుంటూరు రావడమూ మొదలైన ఈ వివరాలన్నీ ఎంతో ఉత్తేజాన్నీ ఆహ్లాదాన్ని, కలిగిస్తాయి పాఠకులకు తెగిన జ్ఞాపకాలు చదువుతున్నప్పుడు రాహుల్‌జీ తెలుగు చదవగలిగేవారట కాని మాట్లాడలేక పోయేవారట రాహుల్ సాంకృత్యాయన్ చాలా కాలం బౌద్ధ సన్యాసిగా ఉండిపోయినారు తన ఏభై ఒకటో యేట రష్యన్ వనిత నొకామెను వివాహం చేసుకున్నారు వాళ్ళకో కొడుకు కూడా పుట్టాడు రాహుల్‌జీ వ్యక్తిత్వంలోని పరస్పర వైరుద్ధ్యాలను, సంచలన వేగతీవ్రతను చూసి చాలా ఆశ్చర్య పడ్డానని అంటున్నారు సంజీవదేవ్ ముందు సన్యాసాశ్రమం గడిపి తరవాత గృహస్థు కావడం క్రమపరిణామం అనేది రాహుల్‌జీ సిద్ధాంతమట రాహుల్‌జీ మాంస భోజన ప్రియత్వం, నిర్విరామ ధూమపాన వ్యగ్రత చాలా ఆశ్చర్యం కలిగించే విషయాలు, వీటిని సరిపెట్టుకోవడం ఎలానో తెలిసింది గాదు అని సంజీవ్‌దేవ్ తమ జ్ఞాపకాలలో రాశారు అహింసను పరమధర్మంగా పాటించే బౌద్ధులు మాంసాహారం పట్ల మమత్వం చూపడం చాలా వింతైన సంగతి ఈ విధంగా సంజీవదేవ్ అనుభవాలు - జ్ఞాపకాలలో తెలుసుకోవలసిన విశేషాలెన్నో ఉన్నాయి ఆయన సృజనాత్మక ప్రతిభాశాలి కూడా కాబట్టి, రచనా విన్యాసం కూడా పరమ రమణీయంగా పర్యవసించింది స్మృతి బింబాలలో కూడా ఆయా ప్రదేశాలలో తమకు తారసపడ్డ విశిష్టమైన, విలక్షణమైన వ్యక్తులను గురించీ పరిసరాలను గురించీ ఆయన వర్ణించారు 'గతంలోకి' ఇటీవలే వచ్చింది కాబట్టి ఇంకా నేను చదవటం పడిందికాదు.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి శ్రీకృష్ణ చరిత్రమనే స్వీయ చరిత్రను గూర్చి ప్రస్తావన కూడా చేయలేదు శ్రీరామమూర్తిగారు ఇది 1959 వ సంవత్సరంలో వెలువడింది ఈ స్వీయ చరిత్ర కూడా చాలా ఆసక్తిని రేకెత్తించే రచన అనే చెప్పాలి. అఖిలభారతంలోనూ శ్రీ శాస్త్రిగారి వైదుష్యానికి జరిగిన సన్మానాలు, పురస్కారాలు మొదలైన వాటితో పాటు, ఆయన గ్రంథ కర్తృత్వ పరిశ్రమ, ఆనాటి సాంఘిక పరిస్థితులు, ఆయన సాగించిన విద్యా వివాదాలు, నడిపిన పత్రికలు, పాటించిన విశ్వాసాలు చదువుతున్నప్పుడు అదొక లోకం అనిపిస్తుంది

దాసరి లక్ష్మణకవిగారు స్వీయచరిత్రను 'నా జీవితయాత్ర' అనే పేరుతో రెండు సంపుటాలుగా ప్రకటించారు రెండో సంపుటం 1962 లో వెలువడింది. ఆంధ్రదేశంలోని కవి పండితులంతా లక్ష్మణ కవిగారినీ, ఆయన జీవితయాత్రనూ శ్లాఘించారు. రవీంద్రకవీంద్రుడు పిఠాపురం వచ్చి కొన్నాళ్ళు రాజాగారికి అతిథిగా వుండటం, తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారితో కలిసి లక్ష్మణకవిగారు రవీంద్రుణ్ణి మూడుసార్లు దర్శించడం, రవీంద్రుడు కవిగారికి తన బాల్య జీవిత విశేషాలు వివరించడం ఈ గ్రంథంలో కుతూహలం కలిగించే విషయం (పుట 142)

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి స్వీయచరిత్ర 'ప్రజ్ఞాప్రభాకరం' 1951 లోనే వెలువడింది ''తమకు గలిగిన యోగానుభూతులను వివరించుచు వేయి పుటల గ్రంథముగా దొలి సంపుటమును, నీ యోగమువలన నుపకారం పడసిన మిత్రుల యొక్కయు, శిష్యుల యొక్కయు ననుభవములను, వారే వ్రాసిన వానిని వేయి పుటల గ్రంథముగా రెండవ సంపుటమునుగా ప్రజ్ఞాప్రభాకరమును వెలయించుట వారి సంకల్పము అందుకై తొడగి రచనమున కుపక్రమించి కొంతవరకు సాగించిరి మిత్రులకడనుండియు, నాప్తులకడనుండియు, శిష్యులకడనుండియు వారి యనుభవములను దెలుపు వృత్తాంతములను గూడ దెప్పించిరి'' అని ప్రజ్ఞాప్రభాకరాన్ని గూర్చి ప్రచురణ కర్తలు తెలియచేశారు భృక్త రహిత తారక రాజయోగంగా పరిగణితమై కుంభకోణంస్వామి వారుగా ప్రసిద్ధులైన మాస్టర్ సి. వి వియోగమార్గంలో ప్రభాకరశాస్త్రిగారు సిద్ధిని సాధించారు ఈ గ్రంథానికి ముప్పైఆరు పేజీల పీఠిక వుంది. శ్రీ ప్రభాకరశాస్త్రులవారు, మానవల్లి

రామకృష్ణకవిగారికి సంబంధించిన చాలా సన్నిహిత విషయాలు కూడా రాశారు. కొమర్రాజు లక్ష్మణరావుగారితో తమ పరిచయమూ, లక్ష్మణరావుగారితో కలిసి వీరేశలింగంగారిని చూడటానికి వెళ్ళటమూ, కవుల చరిత్రను పునస్సంశోధితం చేసే విషయంలో వీరేశలింగంగారు ప్రభాకరశాస్త్రిగారి సాయాన్ని అభిలషించడం ఇత్యాదిగా ఎన్నో తెలుసుకోవలసిన విషయాలున్నాయి "దీని రచనమున నాకు పురుషోత్తముడగు గాంధి స్వచరిత్ర రచనా విధానము దారిదివ్వె" అన్నారు శ్రీ శాస్త్రిగారు శాస్త్రిగారి అభిప్రాయాలు ఎంత నవీనాలో, హేతుయుక్తాలో చూడండి.

"దైవము పేర సంఘమున అలజడి పుట్టించుట సుకరమనీ, అది దిద్దుటంత సుకరముగాదనీ, సంఘము విద్యా విజ్ఞానవంతమై మొత్తముమీద వర్ధిల్లిననేగాని యిట్టి చెట్టలు తొలగింప సాధ్యముకాదనీ విన్నవించుటకే ఈ విషయముల నిక్కడ వ్రాసితిని మతము, వైద్యము, జోస్యము, ధర్మము, ఆచారము ఇత్యాది సంప్రదాయ సంకేతములతో చెడుగులెన్నెన్నో సంఘమున దిద్దగుదర నివై మొద్దువారి కదలకున్నవి వ్యాపించుచున్నవి మూఢ విశ్వాసముతో వాని ననువర్తించు లోకముండుటచే దత్ప్రచారకులు వానిని స్వయముగా విశ్వసింపక పోయినను వానివలన లాభముచే లోకముప పలుకుబడి సాగించుకొనుచున్నారు. కొందఱు సగమెఱుకతో నన్నింటిని పాటించుచున్నారు" (పుట 13-14) దుర దృష్టవశాత్తూ నూటయాభై రెండు పుటల దగ్గర అసంపూర్ణంగా ఆగిపోయిందీ స్వీయచరిత్రం చివర ప్రకరణం నాడీ గ్రంథాలు ఇందులో చాలా అద్భుత మైన విషయాలున్నవి

కె ఎన్ కేసరిగారి 'నా చిన్ననాటి ముచ్చట్లు' అనే స్వీయచరిత్ర 1953 లో అచ్చైంది నిప్పచ్చరపు పేద సంసారం నుంచి స్వయంకృషితో చాలా గొప్పవాడైనాడు శ్రీ కేసరి ఆయన 1875 లో జన్మించారు 1953 లో పరమపదించారు ఇంచుమించుగా ఆయన జీవించిన మూడు పాతికల మించిన ఈ కాలంలో తెలుగుదేశంలో సాంఘిక జీవనంలో వచ్చిన మార్పులన్నీ ఈ ముచ్చట్లద్వారా చక్కగా తెలుసుకోవచ్చు కేసరి కుటీరం స్థాపనం, గృహలక్ష్మి పత్రిక నిర్వహణం మొదలైనవి చాలా ఆసక్తికరమైన వృత్తాంతాలు. మరపురాని మన మహాత్ముడు అనీ, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు అనీ రెండు అధ్యాయాలు కేసరిగారు స్వీయచరిత్రలో రాశారు

"ఇందులో నేను చిన్నతనంలో ఎలా నిరుపేదగా కష్టపడి స్వయంకృషి వలన స్వశక్తితో క్రమంగా విశేషంగా ధనమార్జించినదియు దానిని మొత్తము నా స్వార్థమునకు, విలాసములకు మాత్రము వినియోగించుకోకుండా పరోప కారానికి, సంఘ పురోభివృద్ధికి వినియోగించిన విధము వివరింపబడినది" (పుట 249) అన్నారు కేసరిగారు

"ఆనాటి చెన్నపట్టణము యెట్లుండెనో, అప్పటి విద్యార్థు లెట్లు కాలము గడిపిరో, రోడ్లు, కాఫీ హోటళ్ళు, భవనములు ఏ రీతిన ఉండెడివో తెలుసుకొను టకు అనువగు వర్ణనలు కలవు ఉత్తర దక్షిణదేశ యాత్రలో ఆయా క్షేత్ర ములు, మలబారు పరిస్థితులు, నంబూద్రి బ్రాహ్మణుల వృత్తాంతము, వివిధ నాటక రచనలు, సమాజములు, చిత్రలేఖనము, సంగీతము – ఇది అననేల వివిధ విష యములను గురించి తెలిసికొనగల అంశములు కలవు" అంటున్నారు పత్తిపాటి సత్యనారాయణరావుగారు ఈ గ్రంథ పరిచయంలో.

అనాటి క్రిస్టియన్ కాలేజి ప్రిన్సిపాల్ మిల్లర్ దొరనుగూర్చి కేసరిగారిట్లా అన్నారు

"ఆయన నేటివారివంటివారు కాదు. పూర్వపు కణ్వ, గౌతమ, కాణాదాది కులపతుల తలపించు కరుణార్ద్రహృదయుడు."

చెన్న నగరంలో ఆ రోజుల్లో సుప్రసిద్ధమైన వినోద విహార స్థలమైన పార్క్ ఫేర్ ఒక రోజున ఘోరమైన అగ్నిప్రమాదానికి గురి అయింది అప్పుడు మిల్లర్ దొర చూపిన సాహసం వర్ణనాతీతం అంటున్నారు కేసరిగారు

''ఆయన స్వయముగా సాహసించి గుంజలెగబ్రాకి కాలుచున్న పందిళ్ళను దులిపివేసినారు పొగలోనున్న శిశువులను, స్త్రీలను ఇవతలికితెచ్చి విడిచినారు ఇంకెన్ని విధములుగానో అచటి బాధితులకు సహాయపడినారు అంతేకాక, కాలేజీకి వెళ్ళి రిజిస్టరు చేతబుచ్చుకొని పొరుగూళ్ళనుండి విద్యాభ్యాసమునకై వచ్చి కోన కొక్కడు గొందికొక్కడుగా నుండినవారిని పేరు పేరు వరసన తెలుసు కొని వారి యోగక్షేమములను విచారించి వారి తల్లిదండ్రులకు పోషకులకు తెలియపరచి వారి ఆత్రము బాపిన శిష్యవత్సలుడగు మహాత్ముడు" (పుట 8).

కొండ వెంకటప్పయ్యపంతులుగారి స్వీయచరిత్రలోకూడా మిల్లర్‌దొరను గూర్చిన వివరాలున్నాయి

లింగం వీరభద్రయ్యచౌదరిగారి 'స్వవిషయం' మూడు సంపుటాల బృహత్పరిమాణంగల స్వీయచరిత్ర శ్రీ వీరభద్రయ్యచౌదరిగారు ఇన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంట్‌లో అత్యున్నతమైన పదవుల నధిరోహించారు ఇంచుమించు ఉద్యోగ నిర్వహణంలో ఆంధ్రదేశమంతా పర్యటించారు గంజాం సర్కిల్‌లో కొన్నాళ్ళు పనిచేశారు హైదరాబాద్ సర్కిల్‌లో కూడా కొన్నాళ్ళు పనిచేశారు ఈ శతాబ్దపు పూర్వార్ధంలో క్రమంగా సాంఘిక జీవనంలో నెలకొంటున్న మార్పులను చాలా ఆసక్తికరమైనవాటిని ఈ స్వీయచరిత్ర ద్వారా తెలుసుకో వచ్చు

సినిమా వినోద సాధనంగా ప్రాబల్యం పొందటానికి ముందు గ్రామ ప్రాంతాలలోనూ, నగర ప్రాంతాలలోను కోడి పందాలు, పొట్టేళ్ళ పందాలు జరుగుతూ ఉండటం, ఆయా విశేషాలు చదువుతుంటే చౌదరిగారి ఈ స్వీయ చరిత్ర చాలా ఉత్సుకతను గొలుపుతుంది ఈ సంపుటాలు మూడున్నూ 1977కు ముందుగానే వెలువడ్డాయి

హరికథా పితామహుడు, అపర తుంబురుడు, నిరుపమాన సంగీత సాహిత్య ప్రజ్ఞానిధి, అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు గారి స్వీయచరిత్రం 'నా యెఱుక' 1976వ సంవత్సరంలో పుస్తకరూపాన వచ్చింది దీనికిసాటి అయిన స్వీయచరిత్రం తెలుగులో ఇంకొకటిలేదు కిందటి శతాబ్దపు బందరు ఉప్పెన సంవత్సరమైన 1864లో నారాయణదాస మహాకవి జననం 1894వ సంవత్సరంవరకు ఆయన జీవితంలో తారసిల్లిన పరమాద్భుత వృత్తాంతాలన్నిటిని ఈ స్వీయచరిత్రలో వర్ణించారు ఆనందగజపతి ఆస్థానవైభవాలు, అక్కడి సంగీత, సాహిత్య సరస్వతీ నర్తనాలు, వీనుమిగిలిన సంగీత విద్వాంసులు, సాహిత్యవేత్తలు, భరతనాట్య కళాప్రావీణ్యులైన భోగాంగనలు, ఆనాటి సామాజిక స్వరూపాన్ని, అందులోని ఉచ్చనీచాలతోసహా కళ్ళముందు నిలిపారు నారాయణదాసుగారు బరంపురంలో న్యాయవాదవృత్తిలో ఉంటూ కలియుగ కర్ణునిగా (దాతృత్వ ప్రశస్తికి) విఖ్యాతి పొందిన జయంతి కామేశం పంతుల్ని గూర్చి మహాద్భుతమైన విషయాలెన్నో వర్ణించారు నారాయణదాసుగారు.

పనప్పాకం అనంతాచార్యులవారి పరిచయమూ, మైసూరు రాజాగారి దర్బారులోని విశేషాలు, కిళాంబి రామానుజాచార్యులవారు, చంద్రశేఖరశాస్త్రిగారు మొదలైన విజయనగరం మహారాజా కళాశాల ప్రధానాధ్యాపకులను గూర్చిన సంగతులు బహు తమకంతో చదివిస్తాయి

స్వీయ చరిత్ర అని చెప్పటానికి వీలులేకపోయినా స్వీయచరిత్రాత్మక రచనగా తప్పక సంభావింపదగిన రచన శ్రీ నల్లగొండ రామచంద్రరావుగారి 60 సంవత్సరాల అనుభవాలనే యథార్థ దృశ్యాలు జీవితంలో తారసిల్లిన ముఖ్యమైన సంఘటనలను, అనుభవాలను పద్దెనిమిది ప్రకరణాలుగా రచించారు శ్రీ రామచంద్రరావుగారు ఈ గ్రంథం కూడా 1976 లోనే అచ్చై వచ్చింది. అఖిల భారతదేశంలోనూ యోగాసన ప్రాశస్త్యాన్ని గూర్చి రామచంద్రరావుగారు ఎన్నెన్నో ప్రదర్శనపూర్వకమైన ఉపన్యాసాలు చేశారు సహస్ర సంఖ్యలో యోగ్యతాపత్రాలు పొందారు వీరు గొప్ప యోగాసన ప్రవీణులు డెబ్బైఎనిమిది సంవత్సరాలు నిండినా ఇప్పటికీ అత్యంత దృఢమైన శరీరారోగ్యంతో యోగాసన ప్రదర్శనలు నిర్వహిస్తూనే ఉన్నారు ఆంధ్ర వాల్మీకిగా ఆంధ్రదేశమంతటా పేరు ప్రఖ్యాతులు పొందిన వాసుదాసుగారైన వావిలికొలను సుబ్బారావు పంతులుగారికి రామచంద్రరావుగారు శిష్యులు దయ్యాలు, భూతాలు, మంత్ర తంత్రాలు, ప్రాణాయామం, దానివల్ల లాభాలు, మొదలైన విషయాలతో రామచంద్రరావుగారి ఈ అరవై సంవత్సరాల అనుభవాలు చాలా కుతూహలాన్ని కలిగిస్తాయి భగవంతుని అస్తిత్వాన్ని గురించిన విషయంలో ఇటీవలే కాల ధర్మం చెందిన సింహళదేశ హేతువాదాగ్రేసరుడైన డా॥ కోవూర్ గారిని తాము సవాల్ చేసినట్లుగా వీరు రాస్తున్నారు

* * *

స్వాతంత్ర్యానంతర కాలంలో వెలువడి ఇంకా పుస్తకరూపం పొందని స్వీయ చరిత్రలు కొన్ని ఉన్నాయి ఇందులో కొన్ని అసంపూర్ణాలు కావచ్చు ఇటువంటి వాటిలో పుట్టపర్తి నారాయణాచార్యులు గారి జీవితానుభవాలను పేర్కొనవలసి ఉంటుంది. సుమారు పది సంవత్సరాలకు పూర్వం గుంటూరు నుంచి వెలువడిన ఒక సాహిత్య మాసపత్రికలో శ్రీమాన్ నారాయణచార్యుల

వారి స్వీయ చరిత్రలో కొన్ని భాగాలు వెలువడ్డాయి. ఈ స్వీయచరిత్ర పూర్తి చేసి ప్రచురిస్తే ఆధునిక తెలుగు సాహిత్యానికి ఇది వెలలేని ఆభరణమే కాగలదు. ఆధునిక మహాకావ్యం కాగలదు నారాయణాచార్యుల వారి జీవితమంతా ఉద్వేగ పూరితమైన మహాద్భుత సంఘటనలకు ఆలవాలంగానే సాగింది ఆయన గొప్ప ప్రజ్ఞాశాలి సంగీత సాహిత్యాలలో గొప్ప ప్రజ్ఞ సాధించినవారు బహుభాషావేత్త. ఒక సంవత్సరం కిందట వీరిని కలుసుకొన్నప్పుడు స్వీయచరిత్రను పూర్తి చేయవలసిందిగా ఎంతగానో అర్థించాను అందరూ అట్లానే కోరుతున్నారు అన్నారుకాని, ఆ ప్రయత్నమేమీ వారు చేసినట్లు లేదు

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి 'మరపురాని ముచ్చట్లు' కూడా ఇటువంటి స్వీయ చరిత్రాత్మకమైన రచనమే ననుకోవాలి ఆనాటి సాహిత్యోద్యమాలు, ప్రముఖ వక్తలు, సభలు సమావేశాలు, గొప్ప కవిపండితులు మొదలైన వివరాలు శ్రీ హనుమచ్ఛాస్త్రిగారి మరపురాని ముచ్చట్ల ద్వారా తెలుసుకోగల అవకాశం వుంది.

పత్రికారంగంలో మాండలిక పత్రికలకు ఒక సుస్థిరమైన స్థానాన్ని సంపాదించి, అటువంటి పత్రికల ఆవశ్యకతను ఎంతగానో నిరూపించిన కీర్తిశేషులు నెల్లూరు వెంకట్రామానాయుడు గారు 'నా జీవిత విశేషాలు' అనే పేరుతో తమ స్వీయ జీవిత వృత్తాంతాన్ని గ్రథితం చేశారు వారి జమీన్ రైతు పత్రికలో ఈ విశేషాలు ధారావాహికంగా వెలువడ్డాయి. ఇంకా పుస్తకరూపం ధరించలేదు. 1959 ఫిబ్రవరి 13 వ తేది జమీన్ రైతు సంచికలో ఈ విశేషాలు మొదలైనవి. వెంకట్రామానాయుడు గారు తమ జీవిత విశేషాలు రాసుకోవడానికి నార్లవారు ప్రేరణ కలిగించారని చెప్పకున్నారు

"నాకు దినచర్య వ్రాసిపెట్టే అలవాటు లేనందున నాకు జ్ఞాపకమున్నంత వరకు స్థూలంగా వ్రాయవలసివచ్చింది అందువలన కాల నిర్ణయాలు సరిగ్గా వుంటవనుకోను కొంత హెచ్చు తగ్గులు వుండవచ్చును" అని 1954 లో స్వీయ రచన ప్రారంభిస్తూ ఆయన రాశారు.

"1900-1903 సం. లోపల నా తండ్రి చనిపోయినట్లున్నది అప్పటికి నాకు 10 యేండ్ల వయస్సు వుంటుంది వూహ బాగా తెలియదు. మా తండ్రి

గారు చనిపోయినప్పుడు అందరూ యేడుస్తుంటే, నాకు అర్ధణా యివ్వవలసివుండి యివ్వకుండా చనిపోయినాడే అని ఏడ్చాను" అని రాసుకొన్నారు శ్రీ నెల్లూరు వెంకట్రామానాయుడు జమీన్‌రైతు ఉద్యమంలో ప్రముఖ పాత్రను వహించిన నాయకుడు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు

ఆధునిక రచయిత్రులలో లబ్ధ ప్రతిష్ఠురాలైన శ్రీమతి లత ఒక వార పత్రికలో ఇటీవల తమ జీవితానుభవాలు ఉన్నదున్నట్లుగా రాస్తామని ప్రకటించారు కొంతకాలం ఇవి వెలువడ్డాయి

జీవితంలో అనుభవాలు-ప్రయోగాలు అంటూ శ్రీ పోతుకూచి సాంబశివ రావుగారు తమ పత్రిక విశ్వరచనలో, తమ చిన్ననాటి అనుభవాలను, అనుభూతులను, రచనా ప్రేరణ కలిగించిన సంఘటనలను కొన్నిటిని రాశారు. ఇంకా పుస్తకరూపం పొందలేదు

సుప్రసిద్ధ న్యాయవాదులు, స్థానిక రాజకీయ దురంధురులు, సాంఘిక సాహిత్య రంగాలలో చెప్పుకోదగిన కృషి చేసినవారు అయిన శ్రీ నడింపల్లి లక్ష్మీనరసింహారావు పంతులుగారు తమ జీవితగాధను గుంటూరు నుంచి వెలువడే ఒక వారపత్రికలో వెలువరించారు

ఇటీవలనే అసమగ్రంగానే అయినా విశ్వనాథవారి ఆత్మకథ వెలువడింది. విశ్వనాథ స్మారక సాహిత్య పత్రిక 'మేఖల'లో 65 పుటలుగా విన్యసించిన ఈ ఆత్మకథవల్ల ఆయన సాహిత్య వ్యక్తిత్వం స్పష్టాకృతికంగా అధ్యయనం చేయవచ్చు ఆధునిక సాహిత్యంలో ఆయన అనన్య సామాన్య ప్రతిభావంతుడు. మహాశిఖర సదృశుడు బందరు కళాశాలలో ఎఫ్ ఏ లో చేరిందాకా ఈ ఆత్మకథ సాగింది 1971-72 సంవత్సరాలలో విశ్వనాథ ఈ ఆత్మకథ రచించి వుండవచ్చునంటున్నారు సంపాదకులు.

వరంగల్‌లోని కాకతీయ విశ్వవిద్యాలయంవారు తెలుగుశాఖ తరపున వెలువరించిన 'విమర్శిని' అనే పేరిటి విశ్వనాథ స్మారక సంచికలో విశ్వనాథ సత్యనారాయణగారి సోదరులు వెంకటేశ్వర్లుగారు తమ కుటుంబాన్ని గూర్చి రాసిన బృహద్రచన ప్రచురితం. ఈ రచనను కూడా స్వీయచరిత్రాత్మక రచనగానే పరిగణించవచ్చు.

యువభారతివారు 1972 లో ప్రచురించిన 'మహతి' అనే అమూల్య సాహితీ సంపద్విలసితమైన సంపుటిలో విశ్వనాథ, శ్రీశ్రీలు వ్రాసిన 'నేను-నా సాహిత్య రచనలు' అనే బృహద్వ్యాసాలు కూడా స్వీయచరిత్రాత్మక రచనలే.' స్వీయజీవిత విశేషాలతోబాటు, సాహిత్యపథయాత్రను ఆ వ్యాసాలలో తమ దృక్ప థాలమేరకు వారు విన్యసింపచేశారు

1947 వ సంవత్సరం నవోదయ పత్రికలో శ్రీమతి వేదుల కృష్ణవేణమ్మ గారు రాసిన 'మా తండ్రి మల్లయ్యశాస్త్రి గారు' అనే రచన గొప్ప స్వీయచరి త్రాత్మక రచన ఈశ్వరచంద్ర విద్యా సాగరుడు, దయానంద సరస్వతులతో సరిపోల్చదగిన ఈ మహానుభావుడి శతజయంతి జరిపి సంస్మరించుకోవాలన్న జ్ఞానం సాహిత్య సంస్థలకుగాని, సాంస్కృతిక అధికారిక వ్యవస్థలకు గాని లేక పోవడం చాలా విచారకరం

శ్రీమతి కృష్ణవేణమ్మగారు తండ్రిగారిని గురించి ఇట్లా రాశారు:

"ఆయన గురువు ప్రసిద్ధ పండితులైన పరవస్తు రంగాచార్లయ్య వారలుం గారు అందుచేతనే మా తండ్రి తన కొడుకుకి గురువుగారిపేరు పెట్టుకున్నాడు. ఆయన గురుభక్తి ఎటువంటిదో మరి వేరే చెప్పడమెందుకు? శాస్త్రిలలోను పురాణాలలోను పాండిత్యమే కాదు అన్ని విద్యలలోనూ ఆయన ప్రవీణ్యుడు అవడం అసత్యము కాదు ఆయన చక్కని సంగీతము పాడేవాడు. పంచాంగ ములు గుణించి రాసేవాడు. పర్లాకిమిడి రాజావారు స్థాపించిన నాటక సమాజ ములో సంస్కృతాంధ్ర నాటకములలో రాజు వేషము వేసేవారు కుస్తీ పట్టేవారు మద్దెల వాయించేవారు వంట అద్భుతంగా చేసేవారు. కవిత్వం చెప్పేవాచు మంత్ర శాస్త్రములో ఆయనకు తెలియని విషయము లేదు పురాణం అద్భు తంగా చెప్పేవారు ." ఇలా సాగింది ఈ సంస్మరణ రచన. ఇలాటి రచనలు ఈ శతాబ్ది ఉత్తరార్ధంలో కొన్ని వెలువడి వుండవచ్చు వీటిని గూర్చి తెలుసు కొనే ప్రయత్నం చెయ్యాలి

1972 లోనే శివశ్రీ బండారు తమ్మయ్యగారి స్వీయ చరిత్రం పుస్తక రూపంలో వెలువడింది ఈ గ్రంథంలో రెండు భాగాలున్నాయి మొదటి భాగం మూడు ప్రకరణాలు - స్వవిషయం, రెండో భాగం మత సారస్వత సేవలు పదమూడు ప్రకరణాలు ఈ గ్రంథం చాలా విలువైన గ్రంథం

ఇటీవలనే దువ్వూరి వెంకటరమణశాస్త్రి గారి స్వీయచరిత్రం వెలువడింది.

ఈ మధ్యనే 'ఏభై సంవత్సరాల హైదరాబాదు' అనే పేరుతో సుప్రసిద్ధ రాజకీయవేత్తలు, నిర్మాణ కార్యకర్తలు శ్రీ మందుముల నరసింగరావుగారి స్వీయ చరిత్రం వెలువడింది

శ్రీ కోదాటి నారాయణరావుగారి అనుభవాలూ - జ్ఞాపకాలూ కూడా ఒక మాసపత్రికలో కొన్ని భాగాలు వెలువడినాయి పుస్తకరూపంలో రాలేదు

ఎమ్ ఎస్ రాజలింగం గారు ఇంగ్లీషులో రాయగా కోదాటి నారాయణరావు గారు తెలుగు చేసిన 'కాంగ్రెసు టిక్కెట్టుకై ఇదంతా' అనే గ్రంథాన్ని కూడా స్వీయచరిత్రాత్మక సాహిత్యంలో చేర్చవచ్చు స్వర్గీయ సంజీవయ్యగారు ముఖ్యమంత్రిగా వున్నప్పటి రాజకీయ వ్యవస్థాత్మకమైన స్థితిగతులు, తమ స్వీయజీవితంలో ఏ విధమైన ప్రభావాన్ని చూపాయో వివరించారు రాజలింగం గారు రాజకీయ వ్యక్తుల స్వీయ చరిత్రాత్మక సాహిత్యంలో ఇటువంటి రచనలకు ప్రముఖమైన స్థానం వుంటుంది

1969 వ సంవత్సరంలో వెలువడిన భాగవతుల రామారావుగారి స్వీయ చరిత్ర, 1974 లో వెలువడిన చిట్టా రామకృష్ణారావు గారి స్వీయ చరిత్రలు ఇంకా నేను చూడటం తటస్థించిందిగాదు. ఇదే విధంగా 1952 లోనే ప్రచురితమైన శ్రీ రమణ కవి స్వీయకథ కూడా నేను చూడటం తటస్థించలేదు

1965 వ సంవత్సరంలో ఆచంట సాంఖ్యాయన శర్మగారి శతజయంత్యుత్సవ సంఘం వారు ప్రచురించిన ప్రత్యేక సంచికలో మహోపాధ్యాయ శ్రీ ఆచంట సాంఖ్యాయన శర్మగారి సంగ్రహ స్వీయచరిత్ర వుంది, ఈ స్వీయ చరిత్ర ద్వారా అత్యంత ప్రతిభా సంపూర్ణులైన శ్రీ సాంఖ్యాయ శర్మగారి జీవిత విశేషాలను తెలుసుకోవచ్చు.

* * *

అదృష్టవశాత్తూ ఎక్కడా అచ్చుకాకపోయినా రాత ప్రతులలోనే కొన్ని స్వీయ చరిత్రలు చూడటమూ, కొన్ని చదవడమున్నూ చేశాను. ఇటువంటి

వాటిలో ముఖ్యంగా పేర్కొనవలసింది కనికొండల వెంకటసత్యనారాయణమూర్తి గారి ఆత్మకథ 1942 వ సంవత్సరంలో ప్రారంభించి 1977 వ సంవత్సరం వరకూ ఆత్మకథ రాస్తూ వచ్చారు శ్రీ సత్యనారాయణమూర్తి గారు వీరి వయస్సిప్పుడు తొంభై సంవత్సరాలదాకా వుండవచ్చు విశాఖ జిల్లాలో చాలాచోట్ల తెలుగు పండితుడి ఉద్యోగం చేశారు కాంగ్రెస్ ఉద్యమంలో పాల్గొన్నారు ఈ శతాబ్ది పూర్వార్ధంలో విశాఖ మండలంలోని సామాజిక పరిణామాలన్నీ తెలుసుకొనేందుకు ఈ ఆత్మకథ చాలా ఉపయోగపడుతుంది ఈ ఆత్మకథ ఉనికిని గూర్చి చెప్పి, దీన్ని తీసుకొనివచ్చి నా చేత చదివింపజేసినవారు శ్రీ పురిపండా అప్పలస్వామిగారు వారిపట్ల నేను చాలా కృతజ్ఞుణ్ణి 1909 వ సం. శ్రీమూర్తిగారు ఆగష్టు 8 వ తేది విజయనగరంలో రిపన్ హిందూ థియలాజికల్ హైస్కూలులో తెలుగు పండితుడిగా ప్రవేశించారు. తర్వాత వర్ఝుల చిన సీతారామశాస్త్రిగారు కూడా అదే స్కూల్లో తెలుగు పండితులుగా ప్రవేశించారు తేకుమళ్ళ రాజగోపాలరావు గారా స్కూల్లో అప్పుడు ఉపాధ్యాయులుగాఉండేవారు

"ఆ దినములలోనే బర్మాలో పనిచేయుచున్న అవటపల్లి నారాయణరావు గారు ఆంధ్రప్రకాశికలో ప్రచురింపబడిన నా వ్యాసములను ప్రశంసించుచు నా పేర ఉత్తరము వ్రాయుటేకాక, ఒక పర్యాయము విజయనగరము వచ్చినప్పుడు మా యింటికి వచ్చి నన్ను చూచిరి మరికొంత కాలమునకు బొంబాయిలో కాశీనాథుని నాగేశ్వరరావుగారు 'ఆంధ్రపత్రిక'ను స్థాపించిరి వారి యేజెంటు విజయనగరము వచ్చినప్పుడు మా యింటికి వచ్చి ఆంధ్రపత్రికకు వ్యాసములు వ్రాయుమని నన్ను కోరిరి నాటి నుండి కొంత కాలము ఆంధ్ర పత్రికకు కూడ వ్యాసములు వ్రాయుచుంటిని" (పుట 105 —రాతప్రతి).

"1911 సం॥ అక్టోబర్ 22వ తేదీని కందుకూరి వీరేశలింగము పంతులు గారు విజయనగరమ్ము దయచేసిరి బుర్రా శేషగిరిరావు పంతులుగారి మేడపైని వారి బస ఆ సందర్భమున భాషా విషయికములు కొన్ని సభలును ఉపన్యాసములును విజయనగరమున జరిగెను మరికొలది దినములలో కొక్కొండ వెంకటరత్నము పంతులుగారు విచ్చేసిరి. వారు ప్రొవిన్షియల్ లోవర్ సెకండరీ స్కూలులో సభలుచేసి ఉపన్యాసములు గావించిరి" అని ఈ విధమైన విశేషాలు

ఈ ఆత్మకథలో వర్ణించారు సత్యనారాయణమూర్తిగారు భాగవతుల విశ్వనాథ్ గారు సత్యనారాయణమూర్తి గారికి హైస్కూలు తరగతులలో సహపాఠి. విశ్వనాథ్‌గారు విజయనగరంలో 'భారతమాత' పత్రికను స్థాపించడం, అందులో సత్యనారాయణమూర్తి గారు వ్యాసాలు రాయడం మొదలైన విశేషాలున్నాయి భగవంతుని అస్తిత్వాన్ని గూర్చి మహాత్మాగాంధీకి సత్యనారాయణమూర్తిగారు తమ సంశయాలు నివారించవలసినదంటూ లేఖ రాయగా మహాత్ముడు సమాధానం రాశారు ఆ లేఖ ఈ ఆత్మకథలో ఉదాహృతం వేపా భీమశంకరం గారనే సంఘ సేవాతత్పరుని జీవిత చరిత్రను సత్యనారాయణమూర్తిగారు ప్రకటించారు ఈ పుస్తకం వీరు సి. వై చింతామణిగారికి పంపగా ఆయన అలహాబాదు నుంచి వీరిని ప్రశంసిస్తూ జాబు రాశారు. సి వై చింతామణి ఉత్తరం ఈ ఆత్మకథలో మనం చూడవచ్చు.

26, Hamilton Road,
Allahabad
June 23, 1940

Dear Sir,

Allow me to thank you for the copy of your biography of my friend Mr. Vepa Bhimasankaram I have read it with deep interest and as the result I admire my friend still more than before

Yours truly,
C.Y. CHINTAMANI

కవికొండల వెంకట సత్యనారాయణమూర్తిగారి ఈ ఆత్మ కథలో మొదటి ప్రపంచయుద్ధం, రెండో ప్రపంచయుద్ధం, ఆనాటి పత్రికల వార్తలు, తెలుగు దేశంలోని యుద్ధకాల పరిస్థితులు చాలా విపులంగా వర్ణించారు ఈ గ్రంథం అచ్చవుతే బావుండును కాని గ్రంథకర్త వయోవృద్ధులు. ఎవరినీ ఆశ్రయించలేరు ప్రభుత్వానికి కాని, అకాడమీల వంటి సంస్థలకు కాని ఇటువంటి వారిని గూర్చి ఆలోచన చేసే తీరికా, వోపికా కూడా లేవు. ఉండవు.

ఇటీవల రాత ప్రతిలో నేను చదివిన ఇంకొక స్వీయచరిత్ర శ్రీమతి అడవికొలను పార్వతిగారి 'ఒక్క క్షణం కాలాన్ని వెనక్కు తిప్పితే' సుప్రసిద్ధ దేశభక్తులు, స్వాతంత్రోద్యమ వీరులు, నిర్మాణ కార్యకర్తలు శ్రీ రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారి పుత్రిక శ్రీమతి పార్వతి నవల, కథ, వ్యాసం, కవిత, విమర్శ పుస్తకరూపాన ప్రకటించి అభిజ్ఞుల మెప్పులందుకున్న ప్రతిభావంతు రాలైన రచయిత్రి ఈమె మోడరన్ రెవ్యూ సంపాదకులైన ఆచార్య నళినీ కాంతభద్రో శ్రీ మందేశ్వరశర్మగారికి స్నేహితులు వీరికోసం కొవ్వూరు వస్తూ వుండేవారని శ్రీమతి పార్వతి రాశారు శంకరుల, మార్క్సు, గాంధీజీ సిద్ధాంతాల సమన్వయ రూపమైన శ్రామిక ధర్మరాజ్య సిద్ధాంతాన్ని శ్రీ మందేశ్వరశర్మ గారు తమ జీవితకాలంలో ప్రచారం చేశారు. ఆయా విశేషాలన్నీ శ్రీమతి పార్వతిగారు తమ ఆత్మకథలో ప్రస్తావించారు ఈ ఆత్మకథకు విపులమైన పీఠిక రాయడం నా అదృష్టంగా నేను భావిస్తున్నాను ఈ పుస్తకం అచ్చవు తున్నది. త్వరలోనే వెలువడవచ్చు

ఇటువంటిదే రాతప్రతిలో చదివిన యింకొక స్వీయచరిత్ర శ్రీ దిగవల్లి వెంకట శివరావు పంతులుగారి 'విన్నంత కన్నంత తెలిసినంత.' శ్రీ శివరావుగారు తమ జీవితానుభవాలూ జ్ఞాపకాలూ అక్షరబద్ధం చేయడానికి సంకల్పించి కొంత భాగమే రాశారు ఇది అసంపూర్ణంగానే వుండిపోయింది. వారి కుటుంబ చరిత్ర, రాజమహేంద్రవరంలో వీరేశలింగా స్త్రీకోన్నత పాఠశాలలో చేరి మెట్రిక్యులేషన్ దాకా చదవడం వరకే శ్రీ శివరావుగారు తమ జ్ఞాపకాలు రాసి వుంచారు. శ్రీ శివరావుగారు తమ స్వీయచరిత్రను పూర్తిగా రచించి ప్రకటిస్తే పెద్దభట్ల వీరయ్య, అయ్యదేవర కాళేశ్వరరావుగార్ల స్వీయచరిత్రలవలె, ఆనాటి కృష్ణా మండల సామాజిక రాజకీయ చరిత్రను తెలుసుకోవడానికి ఎంతగానో తోడ్పడ గలదు.

శ్రీ దిగవల్లి వెంకటశివరావు గారింట్లోనే ఆయనగారు చదవడానికని ఇచ్చిన శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్‌గారి స్వీయచరిత్రను చూశాను. ఆవాళ ఎందుకో సదాశివేశ్వరప్రసాద్‌గారు కూడా అక్కడే ఉన్నారు. 1899 వ సంవత్సరం తెలుగు ఉగాది పర్వదినాన జన్మించారు వీరు 1922 వ సంవత్స రంలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, ప్రకాశం పంతులుగారు

జయంతిపురం వెళ్లారు అప్పుడు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ద్వారా నాగేశ్వర రావు పంతులుగారికీ, ప్రకాశం పంతులుగారికి జయంతిపురం రాజావారితో పరిచయం అయింది తర్వాత దుర్గా సదాశివేశ్వర ప్రసాద్‌గారు ఖాదీ ఉద్యమం లోనూ, కాంగ్రెసు కార్యకలాపాలలోనూ పాల్గొన్నారు వీరి స్వీయచరిత్ర రాతప్రతి బృహత్పరిమాణంగల సంపుటాలలో శ్రీ శివరావుగారింట నేను చూడటం జరిగింది వంశ చరిత్రం ఉపోద్ఘాతంలాగా మొదటి సంపుటంలో చేర్చారు నా రాజకీయ జీవితం - అనే భాగానైన్నా ప్రచురించాలని వారికి చాలా అభిలాషగా వుంది. బహుశా శ్రీ దుర్గా సదాశివేశ్వర ప్రసాద్‌గారి స్వీయచరిత్రం అచ్చవుతే ఏడెనిమిది వందల పుటల బృహత్పరిమాణం పొందవచ్చు విశ్వవిద్యాలయాల పరిశోధక శాఖలుకాని, అకాడమీలు కాని ఇటువంటి గ్రంథాలు అచ్చుకావడానికి తోడ్పడటం అత్యంత వాంఛనీయం

అతి పవిత్ర జీవనులు అత్యంత ప్రతిభాపూర్ణులు కవిగారుగా తెలుగు నాట విఖ్యాతులూ అయిన శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు స్వీయచరిత్ర రాయడానికి సంకల్పించారు కాని హరి ఓం అంటూ ఉండగానే అది ఆగిపోవడం తెలుగుదేశపు దురదృష్టమనే చెప్పాలి ఆయన స్వయంగా రాసుకున్న ఆ ఒక్క పుట రాతప్రతిని చూసి రాసుకోడానికి నా కిచ్చిన శ్రీ పురిపండా అప్పలస్వామి గారి పట్ల నేను మిక్కిలి కృతజ్ఞుణ్ణి. శ్రీ రామచంద్రశాస్త్రిగారి స్వీయచరిత్రం ఇలా మొదలైంది

"నా జీవితచరిత్ర (విద్యావిషయికము) 31.1.20 భీష్మైకాదశి

నేను కృష్ణా జిల్లాలోని కనకవల్లి అను అగ్రహారములో భావ సం॥రమున ఆశ్వయుజ బ ౧ం మంగళవారమునాడు పుట్టితిని. (౧౮౭౪ సం॥ నవంబరు 3 వ తేదిని). వెలనాటి వైదికుడను, మాది కౌండిన్యగోత్రము. అప్పడు తెలుగు బడులలో చెప్పుచుండిన చదువుకొంటిని అది ముగిసిన తరువాత కాకినాడలో 'నేటివ్ హైస్కూలు' 'డిసౌజాస్ మెమోరియల్ హైస్కూలు' అను పేర్లతో ఉండిన ఇంగ్లీషు పాఠశాలలలో 1885 సం॥ మొదలుకొని 1891 వ సం॥ దాకా చదివి మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్ళితిగాని, వేపపువ్వు వేసి తగినంత కృషి చేయని కారణముచేత లెక్కలలో తప్పిపోతిని. 1892 సం॥న పాఠశాలలో

చదువకుండ పరీక్షకు వెళ్ళదలచి కీ ర్తిశేషులగు కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావుగారప్పుడు తెలుగు గ్రంథము లచ్చువేయింపనెంచి తాటాకు ప్రతుల నుండి కాగితము మీద వ్రాయించుచు తమకటు చేయగల విద్యార్థి కావలెనని కోరిన మీదట కీ ర్తిశేషులగు పాడి వెంకటస్వామిగారు నేను ౫వ తరగతిలోను, మెట్రిక్యులేషను తరగతిలోను చదువునపుడు తెలుగు పండితులుగా ఉన్నవారగుట చేత నన్ను తీసికొని వెళ్ళి అప్పగింపగా కొన్ని నెలలు కొన్ని గ్రంథములు వ్రాయుచుంటిని పరీక్షకు కొంచెము నేర్చుకొంటిని గాన పద్యము అల్లుటకు అలవాటుపడి కొన్ని తెలుగు నాటకములు చదివి, ఆడగా చూచి చిన్న వేషములు ౧, ౨ సారులు వేసి నాటకముల మీద ఆసక్తి పుట్టుటచేత తోడి విద్యార్థులు నాటక మాడదలచి, ఏదో నాటకము వ్రాయుమని కోరగా చిన్నతనపు తెగువతో నల నాటకము 1892 సం॥న వ్రాసితిని గాని వారు చెప్పినట్లు చేయుటకు వీలుగాకపోవుటచేత ఎందుకని అది చించివేసితిని కొంతసేపు వ్రాసిన ప్రతి చించివేయునపుడు దగ్గరనున్న తోడి విద్యార్థి ఒక్కడు రెండు ముక్కలుగా చించిన ఆ పుస్తకము తాను తీసికొనిపోయి తన దగ్గర ఉంచుకొనెను గాని పాపమత డకాల మృత్యువు వాతబడుటచేత తరువాత చూడబుద్ధి పుట్టినను నా కది లభింపలేదు ఆ యేటనే విఘ్నేశ శతకమును - 'పెరడైజ్ అండ్ పెరి' అనెడి యింగ్లీషు గద్య కావ్యము ననుసరించి పశ్చాత్తాప మాహాత్మ్యమును వ్రాసితిని" ఇక్కడ ఆగిపోయింది శాస్త్రిగారి స్వీయచరిత్ర

తాపీ ధర్మారావుగారి స్వీయచరిత్ర రాళ్ళు రప్పలు అసంపూర్ణం - అచ్చు కావల్సి ఉంది. త్వరలోనే కావచ్చు.

ఇప్పుడు రాత ప్రతిలో చదువుతున్న ఆత్మచరిత్రం ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారిది వెంకటరంగయ్యగారి జీవితానుభవం ఎంత విస్తృత మైనదో, ఆయన ఆదర్శోపాధ్యాయుడిగా, విద్యావేత్తగా, రాజనీతివేత్తగా ఆయా రంగాలలో ఎంతటి కృషిచేశారో తెలుగు దేశానికి వివరంగా చెప్పవలసిన పని లేదు. ఆచార్య వెంకటరంగయ్యగారు తమ స్వీయచరిత్రం రాయడం పూర్తి చేశారు.

వారికి నా పట్లగల దయవల్ల నేను దీనిని ముందుగా చదువుతున్నాను.

ఆచార్య వెంకటరంగయ్యగారికిప్పుడు తొంభయ్యో సంవత్సరం నడుస్తున్నది సహస్ర మాసజీవి సాక్షాత్తు దైవసముడని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కథలు - గాథల్లో రాశారు వెంకటరంగయ్యగారి జీవితంలో ఎంతో వైవిధ్యం వుంది. ఆయన నెల్లూరు, భీమవరం కళాశాలలకు ప్రిన్సిపాల్‌గా పనిచేశారు ఆంధ్ర విశ్వవిద్యాలయం, బొంబాయి విశ్వవిద్యాలయాలలో రాజనీతి శాఖాదార్యులుగా పనిచేశారు గడచిన తొంభై సంవత్సరాల కాలాన్ని ఆయన నిర్మమంగా సంయమ దృష్టితో సమీక్షా పూర్వకంగా గుర్తుచేసుకోవడం వారి స్వీయచరిత్ర ప్రత్యేకత. డా॥ రాధాకృష్ణ, డా॥ సి. ఆర్ రెడ్డి మొదలైన ప్రఖ్యాతులైన ఉపాధ్యాయుల కాలంలో వెంకటరంగయ్యగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రాజనీతి శాఖలో అధ్యాపకత్వం నెరపారు విజయనగరం సంస్థానానికి దివానుగా పనిచేశారు. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు కాకినాడలో కాలేజీలో ప్రిన్సిపాల్‌గా ఉండగా వెంకటరంగయ్యగారు చరిత్ర శాఖాధ్యాపకులుగా అక్కడ కొంతకాలం పనిచేశారు. తమ దగ్గర కళాశాలల్లో చదువుకున్న విద్యార్థులు ఏయే రంగాలలో ఏ విధమైన ఉన్నత స్థితిని పొందారో వెంకటరంగయ్యగారు స్వీయ చరిత్రలో స్మరించారు కృష్ణశాస్త్రిగారు, గరిమెళ్ళ సత్యనారాయణ, మునిమాణిక్యం, గుమ్మిడిదల సుబ్బారావు, దుర్గాబాయి, కళా వెంకట్రావు మొదలైన వారంతా వెంకటరంగయ్యగారు అధ్యాపకులుగా ఉన్నప్పుడు ఆయా కళాశాలల్లో చదువుకొన్నవారే లక్కరాజు సుబ్బారావు, విస్సా అప్పారావు, సర్ సి.వి. రామన్, సూరి భగవంతం, ప్రొఫెసర్ హిరేన్ ముఖర్జీ మొదలైనవారంతా సమకాలికులుగా వారికి సహోద్యోగులుగా వుండేవారు వివిధ దశలలో. డా॥ వి కె.ఆర్.వి. రావుగారు కూడా వెంకటరంగయ్యగారితో ఆయన శాఖలోనే అధ్యాపకులుగా పని చేశారు

మానవ జీవితంలోని అత్యంత విలక్షణమైన మనః ప్రవృత్తులు, ఈర్ష్యాసూయలు, బలహీనతలు, ఎంతటి విద్యావంతులలోను, ఉన్నతోన్నతాధికారాలు వహించిన వారిలోనూ ఏ విధంగా విడంబిస్తూ వుంటాయో వెల్లడి అవుతూ వెంకటరంగయ్యగారి స్వీయచరిత్ర చదువుతుంటే చాలా ఆశ్చర్యం కలుగుతుంది సి. ఆర్ రెడ్డి వంటి సమర్థుడైన విద్యావేత్త, కార్యదక్షుడు, విజ్ఞాని కూడా అధికార నిర్వహణలో ఆశ్రిత పక్షపాతానికి, అక్రమాభిమానాలకు ఏ విధంగా లోనవుతూ వచ్చారో, ఆయనలోని స్తుతిప్రీతి, మొదలైనవి అధికార బాధ్యత నిర్వహణలో

కూడా ఏ విధంగా తమవంతు పాత్రను నిర్వహించేవో తెలుసుకొంటే చాలా ఆశ్చర్యం కలుగుతుంది ఆయన కూడా మానవమాత్రుడే కదా అంటారేమో కావచ్చు కాని ఆ స్థాయి వ్యక్తికే ఈ దోషాలు తప్పనప్పుడు తక్కువస్థాయి కుహనా విద్వాంసుల, కపటపండితుల, చపలచిత్తులైన దురధికారుల ప్రవర్తనలు, స్వభావాలు గురించి చెప్పాలా? వెంకటరంగయ్యగారి స్వీయచరిత్రను గురించి మరొకసారి ఎప్పుడైనా వివరంగా రాస్తాను

తెలుగు సాహిత్యంలో ఆధునిక ప్రక్రియమైన స్వీయ చరిత్రను అధ్యయనం చేస్తే మరెన్నో విషయాలు,సామాజిక పరిణామ హేతువులు బోధపరచుకో గల అవకాశం వుంది

(భారతి - 1979)

# ఒక శతాబ్ది సామాజిక ప్రగతి

సామాజిక శ్రేయస్సును కోరే సంస్కారవాదులు, అభ్యుదయవాదులు, ఎప్పటికప్పుడు కొత్త కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూనే ఉంటారు భూలోక స్వర్గానికి అనుసరించవలసిన మార్గాలను ప్రచారం చేస్తూనే ఉంటారు అయినప్పటికీ ఎక్కడో ఏదో లోటు, అసంతృప్తి చక్కపరచవలసిన అవసరం సామాజికమైన ప్రవృత్తులలోను, నియమ నిబంధనలలోనూ, ఆచార వ్యవహారాలలోనూ కనపడుతూనే ఉన్నాయి కొత్తగా వచ్చిన సంస్కారం కొన్నాళ్ళపాటు బాగా ఆకర్షించి, అధిక సంఖ్యాకులను ఆలోచింప జేసినా - మళ్ళీ అది కూడా పనికి రాకుండా పోతూనే ఉన్నది అసలు యీ సమస్య మానవజాతి పుట్టినప్పటి నుంచీ ఉంటూనే ఉన్నదేమో అనిపిస్తుంది నాగరికతను అలవరచుకొని, సాంఘికమైన హక్కులు, రక్షణలు, బాధ్యతలు, క్రమంగా ఏర్పరచుకొంటూ వచ్చి, ఆర్థిక, రాజకీయ, వ్యవస్థలలో ఆయా దేశాలలో, ఆయా కాలాలలో మానవజాతి పురోభివృద్ధిని సాధిస్తూ వచ్చినా సృష్టి నిరంతరాయంగా సాగుతూ వస్తున్నది కాబట్టి, సామాజికమైన సమస్యలు కూడా ఎప్పటికప్పుడు కొత్త కొత్తవి ఎదురవుతూనే ఉన్నాయని అనిపిస్తుంది.

ఆర్థిక రాజకీయ వ్యవస్థలు సంఘ సమష్టి స్వరూపాన్ని వ్యక్తం చేసినా అనుశాసించినా మత, ధార్మిక, నైతిక విశ్వాసాలు, అభిప్రాయాలు, ప్రభావాలూ కూడా సమాజంలో నిలకడ, శాంతి, భద్రతల పరిరక్షణ విషయకంగా పరిశీలించదగినవి.

అసలు సంఘంలో కొందరు ఎందుకు కష్టపడాలి? దుఃఖపడాలి? అందరికీ ఆరోగ్యం, ఆనందం, అన్నం, వస్త్రం, ఆవాసం ఎందుకు లభించటంలేదు? అనేకమైన సమస్యలతో ఎందుకు బాధపడుతున్నారు? కర్మ సిద్ధాంతానికన్నా, తర్కసహజమైన సమాధానం ఎవరైనా చెప్పగలరా? అయితే మనుష్యుల కష్టాలన్నీ కర్మనుబట్టి మాత్రమే వస్తున్నవి కావు వస్తూత్పాదన గిరాకి, లబ్ధి మొదలైన ఆర్థికశాస్త్ర ప్రాతిపదిక సూత్రాలకు సంబంధించి మనుష్యులలో సహజంగా

అతిసంచయేచ్ఛవల్ల కలిగే పోటీనిబట్టి కూడా బలహీనులకు, బలవంతులకు ఘర్షణ యేర్పడి, తరతమాల దోపిడీ కొనసాగుతూ వున్నదని అనుకోవాలి 'శ్యేనాః కపోతాన్ ఖాదయంతి' అని వేదవచనం ఉన్నది కాబట్టి, నేను నిన్ను తిన వచ్చును అని శిబిచక్రవర్తి కథలో డేగ పావురంతో వాదిస్తుంది మరి ఇదే సూత్రం మనుషులకూ, సామాజిక వ్యవస్థకూ కూడా వర్తిస్తుందేమో ననుకోవాలి.

ఏది ఏమైనప్పటికీ యంత్రోత్పాదితమైన వస్తుజాలంలో ఒకే కొలతలు, ఒకే గుణాలు, ఒకే ఉపయోగాలు ఉన్నట్లుగా ఏ రాజకీయ ఆర్థిక సైద్ధాంతిక అనుశాసనాలవల్ల కూడా సామాజిక పరిస్థితులను చక్కబరచి సామాజికులందరూ ఒకే విధంగా జీవించేటట్లు చేయటం కుదరదు సృష్టిలో వైవిధ్యం ఉన్నట్లుగా మనుషుల తెలివితేటల్లోను, రూపరేఖల్లోను, జీవించే పద్ధతుల్లోను, ఆశయాల లోను ,ఆశయసాధనకు వాళ్ళు అనుసరించే మార్గాలలోను అంతరాలు చాలా కనపడతాయి కాబట్టి మానవుడు తనకు లభించిన ప్రత్యేకమైన బలంవల్లనో, గుణం వల్లనో, అవకాశంవల్లనో ఇతరులకు కష్టనష్టాలు కలిగేలా ప్రవర్తించ కుండా చూడటానికే, శాసించడానికే రాజకీయ వ్యవస్థకాని, మత, నైతిక అను శాసనాలుకాని పుట్టాయి అయితే రాజకీయాలు దీన్ని సాధించలేకపోవడం చూడవచ్చు. మత నైతిక విశ్వాసాలు కూడా పూర్తిగా విఫలం కావడం దేశ దేశాల చారిత్రక, సామాజిక పరిణామాలు రుజువు చేశాయి

రామాయణకాలం త్రేతాయుగం రాముడిరాజ్యంలోసంఘమంతా సంక్షోభా లేవీ లేకుండా శాంతిభద్రతలు అనుభవించినట్లు కవులు వర్ణించారు శ్రేయో రాజ్యమంటే రామరాజ్యం ఉదాహరణమని నానుడి ఏర్పడింది రాముణ్ణి కన్న తండ్రి దశరథుడు దశరథుడి రాజ్యంలో కూడా ప్రజలంతా సుఖించినట్లు వాల్మీకి వర్ణించాడు దశరథుడి పుత్రకామేష్టిలో అసంఖ్యాకంగా అర్థులు, వికలాంగులు వచ్చి, యజ్ఞశాలలో నిరంతరాయంగా అహర్నిశలూ తృప్తిపొంది నట్లు వర్ణితమైనది అంటే ఆ కాలంలో కూడా లేమితో బాధపడేవాళ్ళు యాచకులూ, పాపంచేసి అంగవైకల్యం పొంది జీవిస్తున్న వాళ్ళూ ఉన్నట్లుగా అర్థమవుతున్నది వాళ్ళందరూ ఆ కాలంలో కూడా ఈ కాలంలో వలెనే ఉండటం చాలా వింత.

కాబట్టి ఏ కాలంలో కూడా బాధపడే ప్రజలు, వంచకులు, వంచితులు, భోగులు, రోగులు, దుఃఖార్తులు, బలవంతులు, బలహీనులు ఉంటూనే ఉంటారని, ఉండేవాళ్ళని తెలుస్తున్నది. అయితే, వాళ్ళు అధిక సంఖ్యాకులుగా ఉంటే ఆ కాలం మంచి కాలంకాదనీ, వాళ్ళు అల్పసంఖ్యాకులుగా ఉంటే మంచికాలమనీ కవులూ, చారిత్రకులూ అనవచ్చు అంతేకాని భూలోక స్వర్గమంటూ ఒకటి ఎప్పటికీ ఏ కాలంలోనూ అనుభవంలోకి రాదేమోననే అనుకోవలసి వస్తుంది 'నిర్వైర స్సర్వ భూతానాం' 'ఆత్మవత్సర్వభూతాని' అని ఎంతగా ఘోషించినా, మానవ సహజమైన స్వార్థ, లోభ, మోహ ప్రవృత్తులు తుడిచిపెట్టుకొనిపోవటం లేదు కొత్త సమస్య లుత్పన్న మవుతున్నాయి కొత్తపరిష్కారాలు వస్తున్నాయి కాని మళ్ళా సమస్యలు, జన సామాన్యంలో అసంతృప్తులూ,సంఘర్షణలు, పోటీలు వంచనలు, కొత్త కొత్త బాధలు తలెత్తుతూనే ఉన్నాయి మరి అయితే సామాజిక ప్రగతి అనేది సాధ్యమేకాదా? అంటే అట్లా అనుకోకూడదు తప్పక సమాజం ప్రగతిపథాన పయనిస్తూనే ఉంటుంది.

నూరు సంవత్సరాల క్రితం మన దేశంలోని సాంఘిక సమస్యలను, నేటి కాలాన మనం ఎదుర్కొంటున్న సాంఘిక సమస్యలను పరిశీలించి చూస్తే యీ వంద సంవత్సరాల కాలంలో అనేక దురాచారాలు సమసిపోయి, సామాజిక ప్రగతి గణనీయంగానే సాధించిన వైనం మనం చూడవచ్చు

సామాన్యంగా భారతదేశంలో నాడు ప్రాబల్యం వహించిన సమస్యలే తెలుగుదేశంలో కూడా ప్రాచుర్యం పొంది ఉండేనని చెప్పవచ్చు కొన్ని కొన్ని ప్రాంతాలలో ఆయా సమస్యల తీవ్రత రాజకీయ, సాంఘిక, భౌగోళిక పరిస్థితులను బట్టి కొంత కొంత మార్పు చూపుతూ ఉండవచ్చు కిందటి శతాబ్దంలో, ముఖ్యంగా తొలిపాదంలో ప్రాబల్యం వహించిన సతీసహగమనం, కులీన వివాహాలు, గంగజాతరలు, సిడులాడటం, భూతప్రేత పిశాచాదుల భయం మొదలైనవి ఉత్తర హిందూస్థానంలోనూ, అందునా వంగదేశమూ, ఇంకా మహారాష్ట్రంలోనూ, విజృంభించినంతగా తెలుగుదేశంలో వ్యాపించలేదేమో ననిపిస్తుంది అసలు లేకపోలేదు 1822 సంవత్సరందాకా తెలుగుదేశంలో కూడా సతీసహగమనం ఆచరణలో ఉండేదని వెన్నెలకంటి సుబ్బరావుగారనేవారు ఆంగ్లంలో వ్రాసుకొన్న స్వీయ చరిత్రను బట్టి తెలుస్తున్నది రాజా రామమోహ

నరాయల వారి ప్రభావము, ఇంగ్లీషు చదువుల ప్రభావము దేశీయుల ఆలోచనా విధానాలలో చాలా మార్పులు తెచ్చాయి. రాజా రామమోహన రాయలవారు ఆ కాలంలోనే ప్రపంచ రాజకీయోద్యమాల పట్ల గొప్ప అవగాహన కలిగి ఉండ టమేకాక, ప్రజాస్వామ్యం, వ్యక్తి స్వాతంత్ర్యం మొదలైన వాటిపట్ల విశేషమైన శ్రద్ధాసక్తులు చూపే వారని, ఆదరం కనపరిచే వారని చరిత్రకారులు చెబుతు న్నారు రాజారామమోహనరాయల వారు ఆ కాలంలో పుట్టి ఉండకపోయినట్లైతే, హిందూసంస్కృతి, హైందవధర్మం మరింతపాడై పతనమైఉండేవి 1813 వ సంవత్సరం నుంచి 1828 వ సంవత్సరం వరకు ఒక్క కలకత్తా నగరంలోనే 5 వేలమంది భర్తృవిహీనలు సతిసహగమనమనే దురాచారం వాతపడ్డారని ప్రభుత్వపు నివేదికలనుబట్టి తెలుస్తున్నది ప్రభుత్వం వారి లెక్కలోకి రాకుండా మరికొందరు ఈ దురాచారానికి బలిఅయి వుండవచ్చు ఒక్క కలకత్తా నగరం లోనే ఐదువేల మంది ముద్దరాండ్రు బలి అయిపోతే, వంగదేశమంతా ఇంకెందరు గురి అయినారో! మూడుసంవత్సరాలకు వెయ్యిమంది చొప్పున లెక్కవేస్తే, ఇంచుమించుగా రోజూ ఒకరో, ఇద్దరో, యీ మహా భయంకరాచారానికి బలి అయిపోయే వారన్నమాట! ఎంతఘాతుకం! రాజరామమోహనరాయలవారు ఎంతో పాటుపడి యీ దురాచారాన్ని మట్టుపెట్టాడు అప్పటికి కులీన వివాహాలు, గంగజాతరలు, వల్లభమత ప్రభావంవల్ల సురాపాన, వ్యభిచారాది దోషాలు దేశాన్నిపీడిస్తూ ఉండేవి కిందటి శతాబ్దపు ప్రథమపాదంలో, ఇనుపగొట్టాల ద్వారా మంచినీటి సరఫరాను కూడా ఆచారవంతులు ఏవగించుకొని తాకేవారు కాదుట! వాళ్ళ అజ్ఞానం, అవివేకం ఇప్పుడు తలచుకొంటే చాలా ఆశ్చర్యం కలుగుతుంది

ఇంగ్లీషు చదువులపట్ల దేశంలో ఆసక్తిని వృద్ధి చేసి, ప్రజల్లో విద్యా, విజ్ఞానాదులు వ్యాపించడానికి దేశభాషలను వికసింప చేయాలని కూడా రామ మోహనరాయలవారు బోధించి దానికోసం కృషి చేశారు.

వంగభాషలో వచనరచన కొక స్థితిని ప్రాచుర్యాన్ని కల్పించిన మహాను భావు డాయన కులం, మతం, విగ్రహారాధన, కర్మకాండ మానవత్వపు విలు వలను పెంపొందించడం లేదన్న విశ్వాసంతో ఆయన బ్రాహ్మమతాన్ని స్థాపిం చాడు కాని ఆయన బ్రహ్మసాయుజ్యం పొందిన అర్ధశతాబ్ది అయినా పూర్తిగా గడవకముందే, రామమోహనరాయలవారి బ్రహ్మసమాజం మూడుముక్కలుగా చీలిపోయింది.

తెలుగుదేశంలో కూడా వీరేశలింగం పంతులుగారు, దేశిరాజు పెద బాపయ్య, రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు మొదలైన మహనీయులు బ్రహ్మసమాజాన్ని ప్రచారం చేశారు కాని, దివ్యజ్ఞాన సమాజం విద్యాధికులపై ప్రసరింపజేసిన ప్రభావంతో బ్రహ్మసమాజం క్షీణించింది. తరవాత మళ్ళా వైదిక సంస్కృతి పరిరక్షణ, వైదికధర్మ ప్రచారం అంటూ ఆర్యసమాజం వచ్చింది. మత, సాంఘిక, రాజకీయ, సంస్కరణోద్యమాలు ఇన్ని వచ్చినా, సంఘ సుస్థితికి సంబంధించి చెప్పుకోదగిన మార్పు ఏమైనా కనపడుతున్నదా? అని ప్రశ్న!

వీరేశలింగం పంతులుగారి కాలంలో ఆయన శక్తియుక్తులన్నీ ప్రజలలో మూఢాచారాలు నశించాలని, హేతువాద ధోరణి ప్రబలాలని, ప్రజలు విద్యాధికులై, సంఘంలో లంచగొండితనం,వేశ్యాలంపటత్వం, స్వార్థం,దాంభిక ప్రవర్తన మొదలైన దుర్మార్గాలు నశించాలని ధారపోశారు. ఆయన ప్రయత్నాలు సత్ఫలితాలను ఇచ్చాయో లేవోకాని, ఇంచుమించుగా ఆయన ఆ సాంఘిక దురాచారాలతో పోరాటం ప్రారంభించి, నూరు సంవత్సరాలు గడచి పోతున్నా, ఇంకా వాటికి సంబంధించిన అనేక సమస్యలు, దుష్పరిణామాలు సామాజికులు అనుభవించ వలసే వస్తున్నది 1880 వ సంవత్సరానికే తెలుగుదేశంలో సామాజిక సమస్యల పట్ల అపూర్వమైన చైతన్యం ఆవిష్కృతం కాసాగినట్లుగా, ఆయా మహనీయుల స్వీయ చరిత్రలు చదివితే తెలుసుకోవచ్చు అయితే, అప్పటి ప్రజల్లో మూఢనమ్మకాలు, అజ్ఞానం, ఆచార బానిసత్వం ఎక్కువగా ఉంటే, ఇప్పుడు భోగలాలసత, అక్రమ ద్రవ్యార్జన, అలసత్వం, వంచన మొదలైన దుర్గుణాలు, సామాజిక శ్రేయస్సుకు విఘ్నకారులుగా ఉంటున్నాయి

ప్రజలలో విద్యావివేకాల శాతం యీ వంద సంవత్సరాలలో చెప్పుకోదగినంతగా వృద్ధి చెందలేదనే అనుకోవలసి ఉంటుంది 1891 జనాభా లెక్కలను బట్టి పురుషులలో అక్షరాస్యులైనవారి శాతం ఎనిమిదిని మించలేదు ఎనభై సంవత్సరాలు గడచినా, 1971వ సంవత్సరపు జనాభా లెక్కలని బట్టి నూటికి సుమారు ముప్పైని మించలేదని తెలుస్తున్నది 1891 జనపరిగణనను బట్టి స్త్రీలలో నూటికి ఒక్కరు మాత్రమే విద్యవచ్చినవారుగా స్పష్టమైంది. 1971 వ సంవత్సరం జనపరిగణనం ప్రకారం కూడా స్త్రీలలో నూటికి మూడుశాతం లోపే

చదువుకున్న వాళ్ళు ఉండేవారని తెలుసుకోవచ్చు. వీరేశలింగం పంతులుగారు తమ స్వీయ చరిత్రలో 'ఈ దేశంలో ఎప్పటికైనా వరుడు, తాను వివాహం చేసుకో బోయే వధువును ముందుగా చూడటమంటూ జరుగుతుందా? అట్లాచూసి పర స్పరం వధూవరుల అంగీకారంతోనే వివాహాలు జరుగుతాయా? ఈ దేశంలోనా? అటువంటి మార్పు రావడమా? కల్ల అట్లా జరగదు అసంభవం!' అంటూ ఆక్రో శించినంత పని చేశారు కాని ఆయన గతించి ఏభై సంవత్సరాలు పూర్తికాక ముందే సంఘంలో ఎన్నెన్ని మార్పులో వచ్చాయి అవి రాజకీయార్థిక, పారి శ్రామిక ప్రభావ ఫలితంగా వచ్చి ఉండవచ్చు. కాని, ఆయన ఇలాంటి మార్పులు హిందూ సంఘంలో రావడానికి ఆస్కారం ఉండనే ఉండదు అనుకొన్న మార్పులు ఎన్నో వచ్చాయి కాని, వాటితోపాటు ఇంకా కొత్త సమస్యలెన్నో ఉత్పన్నమైనాయి.

వీరేశలింగం పంతులుగారు సంఘ సంస్కరణ కృషిలో మునిగితేలుతున్న కాలానికి నిర్బంధ వైధవ్యం, ముక్కుపచ్చలారని బిడ్డలకు పెళ్ళి చేయడం, సంఘంలో తగు మనుష్యులనిపించుకొన్న వారిలోనే మితిమీరిన వేశ్యాలంపటత్వం, ప్రభుత్వ రంగంలో లంచగొండితనం మొదలైన దుర్మార్గాలుండేవి ఇప్పుడు ఆ దురాచారాలెన్నో నశించిపోయినవి. అంటరానితనమనే మహాభయంకర వ్యాధి వుండేది సంఘంలో అప్పుడు. మలినజాతులను గర్హిస్తూ, మలినచిత్తులను గౌర వించడం- అది పరమ ధర్మమని మీరనుకొంటే సాగదు. అది చాలా అధర్మమని గురజాడ అప్పారావుగారివంటి కవులు ప్రబోధించవలసి వచ్చింది వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రనుంచి ఒక ఉదాహరణ చదివితే, అప్పుడు అంటరాని తనం ఎంత భయంకరంగా ఉండేదో తెలుసుకోవచ్చు మట్టమధ్యాహ్నం, నడి వేసవి, రాజమహేంద్రవరంలో, జనసమ్మర్దంగల ప్రాంతంలోనే మలిన దేహు డొకడు వడగొట్టి పడిపోతే, ఆ దారినపోయేవాళ్ళు ఎవరూ ఉపచరించవలెనని అనుకోలేదుట పంతులుగారికి అన్నిటా తగిన ఇల్లాలు కాబట్టి, ఆయన ధర్మ పత్ని రాజ్యలక్ష్మమ్మగారా విషాద దృశ్యాన్ని చూడలేక, ఏదో పనిమీద ఆవైపు వెళుతున్న కనపర్తి శ్రీరాములుగారిని బ్రతిమిలాడి, తాము సాయం పట్టి, ఆ మలిన దేహుణ్ణి తమ ఇంటి పంచకు చేర్చి, మంచినీళ్ళిచ్చి ఉపచరించినట్లు వీరేశలింగం పంతులుగారు తమ చరిత్రలో వ్రాశారు పూటకూళ్ళమ్మ ఇంట్లో కూడా బడాయికీ మడీ, ఆచారమూ పాటించే పెద్ద మనుషులుండే వారనీ, వాళ్ళ

కోసం దండెంపైన రెడీమేడ్ మడిబట్టలు పూట కూటింటి యజమానురాలు సిద్ధంగా ఉంచేదనీ చిలకమర్తి వారి రామచంద్ర విజయం చదివి తెలుసు కోవచ్చు అప్పటి వీధిబడులు, ఆ బడి పంతుళ్ళ అజ్ఞానం, చదువుచెప్పే మిషతో పిల్లలను ఆ బడిపంతుళ్ళు పెట్టే బాధలు, నాటక సమాజాలు, భోగంకొంపలు, ఆ సాంఘిక సమస్యలు ఇప్పుడు లేవు హోటళ్ళు, సినిమాలు, సినిమాహాళ్ళు, రెండు శతాబ్దులపాటు ప్రబోధ వాఙ్మయం చెయ్యలేని పనిని, సంఘంలో అస మానతలను, ముఖ్యంగా అస్పృశ్యత విషయంలో రూపుమాపి, కొత్త విలువ లను సృష్టించాయి పదిమంది వీరేశలింగం పంతుళ్ళు కలసి చేయగలిగిన పనిని రైళ్ళు, సినిమాహాళ్ళు కాఫీహోటళ్ళు చేశాయని చెప్పవచ్చు గ్రామాలలో సంప న్నుని వీధి అరుగుమీద, మరెందుకూ కొరగాని, పెద్దమనిషి వీధిబడి పెట్టుకొని, బతకలేక బడిపంతులుగా బ్రతుకుతూ యథాశక్తి విద్యాదానం చేయవలసిన ఆవశ్యకత ఇప్పుడు లేదు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి మాలపల్లిలోని సమస్యలు ఇప్పుడు లేవు, ఆముదపు దీపాలకాలం అంతరించిపోయింది అంట రానితనం చాలావరకు నశించి పోయింది వీరేశలింగంపంతులుగారు 1881 వ సంవత్సరం డిసెంబరు నెలలో నిర్వహించిన మొదటి పునర్వివాహం అద్భుత అపరాధ పరిశోధకగాథలకేమీ తీసిపోలేదు ఒక్కటే భేదం హత్యలు, హంత కులు, నిందితులు మాత్రం ఆ గాథలో లేరు పంతులుగారిని శాపనార్థాలు పెట్టి, వీలైతే హతమార్చుదామని చేసిన ప్రయత్నాలు కూడా లేకపోలేదు కాని, అతి చాకచక్యంతో, ధీరోదాత్తమైన చిత్తవృత్తితో ఆ సాహస కార్యాన్ని ఆయన నిర్వహించారు ఇప్పుడు సంఘంలో స్త్రీ పునర్వివాహమన్నది జటిలమైన సమస్య కానేకాదు సంస్కారవంతులైన కుటుంబాలలో అట్లా పునర్వివాహం చేసుకున్న స్త్రీ పురుషుల నెవ్వరినీ ఆక్షేపించడం లేదు బాల్య వివాహాలు, వాటి తాలూకు సమస్యలు ఇప్పుడు లేవు

అయినప్పటికీ సంఘంలో సుఖశాంతులు, సర్వజన సంక్షేమం కనబడు తున్నాయా అంటే కనిపించటం లేదు ఆడపిల్లలు చదువుకో కూడదని వంద సంవత్సరాల క్రితం కొందరు బుద్ధిమంతులు తీవ్రంగా వాదించేవారని, అందుకు ఎన్నెన్నో ఉపపత్తులు ప్రతిపాదించే వారని ఇప్పుడు తలచుకొంటే, చాలా నవ్వూ, దుఃఖమూకూడా వస్తాయి 1862 సంవత్సర ప్రాంతానికి, ఆంధ్రదేశం మొత్తా నికి మూడు స్కూళ్లు మాత్రమే ఉండేవి ఇప్పుడు ఒక మోస్తరు గ్రామంలో

కూడా ఉన్నత పాఠశాల వెలసింది అన్ని రంగాలలోనూ సరిసమానంగా స్త్రీ పురుషు లిద్దరూకూడా తమ విజ్ఞానాన్ని పెంపొందించుకొనే అవకాశాలు న్నాయి. ప్రోత్సాహమూ ఉన్నది. వయోజన వోటింగువల్ల తమ ప్రభుత్వాన్ని తామే ఎన్నుకొనే అదృష్టం కూడా ప్రజలకు ఈ కాలంలో ఉన్నది అయినా ప్రభుత్వ పరిశ్రమలలో, ప్రభుత్వం పెట్టుబడి పెట్టిన ఇతర రంగాలలో విప రీతమైన నష్టాలు, అధికార సామాన్యంలో, దేశాన్ని గురించి, దేశపురోభివృద్ధిని గురించి సరిఅయిన ఆర్తి, ఆసక్తి లేకిపోవడం, వికృతమైన కులతత్త్వం, సంస్కారంలేని చదువులు, స్వార్థపరత్వం, డబ్బుగలవాళ్ళ రాజకీయాధికారాలు, ముఖ్యంగా తాగుబోతుతనం, నిరుద్యోగం, విద్యాసంస్థలలో అలసత్వం, అవి నీతి, అక్రమార్జనలు, అన్నిరకాల ఆందోళనలతోను తమ తెలియకుండానే ఆక ర్షితులై నష్టపోయే విద్యార్థులు, నీతిలేని రాజకీయాలు, నీతులు చెప్పేవాళ్లేకాని, వ్యక్తిగత జీవితంలో కాని, సాంఘిక జీవనంలోకాని చెప్పినంతమేర కాక పోయినా యథాశక్తిగానైనా ఆ నీతులను ఆచరించి చూపగల పెద్ద మను షులు క్రమంగా తక్కువై పోతూ ఉండడం, యీ దేశానికి ఇప్పుడొచ్చిన పెద్ద కష్టం. అంతకన్నా గొప్ప దురదృష్టం

చుక్కలతో చెలిమిచేస్తూ, రోజు రోజుకూ పెరిగిపోతున్న అత్యవసర వస్తువుల ధరలు, మధ్య తరగతి కుటుంబాలలో విపరీతమైన ఆశలు పెంచుకో వడం, పారిశ్రామిక నాగరికత, ఆధునిక సంసార సదుపాయాలపట్ల అన్ని వర్గాల ప్రజలలో ఆసక్తి, సుఖజీవన వ్యామోహం, సంఘంలో అనేక సంఘర్షణ లకు మూలకారణ మవుతున్నాయి. వంద సంవత్సరాల క్రితం ఆడపిల్లలకు పది పదిహేను సంవత్సరాలకల్లా తప్పని సరిగా వివాహం అవుతూ వుండేది. పురుషు లలో కూడా పాతిక సంవత్సరాల వయసు మించితే ఆక్షేపణగానే ఎంచేవాళ్ళు కాని ఇప్పుడు ఆడపిల్లలు పాతికేళ్ళదాకా వివాహం కాకుండా ఉండటం, ముప్ప య్యేళ్ళు వచ్చిందాకా పురుషులు పెళ్ళికాకుండా ఉండటం అతి సామాన్యమే అయి పోయింది ఇందువల్ల వ్యక్తిగతమైన బాధ్యతలు, సాంఘికమైన బాధ్యతలు తనపై పడకుండా తప్పించుకొని తిరిగే ప్రవృత్తి, అలసత్వం పురుషుడిలో పెరిగే అవకాశం వున్నది సామాన్య, మధ్య తరగతి కుటుంబాలలో కృత్రిమాధి క్యతలు, అభాస గౌరవాలపట్ల ఆకాంక్ష ఎక్కువై, అనేకమైన మానసిక అశాం తులు, అబద్ధపు విలువలు సమస్యలుగా ఎదురవుతున్నాయి మానసికమైన

ఉద్వేగాలనుంచి సరిఅయిన ఉపశాంతిలేక, సామూహికంగా అల్ప విషయాలపట్ల, అంటే జుట్టు, బొట్టు, కట్టు వంటి ఫాషన్లలో వింత వింత అభిరుచులు ప్రదర్శితమవుతున్నాయి ఏదో మార్పు కావాలి, ఏదో కొత్త కావాలి అందుకే హిప్పీలను అనుకరించాలని, మానసికోత్తేజ కౌషధాలమ సైతం మింగాలని, పెరిగి పెద్దవాళ్ళై వృద్ధిలోకి వచ్చి ఉద్ధరిస్తారు, ఊళ్ళేలుతారు అని ఆశలెవరిపైన పెట్టుకుంటున్నారో పండుటాకు తరం, ఆ యువతరం మాత్రం చెవిపట్టీలను చుబుకందాకా పెంచి, గొప్ప ఘనకార్యాలు సాధించామని అనుకుంటున్నారు. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో విద్యార్థులలో కనీసం మూడువంతులమంది ఉత్తేజ కౌషధాలను సేవిస్తున్నారని ఒక విద్యార్థి చెప్పినపుడు, అది విన్నపుడు, ఎలాటి ఊహలు వస్తాయో ఎవరికివారే ఆలోచించుకోవచ్చు

అట్లానే ఈ దేశంలో అత్యంత నాగరిక స్థాయిలలో అనేక సాంఘిక ద్రోహాలు జరుగుతున్నాయి. కాబ్రా డ్యాన్సులు, గుర్రపు పందేలు, లాటరీలు, రోజురోజుకూ పెరిగిపోతున్న మద్య మందిరాల- మద్య విక్రయశాలల సంఖ్య ఇవాళ్టి సాంఘిక సమస్యల కారణాలని ఎంచవచ్చు. కష్టపడి, నీతి నిజాయితీలకు లోబడి పనిచేసి, దైనికావసరాలను తీర్చుకొనడానికి కావలసిన డబ్బు సంపాదించవలసిన అగత్యం లేకుండానే గూండాలు, రౌడీలు, సంఘ విద్రోహకర శక్తులు అక్రమ జీవనం సాగిస్తున్నట్లు ప్రభుత్వమే అప్పుడప్పుడు ప్రకటిస్తున్నప్పుడు, ఈ దేశంలో కష్టపడి తన ఆహారాన్ని తాను ఆర్జించుకోకపోవడంవల్ల ఎంత మానవశక్తి వృథా అయిపోతున్నదో ఊహించుకోవచ్చు. ఎన్నికలకోసం, స్థానిక పరపతికోసం సాంఘిక విద్రోహ శక్తులను కొందరిని వృత్తిగా పోషించే పెద్ద మనుషులు కొందరుండటం, వాళ్ళు అధికారాలను హస్తగతం చేసుకోగలగటం, ప్రజల అజ్ఞానాన్ని, అశిక్షను, అవిద్యను ఆధారం చేసుకొని, ఎన్నికలలో తామే జయించి, ఆశ్రిత పక్షపాతం, అవినీతి, అక్రమార్జనలు నిర్విఘ్నంగా కొనసాగిస్తున్నారు దేశమంతా ఇంతేనా? సంఘమంతా ఇంతేనా? విద్యాధికులందరూ ఇట్లానే ప్రవర్తిస్తున్నారా? అంటే అట్లా అనకూడదు. ఎప్పుడూ, ఏ కాలంలోను అంతా చెడుగే ఉండదు అయినా కొన్ని సాంఘికాచారాలను, అప్పటి చారిత్రకావసరాలను గుర్తించకుండా నిరసించటం లేదా! అదేవిధంగా వర్తమాన కాలంలో, పెద్దలలోనూ పిన్నలలోనుకూడా, కనపడవలసినంత క్రమశిక్షణ కనపడకపోవడం, దేశహితాన్ని గురించిన పట్టుదల లేకపోవడం, కష్టపడి పని

చేయకపోవడం నిరసించవలసిన సాంఘిక సమస్యలు సర్వసామాన్యంగా ఇప్పుడు అన్ని రంగాలలో కూడా దగ్గరి త్రోవలు వెతుక్కొని, సాంఘిక గౌరవాన్నీ, డబ్బును సంపాదించే ఆసక్తి ప్రజలలో పెరిగినట్లుగా కనిపిస్తున్నది ఇక మత, నైతిక, ధార్మిక ప్రబోధాలు చేసే వ్యక్తులు, సంస్థలు కూడా కుహనా పద్ధతులు, సులభమార్గాలు ఆశ్రయించడం వల్ల చెరుపే ఎక్కువ జరుగుతున్నది కాని, మంచి జరగడంలేదు ఎందరో యోగులు, ఆచార్యులు, ఆధ్యాత్మ విద్యోపదేశికులు నడుం కట్టి పనిచేస్తున్నారు కాని, వాళ్ళ ప్రయత్నాలు ఫలకారులు కావడంలేదు ఎందువల్లనంటే, వాళ్ళలోకూడా సత్తు, చిత్తులకున్న తేడా ప్రస్ఫుటం కావడంలేదు ఒకే విధంగా కనపడుతున్నారు ప్రచారము, పేరు ప్రఖ్యాతుల పట్ల చూపిస్తున్న ఆసక్తి, నిర్మాణాత్మకమైన కృషిపట్ల ఎవ్వరూ, ఏ రంగంలోను చూపటంలేదు

ప్రాథమిక పాఠశాలల దగ్గరనుంచీ విశ్వ విద్యాలయాల వరకు, అధ్యాపక వర్గంలోను, విద్యార్థులలోను, సామాన్యంగా క్రమశిక్షణ, చిత్తశుద్ధి లోపించినట్లుగా కనిపిస్తున్నది అపవాదాలు ఉండవచ్చు కాని సాధారణ పరిస్థితులు సంతృప్తికరంగా లేవు ఇప్పుడు ప్రకటితమవుతున్న సాహిత్యం కూడా కేవలం వినోదాన్ని, పాఠకుల అభిరుచులను దృష్టిలో పెట్టుకొని వెలువడుతున్నదేకాని, సామాజిక బాధ్యతల పట్ల ఆలోచనాత్మకమైన ధోరణిని పాఠకులలో ప్రేరేపించేదిగా ఉండటం లేదు, సామాజిక విలువలు, సామాజిక సమస్యలు పాఠకుని ఆలోచనలను ఆక్రమించనంతవరకు, అది ఉదాత్త విషయాలను ప్రకటించలేదు

ఏదిఏమైనా వంద సంవత్సరాల క్రితం సమస్యలు ఇప్పుడు లేవు. ఇప్పటి సమస్యలు కూడా క్రమంగా పరిష్కారం కావచ్చు మళ్ళీ కొత్త సమస్యలు తల ఎత్తవచ్చు సాంఘికార్థిక రాజకీయ రంగాలలో వెనుకబడిన దేశాల సమస్యలు ఒక విధంగా ఉంటే, సంపన్న దేశాల సమస్యలు ఇంకో విధంగా ఉంటున్నాయి ఏమైనా మానవత్వపు విలువలను అనుశాసించే సాంఘిక దృక్పథం సామాజికులలో పెంపొందనంతవరకు, కలిమిలేములు, మంచిచెడ్డలు, తద్వారా ఇతర సమస్యలు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి

(భారత స్వాతంత్ర్యోద్యమ ప్రదీప్త సంచిక - 1980 )

# ఒక దశాబ్ది తెలుగు నవల

వెనక్కు తిరిగిచూస్తే ఒకందుకు సంతోషం కలుగుతుంది

నూట ఎనిమిది సంవత్సరాల తెలుగు నవల చరిత్రచూస్తే, మొలకెత్తిన ఆరు సంవత్సరాల వరకూ మారాకే తొడగలేదు. ఇప్పుడేమో మహావృక్షం, శాఖోపశాఖలు

తెలుగు నవల సమాజ పరిణామాన్ని దృష్టిలో పెట్టుకొనే పుట్టింది

సమాజ వికాసంకోసం ప్రబోధిస్తూ సాగింది పుట్టిన నాటినుంచీ సమాజ సాహిత్య ప్రక్రియగానే ప్రీతిపాత్రమైంది పాఠకులకు సమాజంలోని మార్పులు, ప్రభావాలు, మథనలూ ప్రతిబింబిస్తూనే వచ్చింది అయితే, ఆశ్చర్యం కలిగించే ఘట్టాలు లేకపోలేదు

అర్థంకాని సమస్యలూ ఎదురుకాక పోలేదు - చారిత్రక విశ్లేషణలో.

సామాజిక నవలగా పుట్టింది, పాతిక సంవత్సరాలు గడిచేసరికి చారిత్రక నవలగా ఎందుకు పరిణమించింది? శిల్పం దృష్ట్యాగాని, వస్తువు దృష్ట్యాగాని, సహజమైన వికాసం దృష్ట్యాగాని ఇది వెనకడుగుకాదా?

తెలుగులో మొట్టమొదటి నవల శ్రీరంగరాజ చరిత్రం, రెండోది రాజశేఖర చరిత్రం పేరులోనే ఇవి చరిత్రలు కాని సాంఘిక నవలలు. అంటే నాటి సాంఘిక సమస్యలను దృష్టిలో వుంచుకొని వాటివల్ల ప్రభావితమై పుట్టినవి ఈ రెండింటి తర్వాత వచ్చిన సత్యవతీ చరిత్రం కూడా సాంఘిక నవలే రాజశేఖర చరిత్ర తర్వాత మరి అయిదేళ్ళకు పుట్టిందీ నవల మరి పదేళ్ళదాకా తెలుగులో నవలలు వచ్చినట్లు లేదు కిందటి శతాబ్ది చివరి దశాబ్దంలో 'చింతామణి' అనే సాహిత్య పత్రిక నిర్వహించిన పోటీల ధర్మమా అని నవలా రచన వికాసం పొందింది రచయితలకూ పాఠకులకూ కూడా ఆకర్షకమైంది అప్పట్లో ధర్మవతీ విలాసం, సంజీవరాయ చరిత్రం,రామచంద్ర విజయం, వివేక విజయం- ఇలా వుండేవి పేర్లు అప్పటివరకూ సాంఘికేతివృత్తమే సాగింది

మరి చిలకమర్తి రంగంలో ప్రవేశించింతర్వాత తాత తాతల నాటి కథల కోసం తవ్వడం మొదలైంది ఆనాటి సామాజిక పరిణామాలను విశ్లేషిస్తే ఇది వింతకాదు బ్రహ్మ సమాజం, ఆర్యసమాజం ప్రబలు సన్నగిల్లి దివ్యజ్ఞాన సమాజం ఒక్క వెలుగు వెలుగుతున్న రోజులొచ్చాయి అప్పటికి కిందటి శాతాబ్దం ముగిసింది కొత్త శతాబ్దంలో సాహిత్యంలో లౌకికదృష్టి ప్రబలుతూ వచ్చింది ఈ శతాబ్ది మొదటి దశాబ్దిలో స్వాతంత్ర్యోద్యమం ప్రారంభ మైంది రెండో దశాబ్ద ప్రారంభంలోకాని సామాజిక నవల పుట్టలేదు స్థూలంగా మొదటి పాతిక సంవత్సరాలు సాంఘిక నవల తర్వాత పాతిక సంవత్సరాలు చారిత్రక నవల. మాలపల్లి వచ్చింది. ఇది తెలుగులో మొట్టమొదటి సామాజిక నవల. నవభారత ఇతిహాసాన్ని ప్రతిబింబిస్తున్న సమగ్ర నవల సాంఘిక నవలకూ, సామాజిక నవలకూ భేదమేమిటన్న ప్రశ్న రావచ్చు సాంఘిక నవలలో వ్యక్తి కేంద్రం సామాజిక నవలలో సమాజం కేంద్రం వ్యక్తీ, సమాజమూ పరస్పర ప్రభావశీలాలే కాదనలేం కాని కులాచారాలు, కుటుంబ సమస్యలు, వ్యక్తుల పరస్పర ఆకర్షణ వికర్షణలు సాంఘిక నవలకు వస్తువు. అంటే ముడి వస్తువు. సామాజిక నవల అట్లాకాదు సమాజం మీద సమకాలిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక వ్యవస్థల ప్రభావాన్ని సామాజిక నవల ప్రతిబింబిస్తుంది

మాలపల్లి 1922లో వచ్చింది మరి పదేళ్ళకు చలం మైదానం, విశ్వనాథ వేయి పడగలు వచ్చాయి ఈ పరిణామం ఏమిటి? తెలుగు నవలకు బలుపా, వాపా, ఈ లోపున ఒక ప్రపంచ యుద్ధం ముగిసింది. ఇంకో యుద్ధం రాబో తున్నది. పాశ్చాత్య దేశాలలో మానవ నాగరికత శిథిలమైపోయింది ఈ పరి ణామం అక్కడి సాహిత్యాన్ని, కళను ప్రభావితం చేసింది సమాజంలోని హింసా ప్రవృత్తిని, దౌర్జన్యాన్ని, క్రౌర్యాన్ని నాశనం చెయ్యాలి ఎదురు తిరగాలి ప్రశ్నించాలి పడిపోతామని తెలిసినా లొంగిపోకూడదు సజీవ రచన అంటే నెలకొని ఉన్న, అన్యాయంగా అధికారం చెలాయిస్తున్న వ్యవస్థకు వినాశకంగా అది కంఠం వినిపించాలి ప్రయోజనాన్ని కోల్పోయిన భావాలను నాశనం చెయ్యాలి ఇదీ తిరుగుబాటు చలంలో ఈ తిరుగుబాటు ధోరణి కన్పిస్తుందంటారు. చలంలోని భావోల్బణను ఆయన గొప్ప శైలి అని మెచ్చుకుంటారు పందొమ్మిది వందల పదినుంచి ఇరవై వరకు వచ్చిన నవలలను చలం వికటం చేశాడు తెలుగు నవల అని పరిహాస రచన చేశాడు, ఇంచుమించుగా ఈ పదేళ్ళు చారిత్రక

నవలలే వచ్చాయని చెప్పాలి. ఎందుకంటే విజ్ఞాన చంద్రికామండలి తెలుగు నవలల పోటీ నిర్వహించి, నవల అంటే చారిత్రక నవలే అని ప్రకటించే సాహసం చేసింది. ఈ దశలో విజ్ఞాన చంద్రికామండలి బహుమానం పొందిన ఒక నవలను గురజాడ అప్పారావు తీవ్రంగా విమర్శించాడు చలం ఇంకాస్త ముందుకు వచ్చి వేళాకోళం చేశాడు చారిత్రక నవల అనగానే నవరస భరితంగా ఉండాలనే తలంపుతోనేమో మరి పరిణామం కాస్త పెద్దదిగా వుంటూనే వచ్చింది

మాలపల్లి నుంచి చివరకు మిగిలేది మధ్యకాలంలో నవలా రచనలో ప్రధానమైన ధోరణి ఇది అని నిర్ధారణగా చెప్పలేము అడవి బాపిరాజు సాంఘిక నవలలూ, చారిత్రక నవలలూ రాశాడు విశ్వనాథ అన్నిరకాల నవలలూ రాశాడు- చారిత్రకాలూ, సాంఘికాలూ, అతిమానుషాలూ, అద్భుతాలూ, మనో విశ్లేషణాత్మకాలూ రెండో ప్రపంచయుద్ధం ముగియడమూ, ఆ తర్వాత ఐదు సంవత్సరాలకు మనకు స్వాతంత్ర్యం రావడమూ, సమాజ పరిణామాలూ తెలుగు నవలకి కొత్త రూపరేఖలు తెచ్చాయి

స్వాతంత్ర్యానంతరం తెలుగు నవలలో ఇతివృత్త వైవిధ్యం ఎక్కువైంది వైయక్తికమైన సమస్యలు, రాజకీయ సిద్ధాంత వాహకాలూ అయిన ఇతివృత్తాలూ, మనో విశ్లేషణాత్మకాలూ, శిల్ప సంబంధమైన ప్రయోగాలూ నవలా రచనలో చోటు చేసుకోవడం మొదలైంది చివరకు మిగిలేది, కీలుబొమ్మలు, అసమర్థుని జీవయాత్ర, అల్పజీవివంటి నవలల్లో క్రమానుసారంగా ఈ నవ్యధోరణులు వ్యక్తమవుతూ వచ్చాయి సాంఘికోద్యమాలు సాహిత్యంపైన ప్రభావం చూపాయి మాలపల్లి నవల వచ్చిన తర్వాత పాతిక సంవత్సరాలలో స్వాతంత్ర్యోద్యమం తెలుగు నవలని, తక్కిన సాహిత్య ప్రక్రియలన్నిటిని ప్రభావితం చేసినట్లే ప్రభావితం చేసింది నవలా రచనలో కూడా కొత్తపోకడలు వచ్చాయి ఉదాహరణకు బాపిరాజు నవలల్లో సాంఘిక, చారిత్రక నవలల్లో సమన్వయ శిల్పం కనపడుతుంది తెన్నేటి సూరి ఛంఘిజ్ ఖాన్ నవలలో చారిత్రక, సామాజిక నవలా శిల్ప సమన్వయం కనపడుతుంది. నోరి నరసింహశాస్త్రిగారి వంటి పండితుడు చారిత్రక నవలలు మాత్రమే రాయడానికి - తెలుగు వారిలో ఈ శతాబ్ది పూర్వార్ధంలో మొదటి దశకంలోనే మొదలై అంతకంతకూ బలపడుతూ వచ్చిన స్వరాష్ట్ర సంపాదన కాంక్ష ప్రేరకమై వుండవచ్చు తెలుగుభాషా భాషా

సంస్కృతుల, సాహిత్య ప్రాభవాలను ఈ తరంవారికి స్ఫూర్తి కలిగించే కోరికతో చారిత్రక నవలలు వెలువడటమూ, వాటికి పారకుల ఆదరణ లభించడమూ జరిగింది

ఈ శతాబ్ది ఉత్తరార్ధ ప్రవేశంతో తెలుగు నవల కుటుంబ సమస్యలపట్ల ఆకర్షితం కావడం విశేషం. 'శారద' రాసిన మంచీ - చెడూ, అపస్వరాలూ ఇందుకు ఉదాహరణలు బలివాడ కాంతారావు, రంధి సోమరాజు, అవసరాల రామకృష్ణారావు, కొమ్మూరి వేణుగోపాలరావు మొదలైన రచయితలు కుటుంబ సమస్యలను ఇతివృత్తంగా తీసుకొని మంచి నవలలు రాశారు.

ఇంచుమించు పందొమ్మిదివందల అరవైలనుంచీ నవలా రచనలో మహిళలు ముందంజ వెయ్యడం తెలుగు నవలా చరిత్రలో ఒక విలక్షణ విషయం. ఇంచుమించుగా గడిచిన యీ రెండు దశాబ్దాలు ఆధునిక తెలుగు సాహిత్యంలో నవలాయుగమనే చెప్పాలి అని కొందరు చమత్కరించడం కూడా కద్దు

స్థూలంగా నాలుగు పాతికల తెలుగు నవలా చరిత్రలో ప్రధాన ధోరణులివి. ఇప్పుడు అధిక సంఖ్యలో మహిళలు సాంసారికేతివృత్తానికి ప్రాధాన్యాన్నిస్తూ రచనలు చేస్తున్నారు

ఇక నవలా రూపం గురించి రూపం అంటే ఇతివృత్త నిర్వహణలో బాహిరమైన శిల్పం అన్నమాట ఆకృతి ఒక శిల్పాన్ని చెక్కాలనుకుంటే ముందుగా నిర్ణయించుకోవలసిన కొలతల సమాహారం రూపం అదే ఆకృతి, అదే పరిమాణం ఎంచుకొనే ఇతివృత్తాన్నిబట్టి ఈ పరిధిని సామాన్యంగా రచయిత నిర్ణయించుకుంటాడు.

'కుడ్యచిత్ర రచనవంటిది నవలా రచన బహుశా మన ఆంధ్రుల ప్రతిభ మినియేచర్ పెయింటింగ్‌లో కనబడుతుందనుకుంటాను' అంటాడు శ్రీశ్రీ 'తెలుగులో సంతృప్తికరమైన కవిత్వం వచ్చినట్లు, కథలు వచ్చినట్లు, నవలలింకా రాలేదని నాదో చిరకాలపు ఫిర్యాదు వుంది' అనికూడా రాచకొండను అపరిచయం చేస్తూ (రాజు-మహిషి) అభిప్రాయపడ్డాడు శ్రీశ్రీ.

నవలలో సన్నివేశ నిర్వహణమూ, పాత్రోన్మీలనమూ, సంభాషణలూ, ఆద్యంతాలు, ఆంతర శిల్పానికి సంబంధించిన విషయాలు ఇక బాహిర శిల్పం పరిధికి సంబంధించిన కొలతలు కథా కథన పద్ధతి అన్నమాట నవలా రచనకు సంబంధించిన కథాకథనం స్వగతంగా నిర్వహిస్తున్నాడా, దినచర్యారూపంగానా, సంవాదాత్మకంగానా, లేఖారూపంలో నిర్వహిస్తున్నాడా, ఉత్తమ పురుషలో తానూ పాత్రలలో ఒక పాత్ర అయి కథ చెపుతున్నాడా లేక ఫ్లాష్‌బాక్ పద్ధతిలో కథను మనముందుకు తీసుకొని వస్తున్నాడా అనేవన్నీ నవలా రూపానికి సంబంధించిన విషయాలు ఏంచెపుతున్నాడన్నది ఆంతర విషయమైతే ఎట్లా చెపుతున్నాడనేది రూపవిషయం తెలుగు నవలరూపం విషయంలో ఈ నూరేళ్ళలోనూ వేళ్ళమీద చెక్కపెట్టదగిన ప్రయోగాలు మాత్రమే జరిగాయి. ఎట్లా రాసినా, ఏం రాసినా వాస్తవికతకు చేరువగా వుండాలిగాని దూరంగా వుండకూడదని తొలిరోజులనుంచీ మన గొప్ప నవలా రచయితల అభిప్రాయం. సుమారు తొంభై సంవత్సరాల నాడు మొట్టమొదటిసారిగా నవలా రచనలో పోటీలు నిర్వహించిన చింతామణి పత్రిక ఈ విషయాన్నే నొక్కిచెప్పింది 'కథ కేవల కల్పితమే యైనను స్వభావ విరుద్ధముగా నుండక నిజముగా జరుగుచున్న చరిత్రమువలెనుండి ' అన్న నిబంధన వాక్యంవల్ల నేల విడిచి ఊహా విహారాలలో రచయిత తేలిపోగూడదని స్పష్టపడుతున్నది

సుమారు ఏభై సంవత్సరాల వరకూ రచయిత తన పాత్రల కదలికల వెంట వుంటూ వుండేవాడు భౌతికంగా ఆత్మీయంగా ఎప్పుడూ వుంటాడు ఆ తాదాత్మ్యం లేకపోతే మంచి రచనను చేయనేలేడు అయితే ఎక్కడికక్కడ తాను ప్రత్యక్షం కాకూడదు ఇంచుమించు ఈ శతాబ్ది రెండు దశాబ్దాలు గడిచిన దాకా నవలా రచనలో రచయిత ప్రత్యక్ష సాక్షాత్కారం అనివార్యంగానే సాగుతూ వచ్చింది విశ్వనాథ ఏకవీరలో కూడా ఇలాటి ఒక హెచ్చరిక వుంది. 'పాఠక మహాశయా! ఈ ముసుగుమనిషి మన పద్మనాభమేసుడీ!' అని, అపరాధ పరిశోధక నవలలు చదువుతున్నప్పుడు పాఠకు డెక్కడ భయపడిపోతాడో అన్నట్లూ, ఉత్కంఠను భరించలేక ఏమైపోతాడో అన్నట్లూ రచయిత వచ్చి వీపు నిమురుతాడు తొలిరోజుల చారిత్రక నవలలనిండా పర్వతశ్రేణుల, నదీనదాల, ప్రకృతి పరిసరాల వర్ణనలు అనివార్యంగా కనబడతాయి మానవ మనస్తత్వంలోని వైచిత్రిపట్లగాని, తాము ఎంచుకొన్న ఇతివృత్తానికి సంబంధించిన

పాత్రోన్మీలనంగాని గొప్ప రచయిత ఎవ్వడూ విస్మరించడు. లోకవృత్తాన్ని గురించి, సమకాలీన సామాజిక వ్యవస్థను గురించీ రచయిత వ్యాఖ్యానం చేయ వచ్చు కాని, తానే వచ్చి ప్రత్యక్షంగా వ్యాఖ్యానానికి పూనుకోకూడదు 'అమీర్ డొక్కలో తన్నాడు రాజేశ్వరిని, కడుపుతో వుందన్న కోపంతో' - మైదానంలో సన్నివేశమిది చలమంటాడు - 'రాజేశ్వరికి కోపం రాలేదు ఆ కాలును ముద్దు పెట్టుకోవా లనిపించింది' అని చలం వ్యాఖ్యానం ఎందుకిక్కడ?! ఆ కాలును పట్టుకొని రాజేశ్వరి ముద్దుపెట్టుకుంటే సరిపోయేది. ఇది శిల్పంలోగాని, రచనా సంవిధానంలోగాని లోపమని కాదు ఇక్కడ ప్రస్తావించటం - రచయిత భావ తీవ్రత, భావోద్వేగం పాత్రలతో తాదాత్మ్యం చెందినా, తోలుబొమ్మలాటలో దారాలు తన చేతిలో వుంచుకొని కదలికలను తాను నియంత్రించినట్లు, రచయిత తన పాత్రలను తన చెప్పుచేతల్లో పెట్టుకున్నట్లు కనిపించకూడదు అవి రచయిత చెప్పుచేతల్లో తప్పకుండా వుంటాయి వుండవలసిందేకూడాను. అయితే రచనా సంవిధానంలో కొత్త కొత్త ధోరణులు ప్రవేశించేవరకూ ఇతివృత్త విన్యాసంలో నలిగిన దారినే నడవడం తప్పదు.

ఈ దశాబ్ది ఇంకా రెండు సంవత్సరాలకు ప్రారంభమవుతుందనగా తెలుగు నవల రూపరేఖల్లో ఒక విలక్షణమైన మార్పు వచ్చిందనే చెప్పాలి ఇందుకు ఒకటికన్నా ఎక్కువే కారణాలుండవచ్చు అలవోక పరిమాణంలో అంటే చేతుల్లో పట్టుకొని ఎక్కడికైనా వెళ్ళగలిగేట్లు, కాస్త పెద్ద జేబైతే అందులోనూ ఇమిడేట్లు, అధిక సంఖ్యలో నవలా రచనను ప్రోత్సహించే ప్రణాళికను ఒక సుప్రసిద్ధ ప్రచురణ సంస్థ చేపట్టడం తెలుగు నవల రూపరేఖల్లో మార్పు రావడానికి కారణమైందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇక సామాజిక పరిస్థితులూ, జీవితంలో వేగం, అలజడి, సంఘర్షణ- ఇవికూడా నవల పరిమాణాన్ని హద్దుల్లో వుంచాయి ఇప్పటి రోజుల్లో సామాన్య పాఠకుడెవరైనా మాలపల్లి, వేయిపడగలు, చంఘిజ్ఖాన్ వంటి పెద్ద నవలలను చదవడానికి ఆసక్తి కనపరచడం కష్టం. బాగా చదివించే మంచి శైలితో ఒక పూటలోనో, కనీసం ఒక రోజులోనో ఆ నవల చదవడం ముగియాలని కోరుకుంటాడు. ఎమెస్కో పాకెట్ బుక్స్ పరంపర ప్రారంభించటానికి వేసుకున్న ప్రణాళికలో అవి ఒకే పరిమాణంలోనూ, ఒకే వెలతోనూ సాధ్యమైనంతవరకు ప్రచురించాలని ప్రచురణకర్తలు నిర్ణయించడం జరిగింది ఈ నిర్ణయం సముచితమేకాక అవసరం కూడాను. ఆ ప్రమా

ణంలో సుమారు మూడు వందల పేజీలకు మించకుండాను, వెల రెండు రూపాయలు దాటకుండాను చూడాలని ప్రచురణకర్తలు పథకం నిర్ణయించు కున్నారు మొట్ట మొదటి రోజుల్లో నెలకు నాలుగు నవలలు తప్పకుండా ప్రచు రిస్తూ వచ్చారు మొదటి ఐదారు నెలలదాకా, నెల విడుదలలన్నీ నవలలే కావడం గమనార్హం ఆ తరువాత కొద్ది సంఖ్యలో కథా సంకలనాలు, నాటికలు, నాట కాలు కూడా వెలువడ్డా, ఈ ప్రణాళిక ప్రధానంగా నవలా ప్రచురణకే ఉద్దే శించడం జరిగింది. అందువల్ల ఈ దశాబ్ది నవలల్లో ప్రత్యక్షంగానో పరోక్షం గానో ఎమెస్కో పాకెట్ బుక్స్ పరిమాణ ప్రభావం వుండకపోదు అనుకుంటాను అయితే వారపత్రికలలో సీరియల్‌గా వెలువడిన రచనలు పరిమాణంలో పెద్దవి గానే వుంటూ వచ్చాయి ఉదాహరణకు ఎన్ ఆర్ నంది నైమిశారణ్యం, వడ్డెర చండీదాసు హిమజ్వాల మొదలైనవి ప్రతివారం ఆసక్తిని పెంచుతూ సాగే రచనకు రూపం, అంటే పరిమాణం ఏ పరిధిలో వుండాలి, ఎట్లా వుండాలి అన్నది ప్రశ్న కాదు

నైమిశారణ్యం ఈ దశాబ్దికి చెందిన నవల కాదుకదా అంటారేమో! 1969 లో ఇది పుస్తక రూపాన మొదటిసారి ముద్రణ పొందింది అందువల్ల ఈ దశాబ్ది పూర్వరంగం పరిస్థితులను కూడా స్థూలంగా, సూచనప్రాయంగా తెలుసుకోవడం ఈ దశాబ్ది రూపరేఖల మార్పుల అవగాహనకు బాగా తోడ్పడు తుంది తెలుగుదేశంలో అత్యంత ప్రాచుర్యమైన అమ్మకాలు గల రచయిత్రి శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి నవలలకు రూపం అంటే వస్తుపరిమాణం ఏమీ బాధకం కాదులా ఉంది! రెండు సంపుటాలు, మూడు సంపుటాలుగా కూడా ఆమె రచనలు ప్రియపాఠకులు చదువుతున్నారు కదిలేదీ కదిలించేదీ కవిత్వా నికి కావాలనుకుంటే చదివేదీ చదివించేదీ కావాలోయ్ నవలా ప్రాచుర్యానికి అంటున్నాయి శ్రీమతి సులోచనరాణి నవలలు. జీవనతరంగాలు, మీనా, పార్థు, ఇటీవలే వచ్చిన గిరిజా కల్యాణంకూడా, ఎమెస్కో సిరీస్‌లో వచ్చిన ఆరాధన వలెనే ఆరాధ్యాలైనాయి - చదువరులకు లేదా పాఠక పాఠకీ మణులకు. అందువల్ల వార, మాస, పక్షపత్రికలు ఆమెపట్ల పక్షపాతం వహించడం ఎంతమాత్రమూ అన్యాయం కాదు అమ్మాలోయ్, అమ్మించాలోయ్ అని కదా వాళ్ళ పరమార్థం! వేమనసూక్తి వాళ్ళకు బాగా తెలుసు పత్రికాధిపతులకున్నూ, సదరు సంపాదక మహాశయులకున్నూ 'పనిడిగలాని' ఇత్యాది లోకధర్మం తెలీకపోతే వాళ్ళు

పత్రికలు నడపటానికి పనికిరారు మొదలు చెడిన బేరమా? అలా తియ్యనీరు నవలలకి పారక చేపలను ఎక్కించటం నేరమా?!

ఈ దశాబ్ది నవలకి సంబంధించి రూప చర్చలో ఇంకో విలక్షణత ఏమంటే- మినీ కథలాగే మినీ నవల ఆవిర్భావం కూడా మాసిక నవలలు ఇప్పటి ఫాషన్‌లా వుంది ప్రతి మాసపత్రికా ఒక చిన్న నవలను పూర్తి నవల పేర ఇస్తూనే వుంది మిత్రులు శ్రీ మహీధర రామ్మోహనరావు గారు వీటినే కాటోలు కంగారు నవలలన్నది మా బాగా అన్నారు కంగారుని చూడండి. మర్కటాన్ని దాని కిశోరం కరచుకోవడంకన్నా ఇంచక్కా పొట్ట సంచిలోనే పెట్టుకుంటుంది కంగారు తన బిడ్డని ఈ పూర్తి నవలలు కూడా బాగా ఆకర్షకంగానే వుంటు న్నట్లున్నది ఒక సుప్రసిద్ధ దినపత్రిక సంస్థవారు ప్రతి నెలా ఒక చిన్న నవలను ప్రత్యేకంగా ప్రచురిస్తూనే వున్నారు విపులాచపృథ్వీ కదా! ఎవరి ప్రయత్నాలు వారివి ప్రయోగ చాతుర్యం ముఖ్యం అమ్మకాలకు

అయితే ఒక చిత్రమైన విషయం వుంది చైతన్య స్రవంతి, అస్తిత్వ వాదం, మనోవిశ్లేషణం, ప్రతీకాత్మక ప్రయోగాలు, అధివాస్తవిక వాదం వంటి ప్రయోగాల పట్ల, వస్తుశిల్ప నిర్వహణ పట్ల రచయితలకు ఆసక్తి కలుగుతున్నా, నవ్యత పట్ల మోజున్నూ కలుగుతున్నా ఈ దశాబ్దిలో కూడా చారిత్రక నవలలు వెలువడటం గమనించాల్సిన విషయం బ్రహ్మాండమైన అమ్మకపు ఆకర్షణలతో వెలువడే పంచరంగులు అనాలా లేక హరివిల్లువలె సప్తవర్ణ సంశోభితమైన అనాలా - ఒక మాసపత్రికా రాజంలో రుద్రమదేవి, ఆర్యచాణక్యుడు, బసవేశ్వ రుడు వంటి చారిత్రక నవలలు కూడా వెలువడ్డాయి చారిత్రక నవలలు వెలువడ కూడదని కాదు- తప్పకుండా చారిత్రక దృష్టి వుండాల్సిందే అయితే సంతోషిం చాల్సిన విషయం ఏమంటే- గోన గన్నారెడ్డి, హిమబిందు,అడవి శాంతిశ్రీ వంటి బాపిరాజు నవలల మాదిరిగానూ; మల్లారెడ్డి, ధూర్జటి వంటి నోరివారి నవలల మాదిరిగానూ కాకుండానూ ఈదశాబ్దిలో వచ్చిన చారిత్రకనవలలు కొంత కృశించి వుండటమే పత్రికలలో కూడా పేరు ప్రతిష్ఠలున్న రచయితల పెద్ద రచనలు సీరియల్‌గా ప్రచురిస్తే చదువుతూనే వున్నారు రాజు - మహిషి, ప్రేమ - మనిషి - అనే అసంపూర్ణమైన పెద్ద నవల ఈ కోవకి చెందింది ఒక మాసపత్రికలో ఇది సీరియల్‌గా బహుకాలం వెలువడ్డా 1971 లో పుస్తక రూపాన వచ్చింది

విషయమూ, విన్యాసమూ, రచనా కూడా కొత్త తరహాలో నడిచింది ఈ నవలా విర్భావం ఆధునిక సాహిత్యంలో ఇదొక క్లాసిక్ అంటున్నారు శ్రీశ్రీ ఇలాంటి నవలలను చదివినప్పుడు, ఇవి చదివించినప్పుడూ, నవలా రూపం ఈ యీ లక్షణ సమన్వితంగా వుండాలని చెప్పటంలోనూ, నిబంధించడంలోనూ అనేకమైన చిక్కులు ఎదురవుతాయి ధనికొండ హనుమంతరావు రాసిన గుడ్డివాడు అనే నవల ఇరవైనాలుగు గంటల కాలిక వ్యవధిలో తన ఇతివృత్త శరీరాన్ని సాక్షాత్కరింప చేస్తుందని గుర్తు ఇది పెద్ద నవలే అయినా చదివిస్తుంది ఫ్లాష్‌బాక్ పద్ధతిలో నడిచిన నవల అలాగే గంగినేని వెంకటేశ్వరావు నవల పాము - నిచ్చెన చదునుగా కథాకథన పద్ధతిలో సాగదు లేఖా రూపంలో వుంది. అయినా చదివిస్తుంది ఉప్పల లక్ష్మణరావు రచన అతడు - ఆమె దినచర్యా లేఖనం లేదా దినచర్యా ప్రకటన రూపంలో వుంది. అయినా రోచకంగా చదివిస్తుంది తెలుగులో ఈ వందేళ్ళలోనూ వచ్చిన గొప్పవైన పది నవలల్లోనూ నిస్సందేహంగా వొకటి ఇది

చంఘిజ్‌ఖాన్ సామాజిక చారిత్రక నవల సమకాలీన సామాజిక సంఘర్షణాత్మక చరిత్రను పాతకాలపు చారిత్రక పరిణామాల ఆకృతిలో వ్యాఖ్యానించటం పూర్తిగా వైదేశిక వాతావరణమూ, ఇతివృత్త రంగస్థల ప్రకృతి వర్ణనలూ సాఫీగా చదువుకొని పోవడంలో కొంత చిక్కు కలిగించినా, ఆ పేర్లు గుర్తుంచుకోవడం కూడా కష్టమే అయినా, చంఘిజ్‌ఖాన్ గొప్ప నవల అతడు - ఆమె, చంఘిజ్‌ఖాన్ ఈ దశాబ్దిలో వచ్చిన నవలలు కాకపోయినా, ఈ దశాబ్దిలో అవి మలిముద్రణలు పొందాయి అతడు - ఆమె నవలలో మూడో భాగం ఈ దశాబ్దిలోనే వెలువడింది కూడాను కాబట్టి ప్రతిభావంతుడైన, శిల్ప రహస్యం తెలిసిన రచయిత వూనుకుంటే నవల రూపం ఇదమిత్థంగా మాత్రమే గొప్పగా నిర్వహించగలడు అనేమీ లేదు పరిమాణం విషయంలో కూడా కచ్చితమైన పట్టింపు లేదు. మహీధర నవలలు చిన్నవీ పెద్దవీ కూడా వున్నాయి ఆయన నవలలన్నీ కథాకథనాత్మకాలే కాని, నాటకీయాలు, సంవాదాత్మకాలూ, ప్రాయోగికాలూ కావు అయినా ఆలోచనా ప్రేరకాలైన నవలలు చదివే పాఠకులు ఆ నవలలను ఆదరిస్తూనే ఉన్నారు

తుమ్మలపల్లి రామలింగేశ్వరావు అనే రచయిత నవలా రచయితగా ఎక్కువ ప్రసిద్ధుడు కాడేమో! మామూలు పత్రికాపాఠకులకు ఆయన పరిచితుడు

కాడు ఆయన ఈ దశాబ్దంలో పది నవలలదాకా రాశాడు. ఏడెనిమిది అచ్చై నాయి కూడా ధర్మ నిర్ణయం అనే నవల 1970 లో వచ్చింది. ఇది వొక విలక్షణమైన నవల రెండు మూడు తరాల క్రితం తెలుగుదేశంలో ప్రచురంగా వుండే సాంఘిక స్థితిగతులను గూర్చి చెపుతున్నది అయితే ఆ సాంఘిక వాతావరణం ముఖ్యంగా అగ్రవర్ణాలవారి విశ్వాసాలకు, సంప్రదాయాలకు సంబంధించినది

ఈ దశబ్ది నవలలలోనే చెప్పుకోదగిన ఇంకొక నవల జీవనయాత్ర. రచయిత గోగినేని రాధాకృష్ణమూర్తి జి. ఆర్. కృష్ణ పేరుతో ఈ నవల ప్రచురితమైంది జీన్‌పాల్ సార్త్రే ప్రవచించిన అస్తిత్వవాదం నా నవలకు ప్రేరకం అంటాడీయన స్వీయ జీవితానుభవాలను, అనుభూతులను అక్షర రూపంలో ఆవిష్కరించా నంటాడీయన అయితే ఇలాటి రచనలలోనూ సృజనాత్మకత పాలు వుండక తప్పదనుకోండి సమకాలీన రాజకీయాల వ్యక్తులు ఇందులో పాత్రులు కావడం ఒక విశేషం.

చీకటిరోజులు అనే నవల అంపశయ్య రచయితగా ప్రసిద్ధుడైన నవీన్ రాసింది ఇటీవలి ఎమర్జన్సీ ఘాతుకాలను చిత్రించేది ఉత్తమ పురుషులలో సాగుతుంది అభిరుచిగల పాఠకులు మంచి నవల అన్నారు

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు రాసిన చారిత్రక నవలలు తిక్కన సోమయాజి, తాళ్ళపాక అన్నమాచార్యులు, పోతనామాత్యుడు మొదలైనవి. వీటి నాయన ఐతిహాసిక నవల లన్నాడు రచనలో సాఫీగా సాగే కథా కథనాత్మక పద్ధతినే ఆయన అనుసరించాడు

నాకు తెలిసినంతవరకు ఈ దశాబ్దిలో తెలుగు నవల రూపశిల్పానికి సంబంధించి విలక్షణ ప్రయోగాలు ఏవీ జరగలేదు ఇతివృత్తంలోగాని, రచనా శిల్పంలోగాని కొట్టవచ్చినట్లు కనబడే ప్రయత్నం జరిగినట్లు కాని, పాఠకులను ఆకర్షించినట్లు కానీ కన్పడదు మంచి నవల అంటే మనుషులనుగూర్చి రాసిందీ, తనదైన ఒక దృక్పథమంటూ ప్రతిబింబించేదీ అని ఒక విమర్శకుడన్నాడు దీనితో ఏకీభవించనివారెవరైనా ఉంటారా? ఉండరనే అనుకొంటాను

(అభ్యుదయ - 1980)

# వాడుకభాషా ఉద్యమం – పూర్వాపరాలు

కిందటి శతాబ్ది ఉత్తరార్ధం ప్రారంభానికే తెలుగు పత్రికలు కొన్ని బయలుదేరడంవల్ల వచన రచనలకు ప్రాముఖ్యం కలిగింది. మతం, సాహిత్యం, సామాజిక విషయాలు రాయడానికి తగిన భాషా శైలిని రూపొందించుకోవలసిన అవసరం ఏర్పడింది. 1862 వ సంవత్సరంలో సామినేని ముద్దు నరసింహులు నాయుడుగారు 'హితసూచని'ని ప్రకటించారు. సామాజిక సమస్యలన్నిటినీ చర్చించే వ్యాస సంపుటం హితసూచని నాడు సంఘంలో ప్రచురంగా కనపడుతున్న సర్వ దురాచారాలను గూర్చి, దుష్టమైన విశ్వాసాలను గూర్చి, మతం పేరిట, కులం పేరిట సాంఘిక జీవితాన్ని కలుషితం చేస్తున్న, యాతనామయం చేస్తున్న పరిస్థితులను గూర్చి ముద్దు నరసింహులు నాయుడు వివేచనతో ఎన్నో విషయాలు రాశారు. ఈయన రాసిన వ్యాసాలు వీరేశలింగాన్ని కూడా ప్రభావితం చేశాయి ఈ సమస్యలపైనే ఈయన అభిప్రాయాలను వీరేశలింగం కూడా బలపరచాడు. కేవలం పండితుల ఆమోదం కోసం కాకుండా – నిజానికి సాంఘిక విషయాలలో పురోగమన భావాలను వాళ్ళెప్పుడూ ఆమోదించరు: అధిక సంఖ్యాకులైన ప్రజలకోసం హితసూచని ఉద్దేశితమైంది కాబట్టి ముద్దు నరసింహులు నాయుడు వాడుక భాషలోనే రాయడానికి పూనుకున్నాడు. వాడుక భాష అని తన రచనా శైలిని గూర్చి ఆయన చెప్పుకోకపోయినా 'సాధారణమయిన భాషయందు వాడుకలోనున్న గ్రామ్యపదములు చాలామట్టుకు సరసమైన వాక్య రచనలో నంగీకరించ తగినవిగా నేను ఎంచుకుంటున్నాను' అన్నాడాయన.

ఇంతకన్నా కూడా ఆరు సంవత్సరాలకు పూర్వమే ఉర్దూనుంచి చార్ దర్వీష్ కథలను అనువదించి ప్రకటించిన ఎర్రమిల్లి మల్లికార్జునుడు ". స్త్రీ పురుషులు ఒకరితో నొకరు మాటలాడునట్లు సులభముగా అర్థమయ్యేలాగున సంక్షేపముగా. " రచిస్తున్నా నీ గ్రంథమంటూ ప్రకటించారు అంటే

చిన్నయసూరి నీతిచంద్రికకు ముందు పాండిత్య ప్రదర్శకమైన శైలిపట్ల ఎవంకీ వ్యామోహం ఉండేది కాదని ఇందువల్ల తెలుస్తున్నది

'హితసూచని' వెలువడిన పది సంవత్సరాలకు, అంటే 1872 వ సంవత్సరంలో బందరు నుంచి ఆనాడు వెలువడుతున్న పురుషార్థ ప్రదాయిని పత్రికలో "ఆంధ్రము నందుఁడ వలసిన అత్యములైన విషయములు" అనే సంపాదకీయంలో తెలుగులో సులభమైన వచన శైలితో ప్రపంచ విజ్ఞాన విషయాలన్నీ వెలువడ వలసిన అగత్యాన్ని నొక్కి చెప్పడం జరిగింది ప్రజల విజ్ఞానాభివృద్ధి కోసం వ్యవసాయ విజ్ఞానం, చేతిపనులు, వర్తక వాణిజ్యాలు, కథలు - గాథలు, ప్రకృతి శాస్త్రవిజ్ఞానం, దేశచరిత్ర, జీవిత చరిత్రలు - ప్రతి ఒక్కరూ చదివి తెలుసుకోగల శైలిలో తెలుగులో పుస్తకాలు వెలువడాలి అని పురుషార్థ ప్రదాయిని ప్రబోధించింది

పురుషార్థ ప్రదాయిని ఈ విషయాలు రాసి నూట ఎనిమిది సంవత్సరాలు గడిచినా తెలుగులో నవీన విజ్ఞానమూ, అధిక సంఖ్యాకులకర్థమయ్యే సులభశైలీ నేటికి దూరతీరాలుగానే ఉన్నాయి.

1872 వ సంవత్సరంలోనే అంటే నూట ఎనిమిది సంవత్సరాల కిందట ఆనాటి అత్యున్నత న్యాయస్థానమైన ప్రీవీ కౌన్సిల్ - భారత దేశంలో న్యాయస్థానాల వాదవివాదాల తుదితీర్పు విషయంలో కూడా ఇచ్చిన తీర్పులను పదకి తిరుమలరావు గారనే వారు తెలుగులో ప్రచురించారు పుస్తకరూపంగా ఈ తిరుమలరావుగారానాడు బళ్ళారిలో న్యాయశాఖ సంబంధమైన కోర్టు మున్సిఫ్ ఉద్యోగం నిర్వహిస్తూ ఉండేవారు ఈ తీర్పుల సంగ్రహం ముందుమాటలో ఆయన 'దీన్ని వాడుకలో నుండే సులభమైన తెలుగుభాషలో సిద్ధపరచియున్నాను' అని రాసుకున్నారు కాబట్టి వాడుకలో ఉన్న తెలుగు భాషలోనే ఇటువంటి గ్రంథాలుండాలన్న విషయాన్ని నూరేళ్ళ కిందటే బుద్ధిమంతులు గ్రహించారని విశదమవుతున్నది

1857 తర్వాత భారతదేశంలో మూడు విశ్వవిద్యాలయాల స్థాపన జరగడమూ, ఆంగ్లభాషా మాధ్యం ద్వారా శాస్త్రీయ విజ్ఞానమూ, మానవీయ విజ్ఞానమూ, కళలూ, సాహిత్యం అధ్యయనం జరగడమూ మనకు తెలిసిన విషయమే

ఈ శతాబ్దపు మొదటి దశకంలో అప్పటి గవర్నర్ జెనరల్తైన కర్జన్ దేశంలో అన్ని స్థాయులలోనూ విద్యారంగంలోని సమస్యలను గూర్చి చర్చించి తగిన నిర్ణయాలు చేయడానికి విద్యా విషయిక సదస్సు నొక దానిని ఏర్పాటు చేశాడు ఈ సదస్సు 1901లోని జరిగింది అఖిల భారత స్థాయిన పదిహేను రోజులపాటు సిమ్లాలో ఈ సదస్సు జరిగింది. వందల సంఖ్యలో విద్యావేత్తలు పాల్గొన్నారు నూటయాభై తీర్మానాలు ఆమోదించడం జరిగింది సుమారు అర్ధ శతాబ్దంగా ఈ దేశంలో ఇంగ్లీషు మాధ్యం క్రమక్రమంగా విస్తరిస్తూ దృఢ పడుతూ వచ్చినా పట్టభద్రులైన దేశీయులు తమకు తెలిసిన విజ్ఞానాన్ని దేశ భాషల్లో ఎందుకు ప్రసారం చేయలేకపోతున్నారు అన్న మీమాంస ఎదురయింది ఈ సదస్సు వారికి. దేశభాషలు ఈ అర్ధ శతాబ్దంలో ఆశించినంతగా వృద్ధికి రాకపోగా, అనూహ్యమైన, నిరాశాజనకమైన పరిణామాలను కూడా చవిచూడ వలసి వచ్చింది దేశీయులయిన ఆంగ్లేయ విద్యాధికులు దేశభాషల్లో రచన చేయడానికి ముందుకు రాలేదు బ్రిటీష్ ప్రభుత్వం ఈ పరిణామాన్ని ఆశించ లేదు విశ్వవిద్యాలయాల నుంచి సామాజిక జీవనరంగంలోకి ప్రవేశించే విద్యాధి కుల ద్వారా నవీన విజ్ఞానం ప్రసారమవుతుందని విశ్వవిద్యాలయాలు స్థాపిస్తున్న సమయంలో ప్రభుత్వం ఆశించింది కాని అది జరగలేదు దీనికి కారణం దేశ భాషల్లో రచనచేయాలన్న ఆసక్తిగాని, స్తోమతగానీ విద్యావంతుల్లో లేకపోవడమే నని వేత్తలు గ్రహించగలిగారు అందువల్ల కళాశాల స్థాయిలో అనువాదమూ, వ్యాసరచనా కౌశలమూ పెంపొందించాలని నిశ్చయించడం జరిగింది.

తెలుగుదేశంలో పందొమ్మిది వందల అయిదు, ఆరు ప్రాంతాలలో విశాఖ పట్నం కేంద్ర స్థానంగా సర్కారు జిల్లాలన్నిటి పర్యవేక్షణాధికారం గల విద్యా విచారణాధికారిగా జె ఏ ఏట్సు అనే ఉన్నతోద్యోగి వుండేవాడు అంతకు పూర్వము ఆయన మద్రాసులోని పచ్చయ్యప్ప కళాశాల ప్రధానాధ్యాపకుడుగా కూడా కొన్నాళ్ళు పనిచేశారు అప్పుడు తమిళమూ, తెలుగూ నేర్చుకోవాలన్న కోర్కె ఆయనకు కలిగి వుండడం సహజమే తెలుగు జిల్లాల పాఠశాలల విద్యా విచారణాధికారిగా ఆయన నియుక్తుడయిన తర్వాత పాఠశాలల్లో తెలుగు నేర్పే విధానం పట్ల ఆయనకు ఆసక్తి కలగటంలో కూడా విశేషం లేదు పాఠశాల లను తనిఖీ చేస్తుండగా లౌకిక భాషకూ, విద్యార్థుల విద్యార్జన మాధ్యానికి బాగా వ్యత్యాసం వున్న విషయం ఆయన గ్రహించాడు. బోధన విషయం లోనూ,

పాఠ్యాంశ నిర్ణయంలోనూ తెలుగుకూ, ఇంగ్లీషుకు వున్న అంతరాన్ని కూడా ఆయన గ్రహించాడు ఈ జిజ్ఞాసను సమన్వయించే సమాధానం చెప్పగల విద్యా వేత్తకోసం ఆయన అన్వేషించాడు పి టి శ్రీనివాసయ్యంగారూ, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి ఆయనకి ఈ సందర్భంగా అక్కరకు వచ్చారు. ఉద్యమ రూపంలో వాడుకభాష ప్రాశస్త్యాన్ని గూర్చి తెలుగు దేశంలో ప్రచారం జరగడమూ, అది ఒక గొప్ప సంచలనానికి కారణం గావడమూ ఆ తర్వాత పరిణామాలు.

గురజాడ అప్పారావూ, గిడుగు రామమూర్తీ, మేధావులూ విద్యావేత్తలూ కాబట్టి ప్రభుత్వం వారి అభిప్రాయాలను గౌరవించింది ఫలితంగా 1910 లో వ్యావహారిక భాషోద్యమానికి విజయం కలిగింది. ఇంటర్మీడియట్ స్థాయి పాఠ్య పుస్తక నిర్ణయంలోనూ, విద్యార్థులు అనువాదం, వ్యాసరచనా విషయికంగా పాటించాల్సిన శైలి సంబంధంగానూ కొన్ని మార్పులు ప్రవేశపెట్టారు. దానితో భాషా విషయికంగా సంప్రదాయ పరినిష్ఠిత బుద్ధులూ, సదవగాహన లేనివారు పెద్ద ఆందోళన లేవదీశారు 1911 వ సంవత్సరంలో ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపనం జరిగింది తెలుగుదేశంలోని జమీందారులూ, ధనవంతులూ, సంస్థానాధి పతులూ, వాళ్ళను ఆశ్రయించి వున్న పండితులూ విద్యార్థులకు వ్యావహారిక భాషలో పరీక్షా పత్రాల సమాధానాలు రాయడానికి అనుజ్ఞ లభించడం దేశానికి, భాషకు అరిష్టం దాపురించడమేనని గగ్గోలు సృష్టించారు ఊరూరా వాడవాడా సభలు సమావేశాలు జరిపి ప్రభుత్వానికి మహజర్లు సమర్పించుకున్నారు అంత టితో విద్యాశాఖాధికారులు తాము జారీ చేసిన ఉత్తర్వులను, ఇచ్చిన అనుమతిని ఉపసంహరించుకోవలసి వచ్చింది ఇది 1914 వ సంవత్సరంలో జరిగింది ఆ మరుసటి సంవత్సరమే గురజాడ అప్పారావు స్వర్గస్థుడు కావడం జరిగింది. అయినా గిడుగు రామూర్తి దేశహితం కోసం, తెలుగు భాషా సారస్వత వికాసం కోసం తన సర్వశక్తి యుక్తులతో రంగంలోకి ప్రవేశించి, వితండవాదులైన పండితులతో హోరాహోరీ పోరాడాడు ఆయన మహామేధావీ,ప్రగతి కాముకుడూ, ద్రష్టా కాబట్టి క్రమక్రమంగా ఆయన వాదనలోని సబబును విజ్ఞులు గ్రహించ గలిగారు. తాతా సుబ్బరాయశాస్త్రి, పేరి కాశీనాథశాస్త్రి, వాసా సూర్యనారాయణ శాస్త్రి, బంకుపల్లి మల్లయ్యశాస్త్రి వంటి ఉద్దండ పండితులు రామమూర్తి పంతులు గారి వాదాన్ని సమర్థించారు. బాసటైనారు

వాడుక భాషా ఉద్యమాన్ని గూర్చిన ప్రస్తావన వచ్చినప్పుడు ఇటీవల ఈ వ్యాస రచయితతో మిత్రులు శ్రీ చాగంటి సోమయాజులు గారిలా అన్నారు: "విజయనగరంలో కొందరు మిత్రులతో వెళ్ళి శ్రీ రాయుడు శాస్త్రి గారిని దర్శించినప్పుడు, ఆయన వ్యావహారిక భాషోద్యమాన్ని గట్టిగా సమర్థించారు " వైయ్యాకరణ సార్వభౌములైన శ్రీ రాయుడు శాస్త్రిగారు సంస్కృత ప్రాకృత భాషా వికాసాన్ని, కాలిక పరిణామాలనూ లెస్సగా తెలిసినవారు కాబట్టీ, దర్శన శాస్త్రపారంగతులూ, ధర్మశాస్త్రవేత్తలూ కాబట్టీ, సాంఘిక పరిణామాలను గూర్చి, ధర్మ శాస్త్ర నిబంధనలలో అనివార్యమైన సవరణలను గూర్చి కూడా అభిభాషించారుట. మనుస్మృతికీ పరాశర స్మృతికీ అనేక అనేక విషయాలలో భిన్నతవున్నప్పుడు, ఒక ప్రాంతంలోని శిష్టాచారానికీ మరో ప్రాంతంలోని సంప్రదాయానికీ తేడా వున్నప్పుడు, ఒక శాఖవారి కట్టుబాటు ఇంకో శాఖ వారికి శిరోధార్యం కానప్పుడు, భాష ఈ విధంగానే ఉండాలి సర్వకాలికంగా అని శాసించడం అసంగతం అని గట్టిగా చెప్పారట శ్రీ రాయడుశాస్త్రిగారు అంతేకాకుండా సాహిత్య లక్షణం వుంటే చాలుననీ, రసనిష్యందిగా రచన వుంటే భాష ఏ విధంగా ఉన్నా పట్టించుకోవాల్సిన పనిలేదనీ కూడా హితం చెప్పారుట శ్రీ శాస్త్రిగారు శిష్టభాష శిరోధార్య మన్నదే వారి సిద్ధాంతం వఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారుకూడా రామ్మూర్తి పంతులుగారి వాదాన్ని బలపరచినవారే 'వ్యవహార వశమున భాషలు మారునపుడు వానిలో నాగరక వ్యవహారస్థ భాషను గ్రాంథిక భాషగా గ్రహించుట సకల ప్రామాణిక సమ్మతమయి యున్నది' అని 1913 వ సంవత్సరానికే కృష్ణాపత్రికలో వఝలవారు తమ అభిప్రాయాన్ని ప్రకటించారు.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు సమ్మతించడమే కాక రామమూర్తి పంతులుగారిని సమర్థించారు. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు రామ్మూర్తి పంతులుగారి అనుయాయి వర్గంలో ప్రముఖ స్థానాన్ని పొందారు అక్కిరాజు ఉమాకాంతంగారు వ్యావహారిక భాషోద్యమాన్ని సర్వాత్మనా ఆమోదించడమే కాక సర్వ రచనలూ వ్యావహారికంలోనే నిర్వహించారు సిద్ధాంత గ్రంథమైన నేటి కాలపు కవిత్వాన్ని కూడా ఆయన వ్యావహారికంలోనే రాయడం గమనార్హం పల్నాటి వీరచరిత్రకు ఉమాకాంత విద్యా శేఖరులు రాసిన పీఠికను మల్లంపల్లి వారెంతగానో మెచ్చుకొన్నారు శైలీవిషయికంగా కూడా.

అస్సలు వ్యావహారిక భాషోద్యమాన్ని రామ్మూర్తి పంతులు ప్రవర్తింప చేయడానికి కారణం కుహనా పండితుల ఆభాసవాదమున్నూ, కూటకరణ గ్రంథ పరిష్కరణమున్నూ. చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రాలకు వ్యతిరిక్తంగా ప్రాచీన కావ్యాలలో ఏదైనా ప్రయోగం కనపడితే ఆ ప్రయోగాన్ని దిద్దడానికి పరిష్కర్తలు వెనుదీసేవాళ్ళు కారు భారతాన్ని దిద్ది బగ్గంపాడు చేశారని చెళ్ళ పిళ్ళవారు పండితమ్మన్యులను నిరసించారు దీన్నే కూటకరణం అన్నారు రామ మూర్తి పంతులుగారు వేదం వెంకట్రాయశాస్త్రిగారు, రాయదుర్గం నరసయ్య శాస్త్రిగారు, ఇంకా ఇలాంటి పాతకాలపు పండితులు తాటాకు కావ్యాలను అచ్చులోకి తెచ్చేటప్పుడు భ్రాంతి మూలకమైన పరిష్కరణలు కొన్ని చేసినట్లు రామమూర్తి పంతులుగారు రుజావు చేశారు వేదం వెంకట్రాయశాస్త్రిగారు కొక్కొండ వెంకట రత్నంగారి గ్రంథాల నుంచి వేల అప్రయోగాలు, లక్షణ విరుద్ధాలు చూపారు. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు నన్నయ్యగారినే వదిలిపెట్టలేదు. నన్నయ్యగారు వేలకువేలు సంకర సమాసాలు, దుష్టప్రయోగాలూ చేసినట్లు ఆక్షేపించారుట అందువల్ల రామ్మూర్తి పంతులుగారు పాతకాలపు పండితులను గట్టిగా మంద లించవలసి వచ్చింది లోకంలో ఆయా కాలాలలో కవులంతా శిష్టభాషను ఆద రిస్తూనే వచ్చారని ఆయన నిరూపించారు.

ఇంకా "శిష్టపద వ్యవహారమందున్న భాష అఖిలలోకోపకార మయినది. గ్రంథములు రచించడమునకు చిరకాలమమయి పండితులు వాడుతున్నారు అది అపరిమిత ప్రయోజనమైనది అ పరిహార్యము దానిని నిరసించగూడదు దానిని అవలంబించడం నత్సంప్రదాయమునకు విరుద్ధముకాదు"అని సిద్ధాంతీకరిస్తూ 'పాత తాటాకు అంచు తగిలితే మీరు ఎరువు తెచ్చుకున్న వజ్రాయుధము వెయ్యి ముక్క లయి పోతుంది' అని శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారిని హెచ్చరించారు కవులు పరస్పరం వారి వారి రచనలలో అప ప్రయోగాలని నిందించిన వాటిని వారి వారి స్వీయ రచనలలోనే చూపారు పానుగంటి, చిలకమర్తి, శ్రీపాద వంటి వారికే గ్రాంథికాంధ్రం సరిగా వంటబట్టనప్పుడు, పాఠశాలల్లోనూ కళాశాలల్లోనూ గ్రాంథి కాంధ్రం నిర్బంధంగా నేర్పడం ఏమి సబబని రామమూర్తి పంతులు ప్రశ్నించారు.

"భాష అనగా లౌకిక భాష. లోకులు అనగా శిష్టులు. లౌకిక శబ్దాలు అనగా శిష్ట సంఘములో నలుగురికీ తెలిసే మాటలు. తెలియడమనగా చెవిని పడ

గానే మనస్సులో అర్థము స్ఫురించదము" అని పసుపుర్తి కృష్ణమూర్తిగారి గృహ లక్ష్మి కంఠాభరణానికి పీఠిక రాస్తూ రామ్మూర్తి పంతులుగారు పేర్కొన్నారు

"కావల్సివస్తే పద్యకావ్యాలను మీ ఇష్టం వచ్చిన ధోరణిలో రాసుకోండి గాని వచన రచనాభివృద్ధికి మీ వ్యాకరణ సూత్రాలు కొరగావు' అని వదే పదే చెప్పారు రామ్మూర్తిగారు

"ఏ దేశమందైనా శిష్టులు వాడే భాష దేశభాషగా అంగీకరిస్తారు పతంజలి మహాభాష్యములో అలాగుననే చెప్పినాడు వ్యవహార భ్రష్టమయిన పాత మాటలు కావ్యాలలో వాడగూడదని తిక్కన చెప్పినాడు ఆంధ్ర మండల మందు వ్యవహారములన్నీ దేశభాషలోనే జరగవలెను. అందుకు శిష్టులు నేడు వాడే భాష ఉపచరిస్తుందిగాని గ్రాంథిక భాష ఉపచరించదు" అని 1935వ సంవత్సరం ఏప్రిల్ నెలలో రామమూర్తి పంతులుగారు చంద్రిక పత్రికలో తమ అభిప్రాయాన్ని తెలిపారు.

1940వ సంవత్సరం మార్చి - జూన్ నెలల ఆంధ్ర గ్రంథాలయం సంచికలో పంతులుగారిలా హితవు చెప్పారు·

"రెండు కోట్ల డెబ్బై లక్షల మంది ఆంధ్రులను విద్యావంతులను చేయడానికి నా మతము అంగీకరించేటట్లయితే ఒక మాసము రోజులలో సాధ్యమవుతుంది ముందుగా వ్యావహారిక భాషలో మీ కరపత్రాలన్నిటిని అచ్చొత్తించండి. ఆ తరువాత తెలుగు అక్షరాలూ గుణింతమూ ప్రతివాడికీ నేర్పడానికి గ్రామానికొక ప్రచారకుణ్ని ఏర్పాటు చేయండి అక్షరాలూ గుణింతమూ మామూలు తెలివితేటలుగల వాడు నేర్చుకోవడానికి వారం పది రోజులకన్నా ఎక్కువ పట్టదు ఎప్పుడయితే అక్షరాలూ గుణింతమూ తెలిసిందో ఆ క్షణం నుంచీ మీ కరపత్రాలు మొదలయినవి చదువుకో గలుగుతాడు ఇంతకన్నా దేశములో విద్య వ్యాపింప చేయడానికి సులభ మార్గము లేదు మీరీ పనికి పూనుకోవలెను ఈ విధముగా బాల్కను రాష్ట్రాలలో యుద్ధము అయిపోయిన తర్వాత చేసినారు నేను ఆ విషయమంతా చదివాను. బాల్కను రాష్ట్రాలలో ఆరు మాసాలలో విద్యాశూన్యత అంతా తొలగిపోయింది" అని రామమూర్తి పంతులుగారు వయోజన విద్యా ప్రచారకులను, గ్రంథాలయోద్యమ కార్యకర్తలను ప్రబోధించారు.

ఇంచుమించుగా మూడు దశాబ్దాల పాటు వ్యావహారిక భాషోద్యమం కోసం రామమూర్తి పంతులుగారు శ్రమించారు

అసలింతకూ గ్రాంథిక భాష అంటే ఏమిటి? వాడుక భాష అంటే ఏమిటి? వీటికి పరస్పర వైరుధ్యం ఏమిటి? అని విచికిత్స మనకు కలగవచ్చు. గ్రాంథిక భాష, వ్యావహారిక భాష అనేవి వేరువేరు భాషలు కావు. వేరువేరు శైలులు అస్సలీ వివాదం ఎందుకు తల యెత్తిందంటే చిన్నయ్యసూరి బాల వ్యాకరణం కావ్య భాషనంతా శాసిస్తున్నదనీ, శాసిస్తుందనీ, శాసించాలని భ్రమపడడంవల్ల చిన్నయ్యసూరిగారామాట చెప్పనేలేదు. అలా అభిప్రాయపడనూలేదు కొందరు పండితుల భ్రాంతి మూలకమైన అభిప్రాయాలవల్ల చిన్నయ్యసూరిగారి వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగాలన్నీ దోషాలని వాదించారు

"తెలుగుకి సమగ్రమైన వ్యాకరణం లేదు. ఉన్న కొద్దిపాటి వ్యాకరణాలు కొంత వుపకారం చేయకపోలేదు గాని వుపకారం కంటె అపకారాన్నే యెక్కువగా చేశాయని నా బుద్ధికి తోస్తుంది చిన్నయ్యసూరి వ్యాకరణం వ్రాస్తూ తన కాలం నాటికి మహా ప్రసిద్ధులుగా వుండే శ్రీనాథ మహాకవిని గాని, పిల్లలమర్రినిగాని, తుదకు కవిబ్రహ్మ సోమయాజినిగాని, నాచన సోముణ్నిగాని, భట్టుమూర్తినిగాని బాగా పరిశీలించలేదని అతని తీర్మానాలవల్ల స్పష్టపడుతుంది" ఈ మాటలన్నది ఎవరో కాదు- కవనార్థమేవుదయించానని చెప్పుకొన్న చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు అన్నారు.

"తెలుగు భాషకు వ్యాకరణాలు నామమాత్రాలనిన్నీ మహాకవి ప్రయోగాలే ముఖ్యాధారాలనిన్నీ మొదటినుంచీ నా వాదం."

"లోకంలో పుట్టి లోకంలో పెరిగి లోక మర్యాదలను అతిక్రమించడానికి ఎవరికీ శక్యం కాదు గదా? ఒకవేళ అతిక్రమించి కవిత్వాన్ని నడిపిస్తేనో? అది యీ లోకానికి మట్టుకు పనికిరాదని ఖండితంగా చెప్పవచ్చును లోకాంతరస్థుల కోసం రచించామంటే 'కానివ్వండి అలాగయితే' అని సమ్మతించడమే కర్తవ్యం"

"మూడో నాలుగో అంగుళాలలో యిమిడిన తెలుగు వ్యాకరణానికి"

"జ్ఞాన లవదుర్విదగ్ధుల దిద్దుబాట్లను పుచ్చుకొని పూర్వపాఠాలను వదులుకోవడం యెంత శోచ్యమో ఆలోచించండి"

"బాగా ఆలోచిస్తే శాస్త్రజ్ఞానం కంటే ప్రయోగ విజ్ఞానమే కవికి ముఖ్యం."

"కనక కవికి నూటికి తొంభై వంతులు లక్ష్య జ్ఞానమున్నూ తక్కిన పది వంతులు లక్షణ జ్ఞానమున్నూ వుండడం ఆవశ్యకమని చెప్పక తప్పదు."

అని నెత్తిన నోరు పెట్టుకొని మరీ మరీ చెప్పారు చెళ్ళపిళ్ళవారు. సరిగ్గా రామమూర్తి పంతులుగారు బోధించింది ఇదే లౌకిక భాష కావాలా? అలౌకిక భాష కావాలా? ప్రజాస్వామ్యానికి విద్య విజ్ఞానం, విచక్షణ కలిగించడానికి లౌకిక భాషే ఉపయోగకారి అందువల్ల శిష్టుల భాషని విజ్ఞాన వాహికగా మనం స్వీకరించాలి అన్ని దేశాలలోనూ, అన్ని కాలాలలోనూ ఈ సంప్రదాయాన్ని ఎవరూ నిరసించరు నిరసించకూడదు అని రామమూర్తిగారు ప్రబోధించారు.

ఇక్కడ ఒక విషయం చెప్పాలి ఉగ్రవ్యావహారిక వాదులు 'శిష్టభాష' అనే భావాన్ని కూడా ఈసడిస్తే తప్ప తమ అతి అభ్యుదయ ధోరణి వెల్లడి కాదనుకుంటారు. ఇది అవిచారమూలకం రవీంద్రనాథటాగూరు వాడుక భాషను చలిత్ భాష అనీ, ఇంకా ఆయనకు ఏభై సంవత్సరాలకు ముందే ఈశ్వరచంద్ర సాగరుడివంటి మహా పండితులు సాధుభాష అనీ వ్యవహరించారు అంతేకాని, రామ్మూర్తి పంతులు శిష్ట వ్యావహారికమంటే, శిష్టు లెవరు? అని విపరీత ధోరణి ప్రదర్శించాల్సిన పనిలేదు శిష్ట వ్యావహారికం కూడా ఒక పరిభాషా పదం. ఇంకొక విషయం ఏమంటే, భిన్న ప్రాంతాల ప్రజాసామాన్యపు నుడికారం పరస్పరం అర్థావబోధకు అడ్డు వస్తుంది కాబట్టి, వాడుక భాషని మేమభిమానించలేం అంటారు కొందరు ఇది సరిఅయిన అవగాహన కాదు సృజనాత్మక రచనల విషయంలో రసావిష్కరణం కోసం, వాస్తవికత కోసం ప్రాంతీయ నుడికారాన్ని రచయితలు వినియోగించుకుంటే అందువల్ల చిత్తూరు మాండలికం శ్రీకాకుళంలో అర్థం కాదనడం, ఆదిలాబాదు జననుడి అనంతపురంలో అర్థం కాదనడం వాదసహం కాదు రసమహితంగా వుంటే అదే అర్థమవుతుంది ఈ వాదాలన్నీ చర్విత చర్వణాలైపోయి చాలాకాలం కూడా గడిచిపోయింది భిన్న ప్రాంతాలమధ్య ఇప్పుడు రాకపోకలు బాగా యెక్కువైనాయి అందువల్ల క్రమక్రమంగా సార్వమాండలిక ప్రామాణిక భాషాశైలి ఒకటి రూపొందే అవకాశం మరింత దగ్గరైంది.

వాడుకభాషలో ప్రామాణికత కోసం ఎవరూ పనిగట్టుకొని వ్యాకరణం రచించాల్సిన పనిలేదు జీవద్భాషకు వ్యాకరణం ఎప్పుడూ పరిమిత ప్రయోజనాన్ని మాత్రమే సిద్ధింప చేయగలదు భాష అనేక ముఖాల వికసిస్తే తప్ప అనంతమైన విజ్ఞాన వాహిక కాలేదు అట్లా అని వాడుక భాష రూపరేఖలను, లక్షణాలను సూత్రితం చెయకూడదని కాదు, చేయవచ్చు అయినా ఎప్పటి కప్పుడు ప్రజల వ్యవహారాన్ని స్వీకరిస్తూ సేకరిస్తూ ఉండాలి. వాడుకభాష రచనకు కొన్ని నియమాలంటూ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు వ్యావహారిక భాష లక్షణాలను విశ్లేషించి చూపడానికి ప్రయత్నించారు దానికి రామమూర్తి పంతులుగారు పీఠికరాస్తూ వాడుకభాషకి అనుశాసనం అనవసరం అన్న అభిప్రాయాన్ని ప్రకటించారు పదకోశాలూ, వ్యాకరణమూ సార్వకాలికంగా సవరించుకొంటూ ఉండవలసిందే వ్యావహారిక భాషా నిఘంటువును కూర్చాలని పిఠాపుర సంస్థాన విద్వత్కవులైన రామకృష్ణ కవులాశించారు. కాని ఈ నిఘంటువు సమగ్రంగా రూపుదాల్చిందో లేదో తెలియదు ప్రయత్నం మాత్రం జరిగింది సుమారు పాతిక ముప్పై సంవత్సరాల కిందట అయల సోమయాజుల నరసింహశర్మగారు వ్యవహారవేదిక పేరుతో భారతిలో వాడుకభాషకి వ్యాకరణం సమకూర్చే ప్రయత్నానికి పూనుకొన్నారు కాని ఇది కూడా ముందుకు సాగినట్లు లేదు తరువాత ఇటీవలి కాలంలో కూడా వ్యావహారిక భాషకు వ్యాకరణం రచించే దీక్షితులు కొందరు పూనుకొని కృతకృత్యులమైనా మనుకొన్నారు కాని దానివల్ల ఏం ప్రయోజనం ఒనగూరిందో నవీనభాషా శాస్త్రులే చెప్పాలి ఈ శతాబ్దంలో మూడుపంతులు గడిచిపోయి డెబ్భై సంవత్సరాల కిందటే స్పష్టంగా సిద్ధాంతితమైన వ్యావహారిక భాష ప్రయోజనాన్నిగూర్చి, అపరిహార్యతను గూర్చి ఇంకా వాదులాడడం నిరర్థకం నిరుపయోగం. నిష్ఫలం అవివేకం

(అభ్యుదయ - 1980)

# నవలారచన – పాత్రపోషణ

ఆధునిక సాహిత్యంలో నవలకున్నంత ఆకర్షణ మరే ఇతర ప్రక్రియకూ లేదేమో ననిపిస్తుంది జీవితాన్ని నవల ప్రతిబింబింప చేసినంతగా మరి ఇతర ప్రక్రియలు చేయలేవు నవల సమగ్ర ప్రక్రియ మానవజీవితాన్ని వాస్తవికంగా యథాతథంగా ప్రతిబింబిస్తూనే సాహిత్య శిల్పాన్ని కూడా ప్రదర్శించడానికి అనువైన ప్రక్రియ కవితలోని భావోద్విగ్నత, నాటకంలోని సంఘర్షణ దఘ్నత నవలలో ప్రదర్శించవచ్చు. సాహిత్య ప్రక్రియలన్నిటిలోకీ సామాన్య పాఠకుడికి చేరువైన ప్రక్రియ నవలే. కాబట్టే ఇవాళ నవలకున్నంత ప్రాచుర్యం తెలుగునాట మరే ఇతర ప్రక్రియకూ లేదనాల్సి వస్తున్నది

శరీరంలో ఎంత జవసత్త్వాలున్నా వెన్నెముక దృఢంగా నిటారుగా లేకపోతే ఆ శరీర సౌష్ఠవం శోభించనట్లే పాత్రపోషణ నేర్పుగా నిర్వహించకపోతే ఆ నవల ఆశించిన ప్రయోజనాన్ని కాని సాహిత్యంలో సముచితమైన స్థానాన్ని కాని పొందలేదు.

ఆదినుంచి అంతంవరకు ఇతివృత్త వికాసాన్ని నిర్వహించేది పాత్రలే ఆయా పాత్రల కదలికలవల్లనే కథా నిర్వహణం సాగుతుంది ప్రాయోగిక నవలల్లో సైతం పాత్ర విన్యాసంలేకుండా కథ సాగదు శరీరానికి కరచరణాద్యవయవాల వలె నవలకు పాత్రలు సమగ్రాకృతిని కూరుస్తాయి ఒకే ఒక పాత్ర స్వగతంగానో, ప్రయోగాత్మకంగా ఒక సన్నివేశ ప్రాబల్యంవల్ల ఒక కాలిక పరిమితిలో బహిరంతర సంఘర్షణల, సంచలనాల స్వరూపంగానో నవలను చిత్రించవలసి వచ్చినా పాత్ర చిత్రణం తప్పదు సంఘంలో మనుష్యుల ఉనికి వలెనే నవలలో పాత్రల మనికి తప్పనిసరి

నవలా రచయిత ఏ ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని రచన సాగిస్తాడో, ఏ విధంగా కథా పర్యవసానాన్ని ఊహిస్తాడో దానికనుగుణంగా పాత్రల స్వరూప స్వభావాలు రూపొందించి, ఆయా పాత్రలను ఇతివృత్త రంగస్థలంలో

ప్రవర్తింపజేస్తాడు ప్రతిభావంతుడైన రచయిత తన పాత్రల ఉదయాస్తమయాలలో ఒక పొందిక, ఒక అవిరోధత, ఒక సమన్వయత సాధిస్తాడు. పాత్రలు కథలో మొదటిసారిగా ప్రవేశించి చివరన నిష్క్రమించే వ్యవధిలో వాటి స్వరూప స్వభావాల వ్యక్తీకరణలో అవిశ్వసనీయత, అవాస్తవికత వుండకూడదు. అంటే- ఏ ప్రయోజనాన్ని ఉద్దేశించి ఆ పాత్రల సృష్టి జరిగిందో ఏ సన్నివేశ కల్పన కోసం వీటిని ప్రవేశ పెట్టడం జరిగిందో అందుకు అనుగుణంగానే నిర్వహణం కూడా జరగాలి లేకపోతే ఆ నవల విఫలమవుతుంది

సాహిత్యంలోని కొన్ని పాత్రలు సజీవమూర్తులుగా తరతరాలకూ సాక్షాత్కరిస్తూనే వుంటాయి. అవి ప్రతిభావంతుడైన రచయిత లేఖిని ద్వారా అమరత్వాన్ని పొందుతున్నాయన్నమాట. గురజాడ గిరీశం వేదం వారి పేరిగాడు, పానుగంటి వారి జంఘాలశాస్త్రి (సాక్షి), చిలకమర్తి గణపతి, మొక్కపాటివారి పార్వతీశం, మునిమాణిక్యం కాంతం ముళ్ళపూడి బుడుగు - ఇటువంటి పాత్రలన్నమాట

తెలుగు నవలా చరిత్రలో ఈ విధంగా విలక్షణమైన విశిష్టమైన ప్రాతినిధ్యం వహించగల పాత్రలు చాలా తక్కువగానే కనపడతాయి మొట్టమొదటి తెలుగు నవల రాజశేఖర చరిత్రమే ననాలి రాజశేఖర చరిత్రంకన్నా కూడా ఆరు సంవత్సరాల ముందే శ్రీరంగరాజ చరిత్రమనే నవల రాయడానికి నరహరి గోపాలకృష్ణమ్మశెట్టి అనే ఆనాటి ప్రభుత్వోద్యోగి ఒకరు పూనుకొన్నా, అందులో చారిత్రకేతివృత్తపు ఛాయలుండడంవల్ల తొలితెలుగు నవలగా గుర్తింపు పొందలేకపోయి వుండాలి ఏమంటే, వీరేశలింగానికి తర్వాత తరంలో నవలా రచన చేసిన చిలకమర్తి వంటివారు తమకు నవలా రచనలో మార్గదర్శకత్వం వహించింది రాజశేఖర చరిత్రమేనని పేర్కొన్నారు ఆ తర్వాత రచయితలు ఎవ్వరూ కూడా శ్రీరంగరాజ చరిత్రను తలచనైనా లేదు. రాజశేఖర చరిత్ర యూనివర్శిటీ విద్యార్థులకు ఆ తర్వాత పాఠ్యగ్రంథంగా కూడా గుర్తింపు పొందింది ఒక ఇంగ్లీషు నవల కనుసరణంగా వీరేశలింగం ఈ రాజశేఖర చరిత్రను రచించినా రచయిత ఈ రచనలో చూపిన మౌలిక ప్రతిభనుబట్టి మళ్ళీ ఈ నవల ఇంగ్లీషులోకి అనువాదం పొందింది!

రాజశేఖర చరిత్రంలోని పాత్రలన్నీ యథార్థంగా ఆనాడు తెలుగు దేశంలో మనుగడ సాగిస్తున్న వ్యక్తులకు ప్రతినిధ్యం వహిస్తున్న పాత్రలు.

అందువల్ల సజీవమైనవి. అత్యంత వాస్తవికమైనవి ఒక సాంఘిక వ్యవస్థకా పాత్రలన్నీ ప్రాతినిధ్య మూర్తులన్నమాట అందువల్లనే ఆ పాత్రల కటువంటి చైతన్యం సమకూరింది రాజశేఖర చరిత్ర నవల తెలుగు సాహిత్య చరిత్రలో ఒక యుగ విభాగ సూచిక ఒక మైలురాయి అప్పటివరకూ పురాణాల నుంచి, ఇతిహాసాల నుంచి, చరిత్ర నుంచి మాత్రమే ఇతివృత్త స్వీకరణం జరుగుతూ వుండగా రాజశేఖర చరిత్రతో తెలుగు సాహిత్యం లౌకిక ఇతివృత్త స్వీకరణ వైపు గొప్ప మలుపు తిరిగింది అంతకు పూర్వంవరకు ఫ్యూడల్ వ్యవస్థకాగా, అప్పటినుంచి ప్రజాస్వామిక వ్యవస్థ ప్రారంభమైన పరివర్తనలాగా సుమారు తొమ్మిదివందల సంవత్సరాల తెలుగు సాహిత్యం రాజశేఖర చరిత్ర రచనతో గొప్ప మలుపు తిరిగింది రాజశేఖర చరిత్రలోని పాత్ర సృష్టి అంతా భూలోక సంబంధమైనదే ఇతర లోకాలకు సంబంధించిన ఒక్క సన్నివేశం కాని, అమానుష, అతిమానుష, అద్భుత వృత్తాంతాలుగాని ఈ నవలలో వర్ణితం కాలేదు యథార్థలోకపు వ్యథార్త దృశ్యాలన్నాడే శ్రీశ్రీ, అలాంటి వ్యథార్తదృశ్యాలు కాకపోయినా యథార్థదృశ్యాలు మాత్రం అవును - రాజశేఖర చరిత్రలో వీరేశలింగం చిత్రించిన చిత్రాలు.

రాజశేఖర చరిత్రంలో కథానాయకుడు గోటేటి రాజశేఖరుడు ఈయన ధవళేశ్వరం అనే ఊళ్ళో ఒక మధ్య తరగతి సంపన్న గృహస్థు కొంచెం భూవసతి కలవాడు ఆ ఊళ్ళో గౌరవంగా కాలక్షేపం చేస్తున్నవాడు ఆయన కిద్దరు కూతుళ్ళు. ఒక కొడుకు, ఆయన సంసార జీవితంలో సంభవించిన వొడిదుడుకులు, ఆయన ఎదుర్కొన్న కష్టాలు, అనుభవించిన బాధలు, గురి అయిన మోసాలు, ఆనాటి తెలుగుదేశంలోని సాంఘిక స్థితిగతులు- అన్నీ సంభావ్యమైన రీతిలో వర్ణించి, వాస్తవికతను బాగా పోషించాడు వీరేశలింగం ఈ నవలలో ప్రధానంగా ఈ వాస్తవికతను దృష్టిలో వుంచుకొనే వీరేశలింగం ఈ నవల రచించినట్లుగా అనుకోవచ్చు

గోటేటి రాజశేఖరుడు అమాయకుడు ముఖస్తుతులకు ఉబ్బిపోయే స్వభావం కలవాడు మీరీ ఊళ్ళో ఉండబట్టి మేం బతికిపోతున్నాం, లేకపోతే ఏమైపోయే వాళ్ళమో నంటూ ఊళ్ళోని పురోహితుడూ జ్యోతిష్కుడు గుడి పూజారి ఆయన్ను ముఖస్తుతులుచేస్తూ డబ్బు లాగుతుంటారు ఆయన దర్జా

కోసం, డాబుకోసం తలకు మించిన ఖర్చుచేస్తూ ఉంటాడు మాన్యాలు తాకట్టు పెట్టి కూతురిపెళ్ళి మహావైభవంగా చేస్తాడు క్రమక్రమంగా ఎత్తుబడిపోయి నట్లవుతుంది ఆయన స్థితి ధవళేశ్వరంలో జనార్దనస్వామివారి రథోత్సవం చూడ టానికి వెళితే ఆ జనసమ్మర్దంలో ఆయన పెద్ద కూతురు రుక్మిణి మెళ్ళోని కాసుల పేరును ఎవరో దొంగిలిస్తారు గిట్టనివాళ్లెవరో కాశీకి చదువుకనిపోయిన రుక్మిణి భర్త నరసింహస్వామి కాశీలో కాలంచేసినట్లు వార్త తీసుకొనివచ్చి చెబుతారు రాజశేఖరుడికి దాంతో రాజశేఖరుడి ఇంటి పరిస్థితులన్నీ అస్తవ్యస్తమై పోయినాయి ఈ సందర్భాలన్నీ ఇట్లా ఉండగా 'నాకు బంగారంచేసే విద్య తెలుసు'నంటూ ఒక బైరాగి ధవళేశ్వరం వచ్చి, రాజశేఖరుడి బలహీనతను ఆసరాచేసుకొని ఆయన్ను పూర్తిగా నమ్మిస్తాడు చితికిపోయిన తన సంసార పరిస్థితుల ప్రభావంవల్ల రాజశేఖరుడు ఆ బైరాగిని భక్తిశ్రద్ధలతో ఆరాధించి, బంగారంచేసే విద్యను నేర్చుకోవాలన్న ప్రలోభానికి గురి అవుతాడు. ఇంట్లో ఉన్న వెండి బంగారు వస్తువులన్నీ తీసుకొనివస్తే దానికి ఇబ్బడి ముబ్బడిగా బంగారం చేసి ఇస్తానని బైరాగి నమ్మించడంతో రాజశేఖరుడు ఇంట్లోవున్న బంగారు వస్తువులూ వెండి సామాను తెచ్చి బైరాగిపరం చేస్తాడు ఏవేవో చిట్కాలు చేస్తున్నట్లు నటించి ఆ సొత్తంతా చేజిక్కించుకొని పరారీ అవుతాడు దొంగ బైరాగి దీంతో రాజశేఖరుడి సంసారం బాగా కుదేలయిపోతుంది ఇది వరకు ముఖస్తుతులు చేస్తూ తనను యాచిస్తూ చుట్టుచుట్టు తిరిగే వందిమాగధ బృందమూ, బంధుజనమూ, శ్రేయోభిలాషులు, ఆశ్రితులూ అందరూ రాజ శేఖరుడిని గేలి చేయడం, పగవాణ్ణి చూసినట్లు చూడటం చేస్తారు ఆ ఊళ్లో ఉండలేక కాశీయాత్రకు బయలుదేరుతున్న మిషమీద చెంబూ తప్పేలా మూకుడూ ముంతా సర్దుకొని ఇంటిల్లిపాదీ రాజశేఖరుడి కుటుంబం బండిలో బయలుదేరుతారు. వాళ్ల ఎక్కువ దూరం ప్రయాణం చేయకముందే రాజా నగరం దగ్గర కోయ రామిరెడ్డి బృందందొంగలు రాజశేఖరుణ్ణి అటకాయించి ఆ ఉన్నదికాస్తా అపహరిస్తారు ఈ సంఘర్షణలో పెద్ద కూతురు రుక్మిణికాస్తా తప్పిపోతుంది. కట్టుబట్టలతో తల బొప్పికట్టి చావుదప్పి కన్నులొట్టబోయి పెద్దా పురందాకా ఎలానో చేరుతాడు రాజశేఖరుడు కుటుంబ సహితంగా లోకవృత్తాన్ని వివరంగా తెలియచేయడానికిగాను ఈ రాజశేఖరుడి యాత్రా వృత్తాంతం బాగా ఉపకరించింది వీరేశలింగానికి. రాజశేఖరుడు తాను కలుసుకున్న వ్యక్తులవల్ల,

తాను ఎదుర్కొన్న సంఘటనలవల్ల లోకం పోకడలు బాగా అర్థం చేసుకోగలుగు తాడు. మఠాధిపతుల దాంభికవర్తనలు, ప్రశ్నలు చెప్పేవారి మోసాలు, గ్రామ దేవతల జాతరలలోని మౌఢ్యాలు, శకునాలు నమ్మేవారి మూర్ఖప్రవర్తనలు, పాచకులు, యాచకులు, బడిపంతుళ్ళు, నాటువైద్యులు మొదలైనవారి కడు పాత్రం ఈ నవలలో చక్కగా చిత్రించాడు వీరేశలింగం.

రాజశేఖరుడి పాత్ర సజీవమైన పాత్ర తెలుగు నవలా సాహిత్యచరిత్రలో విలక్షణ ప్రాతినిధ్య పాత్రల విశ్లేషణలో రాజశేఖరుడికి సముచితమైన స్థానమే ఉంది ఈ మొదటి నవల తర్వాత వీరేశలింగం రాసిన రెండో నవల సత్యవతీ చరిత్రం తెలుగులో వెలువడిన మొట్టమొదటి కౌటుంబిక నవల ఇది కుటుంబ జీవనాన్ని ఇందులో సమర్థంగా చిత్రించాడు వీరేశలింగం. ఇందులో కథానాయిక సత్యవతి విలక్షణమైన సజీవపాత్ర చిత్రణప్రసక్తి వచ్చినప్పుడు సత్యవతిని గూర్చి కూడా ఆ జాబితాలో చేర్చుకోవలసి వస్తుంది ఈ నవలికలో వీరేశలింగం నాలుగు విధాలైన దాంపత్యాలను తులనాత్మకంగా పరిశీలించి, వాటి మంచి చెడ్డల నిర్ణయం పాఠకులని గ్రహించవలసిందిగా హెచ్చరిక చేస్తారు. ఆలూమగడూ ఇద్దరూ విద్యావంతులైతే ఆ సంసారం స్వర్గతుల్యంగా ఉంటుందని ప్రతిపాదిం చడం ఆయన అభిమతం అందువల్ల సత్యవతిని చదువూ సంస్కారమూ ఓర్పూ నేర్పూ ఔదార్యమూ స్థైర్యమూ ఔచిత్యమూ త్యాగమూ తెలిసిన దొడ్డ ఇల్లాలుగా ఆయన చిత్రించారు సత్యవతీ చరిత్ర కథా సూత్రానికి కొలికిపూస సత్యవతి తక్కిన పాత్రలు ఆమె మామగారూ, అత్తగారూ, ఆడబడచులూ, తోడికోడళ్లు, మరదులూ మొదలైనవాళ్ళు ఆలుమగలిద్దరూ విద్యావంతులైనవాళ్లూ, ఇద్దరూ విద్యాగంధ శూన్యులు, మగువ చదివి మగవాడు చదువెరుగనివాడూ, మగడు విద్యావంతుడై మగువ విద్యా విహీనురాలైనప్పటి సంసారమూ ఈ నాలుగు రకాలైన దాంపత్యాలను ఈ నవలికలో చిత్రించి, సత్యవతి పాత్రను చైతన్య వంతంగా చిత్రించాడు వీరేశలింగం. ఈ రోజుల్లో సత్యవతి చరిత్రను చదువరులు బాగా ఆదరించారు విద్యావంతులైన కుటుంబాలలో ఆడపిల్లల కెందరికో సత్య వతి పేరు పెట్టుకోవడం జరిగిందని వీరేశలింగం స్వీయచరిత్రలో రాశాడు ఇది ఏ రచయితకైనా అమిత సంతోషకరమైన విషయం తన జీవితమూ, రచనా వ్యాసంగమూ సార్థకమైనట్లుగా తృప్తిపడవలసిన అంశం

వీరేశలింగం తర్వాత తరంలో సుప్రసిద్ధ నవలా రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహం తెలుగులో మొట్టమొదటి హాస్యనవలను రాసినవాడు ఈయనే ఈయన రచించిన మౌలికనవలల్లో రామచంద్రవిజయమూ, గణపతీ బాగా ప్రసిద్ధి కెక్కాయి రామచంద్ర విజయంలో పాత్ర పోషణను చాలా సమర్థంగా నిర్వహించారు చిలకమర్తి కోనసీమలోని మధ్యతరగతి, ఎగువ మధ్యతరగతి కుటుంబ జీవితగాథను ఇందులో చిత్రించాడు రామచంద్రుడు బాల్యంనుంచీ పడిన అష్ట కష్టాలవల్ల ఆ పాత్ర పాఠకుడి మనసులో స్థిరంగా నిలుస్తుంది గణపతి తిండిపోతు, మందుడు అతడి అవకతవక ప్రవర్తనవల్ల, వెకిలితనంవల్ల, తిండిపోతుతనం వల్ల హాస్యస్ఫూర్తి కలిగి, కలకాలం పాఠకులకు గుర్తుంటాడు గణపతి

తెలుగు నవల పుట్టిన పాతిక సంవత్సరాల వరకూ పాతిక నవలలు కూడా వెలువడకపోవడం జరిగింది ఇవాల్టి దృష్టితో చూస్తే ఇది వింతైన విషయం నవలా రచనను ప్రోత్సహించే ఉద్దేశంతో 1892 వ సంవత్సరంలో 'చింతామణి' అనే పత్రిక నవలల పోటీలను కూడా నిర్వహించింది, అప్పుడే చిలకమర్తి లాంటివారు నవలా రచనపట్ల ఉత్సుకులు కావడం జరిగింది ఈ పోటీలు ఐదారు సంవత్సరాలు మాత్రమే జరిగాయి ఇంతలో పత్రిక ఆగిపోయింది. ప్రతి సంవత్సరమూ చిలకమర్తివారు చింతామణి నవలలపోటీకి తన నవల పంపించేవారు. ఈ విధంగా ఆయన అహల్యాబాయి, హేమలత, కర్పూరమంజరి, సౌందర్యతిలక మొదలైన చారిత్రక, పౌరాణిక నవలలు ఎన్నిటినో రచించాడు ఇంకొక పేర్కొనదగిన అంశం ఏమిటంటే, 1897 వ సంవత్సరం వరకూ అంటే తెలుగులో నవలా రచనకు శ్రీకారం చుట్టిన తర్వాత పాతిక సంవన్సరాలవరకూ ఈ సాహిత్య ప్రక్రియను వచన ప్రబంధమనీ నవీన ప్రబంధమనీ పిలవడమే జరిగిందిగాని నవల అని వ్యవహరించడం జరగలేదు 1897 వ సంవత్సరం తర్వాత నుంచీ నవల అన్న పేరే స్థిరపడి పోయింది తెలుగు నవల పుట్టిన తర్వాత మూడునాలుగు దశాబ్దాల వరకు నవలా రచన విషయంలో చెప్పుకోదగిన కృషి జరగలేదు

1905 వ సంవత్సరంలో విజ్ఞాన చంద్రికామండలి స్థాపన జరిగింది దేశ స్వాతంత్ర్యోద్యమంలో ప్రధానంగా చెప్పవలసిన వందేమాతరోద్యమం కూడా ప్రారంభమైంది. విజ్ఞాన చంద్రికామండలి స్థాపనం తర్వాత పదిపదిహేను సంవత్స

రాలు ప్రధానంగా చారిత్రక నవలలే వచ్చాయి ఏ ఒకటి రెండు సాంఘిక నవలలు వచ్చినా అది సాంఘిక నవలల కాలంకాదు ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో చారిత్రక నవలలు బహుళంగా వెలువడడానికి చారిత్రక కారణాలు లేకపోలేదు. దివ్యజ్ఞాన సమాజం వారి ప్రచారంవల్ల ప్రాచీన భారతీయ నాగరికత, సంస్కృతుల పట్ల మేధావి వర్గంలోనూ, ప్రజాసామాన్యంలోనూ, విద్యాధికులలోనూ ఒక గౌరవం, ఆరాధనాభావం ప్రబలినవి అందువల్ల పూర్వకాలపు ఔన్నత్యాన్ని సంస్మరిస్తూ, పొగడుతూ రచయితలు తమ జాతి విశిష్టతను ప్రబోధించడం జరిగింది తెలుగులో వెలువడ్డ చారిత్రక నవలలు కేవలం తెలుగుదేశ చరిత్రకు మాత్రమే సంబంధించినవి కాకపోవడం గమనార్హం. దీనికి జాతీయోద్యమ స్ఫూర్తి ప్రధాన కారణం తెలుగు వాళ్ళకు ప్రత్యేక రాష్ట్రం కావాలన్న కోరిక అప్పుడప్పుడే అంకురించి క్రమంగా బలపడుతూ వచ్చింది. అందువల్ల తెలుగుదేశ చరిత్రను ఇతివృత్తంగా చేసుకొని భోగరాజు నారాయణమూర్తి, కేతవరపు వెంకటశాస్త్రి, దుగ్గిరాల రాఘవచంద్రయ్య మొదలైనవారు చారిత్రక నవలలు రాయడం జరిగింది చారిత్రక నవలలనేసరికి వాస్తవికతకన్నా కాల్పనిక సన్నివేశ ప్రాబల్యమూ, ఊహా విహార భావోద్విగ్నత తప్పనిసరికాబట్టి పాత్రపోషణను గురించి ప్రత్యేకించి విశ్లేషించడానికి అవకాశం లేదు. ఇంచుమించుగా ఇరవై యో శతాబ్దపు తొలి రెండు దశాబ్దాలలో వెలువడిన చారిత్రక నవలలన్నీ ఒకే మూసలో పోసినట్లు, ఒకే విధమైన కల్పనలతో, ఒకే రకమైన వర్ణనలతో, వైవిధ్యంలేని ఆద్యంతాలతో వుంటున్నాయని చలం 'తెలుగు నవల' అనే హేళన రచనకూడా చేయడం జరిగింది

తెలుగు నవలకు స్వర్ణోత్సవం మాలపల్లి. సమకాలీన భారతీయ భాషలు దేనిలోనూ ఇంతటి మహోదాత్తమైన నవల వెలువడలేదేమో! మాలపల్లి ఒక సంగ్రహ విజ్ఞాన సర్వస్వం వంటిది. ఇది ఐతిహాసిక నవల. తెలుగు నవలా సాహిత్యచరిత్రలోనే గొప్ప మలుపు తెచ్చింది మాలపల్లి ఇతివృత్త స్వీకరణలోనూ, భాష విషయికంగానూ, సమకాలీన సామాజిక జీవన చిత్రణలోనూ మాలపల్లి రచనతో కొత్త అధ్యాయమే ప్రారంభమైంది తెలుగు నవల అనే దివ్యమందిరానికి ఉన్నతోన్నతమైన సౌందర్య శిల్పశిఖరం మాలపల్లి. ఇందులోని పాత్రలన్నీ సజీవ శిల్పాలు. రామదాసు, సంగదాసు, వెంకటదాసు, అప్పాదాసు, జ్యోతి, మాలక్ష్మి,

రామానాయుడు, కమల, మోహనరావు, చౌదరయ్య, సాహు- ఒక పాత్ర ఏమిటి? ఇందులో తెరమీదకు వచ్చిన ప్రతిపాత్రకూడా సజీవంగా, మానవ సహజమైన వ్యక్తిత్వాలతో పాఠకులను పలకరిస్తాయి ఈ నవల చదువుతున్నంత సేపూ పాఠకుడు నవలా వాతావరణంలో లీనమైపోతాడు. తెలుగు నవలలో పాత్రపోషణ గురించి చెప్పవలసివస్తే సమగ్రంగా ఒక్క మాలపల్లిని అధ్యయనం చేస్తే చాలును - మానవ జీవితంలోని సమస్త ప్రవృత్తులూ అత్యాశ్చర్యకరంగా అవిష్కారమవుతవి స్త్రీ పాత్రలేమి, పురుష పాత్రలేమి, చేతనాచేతనాలేమి, ఆర్థిక సాంఘిక రాజకీయ మత నైతిక శక్తులు సమాజాన్ని ఏ విధంగా శాసిస్తాయో, ఏ విధంగా నడుపుతూ వుంటాయో, మాలపల్లి నవలలో ప్రతిభావంతంగా చిత్రితమైనాయి. ఉన్నవ లక్ష్మీనారాయణగారు ప్రతి సన్నివేశంలోనూ ప్రతి వాక్యంలోనూ అపూర్వమైన ప్రతిభతో నవల సమగ్రమూర్తిమత్వాన్ని దృష్టిలో పెట్టుకొని రచన సాగించినట్లు రుజువవుతుంది ఒక్క ఉదాహరణ ఈ నవలలో ప్రధాన స్త్రీ పాత్రలలో ప్రధాన పాత్ర అయిన కమలను తొలిసారిగా ప్రవేశపెట్టిన సందర్భంలో కమల పాత్ర పోషణను పరిశీలిస్తే ఆమె వ్యక్తిత్వాన్ని ఉన్నవ ఏ విధంగా రూపు కట్టించదలచుకొన్నారో స్పష్టపడుతుంది కలవారి ఇంటి ఆడబడుచు, సౌందర్యం, సౌకుమార్యంతో బాటు అతిశయం, భర్తపట్ల ఒక నిరాదరణ, జీవితంలో ఒక అతృప్తి ఆమె ప్రవర్తనలో వ్యక్తమవుతాయి అటు తరవాత ఆమె పండువంటి కాపురాన్ని పాడుచేసుకొని వెళ్ళిపోవడం జరుగుతుంది నవీన నాగరికమైన వేషభాషలకు భ్రమసి, తన సంసారంలో తానే నిప్పులు పోసుకుంటుంది కమల ఈ విధంగా పాత్ర చిత్రణలో ఆద్యంతాలు వాళ్ళవాళ్ళ ప్రవేశ నిష్క్రమణలు ఉన్నవ ప్రతిభావంతంగా ఈ నవలలో నిర్వహించారు ఆనాటి సామాజిక రంగస్థల భూమికను దృష్టిలో వుంచుకొంటేకాని ఉన్నవ వారి రచనలోని పరమార్థం మనకు బాగా బోధపడదు.

తెలుగు నవల పుట్టిన అర్ధశతబ్దానికి కాని బాగా ప్రాచుర్యంపొంది పాఠకుల ఆదరణ పొందలేదని అనిపిస్తుంది పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో వచ్చిన ప్రసిద్ధమైన నాటకాలెన్నో వున్నాయి ప్రతిభావంతుడైన ప్రతి ఒక్క రచయితా ఒక్క నాటకమైనా రాయడం జరిగింది. కాని నవలలు రాయడానికెవ్వరూ ఉత్సుకత చూపలేదు ఉన్నవ వారి మాలపల్లి వెలువడిన తర్వాత తెలుగు

నవలకు గొప్పస్థాయి వచ్చింది అటుతర్వాత విశ్వనాథ, చలం, అడవి బాపిరాజు తెలుగు నవలకి ఎక్కువగా పాఠకుల ఆదరణ కలిగించారు ఈ ముగ్గురి రచనలలోనూ ప్రత్యేకమైన విశిష్టతను చూడవచ్చు శైలిలోకాని సామాజిక పరమైన సాహిత్య నిబద్ధత, నిమగ్నతలలోకాని ఈ ముగ్గురు ప్రతిభావంతులైన రచయితల దృక్పథాలు, పోకడలు విలక్షణమైనవి పాత్ర పోషణ విషయంలో కూడా ఈ ముగ్గురు రచయితలూ అపూర్వమైన ప్రతిభను ప్రదర్శింపచేశారు. తాము నమ్మిన సిద్ధాంతాలకు, తామాశించిన సాహిత్య ప్రయోజనానికి, తాము అభిమానించిన సాహిత్య శిల్ప మార్గానికి అనుగుణంగానే వారి పాత్రపోషణ జరిగింది విశ్వనాథ సంప్రదాయంలోని మంచిని మాత్రమే చూపి ప్రదర్శించే ప్రవృత్తిగలవాడు. చలం సంప్రదాయంలోని చెడును మాత్రమే ప్రదర్శించే అభి నివేశం గలవాడు బాపిరాజు అన్నిటా సౌమనస్యవాది. సౌందర్యపిపాసి జగత్తు నంతా సౌందర్యమయంగా చిత్రించాలన్న ఆకాంక్ష గలవాడు ముగ్గురూ శక్తి మంతులైన గొప్ప రచయితలు అందువల్ల ఈ రచయితలు చిత్రించిన పాత్ర లన్నీ చైతన్య మూర్తులుగానే వుంటాయి బాపిరాజు ప్రధానంగా చారిత్రక నవలలే రాసినప్పటికీ, అభౌమమైన, అతిమానుషమైన అద్భుత సన్నివేశాల కల్పన చెయ్యలేదు కాబట్టి, ఆయన పాత్రపోషణ వాస్తవికతాదూరం కాదు సాంఘిక నవలల్లో బాపిరాజు పాత్రపోషణ వైవిధ్య రహితంగానే వుంటుంది. చారిత్రక నవలల్లో మాత్రం ఆయన ప్రతిభ కనపడుతుంది. హిమబిందు, గోన గన్నారెడ్డి, అడవిశాంతిశ్రీ వంటి నవలల్లో బాపిరాజు సౌందర్యాలోకనం బహుముఖ ప్రతిభ, భావుకత బాగా వెల్లడవుతున్నాయి. హిమబిందు, సువర్ణశ్రీ,, శ్రీకృష్ణశాతవాహనుడు, చారుగుప్తుడు, ఆచార్య స్థౌలతిష్యులు విషబాల పాత్ర లను సజీవశిల్పాభిరామంగా చిత్రీకరించారు హిమబిందు నవలలో బాపిరాజు. విశ్వనాథ వేయిపడగలు, ఏకవీర, తెరచిరాజు, చెలియలికట్ట, బద్దన్న సేనాని వంటి నవలల్లో అద్భుతమైన పాత్ర చిత్రణ చేశారు మైదానం, బ్రాహ్మణీకం, దైవమిచ్చిన భార్య, అమీనావంటి నవలల్లో, నవలికల్లో చలం తన సామాజిక సమస్యా పరిష్కార సిద్ధాంత దృక్పథాన్ని వ్యక్తం చేశాడు. చలం సృష్టించిన ప్రధాన పాత్రలన్నీ ఆయన సిద్ధాంత ప్రచార వాహకాలుగానే ఉండటం గమనార్హం

ఈ ముగ్గురు రచయితల తర్వాత తెలుగు నవలారచనను సుసంపన్నం చేసిన వాడు నోరి నరసింహశాస్త్రి. ఈయన తెలుగువారి రాజకీయ చరిత్రనంతా సాంస్కృతిక చరిత్రకు ప్రాధాన్యమిచ్చి నవలలుగా చిత్రీకరించాడు ఆయా కాలాలను వెలిగించిన కవుల జీవితగాధలను కేంద్రంగా చేసుకొని, తెలుగువారి చరిత్రను నవలీకరించడం నోరి వారి విశిష్టత నారాయణభట్టు, రుద్రమదేవి, కవిసార్వభౌముడు, మల్లారెడ్డి, ధూర్జటి మొదలైనవన్నీ చారిత్రక నవలలే- నోరి వారి లేఖినినుంచి వెలువడ్డాయి

ఇటు తర్వాత తెలుగు నవలను సుసంపన్నం చేసిన గొప్ప రచయితలు బుచ్చిబాబు, గోపీచంద్, జి వి కృష్ణారావు, రాచకొండ విశ్వనాథశాస్త్రి బుచ్చిబాబు చివరకు మిగిలేది ఏ ప్రమాణాన్ని బట్టి చూసినా గొప్ప నవల ఇందులోని పాత్రలన్నీ సజీవమూర్తులు దయానిధి, కోమలి, సుశీల, నాగమణి, జగన్నాథం, వైకుంఠాచార్యులు - ఒక్కటేమిటి ప్రతిపాత్రా బుచ్చిబాబు సృష్టిలో ప్రాణం పోసుకున్నాయి. చివరకు మిగిలేదిలో అమృతంపాత్రకు ప్రధాన కథా నిర్వహణం దృష్ట్యా అధిక ప్రాధాన్యం లేదు. అయినా ఆ పాత్రలోని మానవత్వం, మార్దవం, మనసు, మమత మరువరానివి ఒకే ఒక్క నవల రాసినా తెలుగు నవలా సాహిత్య చరిత్రలో చిరస్మరణీయుడే అయినాడు బుచ్చిబాబు గోపీచంద్ అసమర్థుని జీవయాత్ర, మెరపుల మరకలు, పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా, చీకటి గదులు- తెలుగు నవల స్థాయిని ఎంతగానో పెంచాయి అసమర్థుని జీవయాత్రలో సీతారామారావు, మెరపుల మరకలులో ఉషారాణి పాత్రలు మరపురాని పాత్రలు ఈ రెండు నవలలున్నూ తాత్త్విక భూమికాత్మకాలు, ప్రతీకాత్మకమైనవి గోపీచంద్ మేధావి వర్గ రచయిత కాబట్టి ఆయనరచనల్లో తత్త్వ చింతనం కూడా చోటు చేసుకుంటుంది జి వి. కృష్ణారావు రచించిన కీలు బొమ్మలు, పాపికొండలు మంచి నవలలు. చదివేవాళ్ళ వినోదార్థమో, కాలక్షేపార్థమో కాకుండా ఆలోచింపజేసే రచనలు చేశారు కృష్ణారావు

పాత్ర పోషణ విషయంలో రాచకొండ విశ్వనాథశాస్త్రి ప్రత్యేకమైన ముద్రను కనపరుస్తాడు ఆయన అల్పజీవిలో పాత్రలన్నీ చైతన్యంతో కదలాడే పాత్రలు కదిలేవీ కదిలించేవీ ఇటీవల ప్రకటితమైన ఆయన నవలల్లో కొత్తదైన వాక్య విన్యాస శిల్పం చదవరులను అమితంగా ఆకర్షిస్తున్నది క్షేమ - మహిషి,

రాజు - మనిషి, రత్తాలు - రాంబాబు వంటి నవలలు విశ్వనాథశాస్త్రి భావనా ప్రపంచాన్ని సమర్థంగా ఆవిష్కృతం చేస్తున్నాయి పాతిక సంవత్సరాలుగా నవలారచన చేస్తూనే వున్నాడు రాచకొండ కొత్తదనం ఇతివృత్తంలోనూ, రచనా శిల్పంలోనూ కనబరచటం ఈయనలోని విశిష్టత

స్వాతంత్ర్య సముపార్జనానంతరం నవలారచయితగా ఎన్నెన్నో ఆశలు కల్పించిన రచయిత 'శారద' అనే అభిమాననామంతో నవలలు రాసిన నటరాజన్ ఈయన తన కళ్ళముందు దర్శించిన, దర్శిస్తున్న సమాజాన్ని నవలలుగా రాసినందున అవి ఎంతో వాస్తవికతాసుందరంగా పాఠకుల ఆదరాభిమానాలు సంపాదించుకున్నాయి. మంచీ- చెడు, అపస్వరాలు అనే 'శారద' నవలలు పందొమ్మిది వందల యాభైలలో ఎంతగానో అభిమాన పాత్రములైనాయి తెలుగు పాఠకులకు.

స్వాతంత్ర్యానంతరం తెలుగు నవలా సాహిత్యంలో విశిష్టంగా చెప్పుకొనవలసిన అంశం మహిళలు నవలారచనలో ముందంజ వేయడం మహిళలు నవలా రచనం చేపట్టడంవల్ల చదివేవారి సంఖ్య నానాటికీ వృద్ధి పొందడం జరిగింది. ఇది మహిళా రచయితలవల్ల తెలుగు నవలకు జరిగిన గొప్ప మేలు.

ఈ శతాబ్దం ఇంకో ఇరవై సంవత్సరాలలో ముగుస్తుందనగా ఆధునిక నవలా సాహిత్యంలో పాత్ర పోషణ దృష్ట్యా పది కాలాలపాటు నిలిచే తెలుగు నవలలను పేర్కొనడం కష్టసాధ్యమైన విషయమే ఈ విషయాన్ని కాలమే పరిష్కరించాలి ఇంకో పది సంవత్సరాలు లేదా ఇరవై సంవత్సరాలు గడిచిన తర్వాత, ఇప్పుడు రెండు మూడు దశాబ్దాలుగా ఈనాటివరకూ వెలువడుతున్న నవలామణుల నవలల్లో ఏవి మిగులుతాయి, ఏవి మిగులవు అని తర్కించడం ఇప్పుడు వృధా ప్రయాస అల్పజీవి, చివరకు మిగిలేది, అసమర్థుని జీవయాత్ర కీలుబొమ్మలు లాగా పేర్కొనదగిన నవలలు ఇంకా కొన్ని స్ఫురిస్తే ఆ రచనల లోనూ సాహిత్య విలువలు వున్నట్లు, లేకుంటే లేనట్లు.

పాత్ర పోషణ దృష్ట్యా చూస్తే ఉప్పల లక్ష్మణరావుగారి అతడు - ఆమె మంచి నవల అని చెప్పాల్సి వుంటుంది. ఇందులో ప్రధాన పాత్రలు ఇద్దరు. అప్రధాన పాత్రలు మరో ఐదుగురు. వాస్తవికతకు తోడు అపారమైన జీవితాను

భవం కూడా మిళితం కావడంతోనూ, అపూర్వమైన శిల్పమత్కృతి, జీవిత గాంభీర్యం వుండడంతోనూ అతడు - ఆమె మంచి నవలగా ఎంచవచ్చు

మహీధర రామమోహనరావుగారి నవలల్లో సమకాలీన సమాజంతో పాటు రాజకీయ శక్తుల సామాజిక పాత్ర కూడా చిత్రితం కావడంతో పాత్రపోషణ విషయమై ప్రత్యేకించి చెప్పలేము.

ఆర్. ఎస్ సుదర్శనం గారి రచనలు తాత్త్వికాలోచనాత్మకాలు అధి వాస్తవికత, అస్తిత్వవాదం మొదలైన సాహిత్య సిద్ధాంతాల వ్యాఖ్యాత శ్రీ సుదర్శనం. శీలా వీర్రాజు రచించిన 'మైనా' పాత్రపోషణ విషయంగా చెప్పుకోదగిన మంచి నవల ఇందులో కథానాయకుడు సాయిబాబా పాత్రను అత్యంత సమర్థంగానూ వాస్తవికంగానూ చిత్రించారు రచయిత ఈయన శైలి నవలా రచనలోని తక్కిన అంశాలన్నిటికన్నా బలంగా ప్రస్ఫుటంగా కనబడుతుంది.

వట్టికోట ఆళ్వారుస్వామి రచనలు ప్రజలమనిషి, గంగు మొదలైన నవ లల్లో స్వాతంత్ర్యానంతరం తెలంగాణంలో ప్రజాజీవనంలోని సంక్షోభాలను చిత్రించడం జరిగింది కాబట్టి ఈ నవలల్లో కనబడే పాత్రలు ఆనాటి వ్యవస్థా ప్రాతినిధ్యాలే అని చెప్పవచ్చు

ఇటీవల దాశరథి రంగాచార్య కూడా ఇటీవలి గతకాలపు సమాజాన్ని నవలల్లో చిత్రించడం జరిగింది ఈయన రచించిన చిల్లరదేవుళ్ళు, తెలంగాణాలో ఈ శతాబ్ది పూర్వార్ధంలోని చివరి రెండు మూడు దశాబ్దాల సామాజిక చరిత్ర ఈ నవలలో పాత్ర పోషణపట్ల ఆయన మంచి ప్రజ్ఞ కనపరిచారు. స్వాతంత్ర్యా నంతరం తెలుగు నవలకు పేరు పెంపులు తెచ్చినవాళ్ళలో ముఖ్యంగా పేర్కొన వలసిన రచయితలు బలివాడ కాంతారావు, కొమ్మూరి వేణుగోపాలరావు, అవస రాల రామకృష్ణరావు, రంధి సోమరాజు, నవీన్, ఎన్. ఆర్. నంది, పురాణం సుబ్రహ్మణ్యశర్మ ప్రభృతులు వస్తారు

ఈ మధ్య వచ్చిన తెలుగు నవలల్లో ప్రత్యేకించి చెప్పవలసిన నవలలు ఇన్‌క్రెడిబిల్ గాడెస్, యాత్ర అనే చిన్న నవలలు పాత్ర పోషణ దృష్ట్యా చూసినా, సామాజిక ప్రబోధం దృష్ట్యా చూసినా, సాహిత్య శిల్పం దృష్ట్యా చూసినా ఈ రెండు నవలలూ చాలా మెచ్చదగినవి డా॥ కేశవరెడ్డి అనే రచయిత ఇన్‌క్రెడిబిల్ గాడెస్ రచనలో గొప్ప ప్రతిభను ప్రదర్శించారు ఈ ఇరవై ముప్పై సంవత్సరాల తెలుగు నవలా సాహిత్య చరిత్రలో ఇంత మంచి తెలుగు నవల మరొకటి వచ్చిందా అన్న సందేహం కలుగుతుంది ఇది చదివిన తర్వాత ఎవరికైనా ఇందులో రామచంద్రుడు, నాగ, వాళ్ళ కుర్రవాడూ ప్రధాన పాత్రలు, ఈ నవలికలో పాత్ర పోషణ అద్భుతంగా జరిగింది. ఈ నవల పేరు సాంకేతికమైనది అర్థవాదాత్మకమైనది రాయలసీమలో బాగా వెనుక బడిన గ్రామీణ ప్రాంతంలో ఒకచోట క్షుద్ర దేవతారాధన విచిత్రమైన పద్ధతులలో ఇంకా సాగుతూనే ఉందనీ, ఈ కొలుపుల్లో చెప్పూ చేటా పెట్టి కొట్టి ఎంతగా దూషిస్తే అంతగా ఆ క్షుద్రదేవత సంతోషిస్తుందన్న నమ్మకం ఆ ప్రాంత ప్రజలకు ఇంకా ఉందనీ, ఆ విధంగానే అక్కడ అట్టడుగు సాంఘిక స్తరంలో జీవనం సాగిస్తున్న అభాగ్యులు- అగ్రవర్ణాల మోతుబరులు, భూస్వాములు తమని ఎంత హీనంగా చూస్తే అంతగా సంతోషించడం, మరింత విశ్వాసాన్ని ప్రదర్శించడం ఈనాటికీ అనవాయితీగానే ఉందనీ, ఈ దురదృష్టకర పరిస్థితులు ఇంతలో అంతం కావా! అన్న ఆర్తి ఈ రచనలో ధ్వనిస్తున్నది ఆ క్షుద్రదేవత హైన్య సంతోషంతో పోల్చదగినదిగా వుంది అక్కడి హరిజనుల దయనీయమైన జీవన వ్యవస్థ అన్న ధ్వని వుంది ఈ నవల పేరులో అందుకే ఈ పేరు పెట్టడం జరిగింది ఒకవేళ మోతుబరుల దౌర్జన్యాన్ని ప్రతిఘటించడానికి ఏ మాత్రం చిన్న ప్రయత్నం జరిగినా అక్కడ ఆ వ్యక్తులకు ఉప్పూ పప్పూ నిలువనీడా లేకుండా అగమ్మకాకులై పోవలసిన దుర్భర పరిస్థితులు ఇంకా కొనసాగుతూనే వున్నాయన్న చిత్రణ కూడా వుంది. ఈ నవలికలో కథానాయకుడైన రామచంద్రుడనే హరిజనుడు స్వగ్రామం నుంచి నిర్బంధ ప్రవాస యాత్రకు గురికావడం కరుణాపూరితంగా ఈ నవలలో చిత్రితమైంది.

'యాత్ర' అనే పేరుతో చాగంటి తులసి చిన్న నవలిక రచించారు. ఈ నవలలో పాత్ర పోషణ చాలా శ్లాఘనీయంగా నిర్వహించడం జరిగింది నేటి కాలానికి చక్కని సామాజిక ప్రబోధం చేయగల నవల ఇది వయసు మళ్ళిన ఇద్దరు ముసలమ్మలు తమ తమ జీవితానుభవాలతో ఏ విధంగా సమన్వయం కుదుర్చుకున్నదీ వర్ణించారు తులసిగారీ నవలలో భాష, శైలి, కథా కథనం, పాత్ర చిత్రణం అన్నీ చక్కగా సమన్వయం పొందాయి ఈ నవలలో ఇటువంటి చక్కని నవల రాసినందుకు రచయిత్రి చాలా అభినందనీయురాలు మనిషి శాంతంగా సుఖంగా జీవితంతోనూ తనకు కావలసిన వాళ్ళందరితోనూ సర్దుబాటు చేసుకొని బ్రతకటానికి అనువైన మార్గాన్ని చూపటంకన్నా సాహిత్యం ఆశించే పరమ ప్రయోజనంకాని, సాధించే పరమార్థంకాని ఏమైనా ఉన్నవా?!

(వేదిక - 1980)

# సామెతలు

సామెతలు ఒక జాతి జీవన విధానాన్ని తెలియజేసే సూత్ర సంపుటి ఇవి ఆ జాతి జనుల ఆచార వ్యవహారాలు, సంస్కృతి సౌరభాలు, విశ్వాసాలు, విలువలు తెలియజేసే వ్యాఖ్యానాల వంటివి సామెతలలో ఒక ప్రాంతం యొక్క నుడికారం, నాగరకత, పాడిపంటల వివరాలు, సాంప్రదాయిక విజ్ఞానం, ధార్మిక విశ్వాసాలు, సామాజిక నిబంధనలు వెల్లడి అవుతాయి

తరతరాల అనుభవ సంపుటీకరణమే సామెతల వాఙ్మయం. మాట కూర్పులో పొదుపు, భావ వ్యక్తీకరణంలో చమత్కారం, అలంకార విన్యాసం శబ్దలాలిత్యం, వ్యంగ్య వైభవం సామెతలలోని జీవశక్తి

సామెత ఒక జాతి జీవన విధానాన్ని ప్రతిబింబిస్తుంది కాబట్టి ఆయా కాలాల చారిత్రక సామాజిక పరిణామాలు కూడా సామెతల ద్వారా విశ్లేషించి తెలుసుకోవడానికి అవకాశం వుంది మానవ జీవితానుభవాన్ని కొద్ది మాటలలో ఇముడ్చుకోగల సూక్తులు సామెతలు

తెలుగు సామెతలు వీలైనంత అధిక సంఖ్యలో సేకరించి ప్రకటించాలని ఎంతో కృషి చేసినవారు కీర్తిశేషులు కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణరావు గారు. లక్ష సామెతలను మించి ఆయన సేకరించినట్లు తెలుస్తున్నది. ఆనాటి పత్రికలలో ఈ సామెతలు సేకరించడంలో తమకు సాయం చేయవలసిందని అర్థిస్తూనూ, ఈ సామెతల సేకరణలో తమ అనుభవాలను నారాయణరావుగారు వివరించే ఉన్నారు

పరంపరాగతంగా ఒక తరం నుంచి ఇంకొక తరానికి సంక్రమిస్తున్న సాంప్రదాయిక విజ్ఞానంలో ఈ సామెతలకు విశిష్టమైన స్థానం ఉన్నది ఏదో సందర్భంలో ఒక సామెతనైనా ఉదాహరించని వ్యక్తి ఉండడు విద్యావంతులు గానీ, చదవనూ రాయనూ నేర్వని వాళ్ళుగానీ ఆయా సందర్భాలలో సామెతలు వాడుతూనే ఉంటారు

సామెతలలో ఆ సామెత పుట్టిన కాలపు సాంఘిక జీవిత విధానం ప్రతి బింబిస్తూ ఉంటుంది ఉదాహరణకు వేశ్యావృత్తికి సంబంధించినవీ, వేశ్యల విశ్వాసానికి సంబంధించినవీ అటు తర్వాత కాలంలో ఆ సామెత వెలార్చే భావనలో మనకు ఔచిత్యం అంతగా కనపడకపోవచ్చు కులాలు, వర్గాలు, మత నైతిక విశ్వాసాలు, కట్టుబాట్లు ప్రపంచంలోని అన్ని దేశాలను ప్రభావితం చేసినవే అందువల్ల గతకాలపు జీవిత విధానాన్ని ప్రతిబింబించే ఆయా వృత్తు లకు కులాలకు సంబంధించిన సామెతలను మనం తప్పుపట్టకూడదు. తప్పుపట్టి ప్రయోజనం లేదు ఒకనాటి సాంఘిక పరిస్థితులు, సాంఘిక విశ్వాసాలు అవి వెల్లడిస్తున్నా యనుకోవాలి.

ప్రపంచంలో అన్ని నాగరక భాషా సారస్వతాలలోను సామెతలున్నాయి ఒక సామెత సాయంతో ఎవరైనా తమ భావాన్ని మరింత మెరుగు పెట్టవచ్చు దృఢీకరించవచ్చు వినేవారికి ఆహ్లాదం, అనేవారి చాతుర్యం ఇందువల్ల వ్యక్త మవుతాయి

నిత్యజీవితంలో కూడా మాటకారితనాన్ని చమత్కారాన్ని పుష్కలంగా ప్రదర్శించగల వ్యక్తులు అందరి మన్ననకు పాత్రులవటం అందరూ ఎరిగిందే. హాస్య ప్రసంగాలు చేస్తూ ఛలోక్తులు విసురుతూ మాటకారితనాన్ని ప్రదర్శిస్తూ వినోదాన్ని పంచి ఇవ్వగల వ్యక్తి అంటే సామాజికులు, ప్రేక్షకులు, శ్రోతలు కూడా అభిమానిస్తారు వేదికలపై ఉపన్యాసాలు చేసేటప్పుడు కూడా విషయ దష్నతకంటే వినోద ప్రాగల్భ్యాన్ని సర్వసాధారణంగా లోకులు ఎక్కువగా హర్షిస్తూ వుంటారు

కళలన్నిటా ఉత్తమ కళ కవిత్వం అది తెలియడమంటే లోకమంతా తెలియడం కదా! అని అప్పకవివంటి సంప్రదాయాభినివేశపరుడు, పాండిత్యాభి మాని అన్నాడంటే లోకజ్ఞత కవి అన్నవాడికి ఎంత అవసరమో తెలుస్తుంది. 'లోకుల రసనలె ఆకులుగా నుండునట్టి యవివో కవితల్' అన్నాడు సంకుసాల నృసింహ కవి. లోకజ్ఞతకు దర్పణాలు సామెతలు

తెలుగు దేశంలోని వివిధ ప్రాంతాల సామెతలు ఇంతవరకు సంపుటాల లోకి చేరలేదు. శ్రీ చిలుకూరి నారాయణరావుగారు గొప్ప కృషి చేసినా వారి

కృషి సాఫల్యానికి రాలేదు ఇప్పటికీ సంపుటీకరణ ప్రయత్నాలలో నైతం అత్యధిక సంఖ్యాయుతంగా వెలువడిన వాటిలో కూడా పది పన్నెండు వేల సామెతలు మించి చేరలేదు పునరుక్తులూ, రూప భావ తుల్యతలు, ప్రాంతీయ ఛాయలూ పరిహరిస్తే ఈ సంఖ్య కూడా తగ్గుతుంది 'తాటిచెట్టెందు కెక్కా-వంటే దూడగడ్డి కోసమన్నట్లు' అనే సామెతను చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కథలు - గాథల్లో చాలాసార్లు కొబ్బరి చెట్టెక్కడంగా ప్రసక్తం చేశారు 'సింగ డద్దంకి వెళ్ళిరావడమ'ని కొన్ని ప్రాంతాల్లో అంటే, 'పుల్లయ్య వేమవరం వెళ్ళి వచ్చినట్లు' అనే రూపాంతరం కొన్ని ప్రాంతాల్లో వాడుకలో వుంది లఘువాక్య సహితంగా ప్రాంతీయ స్వరూప నిరూపణంతో తెలుగు సామెతలు వెలువరించే ప్రయత్నం ఇంతవరకూ జరగలేదు అసలు సామెతల స్వరూప స్వభావాలేమిటి?

మానవ జీవితంలో ఎదురయ్యే ఒక సన్నివేశాన్నో సంఘటననో వ్యాఖ్యా నించడానికో, వివరించడానికో విమర్శించడానికో, బలపరచడానికో, నిరసించ డానికో నిదర్శనంగానో దృష్టాంతంగానో ఒక భావాన్ని కుదిరికగల మాటలతో సూత్రీకరణ పద్ధతిలో వాక్యంగా విన్యసింపచేయడమే సామెతయొక్క స్వరూపం

సందర్భానికి తగిన భావస్పందనమే సామెత ఒక విషయాన్ని హత్తు కొనేలా చెప్పాలన్నా వ్యాఖ్యానించాలన్నా ఒక సామ్యాన్ని అంటే పోలికను ప్రతి పాదించి చెప్పినప్పుడు ఆ ప్రతిపాద్యంశం, ఆ ప్రకరణం సూటిగా అర్థమవు తాయి అర్థవైశద్య స్ఫూర్తి మాత్రమే కాకుండా పోలిక తేవడంలో లోకరీతి, మానవ స్వభావ చిత్రణ, వస్తుతత్త్వము వెల్లడి కావడంతో ఒక అహ్లాదం కూడా కలుగుతుంది సామెత ప్రయోగించిన వ్యక్తికీ విన్నవారికిన్నీ.

సామెతలో ఉండే విలక్షణత ఏమంటే- విమర్శించే ఉద్దేశంతోనూ ఈస డించేటందుకుగాను ఏదైనా ఒక సామెతను ప్రసక్తం చేసినప్పటికీ ఎవరిగూర్చి అది ఉద్దేశితమైనదో వాళ్ళకు కూడా ఉద్వేగాన్నీ బాధను అది కలిగించక పోవడం

సాముదాయికమైన లక్షణాన్నో, ప్రవృత్తినో సామెత వ్యక్తం చేస్తుంది కాబట్టి రాశిపరంగానో జాతి పరంగానో గుణదోష ప్రతిపాదనం చేస్తుందిగాబట్టి వ్యక్తిగతమైన కించకు అవకాశం లేదు

పోలికతో విషయం మరింత స్పష్టమవుతుంది తత్త్వం మరింత విశద మవుతుంది. భావప్రకటన సామర్థ్యంవల్ల విన్నవారి మనసుకూడ ఆకర్షితమవు తుంది. ఇదీ సామెత ప్రయోజనం

బుద్ధినైశిత్యాన్ని ఆలోచనా స్ఫూర్తిని సద్యః స్ఫురణ సంబంధి చురుకు తనాన్ని పరీక్షించడానికి గాని ఒక గీతను గీసి దాన్ని ఏ కొసనూ చెరపకుండా. ఏ కొసకూ కలపకుండా చిన్నదిగానో పెద్దదిగానో చెయ్యడం ప్రసక్తి వచ్చి నప్పుడు తెలివికల విద్యార్థి అవసరాన్నిబట్టి ఆ గీత పక్కనే ఇంకొక పొడుగు గీతనో పొట్టిగీతనో గీయడం చమత్కార జనకమైనట్లు సామెత ప్రయోగం కూడా ఆ సందర్భాన్ని మరింత భావగర్భితం చేస్తుంది.

గణితశాస్త్రంలో సమీకరణం అనే పారిభాషిక పదం ఉంది రెండు రాశుల తుల్యతను ప్రతిపాదించడం సమీకరణం చేస్తుంది ఇంగ్లీషులో 'ఈక్వేషన్' అంటారు దీన్ని సామెతకూడా సమీకరణం వంటిదే ఒక విషయాన్నో ఒక సన్నివేశాన్నో ఉటంకించి తుల్యమైన ఇంకొక సందర్భాన్ని ప్రసక్తంచేసి మొదటి ప్రతిపాదనను బలపరచడం సమీకరణం సామెతలో సర్వసాధారణంగా రెండు వాక్య దళాలుంటాయి మొదటి దళాన్ని ఆ తర్వాతి విభాగం వ్యాఖ్యానిస్తుంది

సామెతను 'సామ్యోక్తి' అన్నారు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు "చావా టావడు చావ యీ యడనుచున్ సామ్యోక్తి యొందున్నచో దేవీ నా స్థితి యట్టి దయ్యె[1]" . కాబట్టి సామ్యంగల ఉక్తి సామెత అవుతుంది సమతనుంచి కూడా సామెత ఉత్పన్న మయ్యే అవకాశం ఉంది

సామెతకు సామిత అనే రూపాంతరం కూడా ఉంది. కెప్టెన్ డబ్ల్యు. ఎమ్. కార్, చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ వంటి పాశ్చాత్యులే కాకుండా తెలుగు నిఘం టువులు కూడా ఈ ద్వైరూప్యాన్ని అంగీకరించాయి సామెతకు లోకోక్తి అనే పర్యాయ పదంకూడా కెప్టెన్ కార్ ప్రచురించిన తొట్టతొలి సామెతల సంపుటం నుంచే వ్యాప్తిలోకి వచ్చిందేమోననుకోవాలి సంస్కృత నిఘంటువుల్లో గొప్ప ప్రామాణికమైన వాటిలో ఈ లోకోక్తి అనే ఆరోపం కన్పించదు కొన్ని నిఘంటు

1 విక్రమ చెళ్ళపిళ్ళ పుట 32-1936.

వులలో ఈ ఆరోపం ఉన్నా సామెత అనే అర్థాన్ని స్ఫురింపచేయదు. తెలుగులో సామెత అనేదాన్ని సంస్కృతంలో న్యాయమంటారు న్యాయమనే పదానికి వాచస్పత్యంలోగాని శబ్దకల్పద్రుమంలోగాని లోకోక్తి అనే అర్థం లేదు సామెతకు పర్యాయపదంగాను తుల్యార్థబోధకంగాను తెలుగువారు ఈ లోకోక్తి అనే మాట క్రమక్రమంగా వాడుకలోకి తెచ్చుకొన్నారేమో అనిపిస్తుంది

శబ్ద రత్నాకరాన్ని నిర్మించిన బహుజనపల్లి సీతారామాచార్యులవారు సామెత అనే పదానికి అర్థ వివరణం ఏమీ ఇవ్వకుండానే లోకోక్తి అని మాత్రం వివరించి ఊరుకున్నారు అయితే లోకోక్తి అనే ఆరోపం మాత్రం చేర్చడం మరచిపోయినారు సుమారు పది ముద్రణలు పొందినా శబ్దరత్నాకరంలో ఈ లోకోక్తి అనే పదమే చేరలేదు ఇటీవల శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు శబ్దరత్నాకరానికి కూర్చిన అనుబంధంలో కూడా లోకోక్తి అనే ఆరోపం పృథగస్థిత్వంతో కానరాదు శబ్దరత్నాకరం తర్వాత వచ్చిన తెలుగు నిఘంటువులన్నీ కూడా సామెతకు లోకోక్తి అనీ, లోకోక్తికి సామెత అని అర్థాలివ్వడం జరిగింది. శబ్దరత్నాకరంలో మాదిరే సూర్యరాయాంధ్ర నిఘంటువులో కూడా సామెత అనే పదానికి లోకోక్తి అని మాత్రమే ఇవ్వడం జరిగింది అయితే విశేషం 'సామెత' అనే పదానికి ప్రయోగం రెండు ఆకారాల నుంచి కూర్చడం జరిగింది యయాతి చరిత్రం నుంచి, ద్విపద సారంగధర చరిత్రనుంచీ ఈ రూపానికి రెండు ప్రయోగాలు ఉటంకించడం జరిగింది సూర్యరాయాంధ్ర నిఘంటువులో కాని ఈ రెండు ఆకరాలకన్నా అత్యంత ప్రాచీనమైన వరాహపురాణంలోనే 'సామెత' అనే పదప్రయోగం కనపడుతున్నది కాబట్టి సుమారు ఐదు వందల సంవత్సరాలుగా సామెత అనే మాట తెలుగు సాహిత్యంలో సువ్యవస్థితమై ఉందన్నమాట

అయితే లోకోక్తి అనే మాటను సామెతకు సమానార్థకంగా ఎక్కడినుంచి సాధించారు తెలుగు పండితులు అన్న ప్రశ్న వస్తుంది సంస్కృత న్యాయాలను గూర్చి వివరిస్తూ సంస్కృత లోకోక్తులని పేరు పెట్టారు చిలుకూరి నారాయణ రావుగారు

లోకోక్తి అంటే లోకవాడుక, నుడికారం "లోకోక్తీనాం భవేద్యోగో యది స్యాచ్ఛ్రుతిరంజనం" అనే అధర్వణకారికను అహోబల పండితుడు లోకో

క్తులను యథాతథంగా స్వీకరించాలి కాని సంస్కరించాల్సిన పనిలేదని వ్యాఖ్యా నించాడు. దీనికి ఉదాహరణంగా "అయోలక్క ఇత్యాదయః" అనే ప్రయోగా లిస్తూ ధ్వన్యనుకరణాలలో వ్యక్తి గ్రామ నామాలలో ప్రాంతీయత కనపడటం. తప్పనిసరి అని వాటి నలాగే స్వీకరించాలనేది అధర్వణాచార్యుల అభిప్రాయమని చెప్పారు అహోబలుడు. లోకోక్తి అంటే విలక్షణమైన నుడికారం అని అర్థం ఈ నుడికారం, జాతీయత, పలుకుబళ్ళు కచ్చితంగా సామెతలని చెప్పలేం వీటికి సామెత ప్రతిపత్తి అప్పుడప్పుడు సంక్రమిస్తూ ఉంటుంది ఇదే అభిప్రాయం తమిళ సామెతలను వర్గీకరణం చేసి సంకలితం చేసిన హెర్మన్ జన్సన్ అనే పాశ్చాత్య పండితుడు కూడా వ్యక్తం చేశాడు "It seems to me that we should not 'allow the confusion of proverbs with mere precepts or maxims destitute of proverbial significance and character' to go on" (preface - page V) అంటే సూక్తులూ, సుభా షితాలు, పలుకుబళ్ళూ సామెతలు కావని అనుకోవాలి అయితే లోకోక్తికి అర్థ విస్తృతి సంక్రమించి తెలుగులో సామెతకు పర్యాయపదం కాగలిగింది సామె తలను గూర్చి రాస్తూ "పీట్లని లోకోక్తులనడమూ వుంది" అని చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు మొదలుపెట్టారు[1]. బాలకవి శరణ్యంలో గిడుగు రామమూర్తి పంతులుగారు సామెతల ప్రసక్తిలో "సామెతలు, లోకోక్తులు ఇవి లోకములో నలుగురూ వాడేవి మార్చగూడద"న్నారు[2] అంటే సామెతలు, లోకోక్తులూ తుల్యమైనవి కాని అవే ఇవి అనలేదు గిడుగువారు "లోకోక్తి, సామెత ఏకార్థ ములు కావనీ, అన్ని సూక్తులు, సుభాషితములు నిత్యవ్యవహారములలో తరచుగా వాడుటచే సామెతలుగా చెల్లిపోవుచున్నవనీ" శ్రీ సంపత్ రాఘవాచారిగారు సాహిత్య అకాడమీవారు సంకలనం చేయించిన సామెతల సంపుటం ఉపోద్ఘాతంలో అన్నారు దీన్నిబట్టి లోకోక్తి, సుభాషితం, సూక్తి, నుడికారం, నానుడి, జాతీయం, శాస్త్రం, సుద్ది, న్యాయం మొదలైనవన్నీ అప్పుడప్పుడాయా సంద ర్భాన్ని బట్టి తెలుగులో సామెతలుగా చెల్లుబాటవుతున్నాయి కాని, సామెతలది

---

1 కథలు - గాథలు - మొదటి సంపుటం, పుట 257 రెండోకూర్పు 1958

2. బాలకవి శరణ్యం. పుట 255 తృతీయ ముద్రణం-1965 విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ.

ప్రత్యేకవర్గం అని స్పష్టమవుతున్నది, సంస్కృతంలో మీమాంసకులు న్యాయ మనే వ్యవహరిస్తారు కాని లోకోక్తి అనరు ఇటువంటివాటిని వాచస్పత్యంలో, శబ్ద కల్పద్రుమంలో న్యాయమనే ఆరోపానికి సామెత అని అర్థమిచ్చే వివరణ ఉంది కాని లోకోక్తి అనే ఆరోపమే లేదు

అయితే మానియర్ విలియమ్స్ నిఘంటువులో లోకోక్తి అనే పదానికి ఇంగ్లీషులో 'ప్రావెర్బ్'ను సమానార్థకంగా ఇచ్చారు. ఆప్టే నిఘంటువులో కూడా ఈ ఆరోపానికి ఇతర అర్థాలతోపాటు 'ప్రావెర్బ్' అనే అర్థం కూడా ఇవ్వడం జరిగింది

నానుడిని సామెతకు సమానార్థకంగా ప్రయోగించారు ఎర్రాప్రెగడ నృసింహ పురాణ పీఠికలో వేలూరి శివరామశాస్త్రిగారు ఆంధ్ర పద పారిజాత మనే నిఘంటువులో ఓగిరాల జగన్నాథ కవి సామెత అనే ఆరోపానికి అర్థం రాస్తూ లోకోక్తి అని కూడా ఇచ్చారు

తెలుగు సామెతలను మొట్టమొదటిసారి సంపుటీకరించి అచ్చువేసిన కెప్టెన్ ఎమ్ డబ్ల్యు కార్ నాటికే తెలుగులో సామెత, లోకోక్తి పర్యాయ పదాలుగా వ్యవహృతం కావడం కనిపిస్తుంది ఈ సంపుటం మొట్టమొదటిసారి 1868 లో అచ్చైంది దీని ముఖ పత్రంపైన "ఆంధ్ర లోకోక్తి చంద్రిక అనగా తెలుగు సామెతలు" అని ఉంద. ఈ సంపుటంలో 2708 తెలుగు సామెతలు, 488 సంస్కృత న్యాయాలు కార్ కూర్చాడు ఇటు తర్వాత వేలువడ్డ శబ్ద రత్నా కరంలో సామెతకు లోకోక్తి అనే అర్థం నిబంధించడం, అటుతర్వాత తెలుగులో వచ్చిన నిఘంటువులన్నీ ఈ రెండింటినీ పర్యాయాలుగా స్వీకరించడం జరిగింది బ్రౌన్‌దొర తన నిఘంటువుల్లో 'ప్రావెర్బ్' అనే ఇంగ్లీషు పదానికి సమానార్థ కంగా సామెత, సామిత అనే రెండు రూపాలు ఇచ్చారు కాని లోకోక్తి ఇవ్వలేదు

సూక్తులూ సుభాషితాలూ కూడా ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క సందర్భంలో సామెతల స్థానాన్ని పొందుతాయి "వేదసూక్తులు లేక వేదాలలోని సామెతలు" అనే చిన్న సంకలనాన్ని శ్రీ నూకల సత్యనారాయణ శాస్త్రిగారనే వారు ప్రకటించారు.

"పత్నీహి సర్వస్య మిత్రం" (కృష్ణయజుర్వేదం సం 6 2 9) అనే సూక్తికి వ్యాఖ్యానం వ్రాస్తూ శాస్త్రిగారు పశుపక్షి మానవదేవ దానవాదులలో నందరికిని మిక్కిలి ప్రియమగునది భార్యయే, 'పెండ్లాం బెల్లం ముక్క' అను లోకోక్తి ఈ వేద ప్రమాణము నుండియే జనించినది అన్నారు.

"గాయం తగ్గ్ స్త్రియః కామయంతే" (కృ. య. 6-1-7) (గాయకుణ్ణి స్త్రీలు విశేషంగా ప్రేమిస్తారు.)

''అనస్వీచరథీచాఽతిథీనామ పచితతమా'' (కృ.య 5-2-2) (రథాన్నో శకటాన్నో ఎక్కివచ్చిన అతిథిని ముందుగా పూజించాలి-తర్వాతనే ఇతరుల్ని )

''శిరో వాహ్యంగిరౌ జీవనం అనో వాహ్యగ్ సమేజీవనం (కృ.య సం. 6-1-7) (కొండలమీద ఉండేవాళ్ళు బరువు నెత్తి కెత్తుకుంటారు. మైదానాలలో ఉండేవాళ్ళు బండ్లు ఉపయోగించుకుంటారు.)

"పుత్రోహి హృదయం" (కృ య. బ్రా. 2-2-7) కొడుకే తండ్రికి హృదయం.

"నవా ఏతేన సర్వః పురుషః యదిత ఇతో లోమాని దతో నఖాన్" (కృ య బ్రా 1-2-6)

మీసాలు గడ్డాలూ వచ్చినంత మాత్రాన పురుషుడనిపించుకోడు మంచి పనుల వల్లనే మగవాడనిపించుకోగలడు అని దీని భావం ఈ కృష్ణ యజుర్వేద బ్రాహ్మణం తెలుగులో 'రొయ్యకు లేదా బారెడు మీసము' అనే ఎత్తిపొడుపుతోనూ 'పురుషులందు పుణ్య పురుషులు వేరయా' అనే సూక్తితోనూ సంవదిస్తున్నది

"జాతోఽన్నమత్తి" అని కృష్ణ యజుర్వేద సంహితలోని సూక్తి అంటే పుట్టడంతోటే పొట్ట సంగతి తెలుస్తుంది అని ఇలాటి సూక్తులు సందర్భాన్నిబట్టి సామెతలుగా చెలామణి కావడం కద్దు

రామాయణం, మహాభారతాలలో ఇలాటి సూక్తులు సామెత గౌరవాన్ని సంతరించుకోగలవి ఎన్నో కనపడతాయి తెలుగు కావ్యాలలో కూడా లోకరీతిని బట్టి, ఎన్నో పలుకుబళ్ళు, నుడికారాలు కవులు ప్రయోగించారు అందుకే సంకుసాల నరసింహకవి "లోకుల రసనలె ఆకులుగా నుండునట్టి యవివో కవితల్" అని లోకజ్ఞతకే కవితా సౌందర్య గుణాలలో ప్రథమ స్థానం ఇచ్చాడు.

దేశ భాషల్లో నిఘంటువులు కూర్చే ప్రయత్నం ఆదునిక కాలాన పాశ్చాత్య పండితులు నిర్వహించినట్లే వారే సామెతల సంకలనాలుకూడా తెచ్చారు. వాచక పుస్తకాల విషయమైన శ్రద్ధకూడా వారే వహించారు అయా ప్రాంతీయ భాషల నుడికారం, పలుకుబళ్ళు, సంస్కృతి, సంప్రదాయం తెలుసుకోవడంలో సామెతలు అత్యంత సహాయకారులని ఆ పండితులు గ్రహించి ఇటువంటి సంకలనాలు కూర్చి వుంటారు పాశ్చాత్యులు కూర్చిన సామెతల సంకలనాలలో దేశియ సామెతలకు అనువాదంకూడా ఇవ్వడం విశేషం

దక్షిణదేశ భాషల్లో ముందుగా సామెతల సంకలనాలు తెచ్చినవారు పాశ్చాత్య పండితులే తమిళ, మలయాళ, తెలుగు, కన్నడ సామెతలను పందొమ్మిది శతాబ్ది ఉత్తరార్ధంలో సంపుటీకరించడం జరిగింది ఇంతేకాక బ్రౌన్, గుండర్ట్, పోప్ మొదలైన నిఘంటు సంకలన కర్తలు, నిఘంటువుల ఆకోపాల అర్థ వివరణంలో సామెతలనుకూడా ఉదాహరించారు. 1875 ప్రాంతంలో పెర్సివల్ అనే పాశ్చాత్య పండితుడు, చెన్నపట్నం రాజధాని కళాశాలలో ద్రావిడ భాషాచార్యుడుగా పనిచేస్తున్న అతడు తమిళ సామెతల సంకలనాన్ని ప్రకటించాడు తర్వాత ఇరవై సంవత్సరాలకు హెర్‌మన్ జెన్సన్ తమిళ సామెతలన్నిటిని వర్గీకరించి 3644 సామెతలను ఇంగ్లీషు అనువాదంతోనూ, వివరణతోనూ ప్రకటించడం జరిగింది.

తెలుగులో మొట్టమొదటిసారి సామెతల సంకలనాన్ని ప్రకటించిన కెప్టెన్ కార్ దొరకూడా తెలుగు సామెతలను ఇంగ్లీషులో వివరించడమే కాక, సందర్భ వడిన చోట యూరోపియన్ భాషలలోని సమానార్థకమైన సామెతలనుకూడా తెలుగు సామెతలతో పోలుస్తూ ఉదాహరించాడు డచ్చి, స్పానిష్, ఫ్రెంచి, ఇటాలియన్ సామెతలతో భావ సాదృశ్యాన్ని కొన్ని సామెతల దగ్గర చూపడం ఈ సంకలనం విశిష్టత. ఈ కారణంవల్ల తెలుగు నేర్చుకొనే పాశ్చాత్యులకు, తెలుగు దేశాన్ని గూర్చి తెలుసుకోగోరిన వారికి ఈ సంపుటం బాగా ఆకర్షకంగా ఉపయోగపడి ఉంటుంది తెలుగు దేశంలోకూడా ఈ సామెతల సంకలనానికి విశేషాదరం లభించినట్లు తెలుసుకోవచ్చు కార్ సామెతల సంపుటం వెలువడ్డ మూడు నాలుగేళ్ళలో బందరునుంచి పురుషార్థ ప్రదాయిని అనే సారస్వత

సామాజిక మాసపత్రిక ప్రారంభమైంది ఈ పత్రికలో కార్ సంకలనం చేసిన సామెతలు, ఆయన కూర్చిన ఇంగ్లీషు అనువాదంతో సహా అప్పుడప్పుడు ప్రచురించబడటం జరిగేది

కెప్టెన్ కార్ ఈ సంకలనం తయారుచేయడంలో ముఖ్యంగా తెలుగు సామెతలు ఏర్చి కూర్చినవారు రావిపాటి గురుమూర్తిగారని,సంస్కృత లోకోక్తులు ఇచ్చినవారు రేకం రామానుజ సూరిగారనీ వాళ్ళిద్దర్నీ స్మరించుకున్నారు

నాటినుంచి నేటివరకుకూడా వెలువడ్డ సామెతల సంకలనాలు అధికాధికంగా పది పన్నెండు వేల సామెతలకన్నా ఎక్కువ చేర్చలేదు లక్షకుపైగా సామెతలు నేను సేకరించి వర్గీకరించి సిద్ధపరచానని చిలుకూరి నారాయణ రావుగారు సుమారు నలభై సంవత్సరాల క్రితం ఆనాటి పత్రికలన్నిటా ప్రకటించారు కాని ఆ సేకరణ అంతా ఏమైపోయిందీ ఈనాటికీ తెలియదు

సుమారు ఐదు వందల సంవత్సరాల కిందటే నంది మల్లయ్య, ఘంట సింగయ్యగార్ల వరాహపురాణంలో సామెత అనే రూపం ప్రయుక్తమై ఉండగా సామ్యం నుంచి సామ్యత తద్వారా సామెత వ్యాకరణ దుష్టాలని కొందరు పెద్ద పండితులు వాదించడం వింతలలో వింత "వ్యాకరణములొక్క త్రోవ మహా కవులొక త్రోవ" అని చెళ్ళపిళ్ళవారు ఇందుకే అని ఉంటారు తమ దేవీభాగవతం పీఠికలో

ఏదిఏమైనా తెలుగు దేశంలో వివిధ ప్రాంతాలలో వినవచ్చే సామెతలన్నీ సేకరించే బృహత్ప్రయత్నం ఇంతవరకూ జరగలేదు వ్యవసాయానికి సంబంధించినవీ, పాడి పంటలు, వైద్య విజ్ఞానం, వివిధ వృత్తులు, సామాజిక జీవితం, హాస్యచమత్కారాలు వీటికి సంబంధించి ఎన్ని సామెతలో ఆయా ప్రాంతాలలో వృద్ధతరంవారిలో నేటికీ వాడుకలో ఉండవచ్చు. వాటన్నిటినీ సేకరించే యత్నం మాత్రం పెద్ద ఎత్తున ఇదివరలో జరగలేదు ఇప్పుడూ జరగటంలేదు

సూర్యరాయాంధ్ర నిఘంటువు నిర్మాణంలో మార్గదర్శక సూత్రాలు నిబంధించిన కళాప్రపూర్ణ వేదం వెంకటరాయశాస్త్రిగారు ఆ నిఘంటువులో సామెతలు కూడా చేర్చాలన్నారు అయితే శాస్త్రిగారి నిర్వాహకత్వం ఆ నిఘంటువుకి దక్కలేదు ఆ తర్వాత ఆ నిఘంటువును కూర్చినవారు అక్కడక్కడ కొన్ని సామెతలు చేర్చారు కాని వాటి స్వస్వరూపం మార్చి గ్రాంథికీక

రించడంలో వాటికి సొగసుపోయింది. గిడుగు రామమూర్తి పంతులుగారి తీవ్ర విమర్శకు గురి అయిన అంశం కూడా అయింది.

ఆధునిక సృజనాత్మక సాహిత్యంలోకూడా ఆయా ప్రాంతాల రచయితలు సామెతలు బాగా వాడినవారున్నారు. ఉదాహరణకు బలివాడ కాంతారావుగారి దగాపడిన తమ్ముడు నవలలో పదులకొద్దీ సామెతలు ప్రయోగించారు ఈ సామెతలన్నీ ఒకచోట రాశీకరించడమే ఇప్పుడు జరగాల్సినపని

"కవిత్వ పదార్థం లోకోక్తులలో విస్తరించి వుంటుంది. సామెతలు వాడడంలోనే కవిత్వానికి జీవభూతమైన వ్యంగ్యం బాగా స్ఫురిస్తుంది అని తెలిసికొందాం.

సంస్కృత కవులు కూడా కొన్ని దేశ సామెతలు సంస్కృతీకరించి వాడుకున్నారు

యే కవిత్వంలో సామెతలు విశేషించి వుంటాయో ఆ కవిత్వం యెక్కువ హృద్యంగా వుంటుంది"

ఇత్యాది అభిప్రాయాలు చెళ్ళపిళ్ళవారివి సామెతలు గూర్చి రాస్తూ ఈ భావాలు వారు వెల్లడించారు

కానను బులికి బుట్టిన కూన పూరి
మేయు నోట! ను సామెత మిథ్యగాగ
బులులు సైతము లెలమాని పూరిమేయు
నన్న దుష్ట మృగంబుల నెన్న నేల?! (వరాహపురాణం 4.97)

గౌరముఖుడనే మునీశ్వరుడి తపోవన వర్ణన ఇది. పులికూన పూరి మేస్తుందా అనే సామెత మిధ్య అయేటట్లు ఈ తపోవన ప్రాంతం పెద్దపులులు కూడా హింసాహారాన్ని వర్జించాయి అని కవిద్వయ వర్ణన

సామెతలు లోకోక్తులు, జాతీయాలు, వీటిపట్ల ఎక్కువ మక్కువ కనపరచిన కవులలో వరాహపురాణ కవులే మొదటి వారేమో! పగవారికైనా ఆడ సంతానం వద్దు (2.127) ఎంగిలిచేత కాకినేయవు (2.146), గాదంలోని దోసకాయ (3.24) తాటాకు చప్పుళ్ళకు దయ్యాలు వెరుచునే (3.55) రోళ్ళా రోకళ్ళం బాడరోయక (7.22) వంటి పదబంధాలు వరాహపురాణంలో ఇంకా ఉన్నాయి.

యయాతి చరిత్ర, విజయ విలాసం, రుక్మాంగద చరిత్ర, హంస వింశతి, వైజయంతీ విలాసం మొదలైన కావ్యాలలో తెలుగు పలుకుబళ్ళూ సామెతలూ ఎక్కువగానే కనపడతాయి.

ఇక మన శతకాలలో లోకవృత్త వ్యాఖ్యానమూ, లోకపు పలుకుబళ్ళూ కోకొల్లలుగా కనపడతాయి. సుమతీ శతకం, వేమన శతకం, రామలింగేశ శతకం, వేణుగోపాల శతకం, నరసింహ శతకం మొదలైన శతకాలలో దేశీయమైన పలుకుబడి బాగా వినపడుతుంది. అయితే వీటిని సామెతలనడానికి వీలు లేదు. నిదర్శన వాక్యాలుగా లోకవృత్తాన్ని ప్రదర్శించడంగా చెప్పవచ్చు.

పులినాకి విడుచుదైవముగల నాటికి, దైవబలము గలుగనివేళం
గలహించి గొర్రె కరచును గలియుగ మున కుందవరపు కవి చౌడప్పా!
పందిరి మందిరమగునా వందిజనం బాప్త మిత్ర వర్గం బగునా
తుందిలుడు సుఖము గనునా గొంది నృపతి మార్గమగున గువ్వల చెన్నా!
వండలే నమ్మకు వక్కణంబులు గొప్ప
యారి పొయ్యిడి దివ్వె కధిక దీప్తి
కట్ట నిల్వని చెర్వు గడియలోపల నిండు
బ్రతక నేరని బిడ్డ బారెడుండు — వేణుగోగోపాల శతకం

ఇటువంటి వాక్యాలన్నీ లోకుల నోళ్ళలో నలిగి, నాని సామెతలే అవుతాయి.

గోగులపాటి కూర్మనాథ కవి నరసింహ శతకంలో ఇలాంటి నిదర్శన వాక్యాలు, సామెతలు పోలినవి ఎన్నో ఉన్నాయి.

పసరం పంజైతే పసుల కాపరితప్పు
ప్రజలు దుర్జనులైతే ప్రభుని తప్పు
భార్య గయ్యాళి అయితే ప్రాణనాథుడి తప్పు
తనయుడు దుష్టుడైతే తండ్రి తప్పు

సామెత రూపం సంతరించుకోని మానవ జీవితానుభవమే ఉండదు. సాధారణంగా జీవితాన్ని ప్రభావితం చేసే అన్ని రంగాలు, అన్ని భావాలూ సామెతలను సృష్టిస్తూనే ఉంటాయి. ఆయా దేశాల నైసర్గిక స్థితిగతులు, పురాణగాధలు, భౌగోళిక పరిసరాలు, ఋతువులు, కార్తెలు, నమ్మకాలు, ఆచార వ్యవహారాలు, మత నైతిక ధార్మిక ప్రమాణాలు, యానసాధనాలు, వాణిజ్యం, లలిత కళలు

అన్నీ సామెతలను ఉత్పత్తి చేస్తూనే ఉంటాయి. మానవ జీవితంలో అనేక వృత్తులు, కులాలు, జీవన విధానాలు అనాది కాలం నుంచీ ఉంటూనే ఉన్నందు వల్ల ఆయా వృత్తులకు, జీవితానుభవాలకు సంబంధించిన సామెతలు రూపొందుతూ వచ్చాయి

"సామెతలు జాతి యొక్క ఆయువు పట్టులు" అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు.

అత్యంత ప్రాచీన కాలంనుంచీ భారతదేశానికి జీవనాధారం వ్యవసాయమే. అందువల్ల పాడి పంటలకు, సేద్యానికి, రైతు జీవనానికి, వ్యసాయంలోని కష్ట సుఖాలకు, వ్యవసాయానికి అనుకూలించే మంటి మింటి స్థితిగతులకు సంబంధించిన సామెతలు భారతదేశ జీవనంలో ఎక్కువ కనపడతవి. తెలుగులో కూడ పల్లె పట్టులలో ఈ సామెతలకు ప్రచారం ఎక్కువ.

సామెతలను స్థూలంగా ఈ విధంగా వర్గీకరించవచ్చు.

1. వ్యవసాయానికి సంబంధించినవి
2. వైద్యపు సామెతలు.
3 వృత్తిపరమైనవి.
4. లోకవృత్తాన్ని వెల్లడించేవి.
5. కుటుంబ వ్యవస్థాత్మకమైనవి.
6 సాంస్కృతిక జీవనానికి చెందినవి
7. హాస్యసామెతలు.

ఈ వింగడింపులో అవాంతరవర్గాలు ఎన్నైనా సాధించవచ్చు. సంప్రదాయాలు, వేడుకలు, వినోదాలు, ఆటపాటలు, సాంఘిక జీవనంలో వరసవావులు, పరిహాసాలు, ఎత్తిపొడుపులు, జ్యోతిష్యం, సంపదలు, ఆపదలు, గుడి మడి, కలహాలు కార్పణ్యాలు మొదలైన ఉపవిభాగాలెన్నో చేయవచ్చు.

"తెలుగు సామెతలు మిగుల వాడి గలవి తవ్వుగోలలై సారస్వతము నుండియు ప్రత్యక్ష జీవనమునుండియు ఎంతేని భావమును దొలిచి చేతిలో పెట్టగలవు" అన్నారు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు.

వ్యవసాయానికి సంబంధించిన కొన్ని సామెతలు పరిశీలిస్తే ఈ అంశం స్పష్టమవుతుంది.

కోటివిద్యలు కొం[డకు లోపలే-అనేది సామెత. ఇహలోకంలో జీవయాత్ర సుఖశాంతులతో సాగాలంటే కడుపుకు తిండీ, కట్టుకోవడానికి బట్టా మొదట కావాలి. అటుతర్వాత దేహారోగ్యం కాపాడుకోవాలి ఈ వ్యవసాయపు సామెత కోటివిద్యలు కూటికొరకే అనే సామెతను తలపింపచేస్తున్నది 'మడి దున్నిక బ్రతకవచ్చు మహిలో సుమతీ' అనే భావంకూడా భారతదేశంలో వ్యావసాయిక ప్రాధాన్యాన్ని చాటి చెపుతున్నది మన పురాణ వాఙ్మయంలో ఇంద్రోత్సవాలు, సాంస్కృతిక జీవనంలో వరుణజపాలూ కూడా అనాదిగా భారతదేశపు వ్యావసాయిక జీవన ప్రాధాన్యాన్నే చాటిచెపుతున్నాయి

'ఏంచిన ఎరువేదిరా అంటే యజమాని పాదం'-అనేది ఒక సామెత ఎన్ని ఎరువులు వేసినా ఎంత బలగంతో వ్యవసాయం చేయించినా యజమాని స్వయంగా శ్రద్ధతో దగ్గరుండి పనులన్నీ చేసుకొంటేనే తప్ప పంట బాగా పండదని ఈ సామెత అర్థం ఒకవేళ పొలానికి తగినంత బలం చేకూర్చలేకపోయినా రైతు వొళ్ళువంచి శ్రమపడితే తగిన ప్రయోజనం కన్పించకపోదని ఈ సామెత భావం

ఒకనాటి అదును ఏడాది బ్రతుకు-అనేది వ్యవసాయానికి సంబంధించిందే ఇంకో సామెత నాగలిపట్టి దున్నే రైతు అదునుకు వొళ్ళువంచి పనిచేస్తే ఏడాది సుఖంగా బ్రతుకుతాడని దీని అర్థం

అరక అరిగితే గరిసె విరుగుతుంది. ఈ సామెతకూడా వ్యవసాయక కృషికి సంబంధించిందే

ప్రత్తికి పదిచాళ్ళు జొన్నకు ఏడుచాళ్ళు.

ప్రత్తి బాగా పండాలంటే భూమిని మరింత కర్షణంచేయాలి అని దీని భావం

కరువు మానడానికి పంట మిడతలు మాయడానికి మంట.

ఇది అనుప్రాసతోసహా అందంగా రూపుదిద్దుకొన్న సామెత.

బడిలేని చదువు వెంబడిలేని సేద్యము కూడదు.

వ్యవసాయకుని అనుభవంలోంచి పుట్టుకొని వచ్చిన సామెత ఇది.

తల్లిదే వలపక్షం ధరణిదే వలపక్షం

వలపక్షం అంటే పక్షపాతమని అర్థం. తల్లి చూపించే పక్షపాతానికీ భూతల్లి చూపించే పక్షపాతానికీ అవధులుండవని అర్థం.

చేలోలేదు చేతిలోనేగాని - అని ఒక సామెత.

విత్తులు విత్తడం ఒక గొప్ప నేర్పు, ఒక్కొక్క వరిమడి తివాసీనేసినంత గుత్తంగా పెరుగుతుందిట అదొక గొప్ప ప్రజ్ఞ. అందువల్లనే కాబోలు కడప మండలంలో ఈనాటికీ ఒక సామెత వాడుకలో వుంది. "వరిమడిలో యేముంది అంతా నాసల్లడంలో వుందిగాని" అని వొత్తుగా గుత్తంగా పెరిగిన మడిని చూచి రైతు స్వాతిశయ ప్రకటనం చేసుకొంటాడట

'వడ్లూ గొడ్లూ ఉన్నవాడిదే వ్యవసాయం' - అంటే విత్తనాలూ పశువులూ లేకుండా వ్యవసాయం చేయాలనుకోవడం వ్యర్థమని భావం

మడిదున్ని మహారాజైనవాడూ చేనుదున్ని చెడినవాడూ లేడు.

రైతు స్వానుభవంనుంచి పుట్టిన సమాశ్వాసం అయి ఉంటుంది.

తొలకరిని చెరువు నిండినా తొలిచూలిన కొడుకు పుట్టినా లాభం - అనే సామెత కర్షకానుభవం ముద్దకట్టిన ముద్దు సామెత.

తొలకరి వర్షాలకే చెరువునిండితే తర్వాత వానలు కురియకపోయినా ఇబ్బంది లేదు మొదటికి మోసంరాదు అదేవిధంగా తొలిచూలునే కొడుకుపుడితే తండ్రికి నడి వయసుననే అక్కరకువస్తాడు. కాయకష్టంతో కూడిన వ్యవసాయంలో నలభై ఏళ్ళ తండ్రికి ఇరవై ఏళ్ళ కొడుకుండటం ఎంత లాభసాటి విషయమో, వ్యవసాయదారుడి అనుభవం అంతా ఒక్క వాక్యంలో ప్రకటిత మవుతున్నది అంతేకాదు, కొడుకుద్వారా ఇంటిపనుల్లో పొలంపనుల్లో కోడలు కూడా సహాయపడుతుంది రైతుకు. సరిగా ఈ భావాన్నే వెల్లడించే మరొక సామెత "మృగశిరలో వేసిన పైరు మీసాలు రావడంతో పుట్టిన కొడుకు మేలు చేస్తారు" అనేది పంటపొలం బాగా పదునుకాకపోతే మృగశిరలో పైరు వేయరు. మృగశిరలోనే పైరు వేయాలంటే బాగా వానలు కురిసినట్లు అట్లానే మీసాలు రావడంతోనే కొడుకుపుడితే తండ్రి చేతికిందికి త్వరలోనే ఎక్కివస్తాడు. భారత దేశ సాంఘిక జీవనాన్ని కూడా ఆ సామెత వ్యక్తం చేస్తున్నది బాల్య వివాహాలు అంటే ఆడపిల్లలకు పది పదకొండేళ్ళు, మగపిల్లలకు పద్దెనిమిది ఇరవై ఏళ్ళు వివాహ యుక్త కాలంగా వెనుకటి కాలంలో పరిగణించేవారు. పదమూడు పద్నాలుగేళ్ళకే బాలికలు తల్లులయ్యేవాళ్ళు వ్యావసాయిక ప్రాధాన్యంగల వ్యవస్థలో ఈ పరిణామం సహజమే ననుకోవాలి.

'రెండూళ్ళ వ్యవసాయం ఇద్దరు భార్యలూ చెరుపు' - వ్యవసాయదారుడి అనుభవంలోంచి ఈ సామెత పుట్టింది అందువల్లనే కాబోలు రస్సెల్ పండితుడు సామెతను "the wisdom of many and the wit of one" అని నిర్వచించడం జరిగింది ఇదే విధంగా సదే అనే సాహిత్యవేత్త "the experience and wisdom of several ages gathered and summed up in one expression" అని నిర్వచించాడు [1]

ఇదేవిధంగా పశుపాల్యాన్ని మనోహరంగా వివరించే సామెతలున్నాయి

ఎక్కువ వెలపెట్టి గుడ్డను తక్కువ వెలపెట్టి గొడ్డనూ కొనరాదు

వస్త్రధారణ అనేది విలాసంకోసంకాదు మానాన్ని కాపాడుకోవడానికి,శీత వాతాతపాలనుంచి సంరక్షించుకోవడానికి మాత్రమే ఎంచుకొనేవారు మన పూర్వీకులు చౌకగా లభిస్తుంది అని గొడ్డు విషయంలో లోభపడితే "ఓలితక్కువని గుడ్డిదాన్ని పెళ్ళాడితే నెలకు మూడుకుండల" సామెత అవుతుంది.

చెప్పకపోయినా చప్పి కొమ్ముల ఎద్దును కొనాలి.

పది దుక్కులకు తర్వాత దున్నేవాడు పాపాత్ముడు.

పాడి పసరాన్ని పసిబిడ్డనీ ఒకటిగా చూడాలి మొదలైన సామెతల ద్వారా పాశుపాల్యంలో భారతీయ కర్షకుడి అనుభవమూ, హృదయ వైశాల్యమూ విశదమవుతున్నాయి.

బ్రరెచస్తే పాడి బయటపడుతుంది అయ్యో ఇన్ని తవ్వేల పాలిచ్చేది అని దుఃఖిస్తారు. కాబట్టి దానివల్ల యజమానురాలు చేసిన పాడి బయటపడుతుంది అని అర్థం.

ఇక కార్తెలకు సంబంధించిన సామెతలు కూడా యెన్నో వున్నాయి

మృగశిర చిందిస్తే ముసలెద్దు రంకెవేస్తుంది

ఆర్ద్ర కురిస్తే దారిద్ర్యంలేదు

మఘ వురిమితే మద్దురుమీది కర్రఅయినా పండును

ఉత్తర ఉరుముదప్పినా రాజు పాడిదప్పినా చెదపురుగుకి రెక్కలువచ్చినా కష్టం.

---

1. Encyclopaedia Americana, International edition, Volume 22 p p 704-705-1966

హస్తకు ఆదిపంట చిత్తకు చివరిపంట
చిత్త జల్లు స్వాతి వాన
స్వాతి కురిస్తే జొన్నలు చల్లపిడతలోకైనా పండవు

స్వాతి కురిస్తే మోతి పండును - అంటే ముత్యాల పంట పండుతుందని అర్థం.

చిత్త చిత్తగించి స్వాతి చల్లచేసి విశాఖలో విసరకుంటే అనూరాధలో అడిగినంత పండుతాను - అంటుంది భూదేవి

తరతరాలుగా నేలదున్ని నింగికేసి చూస్తూ చినుకుపడితే పొంగిపోతూ, పడకపోతే కుంగిపోతూ జీవిక సాగించే కృషీవలుడి అనుభవసారమంతా ఈ కార్తెలకు సంబంధించిన సామెతలలో ఇమిడివుంది.

కాలగమనాన్ని కర్షక జీవనాన్ని లోకవృత్తాన్ని సమన్వయిస్తూ పండితులు చెప్పిన సామెతలవంటి సూక్తులున్నాయి

'విశాఖాంతాని మేఘాని ప్రసూతాంతాని యౌవనం
లలితాంతాని గీతాని తక్రాంతాని చ భోజనం'

విశాఖకార్తె తర్వాత మేఘాలుండవు కాన్పులతో యౌవనం విశ్లథమవుతుంది. లలిత సంగీతంతో సంగీత కచేరీ ముగుస్తుంది మజ్జిగ వడ్డనతో భోజనం ముగుస్తుంది అని ఈ శ్లోకం భావం తక్రాంతే చక్రధరస్మరణం, గోవిందా గోవిందా అని సంతర్పణ భోజనాల సమయంలో వినపడేది పూర్వం.

భూసారానికి సంబంధించి కూడా వ్యవసాయకులు చెప్పిన సామెతలు కొన్ని ఉన్నాయి

దుక్కిలేనిచేను తాలింపులేనికూర
దుక్కికొద్దీ పంట బుద్ధికొద్దీ సుఖం
దుక్కిచలవే చలవ తల్లిపాలే పాలు
ఎరువుబెట్టినచేను ఏలుబడిఅయిన కోడలు వ్యర్థంకావు
కలుపు తీస్తే బలుపు
చేనికి ఎరువు మడికి మంద
ఈ విధంగా కర్షక జీవితానికి వెలుగిచ్చే సామెతలెన్నో ఉన్నాయి.

ఇహలోక సౌఖ్యానికి పాడిపంటలు ధన ధాన్యాలు ఎంత అవసరమో ఆరోగ్య పరిరక్షణకు వైద్య విజ్ఞానం అంతకన్నా అవసరం. మానవ జీవితంలో ఆరోగ్యం లేనిదే ఐశ్వర్యం ఎంత ఉన్నా నిష్ప్రయోజనం. అందువల్లనే ఆరోగ్యమే మహాభాగ్యం అన్న సూక్తి పుట్టింది.

ప్రాచీన భారతీయ వైద్య విజ్ఞానంలో ఆయుర్వేదానికి ప్రముఖమైన స్థానమున్నది. వేదాంగాలలో ఆయుర్వేదంకూడా చేరింది. "అప్పిచ్చువాడు వైద్యుడు ఎడతెగక పారు ఏరును చొప్పబడిన యూరనుండుము, చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ" అన్నది పూర్వికుల అనుభవసారం గచ్చాకు పుచ్చాకులు కూడా వైద్యానికి పనికి వస్తాయని మన పూర్వులు అనుభవంతో తెలుసుకున్నారు ఒకప్పుడు రాజులు, సంస్థానాధిపతులు, సంపన్నులు, సంప్రదాయ వైద్య విజ్ఞానాన్ని యెంతగానో ఆదరించేవారు అందువల్ల ఆయుర్వేద వైద్య విజ్ఞానం ప్రజా జీవనంతో బాగా మమేకమై పోయింది అనుశ్రుతంగా కొనసాగుతున్న అనుభవ వైద్య చికిత్సా విధానాన్ని గూర్చి తెలుగులో ఎన్నో పలుకుబళ్ళు, నానుళ్ళు, సామెతలు ఉన్నాయి. పాచిమొహంతో తింటే పర్వత మెక్కినంత ఫలం అనే సామెత వైద్య విజ్ఞానానికి సంబంధించినది అంటే ఓషధ సేవనం పరగడుపనే చేయాలనీ, అట్లా చేసినప్పుడే అది ప్రయోజనకారి అవుతుందనీ ఈ సామెత నొక్కి చెపుతున్నది

ఉదయం నిద్ర లేవగానే మరేమీ ఆహారం తీసుకోకుండా మందు తీసుకోవాలనడం ఆయుర్వేద వైద్య విజ్ఞానంలో ప్రధానమైన సూత్రం అట్లా తీసుకొంటే మందు బాగా పని చేస్తుంది అని భావం పర్వతమంటే శ్రీశైల పర్వతమని అర్థం. పర్వతాల మల్లన్న శరణు అని గుంటూరు మండల వ్యవహారం. దుర్గమారణ్య పర్వత ప్రాంతమైన శ్రీశైలం దర్శించడానికి దృఢగాత్రత చాలా అవసరం. అటువంటి దార్ఢ్యాన్ని సైతం కలిగిస్తుంది ఉదయం లేవగానే మందు పుచ్చుకోవడం అని ఈ సామెత సంకేతిస్తున్నది. మందుకు పంపిస్తే మాసికానికి వచ్చాడు అని సామెత. మందుకోసం కబురు చేస్తే ఆ మందు తీసుకొచ్చే మనిషి కాని వైద్యుడు కాని మీనమేషాలు లెక్కబెట్టుకుంటూ శకునాలూ ముహూర్తాలూ చూసుకుంటూ కాలయాపనచేస్తే వాన రాకడ ప్రాణం పోకడ తెలీవు కదా, వైద్యం చేయించామన్న తృప్తికూడా లేకుండా రోగి చనిపోతే ఎట్లా అనే బాధనూ, విసుగునూ వ్యక్తం చేసే సామెత ఇది

వైద్యానికి వాహనానికి ఒకే కాంట్రాక్టు - అనే సామెత ఆధునిక కాలంలో పుట్టి ఉంటుంది ఇట్లైతే గోదానం అట్లైతే వైతరణీదానం అనే మోటు సామెత కూడా దీనికి దగ్గరదే వైద్యుడి తెలివి తక్కువతనాన్ని ఎద్దేవా చేసే సామెత ఇది వైద్యం చేయడానికిగాను ఒక వ్యక్తిని ప్రాధేయపడగా అట్లైతే అవతలి కార్యక్రమంకూడా నాకే వప్పగించాలని వైద్యుడు నిర్లజ్జగా ఛాందసంగా వొప్పందం కుదుర్చుకోబోతే ఆ రోగి తాలూకు బంధువులకు ఎట్లా వుంటుంది? వీరేశలింగం, చిలకమర్తి రచించిన నవలల్లో ఇలాంటి వైద్య పుంగవుల వర్ణన లున్నాయి.

'తక్రం శక్రస్యదుర్లభమ్' అనే సూక్తిని వైద్యపండితులు సృష్టించి ఉంటారు. ఆయుర్వేదంలో మజ్జిగకు ఎంతో ప్రాశస్త్యం, "మజ్జిగను బోలు మందేది ముజ్జగముల" అని ఒక వైద్య విజ్ఞాన భావుకుడు మజ్జిగ ప్రాశస్త్యాన్ని కీర్తించాడు. మజ్జిగ మంచి గుణాలు నూటొక్కటిగా ఆయుర్వేద గ్రంథాలలో వర్ణితాలు.

అన్నబలమే అన్ని బలాలూనూ
అన్నిటికీ వాతనే వైద్యుణ్ణి అవతలే ఉంచు
ఆశపడి వెళ్లి తిన్నా ఆరోగ్యం అంతంతే
ఉల్లి చేసిన మేలు తల్లయినా చేయదు.
శొంఠి శోధిస్తుంది
ఔషధానికీ ఆపథ్యానికీ చెల్లు రోగం శేషం.

"గాడిద పుంటికి బూడిదమందు, దొమ్మరోగానికి కొర్రగంజి, వస్తుగుణం తెలియనయ్య వైద్యంలో మొనగాడా, విశాఖలో వర్షం వ్యాధులకు హర్షం" మొదలైనవన్నీ వైద్య విజ్ఞానానికి సంబంధించిన సామెతలే.

"తల్లిపాలు పిల్ల చెబుతుంది" అనేదికూడా శరీరారోగ్య సంబంధి సామెత.

"చీడ అంటుతుందిగాని సిరి అంటదు" చెడ్డగుణాలు త్వరగా ఒకరినుంచి ఒకరికి వ్యాపిస్తాయి కాని మంచి అనేది పట్టుపడటం చాలా కష్టం అని ఈ సామెత భావం. చీడ అనేది అంటు జాడ్యం. సాంక్రామిక రోగం ఒకరి నుంచి ఒకరికి సంక్రమిస్తుంది సిరిసంపద లలాంటివి కావు కష్టపడి ఒళ్ళువంచి పనిచేసి సాధించాల్సినవి అని లోకానుభవాన్ని ధ్వనింప చేస్తున్న సామెత ఇది.

మితం తప్పితే అమృతమైనా విషమే - అని సామెత. అనభ్యాసే విషం విద్యా అజీర్ణే భోజనం విషం-అనే సూక్తిని జ్ఞాపకం చేస్తుంది ఈ సామెత.

అన్నమధికమైన నదియుదా జంపునా
యన్నమంటకున్న నాత్మనొచ్చు
చంప నొంప బువ్వచాలదా వెయ్యేల
విశ్వదాభిరామ వినురవేమ!

చంప నొంప అనే పారంకన్నా చంప పెంప అనే పారం సరిఅయిన దేమో, వేమనగారిదేనో ఈ పద్యం! లేదా ఎవరైనా వైద్యవేత్త సృష్టించాడో!

'కాళ్ళకు రాచుకుంటే కళ్ళకు చలువ' అనే సామెత ఆయుర్వేద వైద్య విజ్ఞాన సంబంధి అరికాళ్ళకు తైలమర్దనం చేసినందువల్ల కలిగే వైద్య ప్రయోజ నాన్ని వివరించే సూక్తి ఇది. ప్రామాణిక ఆయుర్వేద వైద్య గ్రంథాలలో ఇందు గురించి చాలా గ్రంథం ఉంది అని పెద్దలు చెపుతారు. పాదాల మధ్యనుంచి రెండు సిరలు నేత్రాల వరకు వ్యాపించి ఉంటాయి ఉందువల్ల పాదాలు పరి శుభ్రంగా ఉంటే కళ్ళు కాంతి మంతంగా ఉంటాయని ఈ సామెత భావం.

పథ్యం తప్పితే వంటికి కీడు సత్యం తప్పితే ఇంటికి కీడు, కరక్కాయ కన్నతల్లి, ఉల్లి పది తల్లుల పెట్టు మొదలైనవి వైద్యసామెతలు. ఇంట్లో లేక పోవడమే వంట్లో జబ్బుకు కారణం అనే సామెత ఎంతో అనుభవపూర్వకమైనది సర్వానర్థాలకూ దరిద్రమే కారణమని ఈ సామెత చాటుతోంది దరిద్రంవల్ల పుణ్యకార్యాలకు వెరవులేదు. పుణ్యం చెయ్యనందువల్ల దరిద్రం జన్మజన్మలకూ వెన్నాడుతూనే వుంటుంది పునర్దరిద్రో పునరేవపాపీ అని సూక్తి దేశంలో దరిద్రం లేకపోతే మానవుల మానసిక శారీరకారోగ్యాలు బాగుంటాయని ఈ సామెత పిండితార్థం.

కొత్త వైద్యుడికంటె పాత రోగి మేలు - వైద్య చికిత్సానుభవంలో ఈ సామెత చాలా అనుభవపూర్వకమైనది విలువైనది. పాత రోగి సగం వైద్యుడు అనే సామెత కూడా పై సామెతను వ్యాఖ్యానిస్తుంది.

ఇరు పోటీలకు ఇల్లు చెడుతుంది వాత నొప్పులకు వళ్లు చెడుతుంది - అనేది వైద్యాన్నీ లోకవృత్తాన్నీ సమన్వయంచేస్తున్న సామెత ఇంటి నిర్వహణలో అన్నదమ్ములుగాని భార్యా భర్తలుగాని తండ్రి కొడుకులుగాని కలహించుకుంటూ ఉంటే ఆ సంసారం వాతనొప్పులతో బాధపడే రోగి వొళ్ళుకన్నా సుఖంగా ఉండదని దీని తాత్పర్యం

మానింది మందు ఉన్నది ఊరు ఇదా అదా అని విచికిత్స ఎందుకు?

రోగాన్ని తగ్గించగలదే మందు బతుకుతెరువు ఎక్కడ లభిస్తుందో అదే ఊరు అని భావం

పెరటిచెట్టు మందు కక్కరకురాదు అనేది లోకరీతికి సంబంధించిన సామెత

వృద్ధ వైద్యం బాలజోస్యం - అని సామెత వైద్యుడు వృద్ధుడైతే అతడి అనుభవం పనికివస్తుంది. జోస్యం పలికేవాడు బాలుడైతే అతడి హృదయ నైర్మల్యం ఫలిస్తుంది అని భావం ఈ సామెతనే కొందరింకొక విధంగా వ్యాఖ్యానించడం కద్దు వృద్ధుడికి వైద్యంలాంటిదే బాలుడి జోస్యంకూడాను, నిరర్థకం నిష్ప్రయోజనం రెండూనూ అని భావం. వృద్ధుడికి వైద్యమక్కర లేదు అనుభవం లేనందువల్ల బాలుడి జోస్యం ఫలించదు అని వ్యాఖ్యానం చేస్తారు కొందరు

చీడ సిగ్గెరగదు ఆకలి రుచి ఎరగదు - అనుభవించినవాళ్ళకు బాగా అర్థమవుతుందీ సామెత.

రోగం రొస్టు సంసారం గుట్టు - అనే సామెతలో లోకరీతి ఇమిడి వుంది వ్యాధి సంగతి నలుగురితో చెప్పుకోవాలి అప్పుడు ఒకరుగాకపోతే ఒకరైనా సరి అయిన సలహా చెప్పగలుగుతారు కాని సంసారం సంగతి మూడోకంటివాడికి తెలియకూడదు. తెలిస్తే పరువుపోతుంది. గాంభీర్యం దక్కదు

చెపితే మానం పోతుంది చెప్పకుంటే ప్రాణం పోతుంది - ఈ సామెత సుఖ వ్యాధులగూర్చిన సామెత అయి ఉంటుంది. మానంలో పుండు మామగారి

వైద్యం అనేది కూడ ఇటువంటి సామెతే ఏగాని సౌఖ్యం డబ్బున్నర క్షౌరం అనేదికూడ సుఖవ్యాధులకు సంబంధించిన సామెత.

ఇంట్లో ఈగ పులి బయట పెద్దపులి - అనేది చిత్రమైన సామెత. ఇంట్లో ఈగను రానివ్వకూడదని దీని భావం బయట పెద్దపులిచేసే హాని, పెట్టే భయం, ఇంట్లో ఈగవల్ల కలుగుతాయని ఈ సామెత అంతరార్థం ''ఈగ యెట్టిదనిన ఈశ్వరుడివంటిది, తెలిసి చూడకున్న తేటపడదు'' అన్నాడట వేమనయోగి లయకారుడైన రుద్రుడితో పోల్చాడన్నమాట ఆయన ఈగను. కలరా మొదలైన భయంకరమైన అంటు జబ్బులను వ్యాపింపచేసేవి ఈగలే. వేమనే చెప్పాడో లేదా ఏ వైద్య విద్వాంసుడి స్వీయరచనమో చెప్పలేము.

పడిశం పదిరోగాల పెట్టు, నడమంత్రపుసిరి నరాలమీది కురుపు (నిలవ నీయవని భావం), గడ్డపలుగులు మింగి శొంఠికషాయాలు తాగినట్టు (పాపపు పనులెన్నోచేసి పూజలూ, పునస్కారాలూ చేసినట్లు) మొదలైనవి అనుభవపూర్వక మైన సామెతలు.

ఊరిజబ్బు చాకలికెరుక, ఉద్యోగిజబ్బు బంట్రోతుకెరుక - ఈ సామెత ఆధునిక కాలాన పుట్టి ఉండాలి అధికారి బలహీనతలన్నీ అతణ్ణి అనుసరించు కొని ఉండే నౌకరుకు తప్పక తెలుస్తాయి ఊళ్ళో ఏ జబ్బు ఎక్కడ ఎవరికి అంటిందో అంటుతుందో చాకలికన్నా మరొకరికి బాగా తెలిసేందుకు అవకాశం లేదు అని భావం.

తల్లిగండం పిల్లగండం ఉన్నదిగాని మంత్రసాని గండం ఉన్నదా?

ఎవరేమైనా మంత్రసాని ముడుపు మంత్రసానికి ముడుతుందిగదా అని ఈ సామెత తాత్పర్యం.

మంత్రసాని ముందు మర్మందాచినట్లు - అసంభవమూ, అనివార్యమూ అయినా పాకులాడటాన్ని ఈ సామెత వ్యక్తం చేస్తున్నది

మంత్రసాని దెప్పులు - ప్రసూతి వైరాగ్యంలాంటి సామెత.

వివిధ జీవన వృత్తులకు సంబంధించిన సామెతలు తెలుగులో ఎన్నో ఉన్నాయి ఆయా వృత్తులను, ఆ వృత్తుల ననుసరించినవారి ప్రవృత్తులను పరియాచకంగాను ఎత్తిపొడుపుగాను వ్యాఖ్యానాలు చేసినప్పటికీ అవి కక్షతో కార్పణ్యంతో చేసినవిగా ఎంచగూడదు. అప్పటి ఆయా సన్నివేశాలలో ఆయా కాలాలకు సంబంధించి వారివారి అనుభవాలను సూత్రీకరించారని, చమత్కారంగా సామెతల రూపం కల్పించారని అనుకోవాలి జన సామాన్యం సామాన్యంగా ఎవరివల్ల బాధలు అనుభవిస్తుందో ఆ వర్గాలను గురించి నిర్మొహమాటంగా ఆయా వర్గాలవారికి అప్రియం, కలిగినా లెక్కచేయకుండా సామెతలను సృష్టిస్తుంది వాళ్ళపట్ల ప్రజల్లో ఉండే నిరసన, తిరస్కారం, అసంతృప్తి, అప్రసన్నభావం దాచుకున్నా దాగేవి కావు ప్రజలను బాధించే అధికారాన్ని గాని సబబు లేని పెత్తనాన్ని గాని, నయవంచన, అన్యాయం, స్వార్థపరతలు సామెతల ద్వారా ప్రజలు వెల్లడిస్తూనే ఉంటారు ఏ వృత్తికి ఏ వర్గానికి విలక్షణమైన ఆయా ప్రవృత్తులను వ్యాఖ్యానిస్తుంటారు

ముఖ్యంగా ఆయా వృత్తులు ప్రవృత్తులు దంభాన్ని ప్రదర్శించేవే అయితే ప్రజల విమర్శలకు గురికాకుండా ఉండవు అనాదిగా భారతదేశంలో గ్రామీణ జీవన వ్యవస్థే సాగుతూవస్తున్నది కాబట్టి గ్రామానికి కాపు, కరణాలు అధికార్లు కాబట్టి వీరు సామెతలలోకి ఎక్కారు. ప్రతివారికీ ఆభరణాలపై ఆశ వుంటుంది కాబట్టి, నిత్య జీవితంలో వర్తకుడితో అవసరం ఎలాగూ తప్పదు కాబట్టి స్వర్ణకారుడు, కోమటి, వైద్యుడు, బడిపంతులు మొదలైన వారిని గూర్చి, వాళ్ళ వృత్తులు ప్రవృత్తులను గూర్చి సామెతలు పుట్టాయి కొన్నికొన్ని కుల వృత్తులను గూర్చి, కులాలలో శాఖలను గూర్చి కూడా ఆయా మనుషుల మనోధర్మాల గూర్చి, చేష్టల గూర్చి కొన్ని సామెతలు పుట్టాయి నియోగి ముష్టికి బనారసు సంచి, నియోగికి నీటెక్కువ, ఆరాధ్యుడు ఆఁబోతు - ఇలాటి సామెతలు ఎవరో ఎప్పుడో తమ అనుభవాన్ని పురస్కరించుకొని సృష్టించి ఉంటారు అనోటా అనోటా అవి లోకంలో స్థిరపడి ఉంటవి. కాటికిపోయినా కరణాన్ని నమ్మవద్దు, కన్నతల్లి బంగారమైనా కంసాలి వదలడు, దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడు బాపనసేద్యం బత్తెంచేటు, కాపుల చదువులు కాసులచేటు, లాభంలేని సెట్టి వర దన బోడు, కోమటి కొక్కటిచ్చి పదిగొన్నను దోసములేదు, మంగలి పాత చాకలి కొత్త, రెడ్డొచ్చె మొదలాడు, పూటకూళ్ళమ్మకు పుణ్యంతో పనిలేదు,

కాదన్నవాడు కరణం, ఊరిమీద ఊరుపడ్డా కరణంమీద కానుపడదు, ఇచ్చింది ఇస్తే కరణాన్ని కాదు అన్నాట్ట, ఒకఊరి కరణం ఒక ఊరి వెట్టివాడు, కంసాలి పెళ్ళికి ఇల్లంతా పొయిలే, కరణం సాధుకాదు కాకి తెలుపూకాదు, కుమ్మరివారి కోడలు ఆవందగ్గరైనా కన్పించదా, తింటూ ఉంటే కోమటి నేస్తం, ఇచ్చి తీసుకుంటూ ఉంటే ఈడిగ నేస్తం, గుడిసేటికి ఇల్లాలు గుత్తలంజ, లంజను లంజా అంటే రచ్చకెక్కుతుంది, ఇల్లాలిని లంజ అంటే ఇంట్లో దూరుతుంది, రంకుటాలికి క్రొత్తసుద్దులు హెచ్చు, మధ్య వైష్ణవానికి పంగనామాలు మెండు మొదలైన సామెతలన్నీ లోకరీతిని బట్టి మాటకారితనం గలవాళ్ళు సృష్టించి ఉంటారు

పోకిరికి పోలీసు, చదువురానివాడికి సర్వే అనే ఈ సామెత చాలా ఆధునిక కాలాన పుట్టి ఉంటుంది

లోకంలోని సామెతలన్నీ ప్రజాజీవనానికి ఉపకరించే వృత్తుల గుణదోషాలను ఎత్తి చూపుతుంటాయి.

కరణాల నిష్కరుణ గూర్చి కలహశీలతనుగూర్చి కక్షసాధింపును గూర్చి ఇతరులను వ్యాజ్యాలకు ప్రోత్సహించి స్వంతలాభం చూసుకొనే ప్రవృత్తిని గూర్చి, తగవుల మారితనాన్నిగూర్చి ఎన్నో సామెతలున్నాయి కన్యాశుల్కంలో రామప్పంతులు "పజ్జెండు కోర్టులు తిప్పుతాను, ఏమనుకుంటున్నాడో వాడు" అంటాడు

గ్రామీణ సాంఘిక వ్యవస్థలో గ్రామసీమలను మకుటంలేని మహారాజుల్లాగా ఏలిన కరణాల గురించి ఎన్నో పలుకుబళ్ళు పుట్టుకొనివచ్చాయి. అయితే ఏ ఊరికి ఆ ఊళ్ళోనే అతడి ప్రాబల్యం, అధికారం, ప్రాభవం చెల్లుతూ ఉండేవి. ఈ అధికార దౌర్జన్యంపట్ల అంతర్గతంగా ప్రజలలో నిరసనభావం ఉండేది కాబట్టే ఒక ఊళ్ళో కరణం వేరే ఊళ్ళో వెట్టివాడు అనే సామెత పుట్టి ఉంటుంది "ఒక ఊరి రెడ్డి ఇంకొక ఊరికి పసుల పోలిగాడు" అనే సామెత కూడా ఈ విధంగానే పుట్టి ఉంటుంది.

ఆంధ్రదేశానికి చాలా పొడవైన సముద్రతీరం ఉన్నా నౌకా జీవనానికి సంబంధించిన సామెతలు ఎక్కువగా ప్రచారంలోలేవు. శిలమైపోయి ఉంటా

యేమో "ఓడ స్తంభంమీది కాకిలాగా" "కళాసు బతుకు గాలితోసరి" వంటి సామెతలు మాత్రం కొన్ని వినపడతాయి.

జాలరులకు, బెస్తలకు జీవితానుభవంలో పరిచితమైన సామెతలు కొన్ని వాడుకలో ఉన్నాయి. "పట్టుకొన్నవాడు మట్టగిడస అంటే పైనున్నవాడు జెల్ల కొంక అన్నాడుట" "దరిద్రుడేరేవు కెళ్ళినా ముళ్ళపరగే దొరికిందట" "వలకంటె ముందు రాళ్ళు విసరినట్లు" మొదలైన సామెతలు జాలరుల బతుకులు వర్ణిస్తాయి. "ఎరచూపించి చేపను పట్టినట్లు" "ఎరమింగిన చేపవలె" మొదలైన సామెతలు జాలరుల నుంచి పుట్టి ఉంటాయి

"బ్రాహ్మణులలో చిన్నకు బెస్తల్లో పెద్దకు బెడద ఎక్కువ" అనే సామెత వారివారి వృత్తుల స్థాయినిబట్టి పుట్టిందేననుకోవాలి వెనకటి కాలంలోని సాంఘిక వ్యవస్థనుబట్టి గురుకులవాసం చేస్తూ మాధుకరాన్ని ఎత్తుతూ అగ్రహారంలో అందరికీ తలలో నాలుకగా ఉంటే తప్ప అగ్రహారస్థుడైన బాలుడికి చదువు సంధ్యలు సాగే అవకాశంలేదు. అందువల్ల ఊళ్ళో తనవాళ్ళు ఎవరు ఏ పని చెప్పినా అతడు వెనుదీసే వీలు లేదు అందరూ చిన్నవాణ్ణి తమ తమ పనులకు పురమాయిస్తారు బ్రాహ్మణులలో అది వినయ విధేయతల గుర్తుగా అతడా పనులు చేయాలి

ఇక బెస్తల జీవితంలో పెద్దవాడికి ఎక్కువ ప్రాముఖ్యం ఉంటుంది సముద్రతీరంలో వాళ్లు జీవిస్తారు కాబట్టి ప్రతిచిన్నపనికీ, అడుగుతీసి అడుగువేయ డానికి అనుభవ పరిపూర్ణత ఆసరా అవుతుంది చిన్నకారులోవాళ్లు అంటే నడి వయస్సు వాళ్లు సామాన్యంగా రోజుల తరబడి సముద్రం మీదే ఉంటారు గృహ వ్యవహారాలన్నీ చక్కబెట్టవలసినవాళ్ళు వయసువాళ్ళే అవుతారు యానసాధ నాలు నిర్మించుకోవడంలోను, సముద్రసంపదను విపణికి చేర్చడంలోనూ బాధ్యత అంతా బెస్తలలో పెద్దవాళ్ళదే అయి ఉంటుంది. అందువల్ల ఈ సామెత పుట్టి ఉంటుంది

"కోరుగింజలు కొంగులోకే సరి" - వ్యవసాయం ఎప్పుడూ ఉమ్మడిగా చేయగూడదు ఉమ్మడి వ్యవసాయం పట్ల ఎవరికీ తగిన శ్రద్ధ ఉండదు. కోరు సేద్యం అంటే పంటలో భాగం తీసుకొనే వొప్పందం మీద చేసే సేద్యం దీనికే సంగోరు, మేడిపాలు అని కూడా అంటారు. ఇంతమాత్రమే పంటపండింది ఇందులో సగం నీవు తీసుకో అని ఏదో కొంత ధాన్యం యజమానికి పాలివాడు ఇచ్చినప్పుడు చేసేదేమీలేదు.

"కోర్టుకుబోవడమంటే కొల్లబోవడమే," "కోర్టుకెక్కినవాడు గాడిద నెక్కినవాడూ ఒకటే," "కోర్టు వ్యాజ్యంలో ఓడినవాడు వీధిలో యేడిస్తే గెలిచిన వాడు ఇంట్లో యేడుస్తాడు," "కోర్టుకెక్కినవాళ్ళలో ఒకరు ఆవుకొమ్ములన్ని, ఇంకొకరు తోకను పట్టుకొంటే, వకీలు పొదుగుదగ్గర కూచుంటాడు" లాంటి సామెతలన్నీ ఆధునిక కాలాన పుట్టినవే ఈ దేశంలో ఆధునిక కాలాన ఇంగ్లిషు కోర్టులు వచ్చిన తర్వాత ఈ సామెతలు పుట్టాయి ఇంగ్లిషు న్యాయస్థానాల వివాద విచారణను కాశీయాత్రా చరిత్రలో ఏనుగుల వీరాస్వామయ్యగారు విమర్శించారు.

లోకరీతిని, అనుభవాన్ని, సాంఘిక వ్యవస్థను తెలియజేసే సామెత లెన్నో ఉన్నాయి.

"లేకలేక కూతురు పుడితే అదికాస్త బసివి అయిందట" - ఒక కాలపు సాంఘిక వ్యవస్థలో ఒక సంప్రదాయాన్ని తెలియజేసే సామెత ఇది కొన్ని ప్రాంతాలలో కొన్ని కాలాలలో దేవుడికి మీదు కట్టి మొదట పుట్టిన సంతానాన్ని అర్పించడం ఉండేదట.

"ఇచ్చినమ్మ ఈగ, పుచ్చుకొన్నమ్మ పులి." ఈ సామెత వివాహ వ్యవస్థకు సంబంధించింది. పెళ్ళికూతురి తల్లి కన్నీ సాధింపులూ, పెళ్ళికొడుకు తల్లి కన్నీ దర్జాలు అని ఈ సామెత భావం. ఈగను తీసేసినట్లు తీసేస్తారు ఆడపిల్లను కన్నమ్మను, పులిలాగా భయపెడుతుంది మగపిల్లాడి తల్లి, పెళ్ళిళ్ళ సమయాల్లో అని ఈ సామెత భావం

అబద్ధాలాడితే ఆడపిల్లలు పుడతారనే సామెత అంతరార్థం ఏమిటో నిర్ధారించలేం కాని, అసలు ఈ సామెత తొలిరూపం ఇట్లాఉండి ఉంటుంది. ఆడ పిల్లలు కలవాడు అబద్ధాలెన్నో ఆడవలసి ఉంటుంది అని. నూరబద్ధాలాడైనా ఒక పెళ్ళి చెయ్యమని కదా సూక్తి!

"అత్త పోగొట్టినది అడుగోటి కుండ కోడలు పోగొట్టినది కొత్త కుండ. అమర్చిన దాంట్లో అత్తగారు వేలు పెట్టినట్లు, అరటికర్రు, ఆడుబొట్టె కొర్రు, కూతురు తప్పు గూట్లోనూ కోడలి తప్పు కొలువులోను, అలిగి అత్తవారింటికి చెడి చెల్లెలింటికి పోకూడదు" మొదలైనవి కుటుంబ జీవన వ్యవస్థకూ, అత్తగారి పెత్తనానికీ సాధింపులకూ, కొత్త కోడలు బాధలకూ సంబంధించిన సామెతలు.

"కలవారింటికి కడగొట్టు కోడలయ్యే దానికన్నా పేదవారింటికి పెద్ద కోడలయ్యేది మేలు" అనే సామెతలో లోకానుభవమంతా గర్భీకృతమై ఉంది కలవారింటి కడగొట్టు కోడలిని కుటుంబ సభ్యులు అసూయతో చూస్తారు. ఆ కుటుంబంలో కడగొట్టు కోడలు ప్రవేశించే కాలానికే కుటుంబ పరిస్థితులు అధ్వాన్నంగా తయారయి ఉండవచ్చు వ్యసనాలకు ఆ కుటుంబ సభ్యులు బానిసలై ఉండవచ్చు ఇది సాధారణంగా ఉండే పరిస్థితి దీనికి ఎక్కడైనా అపవాదులుంటే ఉండవచ్చు. పేద ఇంటి పెద్ద కోడలికి కుటుంబ వ్యవస్థలో మన్నన, ప్రేమాభిమానాలు, గౌరవం లభిస్తాయి

ఒకనాటి భారతదేశ సాంఘిక వ్యవస్థలో కొత్త కోడలిని కఠినమైన క్రమ శిక్షణలో ఉంచడం, ఆరళ్ళు పెట్టడం అతి సహజమనే భావించేవారు. అందు వల్లనే "అత్తలేని కోడ లుత్తమురాలు, కోడలులేని అత్త గుణవంతురాలు; అత్తమంచీ వేముతీపీ ఉండవు; పిండిబొమ్మనుజేసి పీటమీద పెడితే ఆడబిడ్డ తనానికి అదిరిపడ్డది; అత్తవారింటి ఐశ్వర్యం కన్నా పుట్టింటి గంజి మేలు" మొదలైన సామెతలు పుట్టి ఉంటాయి

పాండిత్యం, మత నైతిక ఆధ్యాత్మిక దృక్పథ సంబంధులుగా, సాంఘిక జీవన విశ్వాసాలను బట్టి సాంస్కృతికమైన సామెతలు కూడా కొన్ని రూపొందు తుంటాయి భారత భాగవత రామాయణాలు భారతదేశ సాంస్కృతిక జీవి తాన్ని తరతరాలుగా ప్రభావితం చేస్తున్నాయి. అందువల్ల ఈ గాథలకు సంబం

ధించినవీ, పురాణగాథా సంబంధం కలవీ, పండితుల ద్వారాగానీ, లేదా హరి కథలు, తోలుబొమ్మలాటల ద్వారా సమస్త ప్రజకు పురాణాగాథా పరిచితి ఉంటుంది కాబట్టి మాటకారితనంగల సామాన్య ప్రజనుంచో కొన్ని సాంస్కృతిక మైన సామెతలు పుట్టి ఉంటాయి.

"కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు, కాని కాలంవస్తే పయి బట్ట పశు లెత్తుకొనిపోతాయి, భరతుడికి పట్టం రాముడిది రాజ్యం, ఉడతాభక్తి, రామాయణ మంతా విని రాముడికి సీత ఏమవుతుంది అని అడిగినట్లు, ఇంటిగుట్టు లంకకు చేటు" మొదలైన సామెతలు ఇట్లా పుట్టి ఉంటాయి

ఇక ఛలోక్తులు, హాస్యోక్తులు, పరిహాసోక్తులు సామెతలలో కనబడతాయి.

"ఎన్నడూ ఎక్కని రెడ్డి గుర్రమెక్కితే వెనుకముందయిందట, ఏనుగులు ఎగిరిపోతుంటే దోమలో లెక్కా, ఏనుగులు ఏటగొట్టుకొని పోతుంటే పిల్లి పాటి రే వడిగిందట, ఏబ్రాసికి పని ఎక్కువ, దేబిరాసికి తిండి యెక్కువ, గుడ్డిగేదెలలో గూనిగేదె శ్రీమహాలక్ష్మి, కుక్క సంతకు పోయివచ్చినట్లు, ఎద్దు చచ్చినా వాత బాగా పడింది, ఎన్నడూ దొరకనమ్మకు ఏగాని దొరికితే ఏడుముళ్ళు వేసిందట, మా ఇంటాయన కెంత మతిమరుపంటే ఏటనుబడి ఈదమరిచాడు (అని ప్రగల్భించిందట ఒక ఇల్లాలు)" మొదలైనవి హాస్య సామెతలు.

సామెత స్పృశించని మానవ జీవిత ప్రవృత్తి లేనేలేదు. సవాలక్ష సామెత లొక్కచోట చేర్చి వింగడించి ఆ భాష, ఆ జాతి సాంఘిక జీవితాన్ని చక్కగా రాయచ్చు.

(తెలుగు - 1982)